# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 13 సంచిక : 12 హైదరాబాద్ 173 డిసెంబర్ 2015 పేజీలు : 68 రు. 20

- బిహార్‌లో భాజపాకు ఎదురుదెబ్బ
- ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక హోదాపై పోరు
- భూమయ్య, కిష్టాగౌడ్ - నలబై ఏళ్లు
- న్యాయమూర్తుల నియామకాలు
- మత అసహనంపై నిరసనల వెల్లువ
- భోపాల్‌లో తగ్గని విషప్రభావం
- సిరియా సంక్షోభం పూర్వాపరాలు

# ఆర్‌ఎస్ రావు స్మారక సదస్సు

## నవంబర్ 8, 2015, ఆదివారం

సెంటర్ ఫర్ ఎకనమిక్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) సెమినార్ హాల్, బేగంపేట, హైదరాబాద్

## వలసలు - ఆర్థిక వ్యవస్థలు




వీక్షణం పదమూడు సంవత్సరాల సంచికలు; సృజన సర్వస్వం (1966-92);
అరుణతార సంచికలు (1970-2013) డివిడి రూపంలో అందుబాటులో ఉన్నాయి




రు. 200




రు. 240




రు. 125

173

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2015
సంపుటి : 13
సంచిక : 12





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేష్)



**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2015 నవంబర్ నెలలో వచ్చిన విరాళాలు - డా. సాహితి, మిర్యాలగూడ - రు. 3,300; మిత్రులకు కృతజ్ఞతలు- సం.**

వీక్షణం నవంబర్ 2015 సంచికలో వచ్చిన 'తెలంగాణ సమాజం మేల్కొనాలి' వ్యాసం బాగుంది. తెలంగాణ ప్రజలు ఆంధ్రప్రదేశ్ నుండి వేరు పడాలని కోరారు. నిరుద్యోగానికి కారణం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అని, కోస్తా ఆంధ్ర పెట్టుబడిదారులే అని, పెద్ద మనుషుల ఒప్పందం అమలు జరగలేదని, పదవులు ఆంధ్రా వాళ్లకే దక్కాయని అనుకున్నారు. పాలకులు, పార్టీలు మారాయి కాని పరిపాలన విధానం ఒక్కటే అని రాశారు.

**- తుంపాల శ్రీరామమూర్తి**
విశాఖపట్నం

వీక్షణం నవంబర్ 2015 సంచికలో 'వ్యక్తిని చూసి రాజ్యం స్వరూపాన్ని మర్చిపోదామా'? అన్న సి.ఎచ్. మధు వ్యాసం ప్రొ. హరగోపాల్, వరవరరావు చుట్టూ ప్రదక్షిణం చేసింది. 'తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా యాభై సంవత్సరాల స్వప్నం సాకారమైన మాట నిజమే. స్వప్నం సాకారం కావడానికి సోనియా ఇచ్చింది, కెసిఆర్ తెచ్చారు అని అందరిలాగా గతితర్కం తెలిసినవారు కూడా నమ్మడం ఆశ్చర్యం కలిగిస్తుంది.' అన్న వ్యాస రచయిత అలా ఎవరన్నారు, వారలా నమ్మిన దాఖలాలను పేర్కొనలేదు. రచయిత ఇంకొంచెం ముందుకు వెళ్లి 'ప్రజలను, ప్రజా ఉద్యమాలను పక్కనపెట్టి వ్యక్తిగత గ్లామర్ దృష్టితో మాట్లాడేవారితో వచ్చిన చిక్కే ఇది. మానవ పరిణామ క్రమం, మార్క్సిజం, గతితర్కం తెలిసిన వారు కూడా ఇలా మాట్లాడడం ఆశ్చర్యం కలిగిస్తుంది' అన్నారు. రచయితకు కలిగిన ఆ చిక్కేమిటో, ప్రజా ఉద్యమాలను ఎవరు, ఎక్కడ, ఎప్పుడు పక్కన పెట్టారో, వ్యక్తిగత గ్లామర్ దృష్టితో మాట్లాడారో వివరణ ఇవ్వలేదు. ఏదో గంపగుత్తగా రాసినట్లుంది.

'సోనియా గాంధీకి ముందుచూపు ఉంది. తెలంగాణ ఇవ్వకపోతే ప్రజలు తిరగబడతారని, ప్రజలు తిరగబడి తెలంగాణ తెచ్చుకుంటే కెసిఆర్ నాయకత్వం ఉండేది కాదు. తెలంగాణ ఇలా ఉండేది కాదు' అన్న రచయిత, 'ప్రజలు తిరగబడడం' అన్నదానికి స్పష్టతనివ్వలేదు.

'దేశంలో సమస్యలన్నీ కొత్త రాష్ట్రంలో ఉంటాయి. ఏదీ మారదు. దోపిడీ ఉంటుంది. కన్నీళ్లు ఉంటాయి. పోరాటాలు ఉంటాయి. ఈ సత్యం తెలుసుకోకుండా స్వప్నం చెల్లాచెదురయిందంటే ఎలా? ఈ రాజ్య స్వరూపం తెలిసి కూడా భ్రమలు పటా పంచలయ్యాయంటే ఎలా?' ఇలా ఎక్కడ, ఎవరన్నారో వివరణ ఇవ్వలేదు రచయిత. 'ఎందరో మాట్లాడితే ఇంత రాయాల్సిన అవసరం లేదు. ప్రొ. హరగోపాల్ అన్నారు–స్వప్నం చెల్లా చెదురయిందనీ, వరవరరావు అన్నారు–భ్రమలు పటా పంచలయ్యాయని. ఏ స్వప్నాలు కన్నారు? ఏ భ్రమలు పొందారు? – ఇటువంటి మాటలకు సెంటిమెంట్ మార్క్సిజం కూడా సెంటిమెంట్‌కు గురవుతున్నాం. ఇది దురదృష్టకరమైన విషయమే.'

హమ్మయ్య మబ్బులు వీడిపోయాయి. ఇప్పటికైనా రచయిత తన బాణం ఎవరివైపు ఎక్కుపెట్టారో స్పష్టంగా చెప్పారు. ఇక్కడ స్వప్నం చెల్లా చెదురయిందనీ, భ్రమలు పటా పంచలయ్యాయనీ అన్నారంటే, అది ప్రొ. హరగోపాల్, వరవరరావుల వ్యక్తిగతమైన స్వప్నం చెల్లా చెదురయిందనీ, భ్రమలు పటా పంచలయ్యాయనీ కాదు. రచయిత ఇలా ఎలా అర్థం చేసుకున్నారు? ప్రజల స్వప్నం చెల్లా చెదురయిందనీ, ప్రజల భ్రమలు పటా పంచలయ్యాయనీ – ప్రజల కోణం నుంచి సమాజగతంగా అన్నదే కాని, అది వారి వ్యక్తిగత కోణం నుంచి అన్నది కాదు. ఒక 'సెంటుమెంటు మార్క్సిజం...' అన్న రచయిత అభిప్రాయానికి తావెక్కడ?

'క్రిష్ణశాస్త్రి తన బాధని అందరిలోనూ పలికిస్తే, శ్రీశ్రీ అందరి బాధను తనలో పలికిస్తాడు. క్రిష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ' అని చలం అన్నట్లు, మార్క్సిజంలో లబ్ధ ప్రతిష్టులైన ప్రొ. హరగోపాల్, వరవరరావు ప్రజల కోణం నుంచి ఆలోచిస్తారు, రాస్తారు, ప్రజా ఉద్యమ సంస్థల పోరాటాలలో చేయీ చేయీ కలిపి నడుస్తారు. లీగల్ కార్యాచరణలో పాల్గొంటారు. వారికి ఉన్నవి సమాజగత శ్రేయస్సు, అభ్యున్నతే కాని, వ్యక్తిగత స్వప్నాలు, వ్యక్తిగత భ్రమలు కాదు. చివరిగా రచయిత ఇలా అన్నారు. 'ప్రజల పక్షాన ఆలోచించే మనం వ్యక్తిగత సెంటిమెంట్‌ను, ఉద్యమ నాయకుడు అనే అభిమానంతో చూడడం, భ్రమలు బద్దలయ్యాయని భావించడం తప్పు.' ఈ వ్యాస రచయిత పైన వ్యక్తపరచిన భావనల తాలూకు 'మనం'లో ప్రొ. హరగోపాల్, వరవరరావు ఎంత మాత్రం ఉండరు. ఇది నిజం. వారి రచనలు, వారి సామాజిక జీవితం తీరు, వారు ప్రజా ఉద్యమాలలో మమేకమవ్వడం చూసిన వారెవ్వరూ కాదనలేని నిజం ఇది. వారిద్దరికీ సమాజగత, సమాజహిత ఆలోచనలు, ముందు చూపే తప్ప, వ్యక్తిగత ఆలోచనలు, సెంటిమెంట్లు ఉండవు. ఉద్యమ నాయకుడనే అభిమానంతో చూడడం, భ్రమలు బద్దలయ్యాయని భావించడం ఇదంతా ట్రాష్! దానాదీనా ఈ వ్యాసం చదివాక, ప్రొ. హరగోపాల్, వరవరరావు ఈ వ్యాస రచయిత చేత మార్క్సిజంలో 'ఓనమాలు' దిద్దించుకునే స్థితిలో లేరని గ్రహిస్తే బాగుంటుంది.

**- గొట్టుముక్కల సూరి**
హైదరాబాద్

నవంబర్ 2015 సంచికలో రుద్రవేణి రాసిన 'విద్యను దూరం చేసే డిటెన్షన్ విధానం' వ్యాసం నేడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్యా రంగం నుండి తమ బాధ్యతల నుంచి తప్పుకోవడానికి ఎలాంటి సాకులు వెతుకున్నాయో చక్కగా వివరించారు. ప్రభుత్వ రంగంలో పనిచేస్తున్న ప్రాథమిక పాఠశాలల నుంచి విశ్వవిద్యాలయాల వరకు బోధనా సిబ్బందిని నియమించకుండా, వసతులు కల్పించకుండా వాటికవే కుప్పకూలే పరిస్థితిని కల్పిస్తూ, విదేశీ విద్యాసంస్థలకు అనుమతులిస్తున్నారు. విద్యారంగంలో ర్యాంకులు, గ్రేడ్‌లను మాత్రమే ప్రమాణాలుగా చూస్తూ సమాజం ఎదుర్కొంటున్న సమస్యల పట్ల అవగాహన కల్పించకుండా విద్యార్థులను యంత్రాలుగా మారుస్తున్న పరీక్షల తీరును ఈ వ్యాసంలో రచయిత కళ్లకు కట్టినట్లు వివరించారు. విద్యా అంటే మార్కులు మాత్రమే అని అనుకునే నాలాంటి విద్యార్థులకు ఈ వ్యాసం చాలా ఉపయోగకరంగా ఉంది. మనుషుల మధ్య విలువలు నశించి వ్యక్తిగత ప్రయోజనాలకే ప్రాధాన్యత ఇస్తున్న సందర్భంలో ఇలాంటి వ్యాసాలు విరివిగా రావాల్సిన అవసరం ఉంది. ఈ వ్యాసాన్ని సామాజిక ఆలోచనాపరులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు, విద్యారంగ సిలబస్‌ను రూపొందిస్తున్న వారు చదివితే ఉపయోగకరంగా ఉంటుంది. ఇటువంటి వ్యాసాలను రాసి ఆ లోటును పూడ్చే ప్రయత్నం చేసిన రచయితకు, అచ్చువేసిన వీక్షణం పత్రికకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

**- బి. సంతోష**
విద్యార్థి, కరీంనగర్

వీక్షణంలో అచ్చువుతున్న వ్యాసాలు, చర్చలు చాలా ఆసక్తికరంగా ఉంటున్నాయి. చర్చ ప్రక్రియను కొనసాగిస్తూ, విషయ విశ్లేషణలకు అవకాశం కల్పిస్తున్నా పత్రికలో ఇంకా ఎక్కువగా విశ్లేషణ వ్యాసాలు రావాల్సిన అవసరం ఉంది. సామాన్యులకు అర్థమయ్యే విధంగా, సరైన అవగాహన కల్పించే విధంగా ఉంటే బాగుంటుంది. వ్యాసాలు చిన్నవిగా ఉన్నా విషయం పూర్తిగా, సమగ్రంగా ఇస్తే ప్రయోజకరంగా ఉంటుంది. నిడివి ఎక్కువగా ఉండి, అర్థం కాకుండా ఉంటే మాలాంటి సామాన్య పాఠకులకు ఉపయోగం ఉండదు. సంపాదకులు ఈ విషయంలో దృష్టి సారించగలరు.

**- బి. నాగరాజు**
నల్లగొండ

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

# మత అసహనానికి బిహార్ ఎన్నికల ఫలితాల జవాబు

బిహార్ ఎన్నికలు దేశంలో చాల ఆసక్తిని రేకెత్తించాయి. భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్‌కూ ప్రధాన ప్రతిపక్ష పార్టీల కూటమి మహా ఘట్‌బంధన్‌కూ మధ్య జరిగిన పోటీలో అంతిమ ఫలితం ఏమవుతుందనే ఉత్కంఠ దేశమంతా వ్యాపించింది. వ్యవస్థ మారకుండా కేవలం పార్లమెంటరీ ఎన్నికల్లో ఎవరు గెలిచి ఎవరు ఓడినా ప్రజల సమస్యలకు మౌలిక పరిష్కారం దొరకడం అసాధ్యమని ఏడు దశాబ్దాల వలసానంతర భారతదేశం అడుగడుగునా రుజువు చేస్తున్నప్పటికీ, బిహార్ ఎన్నికల్లో ఎన్‌డిఎ ఓడిపోవడం అవసరమైన ఒక చారిత్రక సందర్భం వచ్చింది. సంఘ పరివార్ దూకుడుకు అడ్డుకట్ట ఉందని బిహార్ ప్రజలు చెప్పాలని దేశవ్యాప్తంగా ప్రగతిశీలవాదులు ఆశించారు. మహా ఘట్‌బంధన్ పార్టీలు కూడ దోపిడీవర్గాల పార్టీలేననే విషయంలో ఎవరికీ సందేహం లేదు. అయినా పెద్ద ప్రమాదం తప్పిపోతే చాలుననే అభిప్రాయం చాలమంది ప్రకటించారు. బిహార్ ప్రజలు ఆ అభిప్రాయాన్ని బలపరిచారు.

తొలుత 2015 ఏప్రిల్‌లో ఏర్పడిన ఆరు పార్టీల జనతా పరివార్ కూటమి నుంచి నాలుగు పార్టీలు బైటికి వచ్చి, రెండు పార్టీలు చేరి, మళ్లీ మరొక పార్టీ బైటికి వచ్చి మహా ఘట్‌బంధన్ మూడు పార్టీల కూటమిగా మిగిలింది. అందులో కాంగ్రెస్ మీద ఎవరికీ సదభిప్రాయం లేదు. బిహార్‌లో అది లెక్కించదగిన పార్టీయే కాదు. వెనుకబడిన వర్గాల పార్టీగా ప్రారంభమై అవినీతికర పార్టీగా పేరు మోసిన రాష్ట్రీయ జనతా దళ్ ను కూడ ప్రజలు నమ్మారనడానికి వీలులేదు. సోషలిస్టుగా జీవితం ప్రారంభించారనీ, ముఖ్యమంత్రిగా బిహార్‌కు కొత్త రూపు ఇచ్చారనీ పేరున్నప్పటికీ భాజపా సహచరుడిగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో అధికారం పంచుకున్న నితీష్ కుమార్ జనతాదళ్ – యునైటెడ్ పట్ల కూడ అంత సానుకూలత ఉండే అవకాశం ఏమీ లేదు. నితీశ్ కుమార్ వ్యక్తిగత ప్రతిష్ఠ గురించీ, బిహార్‌లో ఆయన సాధించిన అభివృద్ధి గురించీ ప్రధానస్రవంతి ప్రచారసాధనాలలో ఒక భాగం ఊదరగొట్టిన మాటలన్నీ నిజమేమీ కావు. అందువల్ల మొత్తంగా మహా ఘట్‌బంధన్‌కు సానుకూల వోట్లు వచ్చే అవకాశం తక్కువ. అలాగే, బిహార్ ఎన్నికల రాజకీయాల్లో కుల సమీకరణాల పాత్రదే ప్రాబల్యం. 17 శాతంగా ఉన్న ముస్లింలు ఎన్నికల ఫలితాలను తారుమారు చేయగలరు. దారుణమైన వెనుకబాటుతనానికి నిలయమైన బిహార్‌లో ఎన్నికల్లో డబ్బు పాత్ర, అభివృద్ధి మాయాజాలం పాత్ర కూడ ఎక్కువే. అందుకే సరిగ్గా ఎన్నికల ముందు బిహార్ ప్రజలను ఆకర్షించడానికి ప్రధాని నరేంద్ర మోడీ లక్షా ఇరవై ఐదు కోట్ల రూపాయల ప్యాకేజీ ప్రకటించారు. ఇన్ని కారణాల వల్ల బిహార్ ఎన్నికలలో ఎన్‌డిఎ పరాజయానికైనా, మహా ఘట్‌బంధన్ విజయానికైనా అనేక సంక్లిష్ట కారణాలు ఉండే అవకాశం ఉంది. ఆ ఫలితాన్నంతా ఏదో ఒక కారణానికి ముడిపెట్టడం కుదరదు. భారత ఎన్నికల రాజకీయాలలో మొత్తంగానే సానుకూల వోటు కన్న ప్రత్యర్థికి ప్రతికూల వోటో, ప్రత్యామ్నాయం గతిలేక వేసే వోటో మాత్రమే ఎవరినైనా గెలిపిస్తున్నాయి గనుక బిహార్‌దీ అటువంటి వోటు కావడానికి అవకాశం ఉంది.

దూకుడుగా హిందుత్వ రాజకీయాలను, మత విద్వేష అసహనాన్ని వ్యాపింపజేస్తున్న నరేంద్ర మోడీని అడ్డుకోవాలన్న ఆకాంక్ష కూడ మహా ఘట్‌బంధన్‌కు అనుకూలంగా మారి ఉంటుంది. బిహార్ ఎన్నికల్లో సాధారణ వోటరును ఆకర్షించిన అంశాలు స్థానిక, తక్షణ సమస్యలూ, కుల మత ధన ప్రభావాలూ కావచ్చు గాని దేశవ్యాప్త వాతావరణపు ప్రభావం తప్పనిసరిగా అక్కడ ఉండి ఉంటుంది. నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, ఎంఎం కల్బుర్గి లను హిందూ మతోన్మాద శక్తులు హత్య చేసిన తర్వాత దేశవ్యాప్తంగా రచయితలు, మేధావులు, చరిత్రకారులు, శాస్త్రవేత్తలు ప్రకటిస్తున్న ఆందోళన బిహార్ ప్రజలకు సుదూరమైనదే కావచ్చు. కాని, వారికి సన్నిహితంగా తెలిసిన కుల మత విద్వేషాలను రెచ్చగొట్టే రాజకీయాలు ఉన్నాయి. మరీ ముఖ్యంగా ముజఫర్‌నగర్ మతకల్లోలాల నాటినుంచి దాద్రీలో గోమాంసం తిన్నాడనే ఆరోపణపై అఖ్లాక్ హత్య, ఫరీదాబాద్‌లో దళిత గృహాన్ని తగులబెట్టి ఇద్దరు చిన్నారి పిల్లలను సజీవ దహనం చేయడం వంటి దారుణ మత అసహన, విద్వేష, హింసా సూచనలు, ఆ సూచనల ఛాయలు బిహార్‌కు కూడ చేరి ఉంటాయి. గుజరాత్ ముఖ్యమంత్రిగా మోడీ అక్కడి దారుణ మారణకాండ పట్ల వ్యవహరించిన తీరు, ఆయన మంత్రివర్గ సహచరులే స్వయంగా ఆ హత్యాకాండ జరిపించడం, ఆ హత్యాకాండ పథక రచయిత ఇప్పుడు ఆ పార్టీ అధ్యక్షుడు కూడ అయి, బిహార్ ఎన్నికల ప్రచారానికి కేంద్రబిందువు కావడం – ఇవన్నీ బిహార్ సాధారణ వోటర్ల మీద ప్రభావం చూపి ఉంటాయి. నితీశ్ కుమార్ పాలనను సమర్థించడమా వ్యతిరేకించడమా అనే ప్రశ్న కన్న ముఖ్యంగా ఈ మత సహన, హింసా వాతావరణాన్ని ప్రతిఘటించడమా లేదా అనే ప్రశ్న తలెత్తి ఉంటుంది. ఆ ప్రశ్న, పశువుల దాణా మేశాడని వచ్చిన ఆరోపణలను కూడ విస్మరించి లాలూ ప్రసాద్ పార్టీ 101 స్థానాలకు పోటీ చేస్తే 80 స్థానాల్లో గెలిపించేంత బలమైనది. భాజపా 159 స్థానాల్లో పోటీ చేస్తే, 106 స్థానాల్లో ఓడించేంత బలమైనది. సాధారణంగా అధికారంలో ఉన్నవారి పట్ల వ్యతిరేకత ఉంటుందని సామాజిక శాస్త్రవేత్తలు, ఎన్నికల గణాంక నిపుణులు తయారుచేసిన ఆంటీ ఇంకంబెన్సీ సిద్ధాంతాన్ని తుత్తునియలు చేసి ముఖ్యమంత్రిని మళ్లీ ఎన్నుకునేంత బలమైనది.

ఈ ఫలితాలను బిహార్‌కే పరిమితమైనవిగా చూడడం సరైనది కాదు. వాటిలో దేశానికంతా సూచనలున్నాయి. మోడీ అధికారానికి వచ్చిన తర్వాత అత్యుత్సాహంతో సంఘపరివార్ శక్తులు సాగిస్తున్న విద్వేష రాజకీయాలకు, హింసకు ఎక్కడో ఒక అడ్డుకట్ట పడాలని, ఈ సమాజం ఎంత లోపభరితంగానైనా ఇంతకాలం సాగిస్తూ వచ్చిన సహజీవన విలువలను కొనసాగించాలని అత్యధిక ప్రజానీకంలో ఉన్న ఆకాంక్షకు అవి చిహ్నం. ఈ ఆకాంక్షను గుర్తించి ముందుకు తీసుకుపోవడమే ప్రగతిశీలవాదుల కర్తవ్యం.

వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# గెలుపుకు అర్థం 'బారాఖూన్ మాఫ్' కాదు

వరంగల్ ఉపఎన్నికలలో తెలంగాణ రాష్ట్ర సమితి అసాధారణమైన విజయాన్ని సాధించింది. జాతీయ పార్టీల అభ్యర్థులు, వామపక్ష అభ్యర్థితో సహా ప్రత్యర్థులందరికీ డిపాజిట్లు గల్లంతయ్యాయి. కాని ఇది విర్రవీగవలసిన విజయమో, తెరాస విధానాల పట్ల ఆమోదమో కానక్కరలేదు. రైతుల ఆత్మహత్యలు, నిరుద్యోగుల్లో అసంతృప్తి, కాంట్రాక్టు కార్మికులు, మునిసిపల్ కార్మికులు, ఆశా కార్యకర్తలు చేసిన, చేస్తున్న ఆందోళనలతో ప్రభుత్వం వ్యవహరించిన తీరు పట్ల నిరసన, బూటకపు ఎన్‌కౌంటర్లు, అందులోనూ శ్రుతి, విద్యాసాగర్‌రెడ్డిలను చిత్రహింసలు పెట్టిన తీరు కచ్చితంగా అధికారపార్టీ మీద అసంతృప్తిని రగిలించి ఉన్నాయి. కాని ఆ అసంతృప్తి అంతా వోట్లుగా మారే అవకాశం ఉందని చెప్పలేం. అలాగే తెరాస అభ్యర్థికి ప్రత్యర్థుల మంచిచెడుల కన్న వారి పార్టీల పట్ల వరంగల్ ప్రజానీకంలో ఉన్న వ్యతిరేకత, ఆగ్రహం కూడ తెరాస అనుకూలతగా మారే అవకాశం ఉంది. ప్రజల్లో కాంగ్రెస్ పట్ల, కాంగ్రెస్ అభ్యర్థి పట్ల వ్యతిరేకత ఉంది. తెలుగుదేశం పార్టీ పట్ల, భారతీయ జనతా పార్టీ పట్ల అవి తెలంగాణ వ్యతిరేక పార్టీలనీ, అంతకు ముందూ, బిల్లుపై పార్లమెంటులో చర్చ జరుగుతున్నప్పుడూ, విభజన తర్వాత కూడ తెలంగాణకు అన్యాయం చేశాయనీ, చేస్తున్నాయనీ వ్యతిరేకత ఉంది. అభ్యర్థి విదేశాల నుంచి దిగుమతి కావడం ఆ వ్యతిరేకతను మరింత పెంచింది. వామపక్షాల అభ్యర్థికి అధికారపక్ష అభ్యర్థిని ఢీకొనేంత ఆర్థిక, రాజకీయ ప్రాబల్యం లేదు. కనుక వరంగల్ ఎన్నికల్లో ఈ పదిహేడు నెలల్లో రాష్ట్రంలో అమలైన విధానాల కన్న ఎక్కువ పాత్ర వహించినవి ప్రతిపక్ష పార్టీల పట్ల, అభ్యర్థుల పట్ల ఉండిన అపనమ్మకాలు. ఒకరి మీద అపనమ్మకం వారి ప్రత్యర్థి మీద నమ్మకంగా మారకపోయినా, కనీసం ప్రయోజనం కలిగిస్తుంది. ఈ విజయం తెరాస విధానాలకు ప్రజలు తెలుపుతున్న ఆమోదం అని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. భారత ఎన్నికల విధానంలో ప్రజాభిప్రాయం ఇంత సూటిగా వ్యక్తం కాగలిగిన అవకాశం ఉంటే బాగుండును, కాని లేదు. ఇలా వ్యాఖ్యానించేవారు మరి 1956 నుంచి 2014 దాకా తెలంగాణ వ్యతిరేక పార్టీలు, తెలంగాణ వ్యతిరేక అభ్యర్థులు కూడ ఇటువంటి విజయాలనే పొందడాన్ని ఎలా విశ్లేషిస్తారో తెలియదు. ప్రజాభిప్రాయానికీ ఎన్నికల విజయావకాశాలకూ చాల తేడా ఉంది, ఉంటుంది. ఎన్నికల గెలుపే తమకూ, తమ విధానాలకూ ప్రజలు బారాఖూన్ మాఫ్ అని చెప్పినట్టుగా తెరాస ప్రభుత్వం భావించినా, విశ్లేషకులు అత్యుత్సాహంతో వ్యాఖ్యానించినా అది అంతిమంగా ఓటమికి దారితీసే గర్వంగా పరిణమిస్తుంది గాని వాస్తవ అంచనా కాజాలదు. ప్రజల్లో అసంతృప్తి ఉన్నదనేది ఎన్నికల ప్రచార సభల్లో నిరసనలు, ప్రశ్నలు, వ్యతిరేకతలు ఎదుర్కొన్న ప్రచారకులందరికీ తెలుసు. పోలీసుల నిర్బంధంతో, ప్రశ్నించినవారిని పక్కకు లాగివేయడంతో అప్పటికి నిరసనను తుడిచేసి ఉండవచ్చు. ఫలితాలను అతిశయోక్తులతో విశ్లేషించుకుని, నిరసన లేదని విర్రవీగడం తాత్కాలికంగా సంతృప్తినిస్తుందేమో గాని, దీర్ఘకాలిక ప్రమాదానికే దారితీస్తుంది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# చింతపల్లిలో మళ్లీ బాక్సైట్ చిచ్చు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా పదవి చేపట్టిన నాటి నుంచీ చంద్రబాబు నాయుడు గతంలో తాను చేయలేకపోయిన, సగంలో ఆపవలసి వచ్చిన పనులను పూర్తి చేసే ప్రయత్నాలు ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ సహజ వనరులను దేశదేశాల కార్పొరేట్ సంస్థలకు, బహుళ జాతి సంస్థలకు అప్పగించడం ఆయన 1995-2004 మధ్యకాలంలో ప్రారంభించి, పూర్తి చేయలేకపోయిన కార్యక్రమం. వాటిలో ఒకటి విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల అడవుల్లో ఉన్న అపారమైన బాక్సైట్ నిక్షేపాలను బహుళ జాతి అల్యూమినియం కంపెనీలకు అప్పగించడం. ఏజెన్సీలోని ఆ నిక్షేపాలను బైటివారికి ఇవ్వడం 1 ఆఫ్ 1970 ప్రకారం చట్టవిరుద్ధమైనప్పటికీ, చివరికి ఆ అధికారం ప్రభుత్వానికి కూడ లేదని 1997 సమత తీర్పులో సుప్రీం కోర్టు చెప్పినప్పటికీ, చంద్రబాబు నాయుడు ప్రభుత్వం 2000 జూన్‌లో ట్రైబల్ అడ్వైజరీ కౌన్సిల్‌తో బాక్సైట్ తవ్వకాలు జరిపించమనీ, అందుకోసం గిరిజనేతరులకు భూమి ఇచ్చినా ఫరవాలేదనీ తీర్మానం చేయించింది. ఆ తీర్మానం ప్రాతిపదికగా పెట్టుకుని దుబాల్ అనే దుబాయి అల్యూమినియం కంపెనీకి విశాఖ ఏజెన్సీ భూములను అప్పగించడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి. 2004 ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ ఓడిపోయి, అధికారానికి వచ్చిన వై ఎస్ రాజశేఖర రెడ్డి అదే దారిలో నడిచి 2007లో రస్ అల్ ఖైమా ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకున్నారు. రస్ అల్ ఖైమా ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ లోని పెన్నా గ్రూప్ తో కలిసి ఆన్ రాక్ అల్యూమినియం లిమిటెడ్ అనే కంపెనీని ఏర్పాటు చేసింది. విశాఖపట్నం జిల్లా చింతపల్లి రిజర్వ్ ఫారెస్ట్‌లో జెర్రెల ప్రాంతంలో బాక్సైట్ తవ్వి సరఫరా చేసేపని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఖనిజాభివృద్ధి శాఖ తీసుకుంది. ఆన్‌రాక్ విశాఖపట్నం జిల్లా మాకవారిపాలెంలో అల్యూమినియం శుద్ధి కర్మాగారాన్ని స్థాపించింది. అప్పుడు తెలుగు దేశం పార్టీ కూడ ప్రతిపక్ష పార్టీగా బాక్సైట్ తవ్వకాలకు వ్యతిరేకంగా మాట్లాడింది. ఈలోగా ఆదివాసుల ఆందోళనతో, అధికారస్థాయిలో, న్యాయస్థానాల స్థాయిలో వివాదాలతో బాక్సైట్ తవ్వకాలు వెనుకపట్టు పట్టాయి. కాని తిరిగి అధికారంలోకి రాగానే చంద్రబాబు నాయుడు ప్రభుత్వం 1212 హెక్టార్ల భూమిలో తవ్వకాలకు అనుమతినిస్తూ నవంబర్ 5న జి.ఓ. నం. 97 విడుదల చేసింది. ఈ చట్ట విరుద్ధమైన, ఆదివాసుల జీవితాలకు భంగకరమైన నిర్ణయంతో మళ్లీ ఒకసారి మన్యం ఆదివాసులు భగ్గుమన్నారు. ఈ ఆందోళనకు విప్లవోద్యమం నాయకత్వం అందిస్తున్నదని వార్తలు వస్తున్నప్పటికీ స్థానిక రాజకీయ పక్షాలన్నీ ఈ ప్రజాందోళనలో భాగం కాక తప్పలేదు. చివరికి అధికార తెలుగుదేశం స్థానిక నాయకులు కూడ ఆదివాసుల ఆకాంక్షను వ్యక్తం చేయక తప్పలేదు. నిరసన జ్వాలలు చెలరేగడంతో నవంబర్ మూడో వారంలో ప్రభుత్వం ఆ జి.వో.ను వెనక్కి తీసుకుంది. కాని లోపాయకారీగా నవంబర్ 24 న బాక్సైట్ ఖనిజంపై శ్వేతపత్రం ప్రకటించి, అదే విధానాలు అమలు చేయడానికి ప్రయత్నిస్తోంది. అత్యంత విలువైన ఖనిజాన్ని కారుచౌకగా, చట్టవ్యతిరేకంగా, ప్రజావ్యతిరేకంగా బహుళజాతి సంస్థలకు అప్పగించడానికి తెలుగుదేశం ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలు మన్యం ఆదివాసులు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. సహజవనరులు పరిరక్షించడానికి ఆ ఆదివాసులు సాగిస్తున్న పోరాటానికి సంఘీభావం ప్రకటించడం ఆలోచనాపరుల బాధ్యత. వీ

# పారిస్‌లో అమాయకుల హత్యలు

నవంబర్ 13న ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో స్టేడియంలో, రెస్టారెంట్‌లో, నాటకశాలలో వరుస బాంబుదాడులు, ఆత్మాహుతి దాడులు, కాల్పులు జరిపిన ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ ది లెవాంట్ సమర్థకులు కనీసం 130 మంది మృతికీ, వందలాది మంది గాయపడడానికీ, విధ్వంసానికీ కారణమయ్యారు. ఫ్రాన్స్ మీద ఇటువంటి దాడులు గతంలో కూడ జరిగాయి. ఈ దారుణమారణకాండ పారిస్‌లో జరిగింది గనుక, చనిపోయినవారందరూ తమ సాధారణ జీవన వ్యాపకాలలో పాల్గొంటున్న అమాయకులు గనుక సహజంగానే ప్రపంచవ్యాప్తంగా పెద్ద ఎత్తున నిరసన చెలరేగింది. ఈ దాడులు చేసినవారు సిరియా కేంద్రంగా పనిచేస్తున్నారనే అభిప్రాయంతో ఫ్రాన్స్ ప్రభుత్వం వెంటనే నవంబర్ 15, 16ల్లో సిరియాలోని రఖా పట్టణం మీద బాంబు దాడులు చేసింది. ఒక పట్టణం మీద నిర్విచక్షణగా జరిగిన ఈ బాంబు దాడుల్లో ఎందరు మరణించారో, ఎందరు గాయపడ్డారో, ఎంత విధ్వంసం జరిగిందో చెప్పేవారు, ఈ విధ్వంసాన్ని ఖండించేవారు లేరు. పారిస్‌లో అమాయకుల మరణాలకు సానుతాపం ప్రకటిస్తూనే, అక్కడ జరిగిన మారణహోమాన్ని అతి తీవ్రంగా ఖండిస్తూనే, అదే సమయంలో ఈ హింసాప్రతిహింసా వలయం ఎందుకు జరుగుతున్నదో, ఎవరు నిజమైన ప్రోత్సాహకులో గుర్తించవలసి ఉంది. అలా అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే అర్థవంతమైన పరిష్కారాల గురించీ, శాశ్వత శాంతి గురించీ ఆలోచించడం సాధ్యమవుతుంది. తమ చమురు అవసరాల కోసం, గల్ఫ్ దేశాలన్నీ తమ చెప్పుచేతల్లో ఉండాలని కోరుకుంటున్న సామ్రాజ్యవాదం ఈ హింసా వలయానికి తొలి ప్రారంభకురాలు. గల్ఫ్‌లో కొన్ని దేశాల ప్రభుత్వాలు తమ అధీనంలో ఉండడానికి ఇష్టపడలేదు గనుక సామ్రాజ్యవాద ప్రచార యంత్రాంగం ఇస్లామోఫోబియాను ప్రచారం చేయడం మొదలుపెట్టింది. చివరికి ఇరాక్ మీద దాడితో ఆ ప్రచారం దురాక్రమణగా మారింది. ఐక్యరాజ్యసమితి వంటి అంతర్జాతీయ సంస్థలు, ఇతర సభ్యదేశాలు ఈ దుర్మార్గాన్ని చూసీ చూడనట్టు ప్రవర్తించాయి. కొన్ని దేశాల ప్రభుత్వాలు సామ్రాజ్యవాదానికి సహకరించాయి. ఈ దుర్మార్గాలకూ, దురాక్రమణలకూ వ్యతిరేకంగా ఇస్లామిక్ ఛాందస శక్తులు తమ ప్రజలకు తామే రక్షకులమనే అభిప్రాయాన్ని కలిగించి కూడగట్టగలిగాయి. ఒక దుర్మార్గాన్ని వ్యతిరేకించడానికి మరొక దుర్మార్గానికి సిద్ధపడ్డాయి. నిజానికి ఈ ఛాందస శక్తులలో అత్యధికాన్ని సామ్రాజ్యవాద సంస్థలే పెంచి పోషించాయి. ఇవాళ ఆ ఐక్యత బెడిసిపోయి, బహుళజాతి సంస్థల ఫండమెంటలిజానికీ ఇస్లామిక్ ఫండమెంటలిజానికీ జరుగుతున్న ఘర్షణలో సాధారణ ప్రజలు మాడి మసి అయిపోతున్నారు. ఏదో ఒక భయానక ఘటన జరిగినప్పుడు, కొందరు అమాయకుల ప్రాణాలు పోయినప్పుడు స్పందించడం కాకుండా, మౌలికంగా ఈ దాడులకు కారణమైన సామ్రాజ్యవాద వనరుల దాహాన్ని, మార్కెట్ల దాహాన్ని, దురాక్రమణలను ఖండించినప్పుడే, ప్రతిఘటించినప్పుడే ప్రపంచానికి నిజమైన శాంతి చేకూరుతుంది. సామ్రాజ్యవాదమే హింస అనే చైతన్యం పొందకుండా, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించకుండా, సామ్రాజ్యవాదుల మీద తప్పుడు కారణాలతోనైనా సరే దాడులు చేసేవారిని ఖండించడం అర్థవంతమైన శాంతికేమీ ఉపయోగపడదు. పారిస్ మృతులకోసం కన్నీరు అవసరమే. అదే సమయంలో పాలస్తీనా, ఇరాక్, అఫ్ఘనిస్తాన్, సిరియా, అసలు ప్రపంచం మొత్తం మీదనే సామ్రాజ్యవాదం బారినపడుతున్న సకల మానవాళి కోసమూ కన్నీరూ కార్చాలి. సామ్రాజ్యవాదాన్ని ఓడించడానికి కత్తులూ నూరాలి. వీ




సౌజన్యం: ది హిందూ



❖ **రెండు దోసిళ్ల కాలం** – కవిత్వం – శ్రీరామోజు హరగోపాల్ – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ; తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్; ebook : kinige.com



❖ **అక్షరాలు** – సింగంపల్లి అశోక్‌కుమార్ – ఆలోచన ప్రచురణ – 63 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: ఆలోచన, 305, ప్రగతి టవర్స్, మారుతినగర్ వీధి, విజయవాడ – 520004; ఫోన్: 0866-6617375, సెల్: 9246277375; email:srisri_sahityanidhi@yahoo.com



❖ **స్వాతంత్ర్యోద్యమ కాలపు సంస్కర్త – బంకుపల్లి మల్లయ్య శాస్త్రి – జీవిత దృశ్యం** – డా. కె. ముత్యం – దృష్టి ప్రచురణ – 172 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: కె. స్వయంప్రకాశ్, సంపాదకుడు, అగ్నిపూలు, 6-19-58, ఆదర్శనగర్, నిజామాబాద్-503002; డా. అపర్ణ, ప్లాట్ నెం. 42, గుల్‌మొహర్ పార్క్ కాలనీ, శేరిలింగంపల్లి, హైదరాబాద్ – 500 019



❖ **సినారె వాక్కుకు వయసు లేదు** – తత్త్వ విశ్లేషణ – డా. లింగంపల్లి రామచంద్ర – తేజ పబ్లికేషన్స్ – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: డా. లింగంపల్లి రామచంద్ర, గుండ్లగూడెం (గ్రా), ఆలేరు (మం), నల్లగొండ, సెల్: 9394023143



❖ **తెలంగాణ రాష్ట్ర సాధన – ఉద్యమ డైరీ (2009-2014)** – పిట్టల రవీందర్ – హోం ల్యాండ్ పబ్లికేషన్స్ ప్రై.లి. – 311 పేజీలు, 1/8 డెమీ, రు. 225, ప్రతులకు: హోం ల్యాండ్ పబ్లికేషన్స్ ప్రై. లి. ఇ.నం. 5-9-22/4, హిల్‌ఫోర్ట్, ఆదర్శనగర్, హైదరాబాద్-63; ఫోన్: 040 64525234, 2324359; అన్ని ప్రధాన పుస్తక విక్రయ కేంద్రాలలో



❖ **ఫ్యూడలిజం మళ్లొచ్చింది** – కంచ ఐలయ్య – భూమి పబ్లికేషన్స్ – 270 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌస్ బ్రాంచీలు హైదరాబాద్ – చిక్కడపల్లి; బాగ్‌లింగంపల్లి (ఎస్‌వికె); ఇసిఐఎల్, నల్లగొండ, హన్మకొండ, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్; ఫోన్: 040 27660013



❖ **రాజ్యాంగకర్త అభిభాషణ – డా. బాబా సాహెబ్ అంబేద్కర్ – వ్యాసాలు – ఉపన్యాసాలు** – వాల్యూం – 17 మూడవ భాగం – సంపాదకులు: డా. కత్తి పద్మారావు – లోకాయత ప్రచురణలు – 158 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **3000 ఏండ్ల దళిత ఉద్యమ చరిత్ర** – డా. కత్తి పద్మారావు – లోకాయత ప్రచురణలు – 589 పేజీలు, 1/8 డెమీ, రు. 500

పై రెండు ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, లుంబినీవనం, అంబేద్కర్ కాలనీ, పొన్నూరు – 522124; సెల్:9849741695



❖ **కోయ తెగ – సంస్కృతి** – గిరిజన సంస్కృతి పరిశోధన – శిక్షణా సంస్థ – సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ, భద్రాచలం – 223 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: గిరిజన సంస్కృతి పరిశోధన – శిక్షణా సంస్థ, భద్రాచలం



❖ **ఆదివాసులు – వైద్యం సంస్కృతి అణచివేత** – కె. బాలగోపాల్ – పర్‌స్పెక్టివ్స్ – 147 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురు వీధి, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్ – 500 027; ఫోన్: 040 24652387



❖ **వొడువని ముచ్చట** – తెలంగాణ సిద్ధాంతకర్త ప్రొ. జయశంకర్ – ఇంటర్వ్యూ, సంపాదకత్వం: కొంపెల్లి వెంకట్ గౌడ్ – సహచర బుక్‌మార్క్ ప్రచురణ – 182 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **తెలంగాణ రాష్ట్రోద్యమాలు** (త్యాగాలు, మోసాలు, నమ్మక ద్రోహాల సంక్షిప్త చరిత్ర) – ఆదిరాజు వెంకటేశ్వరరావు– ప్రణవ పబ్లికేషన్స్, 208 పేజీలు, 1/8 డెమీ, రు. 120

పై రెండు పుస్తక ప్రతులకు: సహచర బుక్‌మార్క్ ఎపిఎచ్‌బి ఎచ్‌ఐజి (ఒజి), బ్లాక్ నం. 5, షాప్ నం. 29, సుందరయ్య పార్క్ దగ్గర, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044; సెల్: 9848348173



❖ **తొలి అడుగులు** – నవల – అక్కినేని కుటుంబరావు – స్వేచ్ఛ ప్రచురణలు – 239 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నవోదయ; నవచేతన; నవ తెలంగాణ బుక్‌హౌస్; విశాలాంధ్ర; ప్రజాశక్తి; ebook : kinige.com



❖ **సాలభంజిక** – కథలు – కుప్పిలి పద్మ, సంపాదకులు: అల్లాడి ఉమ, ఎం. శ్రీధర్ – 236 పేజీలు, 1/8 డెమీ, రు. 250



❖ **వాన చెప్పిన రహస్యం** – కథలు – కుప్పిలి పద్మ – 176 పేజీలు, 1/8 డెమీ, రు. 120



❖ **ది లాస్ ఆఫ్ యిన్నోసెన్స్** – కథలు – కుప్పిలి పద్మ – 206 పేజీలు, 1/8 డెమీ, రు. 120

పై మూడు పుస్తక ప్రతులకు: కుప్పిలి పద్మ, 201, విజయలక్ష్మి అపార్ట్‌మెంట్స్, మెథడిస్ట్ కాలనీ, బేగంపేట్, హైదరాబాద్ – 500 016; విశాలాంధ్ర; నవచేతన; నవోదయ; ebook : kinige.com

# భారత ప్రధాని విదేశీ పర్యటనలు

**భా**రతదేశపు ప్రధానమంత్రి భారతదేశంలో ఉండి పాలించాలని, పాలిస్తారని ఎవరైనా అనుకుంటారు. కాని నరేంద్ర మోడీ భారతదేశానికి అప్పుడప్పుడు వచ్చిపోతూ పాలిస్తున్నారని ఆయన మీద పరిహాసాలు వస్తున్నాయి. ఈ పరిహాసాలకు పరాకాష్టగా ఒక పత్రిక ఇటీవల ఒక కార్టూన్ ప్రచురించింది: అమెరికా అధ్యక్షుడు బారక్ ఒబామా నరేంద్ర మోడీకి దీపావళి శుభాకాంక్షలు చెప్పడానికి ఫోన్ చేశారట. దానికి ప్రతిగా మోడీ 'థాంక్యూ' అన్నారట. ఇంగ్లిషులో థాంక్యూ అంటే వెల్ కమ్ అనడం సంప్రదాయం గనుక ఒబామా 'వెల్‌కమ్' అన్నారట. వెల్‌కమ్ అంటే రమ్మని కూడ అర్థం గనుక మోడీ తాను ఎప్పుడు బయల్దేరుతున్నానో చెప్పడం మొదలు పెట్టారట.

నరేంద్ర మోడీ అధికారానికి వచ్చి ఇంకా పద్దెనిమిది నెలలు నిండకుండానే, 20 విదేశీ పర్యటనలు చేసి 88 రోజులు విదేశాల్లో గడిపారు. ముప్పై దేశాలు (భూటాన్, బ్రెజిల్, నేపాల్, జపాన్, అమెరికా, మయన్మార్, ఆస్ట్రేలియా, ఫిజీ, సెషెల్లెస్, మారిషస్, శ్రీలంక, సింగపూర్, ఫ్రాన్స్, జర్మనీ, కెనడా, చైనా, మంగోలియా, దక్షిణ కొరియా, బంగ్లాదేశ్, ఉజ్బెకిస్తాన్, కజకిస్తాన్, రష్యా, తుర్కమెనిస్తాన్, కిర్గిజిస్తాన్, తజకిస్తాన్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, ఐర్లాండ్, యునైటెడ్ కింగ్‌డమ్, టర్కీ, మలేషియా) పర్యటించారు. వాటిలో మూడు దేశాలకు రెండుసార్లు కూడ వెళ్లారు. ఈ పర్యటనలలో తొమ్మిది అంతర్జాతీయ సమావేశాలు, సదస్సులు కాగా మిగిలిన పర్యటనలు దౌత్య, వ్యాపార సంబంధాల కోసమో, మర్యాదపూర్వకంగానో జరిగినవే. అంతర్జాతీయ సంబంధాలలో భాగంగా రాజకీయ, ఆర్థిక, దౌత్యపరమైన వ్యవహారాలు నిర్వహించడానికి ఒక దేశపు నాయకులు మరొక దేశానికి వెళ్లడం సాధారణంగా జరిగేదే. ఆ పని కోసమే విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖ ఉంటుంది. విదేశీ ప్రయాణాల కోసం బడ్జెట్ కేటాయింపు ఉంటుంది. విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖకు 2015-16 బడ్జెట్‌లో మొత్తం కెటాయింపు రు. 14,966 కోట్లు కాగా అందులో వేరువేరు ఖాతాల కింద విదేశీ పర్యటనలకు ఖర్చు చేస్తారు. "ప్రత్యేక దౌత్య వ్యయం"గా కెటాయించిన రు. 1,650 కోట్లు పూర్తిగా పర్యటనలకు పెట్టే ఖర్చే. ప్రస్తుత కేంద్ర ప్రభుత్వంలో విదేశీ వ్యవహారాల శాఖ మంత్రిగా ఉన్న సుష్మా స్వరాజ్ కూడ ఈ పద్దెనిమిది నెలల్లో 20 దేశాలు పర్యటించారు. అంటే విదేశీ వ్యవహారాల శాఖ మంత్రి కన్న ప్రధానమంత్రే ఎక్కువ పర్యటించారు.

గతంలో ప్రధానులుగా పనిచేసిన అటల్ బిహారీ వాజపాయి 1999-2004 ఐదు సంవత్సరాల కాలంలో 31 దేశాలు పర్యటించగా, డా. మన్మోహన్ సింగ్ మొదటి విడత 2004-2009 కాలంలో 35 దేశాలు, రెండో విడత 2009-2014 కాలంలో 38 దేశాలు పర్యటించారు. ఆ ఇద్దరు ప్రధానులు ఐదు సంవత్సరాలలో తిరిగినన్ని దేశాలు నరేంద్ర మోడీ ఏడాదిన్నరలోనే తిరిగారు. ఇలాగే తిరిగితే ఐదు సంవత్సరాల పాలనలో వందదేశాలు తిరిగే అవకాశం ఉంది. ఎప్పుడైనా తప్పనిసరి అవసరం అయితే, విదేశాల నుంచి ఆహ్వానం వస్తే, ఏ దేశ ప్రధానికైనా తమ దేశం తరపున లాంఛనంగా, మర్యాదపూర్వకంగా విదేశాలకు వెళ్లవలసిన అవసరం వస్తుంది. దాన్ని ఎవరూ కాదనలేరు. కాని నరేంద్ర మోడీ అధికారంలోకి వచ్చిన అతి తక్కువ కాలంలోనే ఇంత ఎక్కువగా విదేశాలకు వెళ్లడం పరిశీలకులను ఆశ్చర్యపరుస్తున్నది. పర్యటనల సంఖ్య, ఉరవడి కన్న ముఖ్యంగా ఈ పర్యటనల ఫలితాలు ఏమిటనీ, ఎంత ఖర్చు జరుగుతున్నదో రహస్యంగా ఉంచడం ఏమిటనీ ప్రశ్నలు రేకెత్తుతున్నాయి.

మోడీ వెళ్లిన ప్రతి దేశంలోనూ ఆయా ప్రభుత్వాలతోనో, అక్కడి కార్పొరేట్ సంస్థలతోనో ఏవో ఒప్పందాలు కుదుర్చుకుని వచ్చారని ప్రభుత్వ ప్రకటనలు వచ్చాయి. ఆ ఒప్పందాల మీద సంతకాలు చేసేది ప్రధాని కాదు, ఆయా శాఖలకు బాధ్యత వహించే మంత్రులు, అధికారులు మాత్రమే. కనుక అవి ప్రధాని సమక్షంలో సంతకాలు జరిగాయన్న గొప్పలు చెప్పుకోవడానికే గాని ప్రధాని ఉన్నా లేకపోయినా తేడా ఏమీ లేదు. ఇంతకూ ఇలా ప్రధానమంత్రులు, మంత్రులు ఆయా దేశాలకు వెళ్లినప్పుడు, ఆయా దేశాధినేతలు భారతదేశానికి వచ్చినప్పుడు చేసే ప్రకటనలలో, సంతకాలలో, ఒప్పందాలలో సగమో పావో కూడ వాస్తవరూపం ధరించవనేది ఒక వాస్తవం. ఇటువంటి ఒప్పందాలు సాధారణంగా పెట్టుబడులు, విస్తరణలు వంటి వ్యాపార ఒప్పందాలై ఉంటాయి. అటువంటి ఒప్పందాలను ఆ వ్యాపార సంస్థలు ఒకేసారి నాలుగైదు దేశాల ప్రభుత్వాలతో చేసుకుంటాయి. అది కేవలం ఆసక్తి ప్రకటన. ఆ ప్రకటన ప్రాతిపదికగా ఆ దేశాల ప్రభుత్వాలు ఇవ్వజూపే రాయితీలను, తమ వ్యాపార అవకాశాలను, ఆ దేశంలో శ్రమశక్తి ఖరీదును, ఇతర సౌకర్యాల లభ్యతను అంచనా వేసుకుని, తమ లాభాల రేటు ఎక్కడ ఎక్కువ ఉంటుందో చూసి, చివరికి ఏ దేశంలో తమ వ్యాపారం ప్రారంభించాలో నిర్ణయిస్తాయి. అందువల్ల ఇల్లలకగానే పండుగకాదు, ఎంఒయు మీద సంతకాలు కాగానే ఆ పథకాలో, పెట్టుబడులో వచ్చినట్టు కాదు.

ఆ పథకాలో, పెట్టుబడులో వచ్చినా కూడ అవి ఆ పెట్టుబడిదారులకు లాభాలు సంపాదించిపెడతాయి. ఇక్కడి వనరులను దోచుకుపోతాయి. ఇక్కడి మార్కెట్లను ముంచెత్తి స్థానిక జీవన విధానాన్ని, సరుకుల వినియోగాన్ని, విలువలను మారుస్తాయి. అవి పెట్టుబడిదారుల కోసమే తప్ప ఇక్కడి ప్రజల కోసం కాదు. పెరుగుతున్న యాంత్రీకరణ వల్ల ఆ పథకాలతో, పెట్టుబడులతో వచ్చే ఉద్యోగాలూ ఉండవు. ప్రభుత్వాలు ఇస్తున్న రాయితీల వల్ల ప్రభుత్వ ఖజానాకు కూడ ఒరిగేదేమీ ఉండదు. ఆ పెట్టుబడులు జాతీయాదాయ లెక్కలలో చేరి ఆర్థికవ్యవస్థలో వాపు కనబడుతుంది. ఆ జాతీయాదాయాన్ని జనాభాతో భాగహారం చేసి తలసరి ఆదాయం పెరిగిందనీ, దేశం ప్రగతిపథంలో మున్ముందుకు దూసుకు పోతున్నదనీ ప్రభుత్వాలు ప్రజలను, ముఖ్యంగా మధ్యతరగతిని భ్రమల్లో

ముంచగలుగుతాయి. ప్రజలను ఎంత పెద్ద ఎత్తున భ్రమల్లో ముంచాలంటే ప్రభుత్వాధినేతలు అంతగా విదేశాలు పర్యటించాలి. లేదా విదేశీ ప్రభుత్వాధినేతలను, కార్పొరేట్ సంస్థల అధిపతులను దేశానికి ఆహ్వానించాలి. అందుకే మోడీ 30 దేశాలకు వెళ్లడం మాత్రమే కాదు, ఈ పద్దెనిమిది నెలల్లో 25 దేశాల ప్రభుత్వాధినేతలు భారత పర్యటనకు వచ్చారు. అన్ని సందర్భాలలోను ప్రభుత్వ పక్షాన భారీ ప్రకటనలు వెలువడ్డాయి. వాటిలో ఎన్ని వాస్తవ రూపం ధరించాయో, వాటివల్ల దేశ ప్రజలకు ఏ ప్రయోజనం చేకూరిందో వివరమైన పరిశోధన జరపవలసిందే.

భారత ప్రభుత్వాధినేతలు విదేశాలకు వెళ్లినప్పుడు వారి ప్రయాణ ఖర్చులు (సాధారణంగా ప్రత్యేక విమానంలో వెళతారు), అక్కడ స్థానిక ప్రభుత్వం కొంతవరకు స్థానిక ప్రయాణ, వసతి సౌకర్యాలు చూసినప్పటికీ, ఇతర ఖర్చులు భారత ప్రజాధనం నుంచే పెట్టవలసి ఉంటుంది. అలాగే ఇతర దేశాల ప్రభుత్వాధినేతలు భారత పర్యటనలో ఉన్నప్పుడు వారి ప్రయాణ, వసతి సౌకర్యాలతోపాటు వారికి ఇచ్చే కానుకలపై కూడ భారత ప్రజాధనాన్నే ఖర్చు పెట్టవలసి ఉంటుంది. ఐతే ఈ ప్రజాధనం ఎంత ఖర్చవుతున్నది, ఖర్చుగా లెక్కలు చూపుతున్నదంతా సక్రమమైనదేనా అని ప్రజలు తెలుసుకునే అవకాశమే లేదు. బడ్జెట్ లో ఒక పెద్ద మొత్తాన్ని చూపడం, దాని ఖర్చు నిర్ణయాధికారాన్ని అధికారులకు అప్పగించడం, బడ్జెట్ గడిచిపోయినతర్వాత, బడ్జెట్ లో అంచనా వేసినదానికన్న ఎక్కువ ఖర్చు అయిందని సవరించడం అలవాటయిపోయింది.

ఈ నేపథ్యంలో మోడీ విదేశీ ప్రయాణాలకు గాని, అసలు మొత్తంగా విదేశీవ్యవహారాల శాఖ తరపున జరిగిన విదేశీ పర్యటనల ఖర్చు గాని తెలుసుకోవడానికి బడ్జెట్ అంకెలు ఒక సూచన మాత్రమే. అవి పూర్తి చిత్రాన్ని తెలియజేయవు. 2015-16 బడ్జెట్ ప్రకారం మోడీ అధికారంలోకి వచ్చిన తర్వాత గడిచిన ఆర్థిక సంవత్సరంలో అధికారిక విదేశీ పర్యటనలకు రు. 316.76 కోట్లు ఖర్చయింది. అందులో రు. 39.70 కోట్లు ప్రధానమంత్రి విదేశీ పర్యటనలకు ఖర్చయింది. 2015-16 కు మొత్తం ఖర్చు రు. 269 కోట్లు అని, ప్రధానమంత్రికి రు. 39.26 కోట్లు అని బడ్జెట్ అంకెలు చెపుతున్నాయి గాని కచ్చితంగా ఈ అంకె కన్న ఎంతో ఎక్కువ ఖర్చయిందని వచ్చే సంవత్సరం బడ్జెట్ లో సవరించిన అంచనాలు ప్రకటిస్తారు.

ఈ బడ్జెట్ అంకెలతో సమస్యలు ఉన్నందువల్ల, వాస్తవ ఖర్చును తెలుసుకునేందుకు మరొక మార్గంగా సమాచార హక్కు చట్టం ఉపయోగించుకోవచ్చునని కొందరు భావిస్తున్నారు. సమాచారహక్కు చట్టం ఏదో సర్వ రోగ నివారిణి అన్నట్టు, సంజీవనీ మాత్ర అన్నట్టు జరుగుతున్న ప్రచారం ఎంత అబద్ధాల ఆర్భాటమో ఈ విషయంలో సమాచారహక్కు చట్టం వినియోగదారులు ప్రయత్నాలు చూపుతున్నాయి.

రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి పదవీకాలాలలో వైద్య చికిత్సలకూ ప్రయాణాలకూ ఎంత ఖర్చు అయిందో చెప్పాలని ముంబాయి పౌరుడు చేతన్ కొఠారి 2008 ఫిబ్రవరిలో రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధానమంత్రి కార్యాలయాలలో సమాచార హక్కు అధికారులకు దరఖాస్తులు పంపించారు. "దరఖాస్తుదారు అడిగిన సమాచారం వేరువేరు చోట్లనుంచి సమీకరించవలసి ఉంటుంది. అందుకోసం ఈ ప్రభుత్వ సంస్థ వనరులను అనుచితంగా ఖర్చుపెట్టవలసి వస్తుంది. ఈ కార్యాలయపు సాధారణ పనికి భంగం వాటిల్లుతుంది" అనే కారణంతో ఆ సమాచారం ఇవ్వడానికి నిరాకరించారు. ఆయన సమాచారహక్కు చట్టం ప్రకారం పై అధికారులకు అప్పీలు చేశారు. ఆ పై అధికారులు కూడ దేశాధినేతల విదేశీ పర్యటనల ఖర్చు వివరాలు చెప్పాలంటే విదేశీ వ్యవహారాల మంత్రిత్వశాఖనూ, రక్షణ మంత్రిత్వశాఖనూ అడగాలనీ, ఆ పని చేయడమంటే ఈ కార్యాలయాల వనరులను అనుచితంగా ఖర్చుపెట్టడమేననీ, సాధారణ పనిని పక్కన పెట్టడమేననీ అన్నారు. దానిమీద చేతన్ కొఠారీ కేంద్ర సమాచార కమిషనర్ కు ఫిర్యాదు చేశారు. కేంద్ర సమాచార కమిషనర్ కూడ ఈ సమాచారం నిరాకరించడం సక్రమమేనని తీర్పు చెప్పారు. ఆ చివరి తీర్పు 2009 సెప్టెంబర్ లో వెలువడింది. అంటే, ప్రజాధనాన్ని ప్రజాప్రతినిధులనబడేవారు ఎలా ఖర్చు పెట్టారు అనే న్యాయబద్ధమైన ప్రశ్నకు అడిగిన సమాచారం రాలేదు సరిగదా పందొమ్మిది నెలల సమయం పట్టింది.

ఇక లోకేష్ బత్రా అనే మాజీ సైనికోద్యోగి జూన్ 2014 నుంచి జూన్ 2015 వరకు నరేంద్ర మోడీ పర్యటించిన ఇరవై దేశాలలోని దౌత్యకార్యాలయాలు ఒక్కొక్క దానికీ ఒక సమాచారహక్కు దరఖాస్తు సమర్పించి ప్రయత్నించారు. 16 దేశాల కార్యాలయాలు ఆ సమాచారం ఇచ్చాయి. దాని ప్రకారం ప్రధాని విదేశీ పర్యటనల ఖర్చు రు. 47.42 కోట్లు అని తేలింది. ఇంకా ఫ్రాన్స్, జపాన్, శ్రీలంక, దక్షిణ కొరియాలలోని భారత దౌత్యకార్యాలయాలు తమ లెక్కలు పూర్తి కాలేదని, అందువల్ల ఇవ్వలేమని చెప్పాయి గనుక ఈ అంకె ఇంకా పెరగవచ్చు. అంటే బడ్జెట్ పత్రాలలో చెప్పినది నిజం కాదన్నమాట. వీటిలో ఆస్ట్రేలియా పర్యటనలో, కాన్ బెర్రాలో హోటళ్లకు రు. 5.65 కోట్లు, కార్లు అద్దెకు తీసుకున్నందుకు రు. 2.48 కోట్లతో సహా మొత్తం రు. 13 కోట్లు అతి ఎక్కువ ఖర్చయిందట. తక్కువలో తక్కువ భూటాన్ పర్యటనలో రు. 41.33 లక్షలు ఖర్చయిందట.

ఇంతకన్నా విచిత్రమైన విషయం భారత పర్యటనకు వచ్చే విదేశీ ప్రభుత్వాధినేతలకు భారత ప్రభుత్వం ఇచ్చే కానుకలకు సంబంధించినది. 2015 జనవరిలో రిపబ్లిక్ దే ఉత్సవాల సందర్భంగా భారత పర్యటనకు వచ్చిన సందర్భంగా జరిగిన ఖర్చు గురించీ, అమెరికా అధ్యక్షుడు బారక్ ఒబామాకు, ఆయన కుటుంబ సభ్యులకు ఇచ్చిన కానుకల విలువ గురించీ దేశంలో వేరు వేరు చోట్ల నుంచి 13 సమాచార హక్కు దరఖాస్తులు వచ్చాయి. అన్నిటికీ విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖ ఇచ్చిన జవాబు ఒకటే: "అమెరికా అధ్యక్షుడికీ, ఆయన కుటుంబానికీ భారత ప్రధాని ఇచ్చిన కానుకల గురించి సమాచారం వెల్లడించడం ఆ దేశంతో భారత దేశానికి ఉన్న సంబంధాల మీద ప్రతికూల ప్రభావం వేస్తుంది. సమాచార హక్కు చట్టం నిబంధన 8 (1)(ఎ) కింద ఆ సమాచారం ఇవ్వనక్కరలేదని మినహాయింపు కోరుతున్నాం." నిజానికి అమెరికా విదేశాంగ శాఖ కార్యాలయం తమ అధ్యక్షుడికి ఏయే దేశంలో ఎంతెంత విలువైన కానుకలు ఇచ్చారో తన వెబ్ సైట్ మీద వివరాలన్నీ పెడుతుంది. ఇదీ మన ప్రజాప్రతినిధులు ప్రజాధనాన్ని ఖర్చు పెడుతున్న తీరు!!!

వీ

# విద్వేషపూరిత అసహనం

***దేశంలో భౌతిక వాదులపై, ముస్లిం మైనారిటీలపై ఆధిపత్య మతస్తులు చేస్తున్న దాడులకు నిరసనగా కవులు, కళాకారులు, శాస్త్రవేత్తలు అవార్డులను వాపసు ఇస్తుంటే జీర్ణించుకోలేని శక్తుల అసహన తీరును వివరిస్తున్నారు బి. సతీష్***

భారతదేశం ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామిక దేశమని గొప్పగా చెప్పుకునే రాజకీయ వ్యవస్థకు దేశ అంతర్గత సామాజిక వ్యవస్థ పునాదుల్లో ఎంత అప్రజాస్వామిక భావజాలం దాగి ఉందో చెప్పుకునే ధైర్యం లేదు. అది ఎంతటి అసమానతల సమాజాన్ని రూపొందించిందో బయటి ప్రపంచానికి పెద్దగా తెలియనివ్వకుండా ఓట్లు వేయడం, సీట్లల్లో వ్యక్తుల్ని మార్చడాన్నే గొప్ప ప్రజాస్వామిక వ్యవస్థగా చెప్పుకుంటున్నారు. తనకు ఇష్టమైన వ్యక్తికి, పార్టీకి ఓటువేయడం ప్రజాస్వామిక హక్కు అయినప్పుడు సాధారణ మనిషి తనకిష్టమైన ఆహారాన్ని తినడం, నచ్చిన బట్టల్ని వేసుకోవడం, అభిరుచికి తగిన జీవనశైలిని ఏర్పర్చుకోవడం కూడా ప్రజాస్వామిక హక్కేకదా?

మరి ఇవాళ ఒక మనిషి ఆవు మాంసం తిన్నాడని చంపివేయడం, ప్రేమికుల రోజుగా చెప్పుకునే ఫిబ్రవరి 14న యువతీ యువకుల్ని వేధించడం, హింసించడం వారి పౌర స్వేచ్ఛల్నీ, హక్కుల్నీ ఉల్లఘించడం కాదా? అది ఏ పెద్ద ప్రజాస్వామిక దేశ లక్షణం? దేశమంతా ఒకే జీవన విధానం ఉండాలని, ఒకే విశ్వాసం ఉండాలని వైవిధ్యం అంటేనే విరుచుకుపడే ఫాసిస్టు శక్తులు ఇవాళ స్వైర విహారం చేస్తున్నాయి.

అఖండ భారత్ మహాకలల్లో విహరించే మతోన్మాద సంఘాలిప్పుడు సాంస్కృతిక పెత్తనం కోసం కమండలాలు చేపట్టి ప్రశ్నించే గొంతుల్నీ, అసమ్మతిని తెలిపే బుద్ధిజీవుల్నీ, అనాగరికపు ఆచారాల్ని ఎదిరించే హేతువాదుల్ని, పుక్కిటిపురాణాలు ప్రజల చరిత్ర కాదన్న చరిత్రకారుల్ని వేధించి ప్రాణాలు తీస్తున్నారు. వాస్తవంకంటే విశ్వాసం గొప్పదని, మనోభావాల పేరుతో నిరూపితమైన సత్యాలను మంటగలిపే ఉన్మాదపు చేష్టలకు తెగబడుతున్నారు.

తమిళ రచయిత పేరుమాల్ మురుగన్‌ను రచయితగా 'హత్య' చేసినవి కూడా ఈ ఉన్మాద శక్తులే. అధికారం అండతో అంధవిశ్వాసాలను అసలైన సత్యాలుగా ప్రచారం చేసే పనిని చేయడమేగాక ప్రశ్నిస్తే హింసకు తెగబడుతున్నారు. బాబ్రీ మసీదు కూల్చివేతతో మొదలయి, ఈ దేశ లౌకిక విలువల్ని, సాంస్కృతిక భిన్నత్వాన్ని, విధ్వంసం చేసి సామాజిక వ్యవస్థలో విచ్ఛిన్నకర భావజాలాన్ని చొప్పించి వేలాది మంది అమాయకులు బలైపోవడానికి కారకులయినారు. ఈ దేశంలో హిందువులు మాత్రమే దేశ భక్తులనీ, ముస్లిం, క్రైస్తవ విశ్వాసం కల్గిన వారికి దేశంపట్ల గౌరవం, అభిమానం లేదనే ప్రచారాన్ని విస్తృతంగా చేస్తున్నారు.

భారతదేశం ఏకశిలా సదృశ్యమైనదనే అభూత కల్పనలను వాస్తవంగా చిత్రించే ప్రయత్నం చేస్తూ చరిత్రను తిరిగి రాసే పనిలో నిమగ్నమయినవి. అంతరాలు, అసమానతలతో కూడిన సామాజిక వ్యవస్థకు అమోదం పొందింపచేసే బ్రాహ్మణీయ భావజాలాన్ని సమాజం మొత్తంమీద రుద్దే దుర్మార్గపు ప్రయత్నాలు జరుగుతున్నాయి. అసమానతలు సహజమనే అమానవీయత, అనాగరికత మౌలిక లక్షణంగా కల్గిన మనువాద బ్రాహ్మణీయ వ్యవస్థ తన అసహనపు మంటల్ని వెల్లగక్కుతుంది. శతాబ్దాల కిందట యజ్ఞయాగాదులకు జంతువుల్ని బలిచ్చిన బ్రాహ్మణీయ వ్యవస్థ సాదు జంతువై అహింసావచనాలు పలుకుతున్నది. జంతువులన్నింటిలో ఆవు మాత్రమే పవిత్రమైనదని దాని హత్య మహాపాపమని చెబుతున్నది. అట్లా చెప్పడం ద్వారా ఈ బ్రాహ్మణీయ వ్యవస్థ మనుషులందరిలో బ్రాహ్మణులు ఉత్తములు, పండితులు, పవిత్రులు అనే మేథో ఆధిపత్య భావన మాత్రమే ఉన్నది. పవిత్ర గోవు, పవిత్ర జలాలు అనేవి ఒక మత భావన, మనోభావన మాత్రమే కానీ అది ఒక భౌతిక వాస్తవం కాదు. మానవ వికాసానికి, ఉత్పత్తి క్రమానికి ఉపయోగపడే ఏ జంతువైనా గొప్పదే, కానీ ఒక ఆవు మాత్రమే అదీ పవిత్ర జంతువు పేరుతో గొప్పదనటం వెనకాల అసమానత భావజాలం ఉన్నది. పరిశుభ్రమైన జలాలే ఉంటాయి కానీ, పవిత్ర జలాలంటూ ఏమీ ఉండవు. ఒకవైపు కలుషితమైన గంగానది కోసం వందలాది కోట్ల రూపాయలు ఖర్చుచేస్తూ ఆ జలాలను పవిత్ర జలాలని ప్రచారం చేయడం చీకటి యుగాల లక్షణం. పుట్టుకతోనే ఉత్తమమైనవి, శ్రేష్టమైనవి, అధమమైనవి అని ముద్రవేసే ఈ అనాగరికపు వ్యవస్థే అన్ని రంగాల్లో ఆధిపత్యం చేసి మనుషులందరికి సమాన విలువ, గౌరవంలేని స్థితిని స్థిరపర్చాలనుకుంటున్నది. ఈ క్రమంలోనే తన అసహనాన్ని అన్ని రూపాల్లో వికృతంగా ప్రదర్శిస్తున్నది.

జీవిత కాలమంతా అంధవిశ్వాసాలకు మూఢాచారాలకు వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతం చేసిన నరేంద్ర దభోల్కర్, గోవింద్ పన్సారే, కల్బుర్గి వంటి బుద్ధిజీవుల్ని పొట్టనపెట్టుకున్నది ఈ మతోన్మాదులే. తమ మతం మీద, అసమానత కృత్రిమ కుల వ్యవస్థపైన సహేతుకమైన ప్రశ్నల్ని భరించరూ, పరమత విశ్వాసాలను అస్సలూ సహించరూ. అందరూ ఒకే జీవన విధానం, ఆహారం, ఆహార్యం, భాషను కల్గి ఉండి భిన్నత్వాన్ని, స్వంతదనాన్ని మర్చిపోవాలి. వ్యక్తిగత స్వేచ్ఛల్ని, స్వతంత్రాలను ఇష్టా అయిష్టాలను వదిలివేసి విశ్వాసాల ఆధారంగా ఏర్పడిన మత వ్యవస్థకు బానిసలై బతకాలి. తన మతంలోని వ్యక్తులకు స్వేచ్ఛను నిరాకరించడమే కాకుండా పరమత అసహనాన్ని, అన్యవిశ్వాసాల వారి అలవాట్లను ఈ దేశ విలువలకు, సంస్కృతికి విరుద్ధమనే విధంగా దుష్ప్రచారం చేస్తూ వారి అలవాట్లను హింసాయుతంగా మాత్రమే మార్చగలమనే విధానానికి అమోదం పొందే ప్రయత్నం చేస్తున్నది. ఈ అసహనానికి దౌర్జన్యానికి అధికార పీఠాల అండదండలు పుష్కలంగా ఉన్నవి.

ఏలుతున్న వారికి మాత్రం ప్రజల భద్రత, అభివృద్ధి, వ్యక్తిగత స్వేచ్ఛ, వారికి రాజ్యాంగం కల్పించిన హక్కుకంటే విదేశీ పెట్టుబడులు, మార్కెట్ ఆలింగనాలు, దేశీయ వనరులను 'భద్రంగా' బహుళజాతి కంపనీలకు అర్పించటం మీద ధ్యాసనే ఎక్కువ ఉన్నది. ఇలాంటి సంఘటనల పట్ల అంటిముట్టనట్టుండి అప్పుడప్పుడు మాత్రం కొన్ని సుభాషితాలను బయటికి వదులుతారు. దాద్రిలో గోవు మాంసం తిన్నాడనే నెపంతో మహ్మద్ అక్లాఖ్ అనే ముస్లిం వ్యక్తిని కొట్టి చంపారు. బుందేల్‌ఖండ్‌లో

# బిహార్‌లో భాజపాకు ఎదురుదెబ్బ

***బిజెపి, సంఘ్‌పరివార్ శక్తులు మతం పేరుతో ప్రజల మధ్య సృష్టిస్తున్న విద్వేషాలను, మోడీ అభివృద్ధి నమూనాను తిరస్కరించి, లౌకిక ప్రజాస్వామిక కూటమిని బిహార్ ప్రజలు ఆహ్వానించారని అంటున్నారు* షేక్ కరిముల్లా**

'మతములన్నియు మాసిపోవును జ్ఞానమొక్కటే నిలిచి వెలుగును' అన్న గురజాడ గారి మాటలను నిజం చేస్తూ రాజకీయ విశ్లేషకుల, ఎగ్జిట్ పోల్స్ అంచనాలు తలకిందులైనాయి. నితీష్ కుమార్ సారథ్యంలోని లౌకిక మహా కూటమికి తిరుగులేని ఆధిపత్యంతో పట్టం కట్టి తమ విలక్షణతను చాటుకున్న బిహార్ ప్రజలు అభినందనీయులు. ప్రజల మధ్య చిచ్చు పెట్టి పబ్బం గడుపుకునే విచ్ఛిన్నకర మతతత్వ శక్తులకు చెంపపెట్టు ఈ ఎన్నికల ఫలితాలు. మత శక్తులను అధికారానికి ఆమడ దూరంలో పెట్టి బుద్ధుడు జన్మించిన గడ్డ వారసత్వాన్ని కొనసాగించడం హర్షణీయం. ఒక విధమైన ఉద్రేకభరిత అసహన వాతావరణం మధ్య జరిగిన బిహార్ ఎన్నికలు యావత్ దేశాన్ని ఆకర్షించడమే కాకుండా, ఎంతో ప్రాధాన్యతను సంతరించుకుని, నరాలు తెగే ఉత్కంఠను రేపాయి. అందుకు కారణం ఈ ఎన్నికలు ప్రధాని నరేంద్రమోడీ అనుసరిస్తున్న సంఘ్‌పరివార్ ఎజెండా. కార్పొరేట్ శక్తులకు మేలు చేసే దివాళకోరు ఆర్థిక విధానాలు. అభివృద్ధి, సంస్కరణల పేరిట దేశ ఆర్థిక వ్యవస్థను ప్రభుత్వ రంగాన్ని మరింత నిర్వీర్యం చేస్తూ దేశ, విదేశీ గుత్త పెట్టుబడి శక్తులకు దేశాన్ని తాకట్టు పెట్టే చర్యలను ఆమోదింపచేసుకోవడానికి ఈ ఎన్నికలలో ఎలాగైనా గెలవాలని మోడీ బిహార్ ఎన్నికలను వ్యక్తిగతంగా తీసుకున్నారు. ప్రధాని హోదాలో గతంలో మరెవ్వరూ తిరగనంతగా కాలికి బలపం కట్టుకొని మరి ఎన్‌డిఎ గెలుపు కోసం ప్రచారం చేశారు. ప్రధాన మంత్రి స్థాయి వ్యక్తి ఓ రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలకు

ఆలయ ప్రవేశం చేయబోయిన 90 ఏళ్ల కిమ్మా అహిర్వార్ అనే దళిత వృద్ధుడిని సజీవ దహనం చేశారు, మరోచోట దళిత కుటుంబాన్ని మంటల్లోకి తోసి ఇద్దరు చిన్నారులను సజీవంగా దహనం చేసిన ఉన్మాదపు చర్యలు కళ్లముందటి చరిత్రే.

ఢిల్లీలోని చర్చీపైన దాడులు, పాకిస్తాన్ మాజీ విదేశాంగ శాఖామంత్రి పుస్తకాన్ని ఆవిష్కరించకుండా అడ్డుకున్న ప్రయత్నం, గులాం అలీ సంగీత కార్యక్రమాన్ని బలవంతంగా రద్దుపరచిన దౌర్జన్యకర ఘటనలన్నీ వేరువేరుగా కనిపిస్తున్నా వాటి వెనకాలున్న శక్తులన్నీ ఈ దేశంలో హిందూ సాంస్కృతిక జాతీయ వాదాన్ని రెచ్చగొడుతున్న శక్తులే.

అసహనపూరిత వాతావరణాన్ని, రాజ్యాంగం అంధించిన స్వేచ్ఛా స్వంతంత్రాన్ని హరించే దౌర్జన్యకర స్థితిని నిరసిస్తూ దేశంలోని కవులు, కళాకారులు, రచయితలు, శాస్త్రవేత్తలు, చరిత్రకారులు, సామాజిక కార్యకర్తలు తమ నిరసనగళాన్ని బలంగానే వినిపించారు. అనేకమంది రచయితలు తమ అవార్డుల్ని తిరిగి ఇచ్చివేయడం ద్వారా దేశవ్యాప్తంగా చర్చను లేవనెత్తారు.

నయనతార సెహగల్ తన అవార్డులను కేంద్ర సాహిత్య అకాడమికి తిరిగి పంపడం ద్వారా ఊపందుకున్న ఈ నిరసన రూపం అంతర్జాతీయ సమాజ దృష్టిని కూడా ఆకర్శించింది. పి.ఎం. బార్గవలాంటి సుప్రసిద్ధ శాస్త్రవేత్త పద్మభూషణ్ వంటి పురస్కారాన్ని వాపసు పంపడాన్ని బాధ్యత మరిచిన ప్రభుత్వాలు తప్పుబడుతున్నాయి. రాజకీయాల ప్రభావంతో ప్రభుత్వాలను, దేశప్రతిష్టను కించపరుస్తున్నారంటూ వారిపైనే ఎదురుదాడి చేసే ప్రయత్నాన్ని ప్రభుత్వ పెద్దలు కొందరు చేస్తున్నారు.

మెజారిటి మతాధిపత్యం, సాంస్కృతిక అసహనం, రాజ్యాంగ హక్కుల ఉల్లంఘనలు, మైనారిటీలు అభద్రతలో ఉంటే దేశ ప్రతిష్ట ఏదో దిగజారనట్టు అలాంటి అసహన స్థితిని వ్యతిరేకిస్తేనే దేశానికి ఏదో ఉపద్రవం అన్నట్టు వ్యవహరిస్తున్నారు. నేటి పాలకులే దేశంలో ఇందిరా గాంధి విధించిన అత్యవసర పరిస్థితిని వ్యతిరేకించిన నయనతార సెహగాల్‌ను ధీరవనిత అని పొగడిన సందర్భం ఉంది.

హిందూ మత రాజ్యస్థాపనే ధ్యేయంగా పెట్టుకున్న శక్తులు ఈ దేశపు బహుళత్వాన్ని లౌకిక విలువల్ని అగౌరవ పరచటమే కాకుండా రాజ్యాంగం నిర్ధేశించిన శాస్త్రీయ భావన, మానవీయ విలువలు, ప్రశ్నించే తత్వాన్ని బలవంతంగా తుంచివేసే ఉన్మాద చర్యకు పూనుకుంటున్నాయి. ప్రశ్నను భరించలేని బలహీనమైన ఈ భావజాల శక్తులే భౌతిక దాడులకు పాల్పడుతున్నారు. ఎటువంటి విద్యను అందించాలనే అకాడమిక్ పోలీసింగ్ నుండి ఎలాంటి సాంస్కృతిక విలువల్ని అలవర్చుకోవాలో వరకు నిర్ధేశించే మోరల్ పోలీసింగ్‌కు కూడా ఈ మతోన్మాద శక్తులే పాల్పడుతున్నాయి. పుక్కిటి పురాణాలను వాస్తవ చరిత్రగా, పురాణ పురుషుల్ని చారిత్రక పురుషులుగా చిత్రించే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు.

సమాజ చలనం భౌతిక శక్తులతో కాకుండా కాల్పనిక, ఊహాత్మకమైన శక్తుల ద్వారా జరుగుతుందని నమ్మించే సనాతన భావజాలంవైపు కొత్తతరాన్ని తీసుకెళ్లే ప్రయత్నం అధికార పీఠాల అంగీకారంతో తీవ్రంగా జరుగుతున్నది.

భారత దేశ గతమంతా ఒక ఉజ్వల చరిత్ర అని, ప్రపంచానికి విజ్ఞానాన్ని అందించి నాగరికతను నేర్పింది మనమేనని అటువంటి గొప్ప చరిత్ర విదేశీయుల (ముస్లిం, క్రైస్తవుల) రాకతో చెదిరిపోయిందని ఆ 'మహోజ్వల' చరిత్ర మళ్లీ నిర్మాణం కావాలంటే అఖండభారత్, హిందూ రాజ్య స్థాపన జరగాలనే స్పష్టమైన ఎజెండానే ఇవాల్టి అసహనపూరిత దాడులకు మూలం.

ఇటువంటి మతోన్మాద శక్తుల, దౌర్జన్యకర చర్యలపట్ల రాజ్యం సహనంగా ఉండడం ఆ అజెండాను అమలుపర్చడంలో భాగమే. ఈ విద్వేషపూరిత, విచ్ఛిన్నకరమైన పరిస్థితి కొనసాగితే ఇవాళ నిరసన తెలియజేస్తున్న శక్తులకు, నిరసన రూపాలకు భవిష్యత్తులో ఈ మాత్రం అవకాశం కూడా ఉండదన్న ప్రమాద సంకేతాన్ని అర్థం చేసుకొని ఈ నిరసనలను చిక్కపర్చడమే కాకుండా ప్రజా బాహుళ్యాన్ని ఆ దిశగా సమాయత్తం చేయాలి. వీ

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

12 రోజులు కేటాయించి 31 సభల్లో పాల్గొనడం గతంలో ఎన్నడు లేదన్నది విశ్లేషకుల మాట. మరోవైపు కోట్లు కుమ్మరించినా ఫలితం దక్కలేదు. అంతేకాక సంఘ్‌పరివార్ శక్తుల కుయుక్తులు, ఎత్తులను ఇక ఎంత మాత్రం సాగన్వివ్వబోమని బిహార్ ప్రజలు తేల్చి చెప్పారు. ఢిల్లీ రాష్ట్ర ఎన్నికలతో మొదలైన బిజెపి పతనం ఈ ఫలితాలతో సంపూర్ణమైనది. అన్నింటికి మించి సంఘ్‌పరివార్ లౌకిక భారతావనిపై రుద్దాలనుకున్న సనాతన, భూస్వామ్య సంస్కృతి వారి అనాగరిక చర్యలకు బిహార్ ప్రజలు సమాధానం చెప్పారు. కులం, మతం పేరుతో మారణ హోమాలు సృష్టించి ఒకటిగా కలిసి మెలిసి జీవిస్తున్న ప్రజలను చీల్చాలనుకోవడం, తద్వారా ప్రజలలోని అమాయకత్వాన్ని రాజకీయంగా సొమ్ము చేసుకోవాలనే దుష్ట పన్నాగాలకు ఎదురుదెబ్బ. 1920లో పుట్టిన స్వాతంత్ర్యోద్యమంలో ఎలాంటి పాత్ర, చరిత్రలేని అపర 'దేశ భక్తి' ఆర్ఎస్ఎస్ తదితర ఫాసిస్టు పోకడలకు ఇది అడ్డుకట్ట. దేశభక్తి, జాతీయత, మతం వంటి ముసుగులను కప్పుకుని దేశంలో అరాచకాలు సృష్టించి, కార్పొరేట్ దేశ, విదేశీ పెట్టుబడుల దోపిడీని ప్రజలు ప్రశ్నించకుండా, ప్రజల, మేధావుల, రచయితల, మొత్తం సమాజ ఆలోచనలను పక్కదారి పట్టించే పన్నాగం ఇందులో ఇమిడి ఉంది. ఈ మతతత్వ శక్తులు ఎక్కడ ప్రజల బతుకుకు సంబంధించి, వారి జీవితాల మెరుగుకు సంబంధించి ఆర్థిక విషయాల మీద ఉద్యమించిన దాఖలాలు చరిత్రలో ఎక్కడా లేవు. మౌలికంగా బిజెపి సంపన్న వర్గాల పార్టీ.

2014 సాధారణ ఎన్నికలలో మోడీ అభివృద్ధి మంత్రం పేరుతో ప్రజల ముందుకు వచ్చాడు. యువతకు ఉపాధి నల్ల డబ్బు వెలికితీసి అందరికీ పంచుతామని, అవినీతిని నిర్మూలిస్తామని బిహార్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు ప్రత్యేక హోదా కల్పిస్తాం లాంటి వాగ్దానాలు చేసి 'అచ్ఛేదిన్' తెస్తామని ఊదరగొట్టాడు. అధికారానికి వచ్చి సంవత్సరంన్నర అయినా ఒక్క వాగ్దానం కూడా నెరవేర్చలేదు. ఎంచక్క లక్షల విలువ చేసే సూటు బూటు వేసుకుని విదేశాలు తిరగడం, దేశ, విదేశీ బడా కార్పొరేట్ సంస్థల చుట్టూ తిరగడం, వారి సేవలో తరించడం తప్ప ఈ 'చాయ్‌వాలా' చేసింది ఏమీలేదు.

**బాధ్యతా రహిత ప్రకటనలు**

నిత్యం మతం మౌఢ్యంతో బిజెపి ఎంపిలు, సాధ్వీలు, స్వాములు వివాదాస్పద వ్యాఖ్యలు, బాధ్యతా రహిత ప్రకటనలతో ప్రజల మనోభావాలను దెబ్బతీశారు. బిహార్ ఎన్నికల ముందు మతపరంగా జనాభా లెక్కలు వెల్లడించి ముస్లిం జనాభా పెరుగుతుందని విష ప్రచారం చేశారు. కానీ వాస్తవంగా ముస్లిం జనాభా తగ్గినది. బిహార్‌లో బిజెపి ఓడిపోతే పాకిస్తాన్‌లో టపాసులు పేల్చుకుంటారంటూ బిజెపి అధ్యక్షుడు అమిత్‌షా ఎన్నికల ప్రచారంలో మాట్లాడడం విడ్డూరం. కులాల ప్రాతిపదికగా ఉన్న రిజర్వేషన్ల విధానాన్ని సమీక్షించాలని ఆర్ఎస్ఎస్ అధినేత మోహన్ భగవత్ చేసిన వ్యాఖ్యలతో బిసిలు, దళితులు ఆందోళనకు గురయ్యారు. ఇలాంటి విద్వేష పూరిత ప్రసంగాలు వీరి కొంప ముంచాయి. బిహార్‌లో సామాజిక కూర్పును పరిశీలిస్తే యాదవుల తరువాత దళితుల జనాభే ఎక్కువ. ముస్లింల జనాభా 15 శాతం. ఈ స్థితిలో దళితులు నొచ్చుకునేలా కేంద్ర మంత్రి వికె సింగ్ చేసిన వ్యాఖ్యలు దుమారం రేపాయి. హర్యానాలో ఓ దళితుని ఇంటికి నిప్పు పెట్టగా ఇద్దరు చిన్నారులు కాలిపోయారు. దీనిపై వికె సింగ్ స్పందిస్తూ 'కుక్కపై రాళ్లు వేసినా కేంద్రాన్ని తప్పు పడతారా'? అన్నాడు. దీని ప్రభావం బిహార్ ఎన్నికల ఫలితాల్లో ప్రస్ఫుటంగా కనిపించింది. ఇక బిహార్‌లో ముస్లింలు తొలి నుంచి బిజెపికి వ్యతిరేకంగానే ఉన్నారు. వారి ఓటు బ్యాంకును సమర్థంగా చీల్చి లాభపడాలన్న బిజెపి పాచిక పారలేదు. మజ్లిస్ పార్టీ కూడా ముస్లిం ఓట్లను చీల్చలేకపోయింది. 'దాదరీ' ఘటనపై పాలకులు, అధికార నేతలు స్పందించిన తీరుతో కథ అడ్డం తిరిగింది. దీనికితోడు ముస్లింల పౌరసత్వం, హోదా, తిండిపై కేంద్ర మంత్రులు, అధికార ఎంపిలు వరుసగా చేసిన దురుసు వ్యాఖ్యలు బిహార్ ఎన్నికలను ప్రభావితం చేశాయి. ఈ పరిస్థితిలో ముస్లిం ఓటు ఏకపక్షంగా మహా కూటమికి పోలైందని రాజకీయ పరిశీలకులు విశ్లేషించుకుంటున్నారు.

**ముంచిన అసహనం**

భారత రాజ్యాంగంలో 51 ఎ (ఎచ్) ప్రకారం హేతువాద, శాస్త్రీయ దృక్పథాన్ని ప్రజలలో పెంపొందించి లౌకిక వ్యవస్థను పటిష్టం చేయడం రాజ్యం కర్తవ్యం. ఈ రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా ప్రజలలో హేతువాద శాస్త్రీయ భావాలను పాదుకొలుపుతున్న రచయితలను, మేధావులను, హేతువాదులను చంపడం స్వతంత్ర్యానంతరం దేశంలోనే అత్యంత హీనమైన చర్య. దీనిపై పాలకులు మౌనం వహించడం అత్యంత దారుణం. బిజెపి అధికారంలోకి వచ్చింది మొదలు సంఘ్ పరివార్ హిందూత్వ ఎజెండా అమలుకు కంకణం కట్టుకుంది. న్యాయ వ్యవస్థ న్యాయమూర్తులతో సహా యుజిసి, జాతీయ స్థాయి చారిత్రక, విద్యా, సాంస్కృతిక పరిశోధనా సంస్థల్లో ఉన్నత స్థాయి నియామకా లన్నింటిని ఛాందస హిందూత్వ వాదులతో నింపుతూ వివాదాస్పదం చేసింది. ప్రజల జీవించే హక్కులను కాలరాసే 2013 భూసేకరణ చట్టాన్ని సవరణలు చేసి రాజ్య సభ ఆమోదం పొందడానికి పిల్లి మొగ్గలు వేసి సాధ్యం కాక అనేక పర్యాయం ఆర్డినెన్స్‌లు తెచ్చి అభాసుపాలు అయింది. ముఖ్యంగా కర్ణాటకకు చెందిన మేధావి, హేతువాది, రచయిత కల్బుర్గిని అత్యంత దారుణంగా హిందూత్వ ఛాందస శక్తులు చంపడంతో మొదలైన మేధావుల నిరసన అనూహ్యంగా ప్రజల్లో చైతన్యం నింపి ఆలోచింపచేసింది. ఆనాడు జాతీయోద్యమంలో 1919 ఏప్రిల్‌లో జలియన్ వాలాబాగ్‌లో జరిగిన దారుణ మారణకాండకు నిరసనగా ఆనాడు రవీంద్రనాథ్ ఠాగూర్ తనకు బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన 'సర్' బిరుదును త్యజించాడు. బ్రిటిష్ పాలన కంటే దారుణ సంఘటనలు నేడు చోటుచేసుకుంటున్నాయి. ఈ చర్యలకు నిరసనగా స్వతంత్ర భారతంలో సుప్రసిద్ధ చరిత్రకారులు, మేధావులు, శాస్త్రవేత్తలు, రచయితలు, చివరికి సినీ కళాకారులు సైతం పెద్ద సంఖ్యలో తమ బిరుదు, పురస్కారాలను ప్రభుత్వానికి వాపసు చేశారు. (అవార్డు వాపసి) ఇది మొత్తం భారత సమాజాన్ని ఆలోచింపచేసింది. బిహార్ ఎన్నికలను మరింత ప్రభావింప చేసింది.

**కానరాని అభివృద్ధి ఎజెండా**

2014 ఎన్నికల్లో మోడీ అభివృద్ధి మంత్రం పేరుతో ప్రజల ముందుకు వచ్చాడు. యువతకు ఉపాధి కలిస్తామని, నల్లడబ్బు వెలికి తీసి అందరికీ పంచుతామని, అవినీతిని నిర్మూలిస్తామంటూ వాగ్దానాలు చేశాడు. కానీ ఏమి నెరవేర్చలేదు. ఈ ఎన్నికల్లో బిజెపి నేతలు అవిద్య, పేదరికం, అధిక ధరలు వంటి ప్రధాన సమస్యలను పూర్తిగా వదిలిపెట్టారు. బిహార్‌లో 10 కోట్ల మంది నిరుపేదలున్నారు. వారి బాగుకు ఏ విధమైన కార్యక్రమాలు వివరించలేదు. మరో వంక పప్పు దినుసులు, ఉల్లి, కూరగాయలు వంటి నిత్యవసర వస్తువుల ధరలు పెరిగిపోయాయి. అంటే దేశ ప్రజలలో అత్యధికుల నిజ ఆదాయాలు భారీగా పడిపోయాయని అర్థం. రైతుల ఆత్మహత్యలపై నిర్లక్ష్య వైఖరి మొత్తంగా

# హిందూత్వ అభివృద్ధి నమూనా - బిహార్ ప్రజల తీర్పు

***బిహార్ ఎన్నికల ఫలితాలు బిజెపికి వ్యతిరేకంగా రావడానికి ప్రధాన కారణం ఆ పార్టీ అవలంబించిన మతోన్మాద భావజాలమనీ, ఈ తీర్పు హిందూత్వ అభివృద్ధి నమూనాకు వ్యతిరేకంగా వచ్చిందేనని అంటున్నారు భాస్కర్ ఏంపెల్లి***

బిహార్ ఎన్నికల్లో కులం, మతం లేదా డబ్బు ఏది పని చేయలేదు. పైగా కులం పేరుతో, మతం పేరుతో ఎన్నికల్లో గెలవడానికి ప్రధానమంత్రి హోదాలో నరేంద్ర మోడీ ప్రయత్నించినా బిహార్ ప్రజలు తిరస్కరించారు. హిందూ మతాన్ని, నయా ఉదారవాద పెట్టుబడి అభివృద్ధి నమునాని కలిపి బిజెపి తయారు చేసిన హిందూత్వ అభివృద్ధి నమూనా'ని ప్రజలు తిరస్కరించారు. బిహార్‌లో ముఖ్యమంత్రి నితీష్ కుమార్ నాయకత్వంలోని జెడి(యు), లాలూప్రసాద్ యాదవ్ నాయకత్వంలోని ఆర్‌జెడి, కాంగ్రెస్ మహా కూటమిగా పోటీలో ఉన్నాయి. మరొకవైపు బిజెపి, రాంవిలాస్ పాశ్వాన్ నాయకత్వంలోని ఎల్‌జెపి, మాజీ ముఖ్యమంత్రి జీతాన్ రామ్ మాంఝి నాయకత్వంలోని హిందుస్తాన్ అవామీ మోర్చా అతి వెనుకబడిన కులాల నుండి ఉపేంద్ర కుశ్వాహ ఆర్‌ఎల్‌ఎస్‌పి ఒక కూటమిగా పోటీచేశారు. బిహార్‌లో మొట్ట మొదటిసారి ఆరు కమ్యూనిస్ట్ పార్టీలు ఒక్క తాటిపైకి వచ్చి లెఫ్ట్‌ఫ్రంట్‌గా పోటిచేశాయి. ఇదే తగిన సమయమని ఓవైసీల నాయకత్వంలోని ముస్లిం అగ్రకులాల పార్టీ ఎంఐఎం కూడా బరిలో నిలిచింది.

అయితే ముఖ్యమంత్రి నితీష్ కుమార్ నాయకత్వంలోని మహా కూటమి 178 స్థానాలను గెలిచి, మూడింటా రెండువంతుల మెజారిటీ సాధించి, అధికార కూటమిగా ఏర్పడింది. బిజెపి కూటమి 58 స్థానాలు గెలిచి, తనకు అనుకూలంగా ఇప్పించుకున్న ఎగ్జిట్ పోల్స్ తప్పని తేల్చింది. ఇక లెఫ్ట్‌ఫ్రంట్ మూడు స్థానాలు గెలిచి పరవాలేదు అనిపించింది. దళిత ఓటర్లు దళిత నాయకులకి వాళ్లను నమ్ముకున్న హిందూత్వ వాదులకి తగిన బుద్ది చెప్పారు. దళిత నాయకులే దళితులుగా చెలామణి కాలేరని ఈ ఎన్నికల్లో తేట తెల్లమయింది. ఈ ఎన్నికల్లో ముఖ్యంగా లాభపడ్డది కాంగ్రెస్ పార్టీ. గతంలో మూడు స్థానాలు మాత్రమే గెలిచిన కాంగ్రెస్ ఈసారి ఏకంగా 27 స్థానాలు గెలుచుకుంది.

ఈ ఎన్నికల్లో ప్రభావం చూపిన విషయాలు గమనిస్తే ముఖ్యమంత్రి నితీష్ కుమార్‌కి ప్రజల్లో ఉన్న జెంటిల్‌మాన్ ఇమేజ్, ఇటీవల ముఖ్యమంత్రి అయ్యాక మహిళల సాధికారతకి ఆయన చేసిన పనులు మహిళా ఓటర్లను ప్రభావితం చేసింది. ఈ ఎన్నికల్లో మహిళలు ఎక్కువగా పాల్గొన్నారు. దాంతో ఓటింగ్ శాతం కుడా పెరిగింది. ఇది ఒక విధంగా మహిళా ఓటర్ల విజయం. లాలూ ప్రసాద్ యాదవ్‌ది జంగల్ రాజ్ అని, మహాకూటమి గెలిస్తే బిహార్‌లో మళ్లీ అదే రాజ్ వస్తుందని బిజెపి చేసిన ప్రచారం ఏ మాత్రం పనిచేయలేదు. లాలూ ప్రసాద్ యాదవ్ పార్టీ మహాకూటమిలోనే అత్యధికంగా 81 స్థానాలు గెలుచుకుంది. ఇక్కడ దళిత నాయకులంతా బిజెపితో ఉంటే దళిత ఓటర్లు మాత్రం మహాకూటమి వైపే ఉన్నారని తెలుస్తుంది. రామ్ విలాస్ పాశ్వాన్ 40 స్థానాల్లో పోటిచేసి రెండు స్థానాలు గెలుచుకున్నాడు. ఇక జెడి(యు) తిరుగుబాటు నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి జీతాన్ రామ్ మాంఝి పార్టీ ఇరవై ఒక్క స్థానాల్లో పోటిచేసి ఒక్కటి మాత్రమే గెరిచింది. అది కూడా మాంఝి పోటి చేసిన రెండిట్లో ఒకటి ఓడిపోయి ఒకటి గెలిచాడు. చావు తప్పి కన్ను లోట్టపోయినట్టయింది.

**బెడిసికొట్టిన హిందూత్వ రాజకీయం**

ప్రతి ఎన్నికలకు ముందు ఆర్‌ఎస్‌ఎస్, బిజెపిలు మత విద్వేషాలు రెచ్చగొట్టి హిందూ ఓట్లను చీల్చి తమ వైపుకు తిప్పుకునేందుకు చేసే ప్రయత్నాలే ఇక్కడా చేసింది. అది కాస్తా వికటించి మహాకూటమికి విజయాన్ని తెచ్చిపెట్టింది. ఒకరకంగా ఆర్‌ఎస్‌ఎస్, బిజెపి నాయకులే మహాకూటమికి ప్రచారం చేశారనిపిస్తుంది. బిజెపికి అతిముఖ్యమైన ఈ ఎన్నికలు గెలవడానికి చేసిన ప్రతి ప్రయత్నం, వేసిన ప్రతి ఎత్తుగడ మహాకూటమి విజయానికి దోహదపడింది. ఎందుకంటే ఆర్‌ఎస్‌ఎస్ ముఖ్యుడు మోహన్ భగవత్ రిజర్వేషన్ల మీద చేసిన వ్యాఖ్యలు, బిహార్‌లో బిజెపి ఓడిపోతే పాకిస్తాన్‌లో పండగ చేసుకుంటారని అమిత్ షా చేసిన

ప్రజల మౌలిక ఆర్థిక జీవన అవసరాల మెరుగుకు ఎలాంటి చర్యలు చేపట్టకుండా, ప్రజల్లో భావోద్వేగాలను రెచ్చగొట్టి పబ్బం గడుపుకోవడానికి ప్రాముఖ్యమిచ్చారు. ప్రజల్లో విద్వేషం పెంచి, వర్గాలుగా విభజించి, మత వర్గీకరణ చేసి మెజారీటీ ప్రజలకు తామే దిక్కు అని భావించేలా విషపూరిత చర్యలకు పాల్పడ్డారు. వాస్తవాలను ప్రజలు గుర్తించక మానరు. కట్టు కథలతో కాలక్షేపం చేయవచ్చు కానీ పాలన చేయలేరు. ప్రజలు గమనించారు. తగిన బుద్ధి చెప్పారు. వాస్తవానికి నితీష్ ఇప్పటికే రెండు ధఫాల నుంచి ప్రభుత్వానికి నాయకత్వం వహిస్తూ సిఎంగా పాలనలో ఉన్న వ్యక్తి కనుక ప్రజల్లో సహజంగా ఉండే ప్రభుత్వ వ్యతిరేకత బిజెపికి కలిసి రావాలి. కానీ మొత్తం 13 జిల్లాల్లో ఎన్‌డిఏ కనీసం ఖాతా కూడా తెరవలేదు. 8 జిల్లాల్లో ఒక్క సీటుతో సరిపెట్టుకుని మోడీ-షాలు భంగపడ్డారు. మొత్తం ఎన్‌డిఏ 58 సీట్లతో చతికిల పడింది. ఈ బిహార్ ఎన్నికల ఫలితాల ప్రభావం రాబోయే ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలపైన ఉంటుంది. జాతీయ రాజకీయ సమీకరణాల్లో ఇది కీలక మలుపు. ప్రాంతీయ పార్టీల ప్రభావం దిశగా జాతీయ స్థాయిలో ఒక మహా కూటమికి తొలి అడుగుగా చెప్పవచ్చు. ప్రజలకు 'అచ్చేదిన్' రానున్నాయని ఆశించవచ్చు. ఏమైనా బిహార్ ఎన్నికలు మతతత్వ శక్తులకు తగిన గుణపాఠం చెప్పాయి. లౌకిక ప్రజాస్వామిక శక్తులకు ఉత్తేజాన్ని ఇచ్చాయి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

వ్యాఖ్యలు బిజెపికి ఉపయోగపడక పోగా మహాకూటమిని గెలిపించు కోవాల్సిన అవసరాన్ని ప్రజలకు గుర్తుచేశాయి.

రెండవ దఫల ఎన్నికలు ముగిశాక పరిస్థితి వారికి అనుకూలంగా లేదని అర్థమయ్యి ఈ ఎన్నికల్లో కూడా హిందుత్వ ఎజెండాను ముందుకు తీసుకు వచ్చారు. ముఖ్యంగా మహిళా ఓటర్లు పోలింగ్‌కు ఎక్కువగా రావడంతో బిజెపికి సందేహాలు మొదలయ్యాయి. దాంతో వారి మాతృ సంస్థ అయిన ఆర్ఎస్ఎస్ రంగంలోకి దిగింది. ఆర్ఎస్ఎస్ ముఖ్యుడు మోహన్ భగవత్ రిజర్వేషన్లు తీసివేయాలి అని చర్చ తీసుకువచ్చి కోటాను వ్యతిరేకించే అగ్రకులాలను, ముఖ్యంగా అందులోని యువకులను ఆకర్షించగలమని భావించారు.

బిహార్‌లో కుల రాజకీయాలు ఎక్కువగా పని చేస్తాయని నమ్మిన బిజెపి ఎలాగూ దళిత నాయకత్వం తమవైపు ఉంది కనుక ఇక బిసిలు జెడి(యు), ఆర్జెడిలతోనే ఉండే అవకాశం ఉండడంతో ఇక మిగిలిన ఇబిసిలను తమవైపు తిప్పుకునే ప్రయత్నం చేశారు. అందులో భాగంగానే ప్రధానమంత్రి స్థాయిలో నరేంద్రమోడీ తన కులాన్ని (ఇబిసి) ఎన్నికల్లో విస్తృతంగా ప్రచారం చేసుకున్నాడు.

కాని మోహన్ భగవత్ రిజర్వేషన్లను సమీక్షించాలని అనడం ఇబిసిలు మహాకూటమి వైపు వెళ్లడానికి ఒక కారణంగా చూడొచ్చు. పైగా ఎన్నికలకు ముందు ముఖ్యమంత్రి నితీష్‌కుమార్ బిసి, ఎస్‌సి, ఎస్‌టిలకు 15 లక్షలకు మించని కాంట్రాక్టులలో 50 శాతం కోటాను ప్రకటించాడు. దానికి ఆగ్రహంగా ఉన్న అగ్రకులాలను ఆకట్టుకొని మహాకూటమికి కౌంటర్ ఇవ్వాలని ప్రధాని ప్రయత్నించాడు. అది కాస్తా తిప్పికొట్టి బిసి, ఎస్‌సి, ఎస్‌టిలు ఏకం కావడానికి తోడ్పడింది.

ఆ తర్వాత దాద్రి ఘటనతో గోమాత ప్రచారాన్ని, బీఫ్ నిషేధం గురించి చర్చించి గోమాత సెంటిమెంట్‌ను ముందుకు తీసుకువచ్చారు. అన్నికులాలూ బీఫ్ తింటున్నాయని లాలూప్రసాద్ యాదవ్ చేసిన వ్యాఖ్యలు వాళ్లకు అనుకూలంగా మార్చుకోవడానికి ప్రయత్నించారు. యదు వంశులు ఎవరు బీఫ్ తినరని, అలా మాట్లాడడం హిందువులైన మిగతా బిసి కులాలను అవమానించడమే అని, లాలూని ఇరకాటంలో పెట్టి అగ్రకుల బిసిలను ఆకట్టుకోవచ్చని కూడా చూశారు. కాని విఫలమయ్యారు.

ప్రధానమంత్రి నరేంద్రమోడీ ఈ ఎన్నికల కోసం దాదాపు ముప్పైకి పైగా ప్రచార సభల్లో పాల్గొని ప్రసంగించాడు. ఏ సభలో కూడా అప్పటి వరకు దేశంలో ముస్లింల మీద దళితుల మీద జరుగుతున్న దాడుల గురించి గాని, రిజర్వేషన్ కోటా విషయంలో మోహన్ భగవత్ చేసిన వ్యాఖ్యల పై కాని స్పందించలేదు. ఆయన అభివృద్ధి మంత్రం జపిస్తూ 'ఈ బిహార్‌ను జంగల్‌రాజ్‌గా మార్చారు. దీన్ని నేను మంగల్ రాజ్ (మంచి రాజ్యంగా) గా మారుస్తాన'ని ఊదరగొట్టాడు. ఎలా చేస్తాడో చెప్పనేలేదు. బిహార్ యువత వారికి ఎలాంటి రాజ్ (ప్రభుత్వం)కావాలో నిర్ణయించుకోవాలని ప్రగల్భాలు పలికాడు. మరో వైపు హిందుత్వ సిద్ధాంత కర్తలు గోవుని, రిజర్వేషన్ల వ్యతిరేకతని ఉపయోగించుకొని అగ్రకులాలని ఆకట్టుకొనే ప్రయత్నం చేశారు.

ఈ ఎన్నికల ప్రచారమంతా నరేంద్ర మోడీ ఒక్కడే నడిపి తన చరిష్మాని మళ్లొకసారి ప్రపంచ పెట్టుబడిదారులకి, అగ్రరాజ్యాల అధిపతులకి చూపించుకునే ప్రయత్నం చేశాడు. మహాకూటమి ఈ ఎన్నికలను బీహారి-బహరీ (బయటివాడు) లకి మధ్య జరుగుతున్న ఎన్నికలుగా ప్రచారం చేసేసరికి తప్పనిసరిగా స్థానిక నాయకులకి ప్రాధాన్యత ఇవ్వాల్సి వచ్చింది. ముఖ్యమంత్రి అభ్యర్థి కూడా లేకుండా ప్రచారంలోకి దిగిన బిజెపి తన ప్రచారంలో, బ్యానర్లలో మోడీ, అమిత్ షా తప్ప ఎవరు లేకుండా చూసుకున్నారు. పరిస్థితి అర్థమయ్యి మూడవ దఫాలో సుశీల్ కుమార్ మోడీ వంటిస్థానిక నేతలని ముందుకు తీసుకువచ్చారు. ఇక స్థానిక నాయకుడు శత్రుఘ్నసిన్హాని మొదటి నుండి దూరం పెట్టారు. మోడీ- అమిత్ షాల ఎన్నికల విధానాలను వ్యతిరేకిస్తూ ఆయన పత్రికలకెక్కాడు.

**బిసి అగ్రకులాల రాజకీయం**

ఇప్పటి వరకు బిహార్‌లో బిసిల అధికారం నడవడానికి ఆ పార్టీలకు అగ్రకుల రణవీర్ సేనల నుండి అందిన సహాయం కూడా కారణం. బిహార్‌లో ఆర్‌జెడిని ఓడించడానికి నితీష్ కుమార్ రణవీర్ సేనల సహాయం తీసుకుంటున్నాడని ఆరోపిస్తూ దళిత హత్యలకు, రణవీర్ సేనకు రాజకీయ నాయకులకి ఉన్న కారణాలు వెతకడానికి రబ్రీదేవి ప్రభుత్వం 1997 లో అమీర్ దాస్ కమిషన్‌ని నియమించింది. రిపోర్ట్ ఇవ్వడానికి కమిషన్ సిద్ధమయ్యాక, రిపోర్ట్‌లు ఇవ్వడంలో జాప్యం జరిగిందని అధికారంలోకి రాగానే నితీష్ కుమార్ ప్రభుత్వం 2006 జనవరిలో అమీర్ దాస్ కమిషన్‌ని రద్దు చేసింది. దీనికి కారణం రణవీర్ సేనలకు జెడి(యు)కి ఉన్న రాజకీయ పొత్తులను ఈ రిపోర్ట్‌లు బయట పెడతాయనే భయమే.

రణవీర్ సేనలను ఉపయోగించుకొని జెడి(యు) ఎన్నికల్లో ఎలా లబ్ధి పొందిందని, కొంత మంది జెడి(యు) అభ్యర్థులకు ఎన్నికల్లో పెట్టుబడి కూడా ఈ రణవీర్ సేనలు పెట్టాయని అమీర్ దాస్ స్వయంగా చెప్తున్నాడు. అందుకు ప్రతిగా అగ్రకుల రణవీర్ సేనలను ఈ బిసి పార్టీలు వారి అధికారం కోసం కాపాడుకుంటూ వచ్చాయి. దళిత హత్యలపై ఎదిగిన ఈ పార్టీ అసలు రంగు బయట పడుతుందని ఈ రిపోర్ట్‌ని బయటికి రానివ్వలేదు.

1995 నుండి 2000 వరకు దాదాపు వంద మంది దళితులు హత్య చేయబడ్డారు. 1997లో లక్ష్మన్‌పూర్ బాతేలో యాభై ఎనిమిది మంది దళితులను ఊచకోత కోశారు. లక్ష్మన్‌పూర్ బాతే లాంటి కరెంట్ లేని చీకటి పల్లెలో అర్ధరాత్రి దాడి జరిగినందున, ఆ చీకట్లో చంపిన వారిని గుర్తించడం సాధ్యం కాదని అందరిని వదిలేశారు. ఏ ఒక్క నిందితుడికీ శిక్ష పడలేదు. అయితే అదే అగ్రకులాలు రాజకీయ రంగు పులుముకుని బిసి పార్టీలచే అవమానించ బడ్డ దళిత నాయకులను వాడుకుని అధికారం సాధించాలనుకోవడంతో రెండు బిసి పార్టీలకు భయం పట్టుకుంది. పైగా గత లోక్ సభ ఎన్నికల అనుభవం ఉండనే ఉంది. అందుకే అధికారం పోతే ఎదిగిన భూస్వామ్య పునాదులు కూడా కదులుతాయని భయంతోనే బిసి అగ్రకుల పార్టీలైన ఆర్జెడి, జెడి(యు)లు ఒక తాటిపైకి వచ్చాయి.

**బిహార్ ప్రజల గొప్పతనం**

ఈ ఎన్నికల్లో బిహార్ ప్రజల తీర్పు వారి గొప్పతనాన్ని తెలియ జేస్తుంది. వాళ్లల్లో చాల మందికి చదువు లేకపోవచ్చు కాని వారి అనుభవ జ్ఞానమో లేక వాళ్లకి అవసరమో తెలీదు కాని ఏ ప్రలోభాలకి వారు లొంగినట్లు కనబడరు. మతం, కులం లేదా డబ్బు ఏది కూడా మతతత్వ బిజెపి రాజకీయాలను ఓడించాలనే వారి సంకల్పం ముందు పని చేయలేదు. అదే విధంగా దేశ వ్యాప్తంగా జరుగుతున్న విషయాలను

గమనిస్తున్నట్టు, జరుగుతున్న చర్చంతా తెలిసినట్టు ఎంతో తెలివిగా ఈ నిర్ణయం తీసుకున్నారు. బహుశా ఓట్లు అడిగేవారికి ఎన్నికలు కొత్త కావచ్చు కాని ఓట్లు వేసే ప్రజలకి కాదని నిరూపించారు. ఎన్ని ఎన్నికలు చూసి ఉంటారు. ఎన్ని సార్లు మోసపోయి ఉంటారు. ఎవరు ఏమి ఎందుకు మాట్లాడుతున్నారో వాళ్లకి తెలుసు.

ఆర్ఎస్ఎస్, బిజెపిలు హిందూ మతం సెంటిమెంట్‌ను చూపించి విద్వేషాలు రెచ్చగొట్టాలని ప్రయత్నిస్తే తిప్పికొట్టారు. దేశంలో హిందువులు కాని ముస్లింలు, దళితులు ఇతర ప్రజల మీద, వారి ఆహారపు అలవాట్ల మీద జరుగుతున్న దాడిని సహించేది లేదని తేల్చి చెప్పారు. ఇక ఎంఐఎం ముస్లిం జనాభా అధికంగా ఉన్న సీమాంచల్ ప్రాంతంలో ఎన్నికల్లో ఆరుస్థానాల్లో పోటి చేసింది. ఒవైసిలు ఎన్ని రెచ్చగొట్టే ప్రయత్నాలు, ప్రసంగాలు చేసినా పోలీసులు తప్ప ప్రజలు స్పందించలేదు. అటు హిందూ, ఇటు ముస్లిం అగ్రకుల పెత్తందార్లు చేసిన ప్రలోభాలకి బిహార్ ప్రజలు లొంగలేదు. అలా లొంగిఉంటే బిజెపి, ఎంఐఎంలే గెలిచి ఉండేవి.

ఇంకొక వైపు దళిత నాయకులు హిందూత్వ బిజెపితో కలిసి అధికారం సాధించాలని అనుకోవడం దిగ్భ్రాంతి కలిగించే విషయం. బిహార్‌లో అగ్రకుల రాజపుత్‌లు, భుమిహర్లు రణవీర్ సేనలనే ప్రైవేటు సైన్యాలు ఏర్పాటు చేసి దళితుల మీద ఎన్నో దాడులకు పాల్పడ్డారు. ఇప్పుడు దళిత నాయకులు ఈ రాజ్‌పుట్, భూమిహార్ల చెప్పుచేతల్లో నడిచే బిజెపితో కలిసి దళితులనెలా ఉద్ధరించాలనుకున్నారో ఎవరికీ అర్థం కాదు. దేశంలోని మత అసహనం మీదకాని, పేద ముస్లిం, దళిత ప్రజల మీద జరుగుతున్న దాడిని కాని, రిజర్వేషన్లకి వ్యతిరేకంగా చర్చ జరుగుతున్నప్పుడు కాని నోరు కూడా విప్పలేదు. దళితులం కాబట్టి, దళితులు పదహారు శాతంగా ఉన్నారు కాబాట్టి రాంవిలాస్ పాశ్వాన్ నలభై స్థానాల్లో, జీతాన్ రామ్ మాంఝి ఇరవై ఒక్క స్థానాల్లో పోటి చేసి గెలవగలమని అనుకోవడం ఎంత అవివేకం?

ఇక ఎస్‌సి, ఎస్‌టి నియోజక వర్గాలు నలభై ఉంటె అందులో బిజెపి కూటమి గెలిచింది ఏడు మాత్రమే. దళితుల పార్టీగా చెప్పుకునే రాంవిలాస్ పాశ్వాన్ ఎల్‌జెపి తొమ్మిది స్థానాలు పోటి చేస్తే గెలిచింది శూన్యం. వీళ్లు దళితులను ఓటు బ్యాంకుగా తప్ప వాళ్ల ప్రయోజనాలను పట్టించుకున్నట్టు అనిపించ లేదు. ఇక అతి వెనుకబడిన తరగతుల ప్రతినిధిగా ఉపేంద్ర కుష్వాహ రాష్ట్రీయ లోక్ సమతా పార్టీ ఇరవై మూడు స్థానాల్లో పోటిచేసి రెండే గెలిచాడు. దీన్ని బట్టి బిహార్‌లో పద్నాలుగు శాతంగా ఉన్న కుష్వాహలు మహాకూటమికి ఓటు వేసినట్టు తెలిసి పోతుంది.

బిహార్‌లో బిసిల జనాభా యాభై ఒక్క శాతం. అందులో యాదవులు పద్నాలుగు శాతం, కుష్వాహలు పద్నాలుగు శాతం, కుర్మీలు నాలుగు శాతం. పద్నాలుగు శాతం ఉన్న యాదవ నాయకుడు లాలూ ప్రసాద్ యాదవ్ నాలుగు శాతం ఉన్న కుర్మీల నాయకుడు నితీష్ కుమార్‌కి ఎంతో కొంత అభివృద్ధి చేసిన పేరు ఉండడం వల్ల మహాకూటమి నాయకత్వం ఇవ్వక తప్పలేదు. ఇదంతా చూస్తే ఈ ఎన్నికల్లో ఎక్కడా కులం ప్రభావం చూపలేదని వారు గుడ్డిలో మెల్ల నయమని బిసి పార్టీల వైపు మొగ్గారనిపిస్తుంది.

ఇక రెండవ దఫా ఎన్నికలు జరిగిన నక్సల్ ప్రభావ ప్రాంతాల్లో ముప్పై రెండు నియోజకవర్గాలకు ఇరవై నాలుగు మహాకూటమి, ఎనిమిది బిజెపి కూటమి గెలిచింది. నిజానికి ఈ ప్రాంతంలోనే మహిళా ఓటర్లు ఎక్కువగా స్పందించారు. ఈ రెండవ దఫ తర్వాతనే బిజెపి తన వ్యూహాలు మార్చుకుంది. ప్రధానంగా నక్సల్ ప్రభావం ఎక్కువగా ఉన్న మూడు జిల్లాలు జెహనాబాద్, ఔరంగాబాద్, గయాల్లో పంతొమ్మిది నియోజక వర్గాల్లో మూడు మాత్రమే బిజెపి కూటమి గెలవగలిగింది. అందులో జెడి(యు) తిరుగుబాటు నాయకుడు, మాజీ ముఖ్యమంత్రి, మహా దళిత నాయకుడు జీతాన్ రామ్ మాంఝి (ఇమాంగంజ్) గెలిచింది ఒకటి.

ఈ ఎన్నికల్లో ఓడిపోయింది బిజెపి, ఆర్ఎస్ఎస్ లేదా నరేంద్రమోడీ మాత్రమే కాదు కులవాదం, మతోన్మాదం, నయా ఉదారవాద అభివృద్ధి నమూనా కూడా ఓడిపోయింది. పెట్టుబడికి మతం రంగు పులిమి దాన్ని అభివృద్ధి మంత్రంగా ఎక్కువకాలం జపించలేరని బిహార్ ప్రజలు తేల్చేశారు. బిహార్ ఎన్నికలకు బిజెపి ప్రజలను నమ్ముకుని కాకుండా గోమాత మెడలో నయా ఉదారవాద అభివృద్ధి నమూనాను వేసి, కాషాయం రంగు ఒంటి నిండా పులుముకుని వెళ్లారు.

**ఎన్నికల తర్వాత పరిణామాలు**

ఈ ఘోర పరాభవానికి బాధ్యత వహించాలని బిజెపి సీనియర్ నేతలు ఎల్‌కె అద్వానీ, మురళి మనోహర్ జోషి, అరుణ్ జైట్లీ బహిరంగం గానే మోడీ, అమిత్ షా నాయకత్వాన్ని ప్రశ్నిస్తున్నారు. ఇక శత్రుఘ్న సిన్హా కూడా సీనియర్లకు తోడయ్యాడు. ఎన్నిలంతా అయిపోయాక రాంవిలాస్ పాశ్వాన్, జీతాన్ రామ్ మాంఝి, వికె సింగ్, మోహన్ భగవత్‌లు, ఇతర బిజెపి, ఆర్ఎస్ఎస్ నాయకులు దళితులకు వ్యతిరేకంగా మాట్లాడడం వల్లనే ఓడిపోయామని అన్నారు. ఇంత జరిగినా కేంద్ర హోంమంత్రి రాజ్‌నాథ్ సింగ్, మోహన్ భగవత్‌ను సపోర్ట్ చేస్తూ ఆయన మాటల ప్రభావం ఎన్నికల మీద పడలేదని అంటున్నాడు. ఇక బిజెపి అసలు దళిత, అతి వెనకబడిన కులాల నాయకులను నమ్ముకుని వారికి ఎక్కువ సీట్లు కేటాయించి పొరపాటు చేశామని, వారు వారి కులాల ఓట్లు పొందడంలో విఫలమయ్యారని విమర్శిస్తున్నారు.

దళితుల మీద ఒకవైపు దాడులు చేస్తుంటే బీఫ్ తింటున్నారనే పేరు మీద మనుషులను చంపుతుంటే తాము స్పందించకపోవడం వల్లే ఓడిపోయామని, దళితుల ఆత్మగౌరవాన్ని అధికారం కోసం తాకట్టు పెట్టడం వల్లే దళితులు తిరస్కరించారని చెప్పే ధైర్యం ఈ దళిత నాయకులకి లేదు. హిందూత్వ అజెండా, సిద్ధాంతంతో పనిచేసే పార్టీ దాన్ని నడిపించే వ్యూహకర్తలు ఇలాగే మాట్లాడుతారని ఇన్ని సంవత్సారాలు రాజకీయాల్లో ఉన్నా ఈ దళిత నాయకులకి తెలియలేదా? అసలు దళితుల ప్రతినిధులుగా వీరే ఏం మాట్లాడలేదు. అలాంటిది హిందూ మత సిద్ధాంతకర్తల్లా మాట్లాడుతారు. వారి మాటలకు, దాడులకు నిరసనగా పొత్తు నుండి బయటికి వస్తే ప్రజలు కనీసం వీళ్లను గౌరవించే వాళ్లు. ఇప్పుడు ఈ దళిత నాయకులు ప్రజలకు, అధికారానికి రెండింటికి దూరమైనారు. పైగా మీ వల్లె ఓడిపోయామని బ్రాహ్మణీయ భావజాలం వీళ్లను ఎప్పటికి శపిస్తూనే ఉంటుంది.

ఈ గెలుపు మతోన్మాదానికి వ్యతిరేకంగా ప్రజలు ముఖ్యంగా ముస్లింలు, దళితులు, మహిళలు ఇచ్చింది. వాళ్లు పెద్దగా ఏదో ఆశించి లేదా వారి బతుకులు బాగుపడుతాయని కలలు కని మహాకూటమిని గెలిపించి ఉండరు. ఎందుకంటే వారికి బిహార్, నితీష్ కుమార్, లాలూ ప్రసాద్ యాదవ్‌లు కొత్త కాదు. దళితుల మీద, ముస్లింల మీద దాడులు లేని బిహార్ వారికి చాలు. అధికారాన్ని, భూస్వామ్య స్వభావాన్ని వదులుకోలేని ఈ బిసి నాయకులు ఏం చేస్తారో చూడాలి.

*(రచయిత రిసర్చ్ స్కాలర్, కేంద్రీయ విశ్వవిద్యాలయం)* వీ

# న్యాయమూర్తుల నియామకాలు

***న్యాయవ్యవస్థలో, న్యాయమూర్తుల ఎంపికలో రాజకీయ జోక్యం విపరీతంగా పెరిగిపోయిందంటూ, కొలీజియం వ్యవస్థ తీరుతెన్నులను, పూర్వాపరాలను వివరిస్తున్నారు*** **ఎ. నర్సింహారెడ్డి**

న్యాయమూర్తుల నియామకాలకు సంబంధించి 2014లో పార్లమెంట్ ఏకగ్రీవంగా ఆమోదించిన జాతీయ న్యాయ నియామకాల కమిషన్ (ఎన్‌జెఎసి) చట్టం–2014, సంబంధిత 99వ రాజ్యాంగ సవరణ రాజ్యాంగబద్ధం కాదంటూ సుప్రీంకోర్టు అక్టోబర్ 16న ఖేహర్ నేతృత్వం లోని ఐదుగురు సభ్యుల (జస్టిస్ జెఎస్ ఖేహర్, జస్టిస్ ఎంబి లోకూర్, జస్టిస్ కురియన్ జోసెఫ్, జస్టిస్ ఆదర్శకుమార్ గోయల్, జస్టిస్ జాస్తి చలమేశ్వర్) గల ధర్మాసనం 4:1 నిష్పత్తితో సంచలనాత్మక తీర్పు వెలువరించింది. న్యాయమూర్తుల నియామకంలో ప్రస్తుతం కొనసాగు తున్న కొలీజియం వ్యవస్థ సరైనదేనని సుప్రీంకోర్టు మెజారిటీ తీర్పు చెప్పింది. విచారణను మరింత విస్తృత ధర్మాసనం ముందుకు తీసుకు వెళ్లాలన్న కేంద్ర ప్రభుత్వ అభ్యర్థనను తోసిపుచ్చింది. అలాగే కొలీజియం వ్యవస్థను ఆమోదించిన 1993, 1998 నాటి కేసులను పునఃపరిశీలించా లని చేసిన విజ్ఞప్తిని కూడ కోర్టు తిరస్కరించింది. అయితే కొలీజియంలోని లోపాలను సవరించడానికి మాత్రం సూచనలను ఆహ్వానించింది. సాధారణంగా రాజ్యాంగ పరమైన న్యాయ సమీక్షలు 9 లేదా 11 లేదా 13 మంది న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనం సమీక్షిస్తుంది. ఈసారి ఐదుగురితో కూడిన ధర్మాసనం ఏర్పాటు చేయడంలో ప్రధాన న్యాయమూర్తి పాత్ర ఉంది. ఎన్‌జెఎసిపై తుది తీర్పు వచ్చేవరకు న్యాయమూర్తుల నియామకం చేయకూడదని ముందే ఆదేశించడం గమనిస్తే ఎన్‌జెఎసి పట్ల ప్రధాన న్యాయమూర్తికి ఆందోళన ఉన్నట్లు భావించవలసి వస్తోంది.

ఐదుగురు న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనంలోని నలుగురు న్యాయమూర్తులు జస్టిస్ జెఎస్ ఖేహర్, జస్టిస్ ఎంబి లోకూర్, జస్టిస్ కురియన్ జోసెఫ్, జస్టిస్ ఆదర్శకుమార్ గోయల్ 99వ రాజ్యాంగ సవరణ రాజ్యాంగబద్ధం కాదని, చెల్లదని స్పష్టం చేయగా మరో న్యాయమూర్తి జస్టిస్ చలమేశ్వర్ మాత్రం మిగిలిన వారికి భిన్నంగా ఎన్‌జెఎసిని సమర్థించారు. హైకోర్టు కొలీజియం సిఫార్సు చేసిన పేర్లను సుప్రీంకోర్టు కొలీజియం తిరస్కరించి, వెంటనే మళ్లీ తన నిర్ణయాన్ని మార్చుకుని సందేహాలకు అవకాశమిచ్చిన ఎన్నో ఉదంతాలున్నాయి. సుప్రీంకోర్టుకు చెందిన వేర్వేరు ధర్మాసనాలు తీసుకొనే పరస్పర భిన్నమైన నిర్ణయాలు, చేస్తున్న తప్పులు, న్యాయ వ్యవస్థలో సమగ్ర సంస్కరణలు అవసరమనే సంకేతాలను పంపిస్తున్నాయి. సంస్కరణలు అవసరమైన అంశాల్లో, ఉన్నత న్యాయస్థానాల జడ్జీల ఎంపిక ప్రక్రియ కూడా ఒకటి. ఎన్‌జెఎసిలో కేంద్రం తరపున న్యాయశాఖ మంత్రి మాత్రమే ప్రతిపాదనలు చేస్తారు. ఆ ప్రతిపాదనలకు విలువ లేదనుకుంటే ఎన్‌జెఎసిలోని ఇతర సభ్యులు పక్కన పెట్టేయవచ్చు. ప్రజాస్వామ్యంలో ప్రజలకు ప్రాతినిధ్యం వహించేది కార్యనిర్వాహక వ్యవస్థ. జడ్జీల ఎంపిక ప్రక్రియలో ఈ వ్యవస్థను పూర్తిగా పక్కనపెట్టేయడం తగదని జస్టిస్ జాస్తి చలమేశ్వర్ స్పందించారు.

ఈ తీర్పుతో న్యాయవ్యవస్థకు, కార్యనిర్వాహక వ్యవస్థకు మధ్య పోరు ఆసక్తికరంగా మారింది. ఈ నేపథ్యంలో న్యాయ వ్యవస్థ స్వతంత్రత, పార్లమెంట్ సార్వభౌమాధికారం, కొలీజియం వ్యవస్థ, జాతీయ న్యాయ నియామకాల కమిషన్ మొదలైన వాటిపై లోతైన పరిశీలన చేయాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పుపైన అనుకూల, వ్యతిరేక వాదనలు రాజకీయ, న్యాయ, ప్రభుత్వ, పౌర సమాజం నుంచి వినవస్తున్నాయి. సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు, ఆయా వాదనలు, వాటిలోని సహేతుకతను పరిశీలించడం ప్రజాస్వామికవాదుల బాధ్యత.

బ్రిటిష్ సామ్రాజ్యవాద వలస పాలన కాలంలో దేశంలో ఫెడరల్ కోర్టు ఉండేది. వలసానంతరం 1950 జనవరి 26 నుంచి సుప్రీంకోర్టు ఏర్పడింది. భారత రాజ్యాంగంలోని 124 నుంచి 147 వరకు గల అధికరణలు సుప్రీంకోర్టు ఏర్పాటు, నిర్మాణం, అధికార పరిధి గురించి, 214 నుంచి 231 వరకు గల అధికరణలు హైకోర్టుల నిర్మాణం గురించి చెబుతున్నాయి. 124 అధికరణ ప్రకారం సుప్రీంకోర్టు న్యాయమూర్తులను నియమించే సమయంలో రాష్ట్రపతి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని సంప్రదించాలి. 217 అధికరణ ప్రకారం హైకోర్టు న్యాయమూర్తులను నియమించే సమయంలో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని, ఆ రాష్ట్ర గవర్నర్, ఆ రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సలహాను రాష్ట్రపతి తీసుకోవాలి. 222 అధికరణ ప్రకారం హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సహా ఇతర న్యాయమూర్తుల బదిలీల విషయంలో కూడా రాష్ట్రపతి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని సంప్రదిస్తారు. అంటే ఉన్నత న్యాయస్థానాల్లోని న్యాయమూర్తుల నియామకం, బదిలీల ప్రక్రియలో న్యాయ వ్యవస్థతోపాటు కార్యనిర్వాహక శాఖకు కూడా తగిన ప్రాధాన్యత ఉండేది. న్యాయమూర్తుల నియామకంపైనే న్యాయవ్యవస్థ నిష్పాక్షికత, ప్రమాణాలు ఆధారపడి ఉంటాయి. ఇందులో రాజకీయ ప్రమేయాన్ని అనుమతిస్తే న్యాయవ్యవస్థ స్వేచ్ఛకు భంగం వాటిల్లుతుందని న్యాయమూర్తులు సహా ప్రజాస్వామికవాదులందరి అభిప్రాయం.

1975 అత్యవసర పరిస్థితి విధించిన నాటి నుంచి న్యాయవ్యవస్థలో విపరీతంగా పెరిగిన రాజకీయ జోక్యాన్ని అరికట్టే లక్ష్యంతో జస్టిస్ వర్మ సారథ్యంలో 1993లో కొలీజియం వ్యవస్థ రూపొందింది. కొలీజియంలో లోపాలున్నాయని జస్టిస్ కురియన్ జోసెఫ్ వంటి వారు అభిప్రాయపడ్డారు. కొలీజియం వ్యవస్థలో ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి ప్రబలినాయనే ఆరోపణల నేపథ్యంలో దాన్ని సంస్కరించాల్సిన అవసరం ఏర్పడింది. న్యాయమూర్తుల నియామక ప్రక్రియలో లోపాలు సవరించే ఉద్దేశంతో యుపిఎ ప్రభుత్వం చేసిన ప్రతిపాదనను ఎన్‌డిఎ ప్రభుత్వం 99వ రాజ్యాంగ సవరణ ద్వారా ఎన్‌జెఎసి చట్టం–2014ను చేసింది.

**కొలీజియం వ్యవస్థ ఆవిర్భావం**

కాలక్రమేణా న్యాయ వ్యవస్థలో రాజకీయ జోక్యం పెరుగుతూ వచ్చింది. 1976లో ఈ జోక్యం విపరీత పోకడలకు దారితీసి న్యాయ

వ్యవస్థ ఉత్సవ విగ్రహంగా మారింది. దానిని నివారించడానికి 1981లో ఎస్.పి.గుప్తా సుప్రీంకోర్టులో ఒక కేసు వేసి న్యాయమూర్తుల నియామకం లో కార్యనిర్వాహక శాఖ అధికారాన్ని ప్రశ్నించారు. దీనిపై సుప్రీంకోర్టు తీర్పు చెబుతూ జడ్జీల నియామకంలో రాష్ట్రపతి మిగిలినవారిని సంప్రదించడం అనేది కేవలం సంప్రదాయం అనీ, కార్యనిర్వాహక శాఖకే పూర్తి అధికారం ఉంటుందనీ పేర్కొంది. కొన్ని బలమైన కారణాలతో రాష్ట్రపతి, భారత ప్రధాన న్యాయమూర్తి సలహాను కూడా తిరస్కరించ వచ్చని చెప్పింది. దీంతో న్యాయమూర్తుల నియామకంపై కార్యనిర్వాహక శాఖ ఆధిపత్యం కొనసాగింది. ఈ కేసునే ప్రముఖంగా మొదటి జడ్జెస్ కేసుగా పరిగణించారు. ఇక అప్పటి నుంచి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని బేఖాతరు చేసి రాజకీయ నియామకాలకు తెరతీయడం జరిగింది.

ఆ తర్వాత 1993లో (రెండో జడ్జెస్ కేసు) సుప్రీంకోర్టు అడ్వకేట్స్ ఆన్ రికార్డ్స్ అసోసియేషన్ వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా వేసిన కేసులో జస్టిస్ జె.ఎస్.వర్మ నేతృత్వంలోని తొమ్మిది మంది సభ్యులు ఉన్న ధర్మాసనం మొదటిసారిగా కొలీజియం వ్యవస్థ గురించి పేర్కొంది. ఈ తీర్పులో రాష్ట్రపతి, ప్రధాన న్యాయమూర్తిని 'సంప్రదించడం' అంటే న్యాయమూర్తి 'ఒప్పుకోవడం' అని నూతన భాష్యం చెప్పింది. ఈ తీర్పు ప్రకారం సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తుల నియామకాలు, హైకోర్టు న్యాయమూర్తుల బదిలీల విషయంలో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి సలహాను రాష్ట్రపతి తప్పనిసరిగా పాటించాలని పేర్కొంది. అయితే సలహా ఇచ్చే విషయంలో కేవలం ప్రధాన న్యాయమూర్తే కాకుండా, అతనితో కలిసి మరో ఇద్దరు సీనియర్ న్యాయమూర్తులతో కూడిన కొలీజియం వ్యవస్థ రాష్ట్రపతికి సిఫార్సు చేయాలని తెలిపింది.

అయితే ఆచరణంలో కొలీజియం సైతం తన పాత్రను సరిగా పోషించలేకపోయిందని పలు సందర్భాలు రుజువు చేశాయి. ఎవరిని ఎందుకు నియమించారో, అందుకనుసరించిన ప్రమాణాలేమిటో తెలియని స్థితి ఏర్పడింది. ఒకసారి నియామకం పూర్తయ్యాక వారిపై ఎలాంటి ఆరోపణలొచ్చినా, వారి ప్రవర్తన ఎలా ఉన్నా, ప్రశ్నార్థకమైన తీర్పులు వెలువరించినా న్యాయమూర్తులుగా కొనసాగారు. కొన్ని సందర్భాల్లో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి, ఇతర న్యాయమూర్తులను సంప్రదించకుండానే తన సలహాను రాష్ట్రపతికి తెలియజేశారు. దీనిపై అప్పటి రాష్ట్రపతి కె.ఆర్.నారాయణ్ 1998లో 143 అధికరణను అనుసరించి న్యాయమూర్తుల నియామకం, బదిలీల అంశంలో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి ఉన్న 'సంప్రదింపు' అనే అంశం గురించి అర్థవివరణ ఇవ్వాలని (మూడో జడ్జెస్ కేసు) సుప్రీంకోర్టును కోరారు. అంటే సంప్రదింపునకు అర్థం సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి సలహాను మాత్రమే గ్రహించాలా? లేదా ప్రధాన న్యాయమూర్తితో కూడిన ఇతర న్యాయమూర్తుల సూచనలను కూడా పరిగణించాలా? అనే అంశంపై వివరణ అడిగారు. దానికి సుప్రీంకోర్టు విస్పష్టమైన మార్గదర్శకాలను రూపొందించి, రాష్ట్రపతికి తెలియజేసింది. అయితే 1998లో సుప్రీంకోర్టు 3వ జడ్జెస్ కేసులో 'న్యాయమూర్తులను నియమించేటప్పుడు రాష్ట్రపతి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని, మరొక నలుగురు సీనియర్ న్యాయమూర్తులను సంప్రదించి సలహా ఇవ్వాలి' అని తెలియజేయడం జరిగింది. అంటే 1993లో కొలీజియంలో 1+2గా ఉన్న న్యాయమూర్తుల సంఖ్య 1998 నాటికి 1+4గా మారింది.

1998 నుంచి ఈ కొలీజియం సూచనల మేరకే న్యాయమూర్తుల నియామకం కొనసాగుతోంది. పరోక్షంగా న్యాయమూర్తులే న్యాయమూర్తులను నియమించుకోవడం జరుగుతుంది. కాబట్టి న్యాయ వ్యవస్థలో న్యాయమూర్తులు నియంతలుగా మారే అవకాశం ఏర్పడింది. ప్రజాస్వామ్యంలో శాసన, కార్యనిర్వాహక, న్యాయ శాఖలలో ఎవరికి ఎక్కువ అధికారాలు ఉన్నా అది నియంతృత్వానికి దారి తీస్తుంది. కాబట్టి శాసన, కార్యనిర్వాహక, న్యాయ శాఖలు పరస్పరం సమన్వయం, సహకారంతో పని చేయాలి, కాని న్యాయమూర్తుల నియామకానికి సంబంధించి కొలీజియంకు అపరిమిత అధికారాలు సంక్రమించడం వలన కొన్నిసార్లు అవినీతిపరులైన న్యాయమూర్తులను కూడా సుప్రీంకోర్టు న్యాయమూర్తులుగా నియమించమని కొలీజియం రాష్ట్రపతికి సూచించిన సందర్భాలు ఉన్నాయి. ఏదైన కారణంచేత కొలీజియం సూచించిన వ్యక్తి అవినీతిపరుడనో వేరేదైనా కారణం చేత అతను న్యాయమూర్తిగా కొనసాగడానికి అర్హుడు కాదనో రాష్ట్రపతి భావిస్తే అతని పేరును రాష్ట్రపతి కొలీజియం పునఃపరిశీలనకు పంపవచ్చు. అయితే కొలీజియం ఆ పేరును యథాతథంగా రాష్ట్రపతికి తిరిగి సూచించినట్లయితే రాష్ట్రపతి తప్పనిసరిగా ఆ వ్యక్తిని న్యాయమూర్తిగా నియమించాల్సి ఉంటుంది.

న్యాయమూర్తుల నియామకం, బదిలీల విషయంలో కొలీజియం వ్యవస్థ పారదర్శకత, జవాబుదారీతనం లేని లోపభూయిష్టమైన ప్రక్రియగా రూపాంతరం చెందడంపై చర్చలు మొదలయ్యాయి. స్వయం గా కొందరు సుప్రీంకోర్టు న్యాయమూర్తులే కొలీజియం వ్యవస్థలో ఉన్న లోపాలపై తమ వైఖరిని మీడియా ద్వారా వ్యక్తపరిచారు. వెంకటాచలయ్య కమిషన్ (పాలన, సంస్కరణల) 2002 కూడ కొలీజియంకు ప్రత్యామ్నాయ వ్యవస్థ కావాలని సూచించింది. జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్ ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కొలీజియం ఎంపిక చేసినవారిలో మహిళా న్యాయమూర్తులూ, అణగారిన వర్గాలవారూ తక్కువగా ఉండడం కొట్టొచ్చినట్టు కనబడే ప్రధాన లోపం. వీటన్నిటినీ జస్టిస్ జెఎస్ వర్మ అనేకసార్లు ప్రస్తావించారు.

**ఎన్‌జెఎసి చట్టం–2014**

కేంద్రంలో అధికారంలో ఉన్న ప్రభుత్వాలు కూడా మెరుగైన వ్యవస్థ కోసం అన్వేషించాయి. న్యాయమూర్తుల నియామకం, బదిలీలపై పలు కమిటీలు, కమిషన్లు సిఫార్సులు చేశాయి. ఈ నేపథ్యంలో ఎన్‌డిఎ ప్రభుత్వం 99వ రాజ్యాంగ సవరణ ద్వారా 2014 ఆగస్టులో పార్లమెంట్ ఉభయ సభల్లో కొలీజియం స్థానంలో ప్రవేశపెట్టిన జాతీయ న్యాయ నియామకాల కమిషన్ ఆమోదం పొందింది. 368 అధికరణ ప్రకారం 20 రాష్ట్రాల శాసన సభల ఆమోదం కూడా పొంది, 2014 డిసెంబర్ 31న రాష్ట్రపతి ఆమోదంతో నూతన వ్యవస్థను ఏర్పాటు చేసింది. 99వ రాజ్యాంగ సవరణ ద్వారా 124(ఎ) అధికరణను చేర్చారు. ఎన్‌జెఎసిలో ఒకరు మైనార్టీ లేదా మహిళా వర్గానికి చెందినవారై ఉండాలి. 2015 ఏప్రిల్ 13 నుంచి ఎన్‌జెఎసి అమల్లోకి వచ్చింది. బిల్లు చట్టసభల ఆమోదం పొంది, నోటిఫికేషన్ జారీ అయ్యే 30 రోజుల వ్యవధిలోగా న్యాయమూర్తులకు సంబంధించిన ఖాళీలను కమిషన్ నోటిపై చేస్తుంది. హైకోర్టు న్యాయమూర్తుల నియామకం విషయంలో ఎప్పటికప్పుడు కమిషన్ ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రుల అభిప్రాయాలను కూడా సేకరిస్తుంది.

ఎన్‌జెఎసికి ప్రత్యేకంగా కొన్ని విధులు కేటాయించారు. వాటిని 124(బి) అధికరణలో పేర్కొన్నారు. అవి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టు న్యాయమూర్తులు, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, హైకోర్టు న్యాయమూర్తుల నియామకానికి సంబంధించి సిఫార్సు చేయడం. హైకోర్టు న్యాయమూర్తుల బదిలీ విషయంలో నిజాయితీ, సమర్థత ఉన్న వ్యక్తులను సిఫార్సు చేయాలి. 124(సి)

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తుల నియామక విషయంలో పార్లమెంట్ చట్టం ద్వారా నియంత్రించే అధికారం కలిగి ఉంటుంది. ఐదుగురు సభ్యులు ఉన్న ఎన్‌జెఎసిలోని ఏ ఇద్దరు సభ్యులు వీటో చేసినా, ఆ నియామకంపై రాష్ట్రపతికి సిఫార్సు చేయరాదు. కమిషన్ సిఫార్సు చేసే న్యాయమూర్తుల జాబితాపై పునఃపరిశీలన చేయాలని ఆదేశించే అధికారం రాష్ట్రపతికి ఉంది. అలాంటి సందర్భంలో తిరిగి ఏకగ్రీవంగా కమిషన్ మళ్లీ అదే జాబితాను రెండోసారి పంపితే రాష్ట్రపతి తప్పకుండా ఆమోదించాల్సిందే. ఒకసారి వీటో చేసిన అభ్యర్థి పేరును మళ్లీ సిఫార్సు చేయడం కుదరదు. ప్రముఖ వ్యక్తుల నియామకానికి సంబంధించి, ప్రత్యేకమైన అర్హతలేమ నిర్దేశించలేదు.

### సుప్రీంకోర్టు తీర్పు ముఖ్యాంశాలు

1030 పేజీలతో కూడిన సుదీర్ఘమైన తీర్పులో ధర్మాసనం అనేక అంశాలను పేర్కొంది. ఎన్‌జెఎసి సభ్యుడిగా కేంద్ర న్యాయశాఖ మంత్రి భాగస్వామ్యం రాజ్యాంగ మౌలిక నిర్మాణంలో భాగాలైన అధికార విభజన, న్యాయవ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తిని ఉల్లంఘిస్తుందని, 124(ఎ) అధికరణ ప్రకారం మరో ఇద్దరు 'ప్రముఖ వ్యక్తుల'కు చోటు కల్పించడం రాజ్యాంగ విరుద్ధమని కోర్టు అభిప్రాయపడింది. ఎన్‌జెఎసిలోని ఈ నిబంధన న్యాయవ్యవస్థకు తగినంత ప్రాతినిధ్యాన్ని, ప్రాధాన్యాన్ని కొనసాగించడం లేదని, అంటే న్యాయవ్యవస్థ స్వతంత్రత అనే సూత్రాన్ని ఉల్లంఘించిందని, కొత్త విధానంలో న్యాయ వ్యవస్థ ప్రాధాన్యానికి వీడ్కోలు చెప్పినట్లే అని కోర్టు పేర్కొంది. అందువల్ల 99వ రాజ్యాంగ సవరణను కొట్టేసిన తర్వాత ఎన్‌జెఎసి మనుగడ సాధించదు కాబట్టి దాని చెల్లుబాటు గురించి వివరంగా చర్చించాల్సిన అవసరం లేదని కోర్టు తెలిపింది.

99వ రాజ్యాంగ సవరణ ఫలితంగా 124 (ఎ)వ అధికరణలో చోటు చేసుకున్న మార్పులను అనుసరించి ఏర్పాటు చేయవలసిన ఎన్‌జెఎసిలో ప్రధాని, ప్రతిపక్ష నాయకుడు, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి, న్యాయశాఖ మంత్రితోపాటు ఇద్దరు పౌరసమాజం ప్రతినిధులు ఉంటారు. ఈ కమిషన్ న్యాయమూర్తుల పేర్లను రాష్ట్రపతికి పంపుతుంది. ఈ వ్యవస్థలో కొట్టవచ్చినట్టు కనిపించే లోపాలు రెండు. అవి ఒకటి, దేశంలో అతి పెద్ద కక్షిదారు (లిటిగెంటు) ప్రభుత్వమే. న్యాయస్థానాలు విచారించే కేసులలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా దాఖలైనవే ఎక్కువగా ఉంటాయి. అటువంటి కేసులను విచారించే న్యాయమూర్తుల నియామకంలో కేంద్ర ప్రభుత్వ ప్రతినిధి న్యాయశాఖ మంత్రి ఉండడం సబబేనా? రెండు, పౌరసమాజానికి ప్రాతినిధ్యం వహించే ఇద్దరు ప్రముఖులకు వీటో హక్కు ఇవ్వడం సముచితమేనా? కొలీజియం పద్ధతిలో ఎవరిని న్యాయమూర్తులుగా నియమించవచ్చునో సిఫార్సు చేసిన తర్వాత అంతిమ నిర్ణయం రాష్ట్రపతిది అయితే ఎంపిక అవుతారు. ఎన్‌జెఎసిలో రాష్ట్రపతిని పక్కన పెట్టినట్టే కనిపిస్తుంది. ప్రధాన మంత్రి, ప్రతిపక్ష నాయకుడు, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి కలిసి ఇద్దరు పౌరసమాజం ప్రతినిధులను ఎంపిక చేస్తారు. ప్రభుత్వం ఎవరి చేతుల్లో ఉన్నదో వారికి ఇష్టమైన వ్యక్తులే పౌరసమాజం ప్రతినిధులుగా ఎంపిక అవుతారు. అంటే అధికార పార్టీ ప్రాపకం కలవారే ఎంపిక అవుతారు. ఆరుగురు సభ్యులలో అధికార పార్టీ లేదా కూటమికి చెందినవారు నలుగురు ఉంటారు. న్యాయమూర్తుల నియామకంలో రాష్ట్రపతి కంటే ప్రధానికి ఎక్కువ ప్రాధాన్యం ఉండడం కూడా రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమే.

99వ రాజ్యాంగ సవరణ, ఎన్‌జెఎసి చట్టం–2014 చెల్లుతుందని తీర్పు చెప్పిన జస్టిస్ జాస్తి చలమేశ్వర్ అందుకు కారణాలను కూడా వివరించారు. 'న్యాయమూర్తుల నియామకంలో న్యాయవ్యవస్థకు సర్వోన్నత ప్రాధాన్యత రాజ్యాంగంలోని మౌలికాంశం అన్న భావన లోపభూయిష్టం. రాజ్యాంగ పాలనలో పారదర్శకత అనేది ముఖ్యాంశం. ప్రభుత్వం చేపట్టే ప్రతి చర్యలోనూ హేతుబద్ధత ఉండాలని రాజ్యాంగ విధానం డిమాండ్ చేస్తుందని గతంలో ఈ న్యాయస్థానం ఎన్నో కేసుల్లో అభిప్రాయపడింది. పారదర్శకత అనేది హేతుబద్ధతలోని ఒక అంశం. కొలీజియం వ్యవస్థ వచ్చిన తర్వాత గత 20 ఏళ్లలో హైకోర్టుల కొలీజియం చేసిన ఎన్నో సిఫార్సులను సుప్రీంకోర్టు కొలీజియం తిరస్కరించిందని అన్నారు. భారత ప్రధాన న్యాయమూర్తి అభిప్రాయానికి అధిక ప్రాధాన్యం ఇవ్వడం రాజ్యాంగంలో మౌలికాంశం కాదని, న్యాయమూర్తుల నియామకంలో రాష్ట్రపతికి సంపూర్ణ అధికారాన్ని కట్టబెట్టకపోవడమే రాజ్యాంగంలోని మౌలికాంశమని అటార్నీ జనరల్ చేసిన వాదనతో జస్టిస్ చలమేశ్వర్ ఏకీభవించారు. 'ప్రభుత్వాన్ని ఎంపిక ప్రక్రియ నుంచి పూర్తిగా పక్కన బెట్టడం.. ప్రజాస్వామ్యంలో ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధుల ద్వారా ప్రభుత్వం ఏర్పడుతుందన్న సిద్ధాంతానికి విరుద్ధం' అని స్పష్టం చేశారు.

### లోపభూయిష్టమైన వ్యవస్థలు

చట్టసభలు ఎంత ప్రజా వ్యతిరేకంగా పనిచేస్తున్నాయో అందరికీ తెలుసు. అవినీతి, బంధుప్రీతి, అసమర్థత, అరాచకం వంటి అవలక్షణాలు పెచ్చరిల్లడం చూస్తున్నాం. న్యాయవ్యవస్థలోనూ చీకటి కోణాలు లేకపోలేదు. కొన్నేళ్ల కిందట కేంద్ర న్యాయశాఖ మాజీ మంత్రి శాంతిభూషణ్ సుప్రీంకోర్టులో ఒక అసాధారణమైన అఫిడవిట్ దాఖలు చేశారు. అంతవరకూ సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తులుగా పని చేసిన పదహారు మందిలో ఎనిమిది మంది అవినీతిపరులని ఆరోపిస్తూ, అటువంటి వ్యాఖ్య చేసినందుకు న్యాయస్థానం ఏ రకమైన శిక్షాత్మక చర్యలు తీసుకున్నా ఎదుర్కొనేందుకు తాను సిద్ధమేనని ప్రకటించారు. అనంతరం ఆరుగురు మాజీ ప్రధాన న్యాయమూర్తుల పేర్లు చెప్పి వారందరిపైనా అవినీతి ఆరోపణలు నిరూపించే ఆధారాలు తన వద్ద ఉన్నాయంటూ శాంతిభూషణ్ కుమారుడు ప్రశాంత్‌భూషణ్ మరో అఫిడవిట్ దాఖలు చేశారు. సర్వోన్నత న్యాయం స్థానం మౌనాన్ని ఆశ్రయించిందే కానీ తండ్రీ కొడుకులపైన కోర్టు ధిక్కారనేరం కింద చర్యలు తీసుకునే సాహసం చేయలేదంటే మర్మం ఏమిటో మనకు తెలియనిది కాదు.

### నాయ్యమూర్తుల నియామకాలపై పలు కమిషన్‌ల సిఫార్సులు

ఈ నేపథ్యంలో కొలీజియం వ్యవస్థను పునరుద్ధరించడాన్ని న్యాయవాదులు సైతం వ్యతిరేకిస్తున్నారు. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ (యుపిఎస్‌సి) వంటి స్వతంత్ర సంస్థకు న్యాయమూర్తుల నియామకం బాధ్యతను అప్పగించడమే ఈ వివాదానికి శాశ్వత పరిష్కారం. నియామకాలపైన మాత్రమే కాదు న్యాయమూర్తుల నడవడిక మీదా, వారు ఇచ్చే తీర్పుల మంచిచెడ్డల మీదా ఉన్నత స్థాయి సంఘం ఒకటి నిరంతరం సమీక్షిస్తూ ఉండాలి. ప్రలోభాలకు లోనై అడ్డగోలు తీర్పు చెప్పిన న్యాయమూర్తులపై చర్యలు తీసుకునే అవకాశం ఉండాలి. చట్టాలకు ఎవ్వరూ అతీతులు కారనీ, చట్టం ఎదుట అందరూ సమానమేననే విశ్వాసం జనసామాన్యంలో బలపడినప్పుడే చట్టపాలన పట్ల గౌరవం పెరుగుతుంది.

న్యాయమూర్తుల నియామకాల తీరు దశాబ్దాలుగా చర్చనీయాంశంగా ఉంది. దీనిపై పలు కమీషన్లు, కమిటీలు నిశితంగా పరిశీలించాయి. ప్రస్తుత కొలీజియం వ్యవస్థ లోపాలను ప్రస్తావిస్తూ, దాని స్థానంలో స్వతంత్ర వ్యవస్థ ఏర్పాటు ఆవశ్యకతను పలు కమిషన్‌లు ప్రస్తావించాయి.

# రైతు పెత్తనం లేని విత్తన సదస్సు

***రైతు రాజ్యం తెస్తామని చెప్పి అధికారం చేపట్టి బహుళజాతి కంపెనీలకు వంతపాడడం విచారకరమనీ, వ్యవసాయ చట్టాలను బలోపేతం చేస్తూ రైతులకు భరోసా ఇచ్చేలా ప్రభుత్వ విధానాలు రూపొందించాలనీ అంటున్నారు* ఎ. పున్నయ్య**

సువిశాల భారతదేశ రాజకీయ చిత్ర పటంపై 29వ రాష్ట్రంగా 'తెలంగాణ' ఏర్పడింది. నేడు రాష్ట్రంలో నూటికి 70 శాతం వ్యవసాయాధారిత జనాభానే ఉంది. ఉమ్మడి రాష్ట్రంలో జరగని, ఇంతకు ముందులేని, నూతన వ్యవసాయక విప్లవం వస్తుందనుకున్న ఆశలు అడుగంటిపోతున్న దాఖలాలే మొగ్గతొడిగాయి. రాష్ట్రంలో గత ఆరు దశాబ్దాలుగా అర్రులు చాచిన పాలిత ప్రజల ఆశయాలు ఆదిలోనే ఆవిరైనాయి. ప్రజల ఆశయాలకు నిలువుటద్దంగా నిలబడుతుందనుకున్నారు. కాని పాలకుల ఏకపక్ష, నిరంకుశ పాలితుల ఆశలు మన్నించలేని పాలనా వ్యవసాయానికి 'రాజకీయ విత్తనం' పడింది. జాతీయ, అంతర్జాతీయ ముసుగులో అంతర్జాల మాయజాలంలో కొత్త ముఖాలను పరిచయం చేసుకుంటున్నారు. ప్రధాన వనరైన వ్యవసాయ రంగాన్ని ఎక్కడ మరిచిపోతారనుకుంటారోనని 'జాతీయ సదస్సు' పేరుతో విత్తన సదస్సుకు పాలనా పొలాన్ని చదును చేసింది. ఈ నేపథ్యంలో విత్తన సదస్సు అందించిన ప్రాయోజిత అంశాలేమిటో, ప్రభుత్వ డొల్లతనమేమిటో రాష్ట్ర వ్యవసాయ ప్రపంచానికి సదస్సు ఇవ్వాల్సినదే ముందో చర్చిద్దాం!

**జాతీయ విత్తన సదస్సు**

8వ జాతీయ విత్తన కాంగ్రెస్ హైదరాబాద్ హైటెక్స్‌లో అక్టోబర్ 27, 28, 29 తేదీలలో జరిగింది. రాష్ట్రాన్ని 'సీడ్ భౌర్ ఆఫ్' ఇండియాగా తీర్చిదిద్దుతామన్న ప్రచార ఆర్భాటానికి తెర తీసిన ప్రభుత్వం నిర్వహణలో తన చిత్తశుద్ధిని చూపలేకపోయింది. వ్యవసాయ భద్రతకు భరోసా ఇవ్వాల్సిన ప్రభుత్వ పెద్దలు అటు కేంద్ర వ్యవసాయ మంత్రి గాని, ఇటు రాష్ట్ర ముఖ్యమంత్రి గాని హాజరు కాకపోవడం విచారకరం.

---

నియామక వ్యవస్థలో న్యాయ, శాసన, కార్యనిర్వాహక రంగాల ప్రాతినిధ్య తీరుతెన్నులపై భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. న్యాయవ్యవస్థలో పారదర్శకత, జవాబుదారీతనం లోపించిందని వీరప్పమెయిలీ నేతృత్వంలో ఏర్పాటైన రెండో పాలన సంస్కరణల కమిషన్ (ఎఆర్‌సి) 2007లో పేర్కొంది. 'తన సొంత నియామకాలకు సంబంధించి తుది నిర్ణయాన్ని తానే తీసుకునే న్యాయవ్యవస్థ బహుశా ప్రపంచంలో ఎక్కడా ఉండకపోవచ్చు. భారత్‌లో సుప్రీంకోర్టు లేదా హైకోర్టుల న్యాయమూర్తుల నియామకాల్లో అటు కార్యనిర్వాహక వ్యవస్థకు కానీ ఇటు శాసన వ్యవస్థకు కానీ పెద్దగా పాత్ర లేదు' అని మొయిలీ కమిషన్ పేర్కొంది.

కొలీజియం వ్యవస్థ పారదర్శకంగా లేదని 2007లో లా కమిషన్ పేర్కొంది. కేంద్ర న్యాయశాఖ మంత్రి ఎచ్.ఆర్.భరద్వాజ్ 2008లో ప్రతిభ ప్రాతిపదికన న్యాయమూర్తుల నియామకాలు జరగడం లేదన్న భావన ఉందన్నారు. కొలీజియం వ్యవస్థ కారణంగా కోర్టుల్లో న్యాయమూర్తుల పోస్టులు ఖాళీగా ఉంటున్నాయని, చివరికి దానివల్ల కేసులు అపరిష్కృతంగా ఉండిపోతున్నాయని న్యాయశాఖ మంత్రి సదానందగౌడ గత ఏడాది (2014) వ్యాఖ్యానించారు. అసలు కొలీజియం వ్యవస్థ రాజ్యాంగపరంగా చెల్లుబాటు కాదన్న వాదన కూడా ఉంది.

**ముగింపు**

న్యాయవ్యవస్థలోని అవినీతి, బంధుప్రీతి, అసమర్థత, అరాచకం వంటి అవలక్షణాలు అనేక సందర్భాలల్లో వెలుగులోకి వచ్చాయి. అదే విధంగా ప్రజాప్రాతినిధ్య చట్టసభలలో ఎన్ని రకాల లోపాలు ఉన్నాయో ఇటీవల బయటపడిన కుంభకోణాలే ప్రత్యక్ష సాక్ష్యాలు. రాజ్యాంగానికి లోబడి రెండు వ్యవస్థలు పనిచేయాల్సి ఉంటుందన్నది స్పష్టమే. అయితే ప్రజా ప్రాతినిధ్య వ్యవస్థ కాలానుగుణంగా చట్టాల్ని సవరించే హక్కు కలిగి ఉన్నప్పటికీ, మౌలిక రాజ్యాంగ సూత్రాలకు విరుద్ధంగా వ్యవహరించకూడదు. అదే విధంగా రాజ్యాంగాన్ని సవరించే హక్కు ఉన్న చట్టసభల రాజ్యాంగ సవరణలను ధిక్కరించకుండా న్యాయస్థానాలు అమలు చేయాలి. లోపభూయిష్టమైన కొలీజియం స్థానంలో నిష్పాక్షికమైన న్యాయమూర్తుల నియామకాల వ్యవస్థ రావడం అవసరం. అయితే అది రాజ్యాంగం ఆదేశించిన మౌలిక ప్రాథమిక సూత్రాలకు అనుగుణంగా, న్యాయవ్యవస్థ స్వతంత్రను కాపాడే విధంగా రూపొందించుకోవడం సరైనది.

పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థలో పార్లమెంట్ అత్యున్నతమైనది. ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించేవి చట్టసభలు అన్నది నిర్వివాదాంశం. అయితే చట్టసభలు చేసే ప్రతిచట్టం ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించేదిగా ఉందని చెప్పలేం. ఇప్పటివరకు చేసిన చట్టాలు రాజ్యాంగ మౌలిక సూత్రాలకు కట్టుబడి ఉంటున్నాయని అసలే చెప్పలేం. అదే విధంగా రాజ్యాంగంలో పొందుపరచిన పౌరుల ప్రాథమిక హక్కులను ఉల్లంఘించే తీర్పులను సుప్రీంకోర్టు వెలువరించింది. కొన్ని తీర్పుల్లో న్యాయమూర్తుల స్వీయాత్మక దృక్పథం (మత, వర్గ, వర్ణ, జెండర్)తో పాటు ప్రపంచీకరణ అనుకూల దృక్పథం స్పష్టంగానే కనిపిస్తుంది. తామే ఇచ్చిన తీర్పులకు విరుద్ధమైన తీర్పులు ఇచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఇలాంటి ఉల్లంఘనలు బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో సహజమే. ప్రజలకు కావాల్సింది సత్వర న్యాయం, తీర్పులపై విశ్వాసం. అందువల్ల ఈ తీర్పు పూర్వరంగంలో రాజకీయ పక్షాలన్నీ ఉమ్మడిగా యోచించి, చట్టంలోని లొసుగులను తొలగించి, న్యాయవ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుతూ, ఉన్నత న్యాయస్థానాల న్యాయమూర్తుల నియామకాలలో విస్తృత ప్రాతినిధ్యం (మహిళలకు, షెడ్యూల్డు కులాలకు, తెగలకు, మైనార్టీలకు) కల్పిస్తూ కొలీజియం స్థానంలో కొత్త చట్టాన్ని రూపొందించడం ఉత్తమమైన మార్గం.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

సదస్సులో 54 దేశాల శాస్త్ర వేత్తలు చర్చించిన అంశాల్లో నాణ్యమైన విత్తనోత్పత్తికి అనుసరించాల్సిన వ్యూహాలపై ప్రభుత్వ రంగ విత్తనోత్పత్తి సంస్థల బలోపేతానికి కాకుండా ప్రైవేట్ కంపెనీల ద్వారా విత్తనోత్పత్తికి మార్గం సుగుమం చేసేలా చర్చించారు. ఇప్పటికే వ్యాపార పంటల ఉత్పత్తులకు తమ ప్రాణాలను ఫణంగా పెడుతున్న రైతాంగానికి సదస్సు సరైన దిశా నిర్ధేశం చేయకుండా, ఆహార పంటల విత్తనోత్పత్తికి ప్రాధాన్యత ఇవ్వకుండా ఆహారేతర పంటలకు, జన్యు మార్పిడికి, హైబ్రిడ్ సీడ్ ఉత్పత్తికి ప్రాధాన్యతనిచ్చేలా చర్చించడం ప్రైవేట్ విత్తన వ్యాపారానికి ప్రభుత్వ ఆధ్వర్యంలో మరింత బలం చేకూరింది. నాణ్యమైన విత్తనోత్పత్తికి కావాల్సిన పరీక్షలు, ధ్రువీకరణ, వివిధ పంట రకాల పరిరక్షణ రైతుల హక్కులపై ఐదు దశాబ్దాల క్రితం నాటి చట్టాలపై సదస్సులో సమీక్ష జరగలేదు. కొత్త చట్టాల ఆమోదం లేదు.

**విత్తనోత్పత్తి నాడు - నేడు**

నదీలోయ నాగరికత మొదలు నేటి నవ నాగరిక మానవుని జీవన ప్రయాణంలో మానవుని పురోగతి వ్యవసాయ క్షేత్రంలో కూడా, స్వయం సమృద్ధివైపు నూతన ఆవిష్కరణలు ఎప్పటికప్పుడు జరుగుతూనే ఉన్నాయి. జీవనోపాధికి ఆహార పంటలు మొదలు అవసరాల మేరకు బహుళ పంటల ఉత్పత్తికి రైతు కృషి అనాదిగా కొనసాగుతూనే ఉంది. అందులో భాగంగానే రసాయన ఎరువులు, ఆధునిక సాంకేతిక పద్ధతులు లేని రోజుల్లో రైతు బలమైన, నాణ్యమైన విత్తన తయారికి తనదైన పద్ధతిని అనుసరించాడు. గోదాంలు, కోల్డ్ స్టోరేజీలు లేని రోజుల్లోనే పంట పొలంలోనే మేలు రకం విత్తనాన్ని గుర్తించి విత్తన ధాన్యంగా గుమ్ములు, గూనలు, పెద్ద పెద్ద మట్టి కాగుల్లో నిల్వ చేసుకున్నారు. దురదృష్టవశాత్తు సాంకేతిక విజ్ఞానంతో పాటు పెరిగిన జనాభా అవసరాల దృష్ట్యా సంకరజాతి, జన్యు మార్పిడి విత్తనాలతో ఉత్పత్తిని, ఉత్పాదక శక్తిని పెంచే దిశలో విత్తన కంపెనీలు లాభాల వేటలో పడి ఆధునిక రైతును 'ఆత్మహత్యల' దిశగా పురికొల్పడం వ్యవసాయ ఆధునిక సమాజానికి అత్యంత విషాదకరం.

**ప్రపంచ విత్తనోత్పత్తి కేంద్రంగా తెలంగాణ**

భౌగోళిక విశిష్టత కలిగిన తెలంగాణ రాష్ట్రం విత్తన సాగుకు అత్యంత అనువైన ప్రాంతం. సారవంతమైన నేలలు, సమతూకంలో పోటాష్ పోషకం, సాగునీటి లభ్యత, కోతల సమయంలో అధిక ఉష్ణోగ్రత, గాలిలో తేమ తక్కువ ఫలితంగా చీడపీడల సమస్య తక్కువ ఉన్న తెలంగాణ ప్రపంచంలో ఉన్నత స్థాయి విత్తనోత్పత్తి కేంద్రంగా విలసిల్లుతుంది. శీతోష్ణస్థితి ఆధారంగా రాష్ట్రాన్ని నాలుగు వ్యవసాయ జోనులుగా విభజించారు. కరీంనగర్ జిల్లా జగిత్యాల కేంద్రంగా కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లాలను ఉత్తర తెలంగాణ జోనుగా, వరంగల్ ప్రధాన కేంద్రంగా వరంగల్, ఖమ్మం, మెదక్ జిల్లాలు మధ్య తెలంగాణ జోనుగా, మహబూబ్‌నగర్ జిల్లా 'పాలెం' కేంద్రంగా మహబూబ్‌నగర్, నల్లగొండ, రంగారెడ్డి జిల్లాలు దక్షిణ తెలంగాణ జోనుగా, ఖమ్మం జిల్లా 'చింతపల్లి' కేంద్రంగా సముద్ర మట్టానికి అత్యంత ఎత్తయిన గిరిజన ప్రాంతాల జోన్‌గా విభజించబడింది. రాష్ట్ర వ్యాప్తంగా 114.84 లక్షల హెక్టర్లు మొత్తం భూమి ఉండగా, 43.20 శాతం అనగా 49.61 లక్షల హెక్టర్లు సాగుబడిలో ఇక్రిసాట్‌తో పాటు 364 జాతీయ, అంతర్జాతీయ విత్తన కంపెనీలు 22 పరిశోధనా కేంద్రాల కృషి ఫలితంగా సంవత్సరానికి 15 వేల కోట్ల విలువ చేసే హైబ్రిడ్ విత్తనాలతో పాటు 30 వేల కోట్ల విలువ చేసే ఇతర విత్తనాలను విక్రయిస్తున్నారు. గంటకు సరాసరి 670 మెట్రిక్ టన్నుల విత్తనాలను ప్రాసెస్ చేసే సామర్థ్యాన్ని కలిగి, 45 లక్షల చదరపు ఫీట్ల విస్తీర్ణం గల గోదాంలు, 60 లక్షల క్యూబిక్ ఫీట్ల శీతల గిడ్డంగులు, 11.70 హెక్టర్ల విస్తీర్ణం గల సీడ్ ఫామ్స్‌తో విత్తన కంపెనీలు 1.17 లక్షల మందికి ప్రత్యక్షంగా 1.25 లక్షల మందికి పరోక్షంగా ఉపాధి కల్పిస్తున్నాయి. విత్తనోత్పత్తి రంగంలో ప్రపంచంలోనే పేరు పొందిన అమెరికాలోని 'అంజోనా' రాష్ట్రాన్ని అనతి కాలంలోనే తెలంగాణ అధిగమించింది. తెలంగాణ రాష్ట్రం నుండే దాదాపుగా 20 దేశాలకు పూర్తిగా మరికొన్ని దేశాలకు పాక్షికంగా విత్తన సరఫరా జరుగుతుంది.

**ప్రపంచ వ్యాప్తంగా విత్తనోత్పత్తి**

ప్రపంచ వ్యవసాయ సాగులో వ్యాపార పంటలను ఉదాహరణగా తీసుకుంటే స్థానిక వంగడాలకే ప్రాధాన్యత కనిపిస్తుంది. దాదాపు 50 దేశాల్లో పత్తి సాగు చేస్తుంటే ఒక్క భారతదేశంలోనే పత్తి సాగుకు సంకర జాతి విత్తనాన్ని వాడుతుండగా మిగిలిన దేశాలన్నింటిలో స్థానిక వంగడాలనే వాడుతున్నారు. ఈ నేపథ్యంలో పత్తి దిగుబడి సంకరజాతి విత్తనాలతో పోల్చుకుంటే స్థానిక వంగడాలతో సాధించిన దిగుబడే ఎక్కువ. హైబ్రిడ్ తదితర విత్తనాలతో హెక్టరుకు 5 క్వింటాలు పండించగా, స్థానిక వంగడాలతో సగటున హెక్టరుకు 9 క్వింటాల దిగుబడి సాధిస్తున్నారు. సంకరజాతి విత్తనోత్పత్తికి రసాయన ఎరువుల వినియోగం అధికం కాగా, స్థానిక వంగడాల ఉత్పత్తికి వినియోగం తక్కువే. ఈ నేపథ్యంలో విత్తనోత్పత్తి కేంద్రంగా తెలంగాణను మరింత ముందుకు తీసుకుపోవడానికి సంకరజాతి విత్తనాలతో పాటు స్థానిక వంగడాల విత్తన కేంద్రంగా రూపొందించే దిశగా ఈ విత్తన కాంగ్రెస్ సదస్సు చర్చించి ఉంటే మరింత లాభంగా ఉండేది.

ప్రపంచ వ్యాప్తంగా రష్యా, స్విట్జర్లాండ్ లాంటి 25 దేశాలు జన్యు మార్పిడి విత్తనోత్పత్తులను, దిగుమతులను నిషేధించాయి. ఈ దేశంలో మనరాష్ట్ర పొరుగునున్న కర్నాటక, మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, బీహార్, రాజస్థాన్ వంటి రాష్ట్రాలు జన్యు మార్పిడిని పూర్తిగా నిషేధించాయి. అంతేకాక సుప్రీంకోర్టు సాంకేతిక కమిటీ కూడ ఈ ప్రయోగాలను నిషేధించింది. పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ తీవ్రంగా వ్యతిరేకించింది. అయినప్పటికీ రాష్ట్రాన్ని విత్తన భాండాగారంగా, విత్తన హబ్‌గా తీర్చిదిద్దుతామని చెప్పుకునే రాష్ట్ర ప్రభుత్వం కేవలం బహుళజాతి కంపెనీల పెట్టుబడుల కోసం స్థానిక వంగడాలు, విత్తనాలను నిర్వీర్యం చేయ జూస్తోంది. మన ప్రాంతానికి అనువైనదా? లేదా? అనే ప్రాథమిక విచారణ లేకుండా జీవ భద్రతకు ముప్పు కలిగించే జన్యు మార్పిడి విత్తనాల ఉత్పత్తి ప్రయోగాలకు అనుమతినివ్వడం జీవ వైవిద్యానికే కాక, రాష్ట్ర విత్తన పంటల పైన, ప్రజల జీవనం పైన తీవ్ర ప్రభావం చూపే అవకాశం ఉంది. విత్తన భాండాగారానికి గొడ్డలి పెట్టుగా మారిన దీన్ని పూర్తిగా వ్యతిరేకించి స్థానిక వంగడాలతో విత్తనోత్పత్తికి ప్రాధాన్యం ఇవ్వాలి.

**విత్తన కాంగ్రెస్ - ప్రభుత్వ విధానాలు**

నూతన ఆర్థిక విధానాలు బహుళజాతి కంపెనీల ఒప్పందాలతో తొంబయవ దశకం నుంచి వ్యవసాయం తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడింది.

ఈ నేపథ్యంలో దశాబ్దాలుగా అపరిష్కృత సమస్యగా మిగిలిన వ్యవసాయ రంగ సమస్యలు, రైతుల ఆత్మహత్యలు విత్తనోత్పత్తులపై రైతుకు కాక, బహుళజాతి కంపెనీలకు పెత్తనాన్ని కట్టబెట్టే విధానాలు తదితర రైతు సంక్షేమ విత్తనోత్పత్తి విధానాలను చర్చించకుండా తెలంగాణను విత్తన భాండాగారంగా, విత్తన కాలనీలుగా విత్తన గ్రామాల అభివృద్ధికి అడుగులు వేయడం ప్రభుత్వ ఆర్భాటాలకు అద్దం పడుతుంది.

ప్రధానంగా ఈ సదస్సులో క్షేత్ర స్థాయిలోని రైతులను మరిచి విత్తన కంపెనీలు దోచుకునే తీర్మాణాలను ప్రవేశపెట్టారు. ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్య (పిపిపి) పరిశోధన ఫలాలు ఈ తీర్మాణాల ద్వారా రైతులకు ఏ మేరకు ప్రయోజనం చేకూరుతుందో సందేహమే. విత్తన పంటలను పండించే రైతులకు గుర్తింపు కార్డు ఇచ్చి జిల్లాల వారిగా, డివిజన్‌ల వారిగా లక్ష్యాలను నిర్దేశించి మెరుగైన దిగుబడులు సాధించాలి. పరిశోధన, ప్రయోగ ల్యాబ్ సంబంధిత సదుపాయాలన్నింటిని ఒక హైదరాబాద్‌లోనే కేంద్రీకృతం కాకుండా రైతులకు అత్యంత సమీపంగా జిల్లా, డివిజన్ కేంద్రాల్లో నెలకొల్పే మౌలికాంశాల పట్ల రైతు ప్రయోజిత చర్చ ప్రాథమికంగానైనా జరగలేదు. నిజానికిలా జరిగితే రైతులకు విత్తన తయారీ కేంద్రాలతో దగ్గరి సంబంధం ఏర్పడుతుంది. శాస్త్రవేత్తలు విత్తనోత్పత్తిలో సాధక బాధకాలను ప్రత్యక్షంగా తెలుసుకునే అవకాశముంది. వీరికి ఆయా ప్రాంతాల్లో రైతుల సామాజిక, ఆర్థిక పరిస్థితులపై పూర్తి అవగాహన కలుగుతుంది. ఆ ప్రాంత వాతావరణ పరిస్థితుల కనుగుణంగా రైతును విత్తనోత్పత్తికి ప్రోత్సహించే అవకాశముంది. ఇదే క్రమంలో విత్తనాభివృద్ధి సంస్థ నాణ్యత ప్రమాణాలను పసిగడుతూ చీడ పీడల బారి నుంచి రైతులను నష్టాలకు గురి కాకుండా ఎప్పటికప్పుడు అప్రమత్తం చేస్తారు.

రైతులకు విత్తన పంటను సాగుచేయడానికి ముందే పంటను తిరిగి కొనే (బై బ్యాక్‌లా) విధానాన్ని అమలు చేస్తూ కొనుగోలులో దళారుల బెడద లేకుండా చూడాలి. సాధారణంగా రాష్ట్ర విత్తనాభివృద్ధి సంస్థ విత్తన పంటను తీసుకున్న రెండు నెలల తర్వాత ధర నిర్ణయిండమే కాక, తేమ (నిమ్ము) పేరుతో ధరను తగ్గిస్తూ తూకంలో కోత విధించే విధానాన్ని అరికట్టాలి. ముందే ధరను నిర్ణయించాలి.

**పరిశోధన – విత్తనోత్పత్తి**

ప్రధానంగా ప్రభుత్వ సంస్థలే విత్తనోత్పత్తి చేపట్టాలి. మట్టి నమూనా సేకరణ పరీక్ష ఫలితాలతో పాటు ప్రభుత్వమే నేరుగా రైతులకు విత్తన సరఫరా చేయాలి. ఈ నేపథ్యంలో విత్తన పరిశోధన చేసే విశ్వ విద్యాలయాల పరిధిని పెంచాలి. మరిన్ని వ్యవసాయ విశ్వ విద్యాలయా లను స్థాపించి విత్తనోత్పత్తికి సంబంధించిన కోర్సులను, పరిశోధన ప్రాజెక్టులను విస్తృత పరచాలి. ఎప్పటికప్పుడు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అనుసంధానం చేస్తూ శాస్త్రవేత్తల కృషి ద్వారా వ్యవసాయ రంగంలో అధిక విత్తనోత్పత్తిని సాధించాలి.

**విత్తన చట్టాలు**

ప్రస్తుత విత్తన చట్టాలు చాలా బలహీనంగా ఉన్నాయి. 1966 విత్తన చట్టాన్ని ఆమోదించినప్పుడు ప్రభుత్వ విత్తన కంపెనీలదే విత్తనోత్పత్తిలో సంహాభాగం. ప్రైవేట్ కంపెనీలది నామ మాత్రమే. కాని నేడు ప్రైవేట్ విత్తన కంపెనీల భాగస్వామ్యం అధికం కావడంతో 1966 నాటి చట్టం ప్రైవేట్ కంపెనీలను నియంత్రించలేకపోతోంది. 1983లో సీడ్ కంట్రోల్ ఆర్డర్ ద్వారా విత్తనాన్ని నిత్యావసర జాబితాలో చేర్చినారు. ఐనప్పటికీ ప్రైవేట్ కపెనీలను కట్టడి చేయలేకపోయింది. 1988లో వచ్చిన విత్తనాభివృద్ధిపై నూతన విధానం వలన స్థానిక విత్తనాల నాణ్యతను పెంచే అవకాశం కలిగినప్పటికీ అది ఆచరణాత్మకం కాలేదు. 2001లో పంట రుణాల పరిరక్షణ రైతుల హక్కుల చట్టం చేసినప్పటికీ ఉత్పత్తి సంస్థల విత్తన మోసాలను అరికట్టలేకపోయింది. 2004లో నియమించబడిన పార్లమెంటరీ స్థాయి సంఘం కొన్ని విలువైన సూచనలు చేస్తూ రాష్ట్ర స్థాయిలో విత్తన సంఘాలు ఏర్పాటు చేయడం, విత్తన గరిష్ట అమ్మకం ధరను నిర్ణయించే అధికారం ఇవ్వడం వంటివి సూచించింది. నేటికిది బిల్లు రూపంలోనే ఉంది. చట్టంగా ఆమోదించలేదు. దీనితో 1966 నాటి విత్తన చట్టం నియమ నిబంధనలే నేటికి అమల్లో ఉండి, ప్రైవేట్ విత్తన వ్యాపారాన్ని శాసిస్తున్నాయి కాబట్టి సమగ్ర విత్తన చట్టాన్ని ఈ సదస్సులో రూపొందిస్తే రైతులకు మేలు జరిగేది.

**ముగింపు**

ప్రపంచంలో పెరిగే జనాభాకనుగుణంగా ఆహార ఉత్పత్తులను పెంచాలి. 2050 నాటికి 70 శాతం పైగా అదనపు ఉత్పత్తులు సాధించాలి. దీనికి నాణ్యమైన విత్తనమే పునాది, వ్యవసాయ రంగ అభివృద్దే పరిష్కారం. కావున పారిశ్రామిక కారిడార్ల కోసం బహుళజాతి కంపెనీల ముందు పెట్టుబడుల కోసం సాగిల పడుతూ మరోవైపు బంగారు తెలంగాణ నిర్మాణానికి నిత్యం మాటల కోటలు కడుతున్న పాలక వర్గాలకు వ్యవసాయ పాలన పట్ల, రైతు సంక్షేమం పట్ల ప్రభుత్వ వైఖరిలో చిత్తశుద్ధి అత్యంత ఆవశ్యకం. 'గతకాలం మేలు వచ్చు కాలం కంటెన్' అన్న చందాన కాకుండా గత కొన్ని సంవత్సరాలుగా ఇప్పటికే విత్తనోత్పత్తి రంగంలో పైచేయిగా ఉన్న తెలంగాణను మరింత బలోపేతం చేసే దిశగా ప్రభుత్వ చర్యలుండాలి. రైతులకు వ్యవసాయ భద్రత కల్పించాలి. శాస్త్రీయ విధానాల ఫలితాలను అందుబాటులోకి తేవాలి. రైతులను, రైతు సంఘాలను చైతన్య పరిచే దిశగా చర్యలుండాలి. మొక్కుబడిగా సదస్సు నిర్వహించుకుని ప్రైవేట్ విత్తన కంపెనీలకు, వాడి ఆధిపత్యానికి తలుపులు తెరిచే విధానానికి స్వస్తి పలకాలి. ప్రభుత్వం విత్తనంపై పెత్తనం రైతుకే కాని లాభాలనాశించే కంపెనీలది కాదని రుజువు చేయాలి. ఇందుకోసం ప్రభుత్వ రంగంలో విత్తన పరిశోధనకు ఊతమిచ్చి సీడ్ కార్పొరేషన్‌ను బలోపేతం చేయాలి. రైతులకు విత్తనోత్పత్తికి పంట భీమా సౌకర్యాన్ని ప్రభుత్వమే కల్పించాలి. ఫౌండేషన్, బ్రీడర్ సీడ్‌లను సబ్సిడీలపై అందించాలి. నేటికి ప్రభుత్వ పరంగా కేవలం 12 శాతమే ప్రోత్సాహం అందుతుండగా, 88 శాతం ప్రైవేట్ గుప్పిట్లోనే ఉత్పత్తి సాగుతుంది. విత్తన కంపెనీలు రైతులతో చేసుకునే ఒప్పందాలు విధిగా అమలయ్యేలా చూడాలి. వ్యవసాయ చట్టాలు రైతు పక్షంగా ఉండేలా చూస్తూ విత్తన రైతుకు పూర్తి భరోసా ఇవ్వాలి. వ్యవసాయ రంగంలో శాస్త్ర సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి మరింత కృషి చేయాలి.

తెలంగాణలో ఉన్న అంకాపూర్, ఎర్రవల్లీలను నిత్యం వల్లించే ప్రభుత్వ పెద్దలు విదేశీ పర్యటనలో సైతం ఆకాశ హార్మ్యాలను, ఫ్లైవోవర్లను చూడకుండా వ్యవసాయ క్షేత్రాలను, సాగు విధానాలను, రైతు సంక్షేమ చట్టాలను అధ్యయనం చేస్తే బాగుంటుంది. లేదంటే ఎద్దు ఏడ్చిన ఎవుసానికి రైతు ఏడ్చిన రాజ్యానికి కష్ట కాలమే మిగులుతుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

# సిరియా సంక్షోభం - పూర్వాపరాలు

***పాశ్చాత్య సామ్రాజ్యవాద దేశాల దమనకాండల వల్ల సిరియాలో సంక్షోభం కొనసాగుతోందనీ, ఆ దేశ పౌరుల జీవనం విధ్వంసం అవుతోందనీ, ఈ సంక్షోభం ఇలాగే కొనసాగితే తీవ్ర పరిణామాలు ఉత్పన్నమవుతాయనీ అంటున్నారు* రాజేంద్రబాబు అర్విణి**

గత నాలుగు సంవత్సరాలుగా సిరియా తీవ్ర సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుంది. మూడు లక్షలకు పైగా ప్రజలు మరణించారు. 70 లక్షల మంది నిరాశ్రయులయ్యారు. మరో 50 లక్షల మంది పొట్ట చేతబట్టుకొని ప్రాణభయంతో దేశాన్ని వదిలిపెట్టి పారిపోయారు. ఈ సంవత్సరం రష్యాతో కలుపుకొని కనీసం పది దేశాలు సిరియాపై వైమానిక దాడులు చేశాయి. ఆ దేశంపై ఆకాశం నుండి బాంబుల వర్షం కురిపించిన దేశాలలో అమెరికా, బ్రిటన్, కెనడా, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా, టర్కి, ఇజ్రాయిల్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, జోర్డన్ కూడా ఉన్నాయి. ప్రతిరోజు వేలాది మంది సిరియన్లు దేశం వదిలిపెట్టి వెళ్లిపోతున్నారు. వారు నివసిస్తున్న ప్రాంతాలు బాంబుదాడికి గురవడం, పక్క వీధిలో నివసిస్తున్న వారు బాంబుదాడుల్లో మరణించడం చూడలేక రాత్రికిరాత్రే సరిహద్దులకావల దేశాలకు వలస పోతున్నారు. మానవ చరిత్రలో ఇటీవలి కాలంలో సంభవించిన అత్యంత విషాదకర సన్నివేశం సిరియా సంక్షోభమేనని చెప్పవచ్చు.

'అరబ్ దేశాలలో వసంతకాలం'గా పేర్కొనబడిన అరబ్ ప్రాంత ప్రజా పోరాటాల వెల్లువలో నలుగురు నియంతలు నేలకూలారు. ఈ పోరాటాలు వివిధ రకాలుగా రూపుదాల్చాయి. 1) టునీషియా, ఈజిప్టులలో స్వతః సిద్ధంగా పోరాటాలు పెల్లుబికాయి. అహింసా పద్ధతులలో కొనసాగాయి. ఆదేశాలలోని జాతీయ సైన్యాలు పాలకున్ని కాదని పోరాడుతున్న ప్రజలవైపు నిలబడ్డాయి. ఆదేశాల నియంతలు ప్రజల, సైనికుల ఒత్తిడికి తట్టుకోలేక పదవులు వదిలి పలాయనం చిత్తగించారు. 2) లిబియాలో పరిస్థితి కొంతభిన్నం. తూర్పు లిబియాలో ప్రారంభమయిన ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలను అణచడానికి ప్రభుత్వం సైన్యాన్ని పంపింది. ఆసైన్యంలోంచి చాలా మంది సైనికులు బయటికి వచ్చి ప్రదర్శన కారులతో చేతులు కలిపి ప్రభుత్వానికి వ్యతిరేక పోరాటాన్ని కొనసాగించారు. ప్రతిపక్షాలకు కీలకమయిన ప్రాంతాలలో స్థావరాలు ఏర్పాటు చేసుకొని గడాఫీ వ్యతిరేక గ్రూపులతో కలిసి పోరాటం తీవ్రంచేశారు. చివరికి గడఫీ గత్యంతరంలేక లొంగిపోయాడు. నాటో (ఉత్తర అట్లాంటిక్ దేశాల సంధి ఒడంబడిక వ్యవస్థ) కూడా కలగచేసుకొని ప్రభుత్వానికి వ్యతిరేకంగా బాంబు దాడులకు దిగింది. 3) యెమన్ దేశంలో పరిస్థితి పూర్తిగా విరుద్ధం. హింస ప్రజ్వరిల్లింది. ప్రతిహింస చెలరేగింది. విదేశీ శక్తులు బాహాటంగా ప్రభుత్వానికి అనుకూలంగా వ్యవహరించారు. విదేశీ శక్తుల జోక్యాన్ని ప్రజలు నిరసించారు. చివరికి దేశీయ బలగాలు, ప్రాదేశిక శక్తుల ప్రోద్బలంతో రాజీ ప్రయత్నాలు జరిగాయి.

నియంత తప్పుకోవడానికి ఒప్పుకున్నాడు, కాని మరో అధ్యక్షునితో అదే పరిపాలనా వ్యవస్థ కొనసాగింది. వీటితో పోల్చినప్పుడు సిరియా పోరాటం కొంత ప్రత్యేకం. సిరియా అధ్యక్షుడు అసద్ నియంతృత్వ పోకడలు, ప్రజావ్యతిరేక చర్యలు, పౌరులపై విచక్షణా రహితంగా హింసాత్మక పద్ధతులు ప్రయోగించడం కారణంగా వాస్తవమైన ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఉద్యమాలపై ప్రభుత్వ దమనకాండ పెచ్చరిల్లిపోయింది. పోరాటాలను కర్కశంగా అణచి వేయమని నియంత అస్సద్ సైన్యాన్ని పురమాయించాడు.

దీంతో సైన్యాన్ని వదిలి ఆందోళన కారులతో చేరిపోయారు చాలామంది సైనికులు. సైన్యంలో తిరుగుబాటు దారుల హింసాయుత అంతర్యుద్ధం జరిగింది. సిరియా దేశానికి ఉన్న భౌగోళిక ప్రాముఖ్యత ఆదేశ సంక్షోభాన్ని ద్విగుణీకృతం చేసింది. విదేశీ శక్తుల జోక్యం అధికమయింది. అన్నింటికీ మించి సిరియా సంక్షోభానికి విదేశీ ప్రమేయమే ప్రధానమైనదని విశ్లేషకుల అభిప్రాయం.

పెద్ద పెద్ద అధికార పీఠాలు ఇరువైపులా మొహరించి ఉన్నాయి. అమెరికా, యురోపియన్ యూనియన్, టర్కీ, సౌదీ అరేబియా, ఖతర్ దేశాలు మిలిటరీ రూపకంగా ఇతర విధాలుగాను సిరియాలో తిరుగుబాటు దారులకు అండగా ఉంటే, రష్యా, చైనా, ఇరాన్, ఇరాక్‌లు అసద్ ప్రభుత్వాన్ని సమర్ధిస్తున్నాయి. ఈ సంక్షోభం ప్రారంభం నుండి రష్యా, ఇరాన్, ఇరాక్‌లు సిరియా ప్రభుత్వానికి సాంకేతిక, ఆర్థిక, రాజకీయ పరంగా సహాయ సహకారాలు అందజేస్తున్నాయి. 2013వ సంవత్సరంలో ఇరాన్ ప్రాపకం ఉన్న హజ్బోలా సంస్థ సిరియా సైన్యానికి అనుకూలంగా ప్రత్యక్ష యుద్ధంలోకి ప్రవేశించింది. హజ్బోలా అంటె అరబిక్ బాషలో 'దేవునిపక్షం' అని అర్థం. అది పూర్తిగా మతానికి అంకితమయిన సంస్థ. 2015 సెప్టెంబర్ 30న సిరియా తిరుగుబాటు దారులపై వైమానిక దాడులతో రష్యా బహిరంగంగా రంగప్రవేశం చేసింది. అప్పట్నుంచి ఇది రష్యా, అమెరికాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధంగా మారిపోయింది. అటు పిమ్మట దాదాపు పదిపన్నెండు దేశాలు ఏదోరకంగా యుద్ధంలో పాల్గొని ప్రపంచ యుద్ధం మాదిరి సిరియా యుద్ధం రూపురేఖలు మార్చి వేశాయి. 2013 లో భూభాగంలో 30-40 శాతం, దేశ జనాభాలో 60 శాతం సిరియా ప్రభుత్వ ఆధీనంలో ఉండింది. 2015కల్లా అది తగ్గిపోయి, కేవలం 29,797 కిలోమీటర్లు అంటే దేశం మొత్తంలో ఆరవ భాగం మాత్రమే ప్రభుత్వ సేనల ఆధీనంలో ఉండే పరిస్థితి వచ్చింది. ప్రభుత్వ ఆధీనంలో ఉండే ప్రాంతాలలో 73 శాతం ప్రజలు ప్రభుత్వ విధానాలను సమర్ధిస్తున్నారని ఒక సర్వేలో తేలింది.

అరబ్ ప్రాంతంలో మతం పునాదిగా ఉన్న వివిధ వర్గాలలో ముఖ్యమైనవి షియా, సున్నీలు. సిరియాలో షియా, సున్నీలతో పాటు అలావైట్ అన్న గ్రూప్ కూడా ఉంది. ఆ వర్గం ఆధిపత్యంలోనే సిరియా ప్రభుత్వం ఉంది. ప్రభుత్వంలో, సైన్యంలో ఉన్న అలావైట్, షియా శక్తులు సిరియా అధ్యక్షుడు అస్సద్ను సమర్థిస్తూవుంటే ఆ నియంత్రుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతూ ఉన్న తిరుగుబాటు దారులు సున్నీల ప్రాబల్యంలో ఉన్నారు. ఉపరితలంలో ఈ పోరాటం సున్నీలకు అలవైట్, షియాలకు మధ్య జరుగుతున్న పోరాటంగా ప్రారంభంలో చిత్రీకరించే ప్రయత్నం జరిగినా రష్యా, చైనా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ మున్నగు దేశాలుప్రత్యక్షంగా పాల్గొనడంతో ఆ ముసుగు తొలిగిపోయి సామ్రాజ్యవాద శక్తుల ప్రయోజనాలు ఇందులో ఇమిడి ఉన్నాయన్న విషయం ప్రపంచానికి అర్థమయింది.

ఈ యుద్ధంలో ఏప్రిల్ 2015 నాటికి 3 లక్షల 10 వేలమంది మరణించారు. వారిలో సిరియా ప్రభుత్వ సైనికులు, వారికి వ్యతిరేకంగా పోరాడుతున్న ఇస్లామిక్ స్టేట్స్‌కు సంభంధించిన రెండు సంస్థలకు చెందిన ఉద్యమకారులూ ఉన్నారు.

ఈ సంక్లిష్ట సమయంలో ఇరుపక్షాలు తీవ్రస్థాయిలో మానవహక్కుల ఉల్లంఘనకు పాల్పడ్డాయని అంతర్జాతీయ సంస్థలు ఘోషించాయి. రెండు వైపులా రసాయన ఆయుధాలు వాడడం గమనార్హం. పోరాటంలో నిరాయుధులయిన వేలాది మంది సామాన్య పౌరులు మరణించారు. కొన్నివేల మంది నిరపరాధులైన సిరియన్ పౌరులు జైళ్లల్లో మగ్గుతున్నారు. రోజూ వందల మంది సిరియన్లు ఇతర దేశాలకు వలస పోతున్నారు. విధిలేక చిన్న పడవలలో, బోటులలో మెడిటరేనియన్స్ సముద్రందాటి యూరప్ దేశాలకు వలస పోదామని చేసే ప్రయత్నంలో చాలామంది సముద్రంలో మునిగి ప్రాణాలు కోల్పోతున్నారు. గ్రీకు, ఈజిప్టు లాంటి దేశాలలో వలస వచ్చిన సిరియన్లు సాంస్కృతిక వైరుధ్యానికి గురై వర్ణించలేని ఇక్కట్లకు గురవుతున్నారు.

సిరియా నుండి వలసపోయె కాందిశీకుల సంఖ్య ప్రతి ఏటా అనూహ్యంగా పెరుగుతోంది. 2012లో వలస వెళ్లిన వారి సంఖ్య ఒకలక్ష అయితే, 2013 ఏప్రిల్ వరకల్లా ఆ సంఖ్య 8 లక్షలకు చేరుకుంది. నాలుగు నెలల్లో కాందిశీకులు 16 లక్షలకు పెరిగారు. యునైటెడ్ నేషన్స్ అంచనా ప్రకారం మానవ చరిత్రలోనే అతి హేయమయినదిగా పేర్కొనదగినది ఈ సిరియా కాందిశీకుల సమస్య. సరిహద్దులు దాటి పొరుగు దేశాలకు వలసవెళ్లిన కాంది శీకులలో సగానికిపైగా 18 సంవత్సరాల వయసు కూడా దాటని పిల్లలే!

ఒక ప్రముఖ రాజకీయ విశ్లేషకుడు వ్యాఖ్యానించినట్టు పరిష్కరించ బడని రాజకీయాల పొడగింపే యుద్ధం. సిరియా విషయంలో ఇది పూర్తిగా వాస్తవం. సిరియా అంతర్యుద్ధం అంతర్గతంగా జరుగుతున్న వర్గ పోరాటానికి బాహ్యరూపమే. సిరియా అధ్యక్షుడు అస్సద్ పక్షాన సిరియాలోని ధనవంతమైన వ్యాపారవర్గం ఉంది. అలవైట్....., షియా గ్రూపులలోని బలమైన పెట్టుబడిదారుల మద్దతు ఉంది. తిరుగుబాటుదారుల వైపు నిరుపేద రైతులు, కార్మికులు ఇతర శ్రామిక వర్గం ఉంది. కార్మికుల జనాభా ఎక్కువగా ఉన్న అలెప్పో.... ప్రాంతం ఆసాంతం ఆందోళనకారుల ఆధీనంలో ఉంది. సిరియాలోని అలెప్పో ప్రాంతం దేశంలోనే ఎక్కువగా పారిశ్రామీకరణ జరిగిన ప్రాంతం. అక్కడ జనాభా 50 లక్షల కంటే ఎక్కువే. అస్సద్, ఆయనను సమర్థిస్తున్న సామ్రాజ్యవాద శక్తులు, ఇరాన్, హిజ్బోలా..... అనుసరిస్తున్న విధానాల వల్ల, తిరుగుబాటుదారులను సమర్థిస్తున్న ఇస్లామిక్ వాదులు, ఖతర్, సౌదీ అరేబియా కారణంగా ఈ పోరాటంలోని అసలైన వర్గ విభేదాలు మరుగున పడిపోయి షియా, సున్నీల మధ్య ఆధిపత్య పోరుగా రూపం సంతరించుకుంది. అమెరికా, రష్యా, చైనా, యూరోపియన్ యూనియన్, ఇజ్రాయిల్లు కూడా సిరియా పోరాటంలోని వర్గముల.... విప్లవకర అంశాన్ని మరుగుపరిచేందుకు శత విధాలా ప్రయత్నం చేస్తున్నాయి. అయితే, సియాలో వర్గపోరాట అంశాలను సమన్వయపరిచి విప్లవ రాజకీయాలకు అంకితమయిన రాజకీయ పార్టీ రూపుదిద్దుకోక పోవడం కూడా ఈపరిస్థితికి ఒక కారణంగా చెప్పవచ్చు.

అరబ్ ప్రపంచంలో మౌరిటానియ నుండి ఇరాన్ సరిహద్దుల వరకు ఉన్న మొత్తం 22 దేశాలలో ఒక్క సిరియా మాత్రమే రష్యాకు అనుకూలంగా ఉంది. మిగతా అన్ని రాజ్యాలూ అమెరికా శిబిరంలో ఇమిడినవే. ఈ మధ్యనే రష్యా ఇరాక్‌తో మిత్రుత్వం పెంచుకుంటుంది. ఇటీవలి కాలంలో అమెరికా శిబిరం బీటలువారే సూచనలు కనిపిస్తున్నాయి. ఈ పరిణామాలు అమెరికాకు నచ్చడంలేదు. రష్యా అరబ్ దేశాలలో తన ప్రాబల్యం కోసం ప్రయత్నిస్తోంది. అమెరికా రష్యాల ఆధిపత్యపోరులో సిరియా బలిపశువు అవుతున్నది.

సిరియా సంక్షోభం పరిష్కారానికై అమెరికా విదేశాంగ మంత్రి వియన్నా వెళతాడు. వియన్నాలో సౌదీ, రష్యా, టర్కిష్ విదేశాంగ మంత్రులు సమావేశమవుతారు. అమెరికా, రష్యా మంత్రులు చర్చిస్తారు. అమెరికా ప్రభుత్వం తరపున జానెక్రీ సౌదీ అరేబియా రాజును కలుస్తాడు. రష్యా విదేశాంగమంత్రి సిరియాలో ఎన్నికలు జరగాలంటాడు. అమెరికా మాజీ అధ్యక్షుడు జిమ్మీ కార్టర్ 'సిరియా సంక్షోభానికి అయుదు దేశాల సంయుక్త ప్రణాళిక' అని ఒక పరిష్కారం సూచిస్తాడు. అస్సద్ దేశాధినేతగా కొనసాగాలని రష్యా పట్టుపడుతుంది. అమెరికా అస్సలు కుదరదంటుంది.

ఇంకా ఎక్కడెక్కడో ఎన్నెన్నో హంగామాలు చేస్తారు. విచిత్రం ఏమిటంటే, అసలు సమస్య సిరియా దేశానిది. సిరియా ప్రమేయం లేకుండానే సమస్య పరిష్కారానికి మార్గాలు బోధిస్తారు. బయటి శక్తులు సిరియా సమస్యను పరిష్కరించలేవు అన్నది వాస్తవం. సిరియా దేశంలో ఉన్న వివిధ వర్గాలు – అవి మతపరమయిన వయినా కావచ్చు లేదా రాజకీయ సంబంధమైన వయినా కావచ్చు – వారే సమస్యను పరిష్కరించుకోవాలి. ఎలా పరిష్కరించుకోవాలో వారే మార్గాలు వెతుక్కోవాలి.

సిరియా సంక్షోభానికి నియంతకు ప్రజలకు మధ్య వైరుధ్యాన్ని మించిన పరిధి ఉంది. అరబ్ ప్రపంచంలో ప్రాబల్యం కోసం బయటి దేశాల ప్రయత్నాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఈ వైరుధ్యాలు దీర్ఘకాలం కొనసాగే ప్రమాదం ఉంది. పేలిన రష్యా విమానాలూ, ఫ్రాన్స్‌లో జరిగిన బాంబు దాడుల లాంటి సంఘటనలు పునరావృతమైనా ఆశ్చర్యపడనక్కరలేదు.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# సాంఘిక వ్యవసాయమే పరిష్కారం

***వ్యవసాయ రంగంలో ప్రభుత్వం అమలు చేస్తున్న విదేశీ విధానాల వల్ల రైతులు ఆత్మహత్యల బారిన పడుతున్నారనీ, దీనికి ప్రత్యామ్నాయంగా సమష్టి వ్యవసాయమే మేలనీ అంటున్నారు బి.ఎస్. రాజు***

ఈ దేశపు చట్టసభల్లో కుక్కల్లా కొట్లాడుకునే అధికార, ప్రతిపక్ష రాజకీయ నాయకులకు రైతులు ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటున్నారో తెలియని విషయమా? వీరిలో వ్యవసాయ భూములు లేని వారుంటారని మనమనుకోగలమా? వీరు తమ కమతాలను ఇతర రైతులకు కౌలుకివ్వడమో లేక అసలు వ్యవసాయం చేయకుండానే రియల్ ఎస్టేట్ దందాకై ల్యాండ్ బ్యాంక్‌లుగ కూడబెట్టుకోవడమో చేస్తారు. వీరికున్న వ్యవసాయ భూముల వల్ల వీరికెప్పుడూ డబల్ ధమాకాయే! జాక్పాట్లే! వీరెవరికీ ఆత్మహత్యల బారిన పడాల్సిన పరిస్థితులుండవు. వ్యవసాయం వీరికి జీవనాదరువు కానే కాదు. అది వీరికి పోగేసుకున్న అదనపు ఆస్తి. కూడబెట్టుకున్న అక్రమ సంపద. ఇన్నేసి భూములున్న వీరు సొంతంగా దున్నేదీ లేదు, ఇతరులచే దున్నించి తాము చెడిపోయేదీ ఉండదు. దున్నక బీడుపెట్టినా నష్టపోయేదీ లేదు. చెడిపోతున్న దెవరు? చనిపోతున్న దెవరు? చేను దున్నేవాడు, పంట పండించి బతకాలనుకునే వాడు చావక తప్పడం లేదు. అంతేకాక వీరే సమాజ పెత్తందార్లు కనుక చిన్నరైతుల చావులపై అందరికన్నా దుఖః భాదితులుగా అగుపించాల్సిన అవసరం వీరికే ఎక్కువ గనుక, వారు వరదలై పారే దుఖ్ఖాన్ని ప్రదర్శిస్తారు.

ఈ దేశంలో చిన్నరైతు కుదేలైపోతున్నాడు, చిరు వ్యవసాయం అతని పాలిట ఉరితాడై, ఊపిరితీసేస్తోంది. నిత్యం చనిపోతున్న చిన్న రైతు, కౌలు రైతు, తానో గౌరవనీయ రైతునని, వ్యవసాయకుణ్ని అనుకుంటూ, దిన కూలిగా మారలేక, ఊరొదిలి పట్నం వీథుల బారిన పడలేక, పుట్టిన ఊరునే నమ్ముకుని అప్పుల ఉరితాడుకు చిక్కుకుని ఉసురు తీసుకుంటున్నాడు. ఈ గౌరవనీయ రైతు మనసు చంపుకుని కూలివానిగా మారిపోవడానికి ఒడంబడితే, చావుకు దూరమై ఏదోలా బతగ్గలడు. అలా ఊరి నుండి బొడ్డుతాడు తెంచుకుని విడివడి రెక్కలు విప్పుకున్న వాళ్లు ఉరితాళ్ల ఊపిరి తీసివేతల నుండి తప్పించుకుంటున్నారు. తప్పించుకుని ఎలా బతుకుతున్నారు? అన్నది వేరే విషయం. ఎలాగోలా, ఏదోవిధంగా చావకుండా బతుకుతున్నారు. పొలంతో, పంటతో, వ్యవసాయంతో సంబంధం లేనోడు చావుకు దూరంగానే మిగులుతున్నాడు. వాడు దళారో, కూలోడో, వర్కరో, ప్రైవేట్ ఉద్యోగో, సర్కారీ సద్యోగో లేకపోతే పట్టణ అడ్డాకూలీనో, ఇంకా అధోగతి పాలై కూడలిలో బిచ్చగాడో ఏమైనా కావచ్చు గాని, రైతు కాని వాడు మృత్యు కౌగిలికి దూరంగానే ఉండగల్గుతున్నాడు. అంటే సేద్యం చేసేవాడు చచ్చిపోతుంటే, సమాజంలో మిగతావాళ్లు అయ్యో పాపం అని జాలిపడి, దుఖించి సంతృప్తి పడిపోతున్నాం. అంతకు మించి ఆలోచించడం లేదు.

చిన్న కమతాలు, చిరు వ్యవసాయం, చేతివృత్తులు, చిన్నపరిశ్రమలు మొక్కకు కాసే కుక్క పిందెల్లాంటివి. అవి అనుబంధ పాత్రను పోషించ గలవే గాని స్వయంగా ఎదగలేవు. స్వయంగా నిలబడి, మనగల్గలేవు. ఇవేవీ దుర్భరమైన శ్రమనుండి మానవున్ని త్వరిత గతిన విముక్తి చేయలేవు. మానవుని ఉన్నత జీవన ఆకాంక్షను తీర్చలేవు. భారతదేశ గ్రామీణ సమాజం ఇటువంటి వైరుధ్యం నుండి బయట పడడానికి పెనుగులాడుతోంది. ఈ పెనుగులాటలో భాగమే పట్టణాలకు వెల్లువెత్తుతున్న వలసలు. గ్రామీణ వ్యవసాయ సంక్షోభపు 'క్షోభ' నుండి బయటపడే మార్గంలో జరుగుతున్నవలసలు పెట్టుబడి బలుపుకి కారుచవుకగా మానవ వనరులను సమకూరుస్తున్నాయి.

ప్రతి పేద దేశంలోను ఈ చిన్న కమతాల వ్యవసాయం మానవాభివృద్ధికి ఓ పెద్ద ఆటంకంగా ఉంటోంది. చిన్నకమతాల వ్యవసాయం పెద్ద కమతాల ధనస్వామ్య కార్పోరేట్ వ్యవసాయంగానైనా, లేక ఉన్నత సమతా విలువలతో కూడిన సాంఘిక వ్యవసాయంగానైనా రూపాంతరం చెందక తప్పదు. గిడసబారిన చిరు కమతాల వ్యవసాయ వ్యవస్థ పెట్టుబడి దారీ వ్యవస్థలో భాగంగా బృహత్ క్షేత్రాల వ్యవసాయంగా నైనా లేక విప్లవాత్మక మార్పులకు గురై సాంఘీక సమీకరణ చెంది, సమతా భావజాల దృక్పథంతో కమ్యూన్ వ్యవసాయంగా నైనా రూపాంతరం చెందాలి. అప్పులు, తిప్పలు, ఆత్మహత్యల ఫ్యూడల్ సమాజ బంధనాల నుండి బయటపడి మెరుగైన సమాజం రూపు దిద్దుకోవడానికి చిన్న రైతు ముందున్నవి ఈ రెండు మార్గాలు. ఇది ఎగుడు దిగుడుల వ్యత్యాస భరిత కార్పోరేట్ వ్యవస్థలో నైనా ఇమిడి పోవాలి లేదా సమిష్టి క్షేత్ర ఉమ్మడి వ్యవసాయంగా నైనా మారిపోవాలి. కార్పోరేట్ వ్యవసాయంగా మారితే చిన్న రైతు పెట్టుబడి కూలీగా మారుతాడు. లేక ఆ మొత్తం వ్యవస్థలో ఏదో ఒక మెట్టులో ఒదిగో, ఎదిగో, మిగులుతాడు. అలాగాక సాంఘిక వ్యవసాయం లో భాగమైతే స్వావలంభిగా, ఉన్నత విలువలతో బ్రతగ్గలుగుతాడు.

కార్పోరేట్ వ్యవసాయమా? కమ్యూన్ వ్యవసాయమా? భారత దేశ శ్రామిక వ్యవసాయకులకు ఏది సరైన దారి? అని ప్రశ్నించుకున్నప్పుడు ఈ రెండు మార్గాల చరిత్ర అనుభావాలనుండి చూస్తే సరైన మార్గామేమిటో తేటతెల్ల మౌతుంది. కార్పోరేట్ వ్యవసాయం అంతిమంగా సామాజిక వ్యత్యాసాలకి, పర్యావరణ ముప్పుకి, సామ్రాజ్యవాదానికి, భూభాగాల దురాక్రమణకు, యుద్ధాలకు, అశాంతికి దారి తీస్తుంది కాబట్టి ఈ మార్గం ఎన్నుకోవడం అంటే రైతాంగం మరింత అగాథం లోనికి తమను తాము నెట్టు కోవడమే ఔతుంది. ఇప్పుడు రైతుల ఆత్మహత్యలకు, వ్యవసాయ సంక్షోభానికి అసలు కారణమే కార్పోరేట్ వ్యవసాయం దిశగా అడుగులేస్తున్న పెట్టుబడి ఆధారిత వ్యవసాయమే కదా! మన విత్తనంపై, మన వ్యవసాయంపై, మన విఫణీ వాణిజ్యాలపై పెత్తనం ప్రపంచ

కార్పోరేట్ సంస్థలదైపోవడం వల్లే కదా చిన్న రైతు వ్యవస్థ విషాదంలో కూరుకుపోయింది! భారత దేశ చిన్న సన్నకారు రైతులు, కౌలు రైతులు, వ్యవసాయ కూలీలు ఎన్నుకోవలసిన అసలు సిసలు మార్గం సాంఘిక వ్యవసాయమే తప్ప వేరే కాదు.

బృహత్ క్షేత్ర వ్యవసాయ మంటే పెద్ద కమతాల వ్యవసాయం. చిన్న చిన్న వ్యవసాయ కమతాలను సమీకరణ చేసి కార్పొరేట్ వ్యవసాయ యాజమాన్యం లోనికి లేక సాంఘిక వ్యవసాయ సమీకరణ చేసి ప్రజా కమ్యూన్ల యాజమాన్యంలోనికి తీసుకురావడం. అంటే చిన్న రైతుల వ్యక్తిగత యాజమాన్యం నుండి జానా బెత్తెడు మడిచెక్కల వ్యవసాయాన్ని విముక్తి చేయడం. చిన్న రైతును ప్రభుత్వ ఉద్యోగి స్థాయికి తెచ్చి నిలకడగల ఆదాయం సమకూర్చే ప్రణాళికలో భాగం చేయడం. అంటే చిన్న కమతాల వ్యవసాయాన్ని కార్పొరేట్ సంస్థల యాజమాన్యంలో బడా పారిశ్రామిక వ్యాపారంగా నైనా లేదా రైతు సమిష్టి యాజమాన్యంలో బృహత్ వ్యవసాయ క్షేత్రాలుగా నైనా మార్పు చెందించడం. వాణిజ్యాన్ని, విఫణిని సమిష్టిగా సమైఖ్యపడిన రైతు సమాజ నియంత్రణ లోనికి తేవాలి. అది పెట్టుబడి బంధనాలను తెంచుకుని తానే మార్కెట్‌ను, పంపిణీ వ్యవస్థను విప్లవీకరించి సొంతం చేసుకోవాలి. అంటే వ్యవసాయం, ఉత్పత్తి, పంపిణీ వ్యవస్థలు వ్యక్తి స్వామ్యం నుండి విడుదలై విప్లవ మార్గంలో సమిష్టి స్వామ్యం లోనికి మారాలి. ఇది సిద్ధించాలంటే రైతుకు రాజ్యాధికారం కావాలి.

రైతు రాజ్యాధికారం సాధించుకోవాలంటే పెట్టుబడితో, దాని ఆధిపత్య రాజ్యంతో యుద్ధంచేసి గెలవాలె. అలా సాధ్యంకాని పక్షంలో, అటువంటి స్థితి సమాజంలో లేని పక్షంలో వ్యవసాయం కార్పొరేటీకరణ వైపే పయనిస్తుంది. వ్యవసాయ కార్పొరేటీకరణ గాని, వ్యవసాయ కమ్యూనీకరణ గాని ఎంత తొందరగా జరిగితే చావు దిశగా పయనిస్తున్న చిన్న రైతుకు అంత తొందరగా ఊరట కల్గుతుంది.

గత 100 ఏళ్లుగా ఈ దేశంలో కమ్యూనిస్ట్ పార్టీలు, సంస్థలు, గ్రూపులు ఎంతగా ప్రయత్నించినా వ్యవసాయ విప్లవ కార్యక్రమం పేలిపోయిన బుడగలానే ఉండిపోయింది తప్ప చిన్న రైతాంగానికి విముక్తి ప్రధాతగా ఎదగలేక పోయింది, నిలబడలేక పోయిందనేది ఓ చారిత్రిక వాస్తవం. గత దశాబ్ద కాలంగా ఈ దేశంలో మావోయిస్టు కమ్యూనిస్ట్ పార్టీ ఓ ప్రత్యామ్నాయ రాజకీయ ఆర్థిక వ్యవస్థను తమ విముక్తి ప్రాంతంగా చెప్పుకుంటున్న దండకారణ్య ప్రాంతంలో అమలు చేస్తున్నట్లు సమాచారం. జనతన సర్కార్లనే ప్రజా పాలనా నమూనా ఓ నూతన బోల్షివిక్ ప్రయోగంగా దండకారణ్య ప్రాంతంలో అమలౌతోందని వింటున్నాం. మీడియా, ప్రజా సంఘాలు దీనిపై చాలా ప్రచారం కూడా చేస్తున్నాయి. అయితే ఈ ప్రయోగం వ్యవసాయకంగా వెనుకబడి ఉన్న ఆదివాసీ నివాసిత ప్రాంతాలైన, ఇంకా ఆధునిక మార్కెట్ ప్రవేశించని భూభాగానికి పరిమితమై ఉంది. మార్కెట్ తన రాజ్య బలగాలతో అక్కడ చొరబడడానికి సర్వశక్తులా ప్రయత్నిస్తున్నది. ఈ నూతన బోల్షివిక్ జనతన సర్కార్ల ప్రయోగం దండకారణ్య భూభాగాల్లో ఒక మేరకు మాత్రమే జరుగుతోందని మావోయిస్టు ఉద్యమ పత్రాలు చెబుతున్నాయ్. గమనించాల్సిన విషయమేమంటే ఈ దండకారణ్య ఉద్యమ ప్రాంతాల్లో రాజ్యం జరిపే దాడుల్లో ఆదివాసీ ప్రజలు చనిపోతున్నారు తప్ప, వ్యవసాయం చేసి అప్పుల పాలై, సంక్షోభంలో కూరుకపోయి చనిపోవడం అన్నది లేదు.

వ్యవసాయంలో ఎంతో మెరుగైన దిగుబడులు సాధించిన చోట, ఆధునిక మార్కెట్ ఉన్నచోట, వాణిజ్య పంటల విస్తీర్ణం పెరిగిన చోట, ప్రయాణ సాధనాలు, రహదార్లు, సమాచార సాంకేతిక వ్యవస్థలు, బ్యాంకింగ్ వ్యవస్థ బాగా అందుబాటులో ఉన్నచోట చిన్నసన్నకారు రైతులు, కౌలుదార్లు చనిపోతున్నారు. వ్యవసాయం ఆధునిక మార్కెట్ శక్తుల గుప్పెట్లోకి వెళ్లిపోయిన విస్తృత గ్రామీణ మైదాన ప్రాంతాల్లోనే ఎక్కువగా చిన్నరైతుల ఆత్మహత్యలు చోటు చేసుకుంటున్నట్లు పత్రికా గణాంకాలు నిత్యం తెలియ చేస్తున్నాయి.

పైన చెప్పిన రెండు తరహాల వ్యవసాయక వ్యవస్థగలే గాక మూడవ మార్గ మొకటి క్యూబాలో, ఓ ప్రత్యేక చారిత్రిక సందర్భంలో మానవ అనుభవం లోనికి వచ్చింది. ఈ అనుభవాన్ని కూడా లోతైన అధ్యయనం చేసి దండకారణ్య రైతాంగ జనతన సర్కార్ల అనుభవంతో జోడించ వలసి ఉంది. గత సోవియెట్ రష్యా వ్యవసాయ చరిత్ర , చైనా ప్రజా కమ్యూన్ల చరిత్రలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి ఉపయోగాత్మక సారాన్ని భారత దేశ వ్యవసాయ విప్లవ విజయానికి తోడ్పడే విధంగా అన్వ యించు కోవాలి. సన్న చిన్న కారు రైతుల్లో, భూమిలేని కౌలు రైతుల్లో, వ్యవసాయ కూలీల్లో రైతాంగ విముక్తి తమ పోరాటం ద్వారానే సాధ్యమని విస్తృతంగా ప్రచారం చేపట్టాలి. పర్యావరణ వినాశనం, గ్రామీణ వ్యవసాయక సంక్షోభం, రైతు ఆత్మహత్యలు ఇత్యాది సమస్యలన్నిటికీ మూలమైన పెట్టుబడి ప్రపంచీకరణ, మార్కెట్ల దురాక్రమణ, యుద్ధ భీభత్సం గురించి విస్తృత రైతాంగానికి అర్థమయ్యే రీతిలో ప్రచారం జరిపి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో వీరిని సమీకరించాలి. స్వావలంభన దిశగా శ్రామిక పజల ఆలోచనా సరళిని మార్చడానికి కృషి చెయ్యాలి. సకల రంగాల్లో పనిచేసే సంఘటిత, అసంఘటిత కార్మికులు, చిరుద్యోగులు, రైతు విముక్తికి బాసటగా నిలబడాలి. ఆ కృషిలో భాగస్వాములు కావాలి.

ఎప్పుడో కాదు, ఇప్పటి నుండే కౌలు రైతులు, చిరు వ్యవసాయ దారులు సంఘటిత పడి స్వయం సహాయక బృందాలుగా ఏర్పడే మార్గాలు అన్వేషించాలి. అలా ఏర్పడటానికి వారిని ఎక్కడికక్కడ ప్రోత్సహించాలి. సాంఘిక వ్యవసాయం వైపు అడుగులు వేయడం ఇప్పటి నుండే మొదలవ్వాలి. తిరిగి గ్రామాలకు తరలండి అనే నినాదంతో పట్టణ కార్మికులు, విద్యార్థులు, భుద్ధిజీవులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కళాకారులు ప్రణాళికా బద్ధంగా ఐక్యతా రాగంతో సామ్రాజ్యవాద వ్యతిరేక రైతాంగ ఉద్యమంలో పాలు పంచుకొవాలి. వీరందరి పునాది, ఊపిరి వ్యవసాయమే కాబట్టి రైతాంగానికి బాసటగా నిలబడటం అందరి ప్రాథమిక కర్తవ్యంగా ఉండాలి. భారత దేశ వ్యవసాయక విప్లవం అందరి ఊపిరి కావాలి. రైతాంగం అటువంటి చొరవను తమ లోనుండి పైకి తోడి తెచ్చుకుని, వ్యవసాయ సంక్షోభానికి గురౌతున్న శ్రామిక రైతాంగ శక్తులను క్షేత్ర స్థాయిలో ఒక్క తాటిపైకి తెచ్చి ఒక బలీయమైన శక్తిగా ఎదగాలి.

రైతాంగ ఆత్మహత్యలు ఆగాలంటే, వ్యవసాయ సంక్షోభం నుండి వారికి శాశ్వత విముక్తి లభించాలంటే చావులు పరిష్కారం కానే కాదు. అటువంటి చావులు తమ కుటుంబాలను మరింత విషాదం లోనికి, దుర్భర పరిస్థితుల్లోనికి నెట్టి వేస్తాయి. రైతు విముక్తికి విప్లవ కార్యాచరనే ఏకైక మార్గమని, రైతాంగ శక్తులే వ్యవసాయ ఉద్యమ నిర్మాణానికి నడుంకట్టడంలోనే పరిష్కారం ఉంది.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

# పులీ నక్కా గొర్రెయిజం

***పాలకులు ప్రజలను ఆటవిక దశలో ఉంచి, వారి వెనుకబాటుతనాన్ని, నమ్మకాలను పునాదిగా చేసుకొని చాతుర్వర్ణ వ్యవస్థను అమలుపరుస్తున్న తీరును వివరిస్తున్నారు బి. విజయభారతి***

మహాకవి బోయి భీమన్న ప్రతిపాదించిన పులీ, నక్కా గొర్రెయిజానికి ఈనాడూ ప్రాసంగికత ఉన్నది.

'గొర్రెల్ని దోచుకు తినడం కోసం పులీ, నక్కా ముఠా కట్టాయి. మనుస్మృతి లాంటి ఆర్డినెన్స్‌లు, చట్టాలు అలా పుట్టినవే' అని ఆయన చెప్పారు. ఈనాడు ప్రజల ఆహార విహారాల మీద భావప్రకటనా స్వేచ్ఛ మీద బలం కలవాళ్ల ఆంక్షలు విధించడం, పాలక వర్గం దానికి మౌనంగా వత్తాసు పలకడం చూస్తూనే ఉన్నాం. నిరసన గళాలు – ధిక్కార స్వరాలు ఈ అరాచక శక్తుల మీద ఎలాంటి ప్రభావమూ చూపుతున్నట్లు లేదు.

'అన్నం అందరిదీ – ఏ ఒక్కడికీ దానిమీద గుత్తాధిపత్యం లేదు. బలం కలవాళ్లు ముఠాకట్టి ఆ అధికారాన్ని చేజిక్కించుకున్నారు.' అని చెప్పిన భీమన్న (1911–2005) సాహిత్యం వైవిధ్య భరితమైనదీ – విలక్షణమైనదీ – వివాదాస్పదమైనదీ కూడా. ఆయన భావాలు – ఆలోచనలు – ఆలోచింప చేయడమే కాదు, పాఠకులను చైతన్య పరుస్తాయి.

'లోకంలో నేడున్న దుస్థితికంతకూ గొర్రెల బలహీనతే కారణం' అని గుడిసెలు కాలిపోతున్నై (వచన కావ్యం – ప్రచురణ 1973) లో భీమన్న టుఖీలు చెప్పడం ఆశ్చర్య పడదగినదేమీ కాదు.'గొర్రె సోదరుల్లారా కళ్లు తెరవండి' అన్నారు ఆయన.

'బలం కలవాడు పులి.

తెలివి గలవాడు నక్క.

ఈ ఇరువర్గాలకు ఆహారంగా బతుకుతున్న మూర్ఖులు గొర్రెలు' అని వివరించారు.

'కర్మ సూత్రంపై విశ్వాసం, చచ్చిన అవతారాల పట్ల భక్తి పులికి పాదసేవ. నక్కకు దాసోహం – గొర్రెలకి వామోక్ష మార్గాలు' అని ఆనాడే ప్రశ్నించారు.

నేటి హిందూత్వం భగవంతుడి కోసం ఏర్పడ్డ మతం కాదు–ఆర్థిక రాజకీయ ప్రాబల్యం కోసం కొన్ని అరాచక శక్తులు రూపొందించిన సాంఘిక పథకం. అధర్మానికి, ఆత్మ వంచనకు, అన్యాయానికి, అనైతికతకు ఆకారమై రోజు రోజుకు క్షీణించిపోతున్న ఈ శైథిల్యాన్ని భీమన్న ఏనాడో పసికట్టారు. ప్రజలను హెచ్చరిస్తూ ఎన్నో రచనలు చేశారు. 'గుడిసెలు కాలిపోతున్నై జాగ్రత్తపడండి, మానవత్వంకేసి కదలండి' అని దండోరా వేశారు. ఆ కావ్యానికి ఆయన రాసుకొన్న పీఠిక పేరు 'దండోరా'.

మానవులను ఆయన మూడు తరహాలుగా విభజించారు. (1) పులులు. (2) నక్కలు (3) గొర్రెలు. వాళ్లను నేటి సమాజమే అలా తయారు చేసిందన్నారు. పురుషార్థాలు పునాదిగా వర్ధిల్లిన వైదిక సమాజం వర్ణ వ్యవస్థ అనే రోగంతో పతనమై పోయిన తర్వాత దానికి చికిత్స జరగనే లేదు. అది వన్య వ్యవస్థగా ఉండి పోయింది. సోషలిస్టు సమ సమాజం ఏర్పడాలంటే దానికి చికిత్స జరగాలి. హిందూ సమాజానికి విశిష్ట లక్షణంగా చెప్పబడే చాతుర్వర్ణ వ్యవస్థ అనే ప్రాథమిక సూత్రాన్ని పూర్తిగా పెకలించి పారేయాలి. అదే రోగ కారణం – మానవ బలహీనతలే ఈ రోగాన్ని పెంచి పోషిస్తున్నాయి – అని భీమన్న చెప్పారు. రసాద్వైత కవిగా, భావకవిగా, అభ్యుదయ కవిగా పేరుపడ్డ భీమన్న ప్రతిఘటనను కూడా బలంగా వ్యక్తీకరించారు. ఆయన రాసిన పాలేరు నాటకం, పాలేరు వర్గాలను అక్షరాస్యత వైపూ, ఉద్యోగాల వైపూ నడిపించింది. ప్రగతి నిరోధక శక్తులను ప్రతిఘటించాలనే తత్వం వారి రచనలలో అంతర్లీనంగానూ, బాహాటంగానూ కనిపిస్తుంది.

'ఎవరు శాంతి కాముకులెవ్వరు నగ్జల్స్
దొడ్డవార లెవరు దుష్టులెవరు
వారె వీరు గాలివాటమె నిర్ణేత
కోటి వృత్తులైన నోటివరకె'

అన్న భీమన్న (చివరి మెట్టు మీద శివుడు – 262) మాట ఈ నాటి రాజకీయాలలో ప్రత్యక్షంగా నిజం కావడాన్ని ప్రజలు చూశారు. 'శుష్క వాగ్దానాల వెంట పోకండి – క్రియాశీలురు కండి' అన్నారు. భీమన్న. 'ధర్మం కోసం పోరాడండి' అంటూ ఒక పుస్తకమే రాశారు (1968). మనిషిని మనిషి దోచుకుతినే లోకరీతిని స్పష్టంగా చెప్పారు. మతం కావలసింది పేద వాళ్లకు. వాళ్లకు ఆశే జీవితం. ఆ ఆశల హరివిల్లు మతం. పేదలు అందుకే మతాన్ని పట్టుకు వేళ్లాడతారు. ఆ మతాన్నే పాలక వర్గాలు ఆయుధంగా చేసుకుంటున్నాయి. పండగలూ – వేదాద్రులూ ఓటర్లకు వేసే గాలాలు.

'దేవుళ్లవతరించారు, ప్రవక్తలుద్భవించారు నెత్తుర్లు చిందించారు, నీతులు బోధించారు మానవ నైజం మాత్రం గొంగళిలా, ఎక్కడిదక్కడే ఉంది' (గుడిసెలు కాలిపోతున్నై – 67).

'వద్దు మతం వద్దు మత బోధలు
వద్దు భక్తి వద్దు భజనలు
ఏది పులో ఏది నక్కో కనిపెట్టండి మనశ్శక్తిని పెంచుకుని మనుషులుగా బతకండి.'

'మతం అది ఏమతమైనా సరే
పులీ నక్కా కలిసి పన్నిన వల
భక్తి – ఇది ఏ దేవుడి మీద దైనాసరే
గొర్రెల కోసం పెట్టిన ఎర'

'వేద యుగం నాటి మనిషికీ నేటి మనిషికీ
స్వభావంలో తేడా ఏముంది
నాడెంతో నేడూ అంతే

# ఇది ప్రజాస్వామ్య స్ఫూర్తేనా?

***ఎన్నికల రాజకీయాలలో అన్ని పార్టీల విధానాలూ ఒక్కటేననీ, పార్టీలు ప్రజలకు హామీలిచ్చి మోసగించడం కొత్తేమీ కాదనీ, వరంగల్ ఉప ఎన్నికలు కూడా అదే కోవలోకి వస్తాయనీ అంటున్నారు* వంగల సంపత్ రెడ్డి**

వరంగల్ ఉప ఎన్నికకు కారణం కడియం శ్రీహరి రాజీనామా. అవినీతి ఆరోపణలతో తాటికొండ రాజయ్యను ఉప ముఖ్యమంత్రిగా తొలగించి, అతని స్థానంలో వరంగల్ పార్లమెంట్ సభ్యుడైన శ్రీహరిని ఉప ముఖ్యమంత్రిగా, విద్యాశాఖ మంత్రిగా నియమించడం వరంగల్ ఉప ఎన్నికకు కారణం. కెసిఆర్ నియంతృత్వ, ఆధిపత్య పోకడలకు వరంగల్ ఉప ఎన్నిక ఒక చిహ్నమని ప్రతిపక్షాలు నానాయాగి చేస్తున్నాయి గానీ కెసిఆర్ ఏ ఉద్దేశ్యంతో తాటికొండ రాజయ్యను తొలగించి, కడియం శ్రీహరిని ఎందుకు నియమించుకున్నాడో ప్రతిపక్షాలకు ఇప్పటికీ అర్థం కాలేదని వారి ప్రకటనలే చెబుతున్నాయి.

రాజయ్య తొలగింపుకు కారణమైన అవినీతి ఆరోపణలు ఒక నెపం మాత్రమే. ఎంతమంది మంత్రులపై అవినీతి ఆరోపణలు రాలేదు. ఆ మంత్రులను ఎందుకు తొలగించలేదు? మరి, కేవలం రాజయ్యను మాత్రమే ఎందుకు తొలగించాడు? ఇది అర్థం కావాలంటే గత 20 సంవత్సరాలుగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మొదులుకొని నేటి తెలంగాణలో ప్రపంచ బ్యాంకు పాత్ర అర్థం కావాలి. అపుడు మాత్రమే ఒక అంచనాకు రాగలం.

వరంగల్ ఉప ఎన్నికలకు ప్రధాన కారణం కెసిఆర్ ఆలోచనా విధానం. కెజి నుంచి పిజి ఉచిత విద్య హామీ తప్ప ఎన్నికలకు ముందు ఇచ్చిన హామీలన్నీ నెరవేర్చాలని తనకు తానే చెప్పుకుంటున్న కెసిఆర్, ఒకప్పటి తన నాయకుడు, ప్రస్తుత ప్రత్యర్థి చంద్రబాబు దారిలోనే ప్రపంచ బ్యాంకు విధానాలను అమలు పరుస్తున్నాడు. అందుకు ప్రపంచ బ్యాంకుకు తాను విధేయుడినని ప్రపంచ బ్యాంకుకు చెప్పదలుచుకున్నాడు. సంక్షేమ పథకాలను వ్యతిరేకించే ప్రపంచ బ్యాంకుకు నమ్మకం కుదిరేటట్లుగా కెజి నుంచి పిజి ఉచిత విద్య నుండి తప్పుకోదలచాడు. పాము చావకుండా కర్ర విరగకుండా పని చేసే సమర్థుడు కావాలి. అందులో అనుభవజ్ఞుడై ఉంటే మరీ మంచిది. వెతకగా ఒకప్పటి తన సహచరుడు కడియం శ్రీహరి కనిపించాడు. ఎన్‌టిఆర్‌కు వెన్నుపోటు పొడిచి అధికారంలోకి వచ్చిన చంద్రబాబు ప్రపంచబ్యాంకు ఎజెండాను అమలుపరచాడు. ప్రపంచ బ్యాంకు ఎజెండాను అమలుపరచడంలో చంద్రబాబుకు సహాధ్యాయులుగా ఉన్నది కెసిఆర్, కడియం శ్రీహరిలే.

ప్రపంచబ్యాంకు విధానాలను అమలుపరిచే క్రమంలో చంద్రబాబు విజన్ 2020 ని ప్రకటించాడు. విజన్ 2020లో మార్కెట్ నైపుణ్యాలను పెంపొందించే విద్యయని ప్రకటించాడు. విద్యను సరుకన్నాడు. మార్కెట్ నైపుణ్యాలను పెంపొందించే దిశగా విద్యారంగాన్ని సమాయత్తం చేసేందుకు ప్రయత్నించాడు. అందుకు విద్యారంగాన్ని మొత్తంగా ప్రైవేటీకరించదలిచాడు. విద్యా ప్రైవేటీకరణలో భాగంగా ప్రభుత్వ విద్యా సంస్థలను బలహీనం చేయదలిచాడు. అందుకు చంద్రబాబుకు తోడ్పడింది అప్పటి విద్యాశాఖ మంత్రి కడియం శ్రీహరే. తదనంతరం గుణాత్మక విద్య పేరుతో ప్రాథమిక పాఠశాలలను బలహీనం చేశారు. పార్ట్‌టైం లెక్చరర్లను, కాంట్రాక్టు లెక్చరర్లను నియమించి ఉన్నత విద్యారంగాన్ని ధ్వంసం చేశారు. విశ్వవిద్యాయాలో నియామకాలు లేవు. పరిశోధనలు మూతపడ్డాయి. సామాజిక శాస్త్రాల అధ్యయనం అనవసరమని ప్రచారం చేశారు. అధ్యాపకుల జీతాల గురించి, వారి సెలవుల గురించి అవాస్తవాలను ప్రచారం చేశారు. హేతుబద్ధీకరణ పేరుతో పాఠశాలలను మూసివేశారు. గత 20 సంవత్సరాల నుండి విద్య ప్రైవేటీకరణ వేగం పుంజుకున్నది.

తెలంగాణ రాష్ట్రంలో కెజి నుండి పిజి ఉచిత విద్య నినాదంతో కెసిఆర్ అధికారంలోకి వచ్చాడు. ఇప్పుడు దాని నుండి తప్పుకొదలచాడు.

---

అదే పులి – అదే నక్క – అవే గొర్రెలు.'

ఈనాడు ఒక్క గొర్రెలు తప్ప తక్కిన రెండు తరహాల వారూ పాపాన్ని పంచదారలా ఆరగిస్తున్నారంటారు భీమన్న. 'సమాజంలో నిజాయితీ లోపించడానికి మతంలోని అభివృద్ధి నిరోధకతే కారణం. అదే అగ్ర కులాలకు, పాలక వర్గాలకు రక్షణ కవచం. మతపిచ్చి పోతేనే ప్రగతి' అన్నారు భీమన్న. 'మతములన్నియు మాసిపోవును జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' అన్న గురజాడను ఆయన ప్రస్తావించారు. గుడిసెలు కాలిపోతున్నై కావ్యంలో భిన్న విషయాలకు చెందిన కవితలెన్నో ఉన్నాయి. ఈ సంపుటి కేంద్ర సాహిత్య అకాడమీ వారి జాతీయ బహుమానం (1975) పొందింది.

'నాల్గు వర్ణాలన్నది హిందూయిజం
రెండు వర్గాలన్నది కమ్యూనిజం
ఈ వర్ణ విభజనా వర్గ విభజనా చేసింది
పులి నక్కాయిజం'
'మనిషి గుణం మారడం లేదు కారణం మతం.
మనిషి మెదడు పెరగడం లేదు కారణం భక్తి.
మతమూ, భక్తీ నశించకుండా ప్రగతి లేదు మనిషికి.' అని చెప్పారు.

పాలక వర్గాలకైనా, పాలిత వర్గాలకైనా ఇది వర్తిస్తుంది. ఈనాడు దేశంలో పెద్దలకు ఆలోచన లేదు. ఆలోచించే చిన్నలకు పెద్దరికం లేదు. అంటూ ఈ దుస్థితిని ఎలా ఎదుర్కోవాలో యువతకే వదిలేశారు భీమన్న. నేటి మతోన్మాద అసహనాన్నీ, పెట్టుబడిదారీ సంక్షోభాన్నీ ఎదుర్కోవడానికి యువత సన్నద్ధం కావలసిన అవసరాన్నీ–మార్గాలనూ ఆయన రచనల్లో చూడవచ్చు.

*(రచయిత సాహిత్య, సామాజిక విమర్శకులు)* వీ

అవినీతి ఆరోపణ పేరుతో రాజయ్యను తొలగించడం వల్ల తాను అవినీతిని సహించనని చెప్పడం, ప్రపంచ బ్యాంకు ఎజెండాను అమలు చేస్తానని ప్రపంచ బ్యాంకుకు నమ్మకం కలిగించడం ఏకకాలంలో చెప్పదలుచుకున్నాడు. అందుకు రాజయ్యను తొలగించడం, ప్రపంచ బ్యాంకు ఎజెండాను అమలు చేయడంలో అనుభవమున్న కడియం శ్రీహరిని నియమించడం ద్వారా తన పనిని పూర్తి చేశాడు. అందువల్ల వరంగల్ ఉప ఎన్నిక కెసిఆర్‌కు అనివార్యమైంది. కాబట్టి వరంగల్ ఉప ఎన్నికల్లో ప్రజా ఆకాంక్షలు చర్చకు వస్తాయనుకోవడం భ్రమే.

కెజి నుంచి పిజి ఉచిత విద్య హామి నుండి కెసిఆర్ తప్పుకుంటాడని చెప్పడం అనుమానమేనని కొందరు మేధావులు, పాలక వర్గాలను సమర్థించే సంఘనాయకులు మాట్లాడవచ్చు. కాని, తన హామీ నుండి కెసిఆర్ తప్పుకుంటాడని చెప్పడానికి చాలా ఆధారాలున్నాయి.

పదవిని స్వీకరించిన మరుక్షణం నుండే కడియం శ్రీహరి ఉపాధ్యాయుల జీతాల గురించి, వారి సెలవుల గురించి, వారి సంఘాల గురించి, ప్రభుత్వ పాఠశాలల నిర్వహణ గురించి చంద్రబాబు హయాంలో మాదిరిగానే అవాస్తవాలను ప్రచారం చేస్తున్నారు.

అంతేకాకుండా కెసిఆర్ కనుసన్నల్లో మెదుల్తూ, విద్యాశాఖలో ఒఎస్‌డిగా పనిచేస్తున్న వ్యక్తి నడిపిస్తున్న 'తెలంగాణ వికాస సమితి' ఆధ్వర్యంలో ఒఎస్‌డిలో 'కెజి నుంచి పిజి ఉచిత విద్య సాధ్యమేనా?'అనే అంశం మీద రౌండు టేబుల్ సమావేశం జరిగింది. సాధ్యమేనా? అంటూ జరిగిన చర్చ ద్వారా అసాధ్యమని నిర్ధారించడానికే తప్ప మరొకటి కాదని ఆ సమావేశంలో పాల్గొన్నవారికి అర్థమైంది. అంతే కాకుండా ఆ సమావేశంలో గతంలో ప్రగతిశీల సంఘ రాష్ట్ర ప్రధాన బాధ్యుడిగా పనిచేసిన వ్యక్తి తన పత్రంలో కెజి నుంచి పిజి ఉచిత విద్య ఎవరికంటూ ప్రశ్నిస్తూనే కెసిఆర్‌కు సమయమివ్వాలన్నాడు. అంతే కాకుండా తాను ఫలానా వ్యక్తి చెపితే ఈ పత్రం రూపొందించానని చెప్పడం శోచనీయం. ఆ సంస్థ ఇలాంటి సమావేశాల ద్వారా కెజి నుంచి పిజి ఉచిత విద్య నుండి తప్పుకుంటే జరిగే పరిణామాలను విశ్లేషించి కెసిఆర్ కు నివేదించి ఉండవచ్చు. అందువల్లనే కావచ్చు కెజి నుండి పిజి ఉచిత విద్య గురించి కెసిఆర్ ఎక్కువగా మాట్లాడడంలేదు.

అంతేకాకుండా విద్యాశాఖలో ఒఎస్‌డిగా పనిచేస్తున్న ఆ వ్యక్తి ఇటీవల వరంగల్‌లో ఒక పుస్తకావిష్కరణ సభలో 'ఉపాధ్యాయులు ఎప్పుడూ తమ జీతాల గురించి, డి.ఎ. గురించి మాట్లాడుకుంటారు గాని ఆ సంవత్సరంలో తమ విద్యా బోధన ఎంత మెరుగయిందో మాట్లాడుకోరు' అంటూ మాట్లాడిన తీరు కడియం శ్రీహరి మాట తీరుకు చాలా దగ్గరగానే ఉన్నది.

కాబట్టి కెజి నుంచి పిజి ఉచిత విద్య నుండి తప్పుకునే కార్యక్రమంలో భాగంగా వచ్చిన వరంగల్ ఉప ఎన్నికలో ప్రజా ఆకాంక్షలు ఏమైనా ఉన్నాయా అని పరిశీలిస్తే దళితులకు మూడు ఎకరాల భూమి ముచ్చట మాట్లాడే పార్టీలు లేవు. కనీసం వామపక్షాలు కూడా భూమి గురించి మాట్లాడకపోవడం విచారకరం. భూమి ఎక్కడ ఉందని చర్చ చేస్తున్నారు. కానీ పారిశ్రామికవేత్తలకు వేల ఎకరాల భూమిని దారాదత్తం చేయడానికి భూమి ఎక్కడి నుండి వస్తున్నదో పాలకవర్గాలకు? ఎన్‌కౌంటర్లు లేని సమాజం కోసం బలంగా వాదించే, ఉద్యమాలు నిర్మిస్తామనే హామీ కూడా ఇవ్వలేని స్థితిలో రాజకీయ పార్టీలు ఉన్నాయి.

ఎన్నికలకు ముందు ఓపెన్‌కాస్ట్ బొగ్గు బావులను వ్యతిరేకించిన పాలకవర్గం ఇపుడు ఆ ఊసే ఎత్తడం లేదు. అంతే కాకుండా కొత్తగా ఓపెన్ కాస్ట్ తవ్వకానికి ప్రణాళికలు రచిస్తున్నట్లు వినబడుతోంది. కనీసం దీనిని ప్రతిపక్షాలు ప్రశ్నించడం లేదు.

హరితహారం పేరుతో ఆదివాసులు సాగు చేసుకుంటున్న పోడు భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోడానికి చేస్తున్న ప్రయత్నాలను ఏ పార్టీలు ప్రశ్నించడంలేదు. సాగునీటి ప్రాజెక్టు రీ డిజైనింగు పేరుతో అంతిమంగా నష్టపోయే ఆదివాసుల గురించి చర్చలు లేవు. ఐరన్‌ఓర్ తవ్వకాల కోసం వందల ఎకరాలను ప్రైవేట్ వ్యక్తులకు లీజుకివ్వడాన్ని ఏ పార్టీలు ప్రశ్నించిన సందర్భాలు లేవు.

లండన్ వెళుతూ విదేశీ పెట్టుబడులకు బార్లా తెరిచిన మోడీ విధానాలను బలంగా వ్యతిరేకించే హామీలు లేవు.

రైతుల రుణమాఫీపై తూతూ మంత్రం చర్చ సాగుతున్నదే తప్ప ప్రభుత్వాన్ని నిలదీయాల్సిన స్థితిలో లేదు.

రైతుకు నిరంతరాయంగా పగటిపూట విద్యుత్ సరఫరా అందిస్తామనే పాలక వర్గ హామీ గురించి చర్చ లేదు. ఎనుమాముల మార్కెట్‌లో పత్తి ధర అమాంతంగా ఎందుకు పడిపోయిందో పట్టించుకోని ప్రభుత్వం, రైతుల ఆందోళనకు దిగి ధర పెంచుకున్న విధానం వెనుక ఎవరున్నారని విచారించడం శోచనీయం.

నిరసనను ప్రకటించాలంటే కూడా అనుమతిని తీసుకోవాలనే దౌర్భాగ్యం మీద మాట్లాడే నాయకులు లేరు.

ఏ ఎన్నికయినా రాజ్యాంగ విలువలను పెంపొందించేదిగా, ప్రజాస్వామ్య స్ఫూర్తిని రక్షించేదిగా, ప్రజా ఆకాంక్షను వ్యక్త పరిచేదిగా ఉండాలి. కాని వరంగల్ ఉప ఎన్నిక ప్రజలు కోరుకోలేదు. ఈ ఉప ఎన్నిక ప్రజలపై రుద్దబడినది. అందువల్ల వరంగల్ ఉపఎన్నిక రాజ్యాంగ విలువలను పెంపొందించే విధంగా ఉంటుందనుకోవడం, ప్రజాస్వామ్య స్ఫూర్తిని రక్షించేదిగా ఉంటుందనుకోవడం, ప్రజా ఆకాంక్షను వ్యక్త పరిచేదిలా ఉంటుందనుకోవడం నేతిబీరలో నెయ్యి చందమే అవుతుంది. ప్రజాస్వామ్య స్ఫూర్తికి విరుద్ధంగా జరుగుతున్న వరంగల్ ఉప ఎన్నికలో ఎవరు గెలిచినా, ఎవరు ఓడినా అంతిమంగా ఓడిపోయేది ప్రజలే.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్)* వీ

**రాబోయే సంచికలలో...**

- **ఆదివాసులకు స్వయం ప్రతిపత్తి కల్పించాలి - పూాకె రామకృష్ణ**
- **సాంఘిక వెలి - ప్రజారోగ్యం - డా. పట్టా వెంకటేశ్వర్లు**
- **మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతం పై ఒక వివరణ - వై.వి. రమణారావు**
- **ప్రజారోగ్యం ప్రైవేట్ పరం - మండి నాగమణి**

# భూమయ్య, కిష్టాగౌడ్ - నలభై ఏళ్లు

*నలభై సంవత్సరాల క్రితం భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షను వ్యతిరేకిస్తూ సాగిన పోరాటాల చరిత్రను వివరిస్తు, ప్రభుత్వాలు ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించకుండా, ఇప్పటికీ అవే అనాగరిక చర్యలకు పాల్పడుతున్నాయని అంటున్నారు* **వరవరరావు**

**భూ**మయ్య, కిష్టాగౌడ్‌ల అమరత్వానికి ఈ డిసెంబర్ 1కి నలభై ఏళ్లు. భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లకు బ్రిటిషిండియా న్యాయస్థానం ఉరిశిక్ష విధించి అమలు చేసింది. ఇంకా రాజ్యాంగ రచన జరగక పూర్వమే కేంద్రంలోనూ, రాష్ట్రాల్లోనూ తాత్కాలిక భారత ప్రభుత్వాలు పనిచేస్తున్న కాలంలో మద్రాసు ప్రావిన్సులో కయ్యూర్ కామ్రేడ్స్‌ను నలుగురిని ఉరితీశారు. భారత రాజ్యాంగం అమలులోకి వచ్చిన తర్వాత ఉరికంబమెక్కిన రైతాంగ విప్లవకారులు భూమయ్య, కిష్టాగౌడ్‌లే.

విస్తృత ప్రచారం, ఉద్యమం జరిగి ఉరిశిక్ష ఆగిపోయిన వాళ్లు నాగభూషణ్ పట్నాయక్, జీతన్ మరాండీ, అతని సహచరులు. నాగభూషణ్ పట్నాయక్ ఉరిశిక్షను 1972 ఆగస్ట్ 15 భారత స్వాతంత్ర్యదిన రజతోత్సవాల సందర్భంగా రాష్ట్రపతి క్షమాభిక్ష పెట్టి యావజ్జీవ శిక్షగా మార్చాడు. జీతన్ మరాండీ అతని సహచరులకు గిర్డి (ఝార్ఖండ్) సెషన్స్ కోర్టు విధించిన ఉరిశిక్షను మొదట హైకోర్టు కొట్టివేసింది. దీనిపై ఝార్ఖండ్ ప్రభుత్వం అపీల్‌కు పోతే ఇటీవలనే సుప్రీంకోర్టు కూడా కొట్టివేసింది.

కోసుగంటి భూమయ్యది కరీంనగర్ జిల్లా, పెద్దపల్లి తాలూకా, ముత్తునూరు గ్రామం, జంగమ వృత్తి. గున్నాల కిష్టాగౌడ్‌ది ఆదిలాబాద్ జిల్లా, ఆసిఫాబాద్ తాలూకా, కనర్‌గామ గ్రామం. కల్లుగీసే వృత్తి. ఇద్దరివీ గోదావరికి అటు ఇటు ఉన్న గ్రామాలు. ఇద్దరు కలిసి తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో గట్టుపల్లి మురళి దళంలో పనిచేశారు. ఆ పోరాటంలోనే కిష్టాగౌడ్ తొడకు తుపాకి గుండు తగిలి ఆ బుల్లెట్లు చివరిదాకా ఆ తొడలో మిగిలే ఉన్నాయి. నక్సల్బరీ, శ్రీకాకుళ రైతాంగ పోరాట ప్రభావంతో మళ్లీ గోదావరి లోయలో నక్సలైటు ఉద్యమం ప్రారంభమైనపుడు గోదావరిలో స్నానం చేస్తుండగా గుండి దామోదరరావుతో పాటు వీళ్లిద్దరూ అరెస్టయ్యారు.

ఆదిలాబాద్ జిల్లా గిన్నెదరి భూస్వామి లచ్చు పటేల్‌ను హత్య చేసిన కేసుల్లో వీళ్లిద్దరికీ ఆదిలాబాద్ సెషన్స్ కోర్టు ఉరిశిక్ష విధించి, వరంగల్ జైలు నుంచి సికిందరాబాద్ (ముషీరాబాద్) జైలుకు మార్చింది. సెషన్స్ కోర్టులో 1972కు పూర్వం సరియైన న్యాయ సహాయం అందక ఒకవైపు, బూర్జువా కోర్టులను బహిష్కరించాలన్న అవగాహన ఒకవైపు ఉండడం వల్ల కొంత ఈ తీవ్రమైన శిక్షకు కారణమైంది. దానికితోడు స్థానిక భూస్వాములు సెషన్స్ జడ్జికి పెద్ద మొత్తంలో లంచం ఇచ్చి నక్సలైట్ల ఉద్యమానికి మొగ్గలోనే ఒక కఠినమైన గుణపాఠం చెప్పాలని ఈ శిక్ష వేయించారని కూడా ఆ రోజుల్లో చెప్పుకున్నారు.

సెషన్స్ కోర్టు విధించిన ఉరిశిక్షను హైకోర్టు ఖాయపరిచి, హైకోర్టులో రావి సుబ్బారావు, పత్తిపాటి వెంకటేశ్వర్లు చేపట్టిన తర్వాత కానీ ఈ కేసు గురించి నలుగురి దృష్టికి రాలేదు. ఈ ఇద్దరినీ సికిందరాబాద్ జైలుకు మార్చిన తర్వాత నవంబర్ 72లో అరెస్టయినపుడు కె.జి. సత్యమూర్తి (శివసాగర్)ని గంజ్ (సెల్స్)లో వీళ్ల పక్కనే ఉంచారు. ఆ పరిచయమే ఆయనతో తోటరాముని (విలుకాడా!) పాట రాయించింది. వెంపటాపు సత్యంను (ఆదిభట్ల కైలాసంతో పాటు) 1970 జూలై 10న ప్రభుత్వం ఎన్‌కౌంటర్ పేరుతో హత్య చేసిన వార్త విని ఎస్.ఎం. బాధపడుతుంటే ఒక రైతు 'అదేలెండి తుపాకి గుండు గుండెకు తగల్లేదు, తొడకు తగిలింది' అన్నాడు. కిష్టాగౌడ్ తొడలో ఆ తుపాకి గుండు గుర్తులు చూసి నాకు గానీ ఈ పాట రూపొందలేదట.

కిష్టాగౌడ్ గురించి శివసాగర్ ఇట్లా చెప్పాడు–

'72లో అరెస్టయినపుడు ముషీరాబాద్ జైల్లో ఉంచినపుడు అదృష్టవశాత్తు నేను అమరులు, రైతాంగ గెరిల్లా యోధులు కామ్రేడ్ కిష్టాగౌడ్, భూమయ్యలతో ఉండడం తటస్థించింది. కామ్రేడ్ కిష్టాగౌడ్ కవి, అతని జీవితం గురించి చెప్పినపుడు అతడు గొప్ప కథలు రాయగల వాడనిపించింది. నిజంగా టేప్‌రికార్డరే ఉండి అతను తన జీవితాన్ని అలా చెపు్త (narrate చేస్తూ..) ఉంటే దాన్నే రికార్డు చేసి ఉంటే, అదెంత గొప్ప కథా రచన అయి ఉండేదో! అతని సహాయంతోనే నేను 'తోటరాముడు' గేయం రాయగలిగాను. అతను ఆదిలాబాద్ జిల్లాలో ఉండే జంతువులు, ఆ అడవుల్లో ఉండే పిట్టలు 30, 40 వరకు చెప్పాడు. అలాగే అడవిలో ఉండే రకరకాల పూలు అనేకం చెప్పాడు. నాకు కావలసినటు వంటి ఈ కవిత్వం రాయడానికి అవసరమైన సరుకులు, పనిముట్లు, కవితా సామాగ్రి లభ్యమైంది.

గోగురిచ్చ వచ్చి గోము చేసిందంట

ఈ గోగురిచ్చ కిష్టాగౌడ్ చెప్పేవాడు. ఆదిలాబాద్ జిల్లాలో అది ఊరికే వచ్చి గోదావరిలో మునకలేస్తూ బ్రాహ్మలు సంధ్యవార్చినట్లు చేసేదట.

అలాగే 'పైడికంటె'ని నేను చూడలేదు. పాత సాహిత్యంలో కోకిలలు మాత్రమే ఉంటాయి. కిష్టాగౌడ్‌కు ఎందుకనో గానీ కోకిల గానం ఇష్టం ఉండేది కాదు. పైడికంటె స్వరం అతనికిష్టం. జైలు గోడమీదకి రోజూ రాత్రి తప్పనిసరిగా పైడికంటె వచ్చేది. నాకు తెలీదా విషయం. అది కూసినపుడల్లా నేనొక గది (సెల్)లో అతనొక గది (సెల్)లో ఉంటే 'ఏమయ్యో సత్యమూర్తీ, నా పైడికంటె ఎలా ఉండేదని అడిగేవాడివి విను, ఒకసారి చూడు. ఎంతందంగా కూస్తున్నదో' అని అది కూసినట్లే తనూ కూసి, దాన్ని కవ్వించి, అది కూయా, ఈయన కూడా... ఇలా అరగంటసేపు అందర్నీ నవ్విస్తుండేవాడు.' (ఫిబ్రవరి, )

సికిందరాబాద్ కుట్ర కేసులో 1974 మే 20న విప్లవ రచయితలను ఐదుగురిని (కెవిఆర్ జూలై 1న అరెస్టయ్యాడు) సికిందరాబాద్ జైలుకు తెచ్చారు. ఈ గంజ్ పక్కనే మొదట ఒక నెల రోజులుంచారు గానీ మాకు వీళ్లను చూసే అవకాశం రాలేదు. ఆ రోజుల్లో జైలు సూపరింటెండెంట్ కురుదూర్కర్ అనే మహారాష్ట్రుడు ఉండేవాడు. ఆయన మరాఠీ నాటకాల్లో నటించేవాడు. అట్లా ఖాన్‌సాబ్‌తో పరిచయం, స్నేహం ఉండేది. ముఖ్యంగా టెండూల్కర్ నాటకాలు ప్రదర్శించేవాడు. తర్వాత కాలంలో ఒకసారి హైదరాబాద్ వచ్చినపుడు టెండూల్కర్‌ను మాదగ్గరికి జైలుకు తీసుకవచ్చి కలిపాడు కూడా. కనుక మమ్మల్ని జైల్లో వేరే చోటికి మార్చాక ఒకరోజు 1974 జూన్ 30న కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్‌లను కలవడానికి అనుమతించారు.

లాకప్ అయ్యేదాకా ఇద్దరూ మాకు ఎన్నో విషయాలు చెప్పారు. కిష్టాగౌడ్ చాలా చలాకీగా మాట్లాడేవాడు. మిలమిల మెరిసే కాటుక కళ్లు – నల్లగా నూనె దట్టంగా పట్టించిన నిగనిగలాడే ఉంగరాల జుట్టు. కళ్లలోంచి పెదవుల మీదికి ఎల్లవేళలా పరచుకునే చిరునవ్వు. బలాదూర్ తత్వం. కుటుంబంతోనూ భార్యతోనూ సంబంధం తెగిపోయింది. తెలంగాణ సాయుధ పోరాటంలో తొడకు తగిలిన బుల్లెట్ గాయం, లోన బుల్లెట్లు మిగిలిన చోటు చూపి అప్పటి కథలు చెప్పాడు. భూమయ్య పెద్ద వయస్సులా అనిపించేవాడు. బట్టతల. భార్య, పిల్లలు ఉన్నారు. ఊళ్లో జంగమ వృత్తికి ఇచ్చిన ఇనాం భూమి ఉంది. కాని దొర ఆక్రమించు కున్నాడు. అది విడిపించి తన భార్యా పిల్లలకు చెందేలా చేయాలన్నదే ఆయన ఆఖరి కోరిక. మితభాషి. ఒక్కసారయినా ఆయన భార్యా పిల్లలను తీసుకువచ్చి చూపాలని, ఆ భూమి వీళ్ల కుటుంబానికి తిరిగి వచ్చేలా చేయాలని భాగ్యనగర్ విజయకుమార్ చాలా ప్రయత్నాలు చేశాడు గానీ ఫలించలేదు.

జైల్లో వీళ్లిద్దరినీ చూసిన రోజే 'విప్లవ వేణువులు' అని వీళ్లపై కవిత రాసుకున్నాను. వీళ్లు నాకు అసామాన్యులైన సామాన్యులనిపించింది. మేమింకా ఈ జైల్లో ఉండగానే 1974 నవంబర్‌లో ఒకరోజు మర్నాడు వీరిద్దరినీ ఉరితీస్తారన్న వార్త జైలంతా గుప్పుమన్నది. సరిగ్గా ఇరవై నాలుగు గంటల ముందు జైలు అధికారులు వేకువనే వెళ్లి ఈ నిర్ణయం చెప్పి – వాళ్ల ఆరోగ్యాన్ని పరీక్షించి, ఆఖరి కోర్కె అడగాల్సి ఉంటుంది. ఉరిశిక్షకు సంబంధించిన ఏర్పాట్లు చేయాల్సి ఉంటుంది. అట్లా ఆ వార్త అంతటా వ్యాపిస్తుంది. (భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌ల విషయంలో కూడా లాహోర్ జైలు నుంచి ఈ నిర్ణయం బయటికి కూడా తెలిసే మర్నాడు ఉదయానికి జైలు ఆవరణలో వేలాది మంది గుమిగూడడం, ఇది ముందే ఊహించిన బ్రిటిషిండియా ప్రభుత్వం చట్టానికి, తమ నిర్ణయానికి విరుద్ధంగా ముందు రోజు సాయంత్రమే ఉరితీసి శవాలను సట్లెజ్ నదిలో వదిలేసిన ఉదంతం ఇప్పుడు చరిత్రలో భాగమే).

మాకు తెలిసిన వెంటనే మేం వీళ్ల న్యాయవాది మాత్రమే కాకుండా, ఎపిసిఎల్‌సి కార్యదర్శి కూడా అయిన పత్తిపాటి వెంకటేశ్వర్లు గారికి సమాచారం చేరవేసి మొదటిసారి పత్తిపాటి వీళ్ల ఉరిశిక్షలు ఆపడానికి చేసిన ప్రయత్నాలు ఏ పౌరహక్కుల కార్యకర్తకయినా ఆదర్శ ప్రాయమైనవి. ఆ రోజుల్లో మొబైల్ ఫోన్‌లు లేవు. ట్రంక్ కాల్ వసతి మాత్రమే ఉంది. అయినా నేరుగా రాష్ట్రపతి భవన్‌కు ఫోన్ చేసి విజ్ఞప్తి చేశాడు. కేంద్ర కమిటీ సమావేశంలో పాట్నాలో ఉన్న సిపిఐ కార్యదర్శి చండ్ర రాజేశ్వరరావుకు ఫోన్ చేశాడు. ఆయన అపుడు రాజ్యసభ సభ్యుడుగా ఉన్న భూపేశ్‌గుప్తాను రాష్ట్రపతి దగ్గరికి పంపించాడు. ఇవన్నీ చేసి మా దగ్గరికి వచ్చి, గంజ్‌కు వెళ్లి వాళ్లని కలిశాడు. నిజానికి ఆరోజు ఆర్టిస్ట్ చంద్రను పిలిపించి వాళ్ల స్కెచ్‌లు వేయించాలని కూడా ప్రయత్నించాం గాని వీలుకాలేదు. ఫొటోగ్రాఫర్‌ను పిలిపించేంత సాహసం సూపరింటెండెంట్ చేయలేక పోయాడు. ఎందుకంటే జైలర్ పూర్తి విరుద్ధమైన స్వభావం గల భూస్వామ్య వర్గం నుంచి వచ్చినవాడు. ఎజి గార్డినర్ మాటల్లో చెప్పాలంటే రిసెంట్‌ఫుల్ ఎంప్లాయీ – తిరస్కారోద్యోగి.

ఇంక ఆ రోజంతా ఉత్కంఠభరితంగా గడిచింది. చెరబండరాజు నాయకత్వంలో మేముండే 3వ నెంబర్ బ్యారక్‌లో విశాలమైన ఆవరణలో లాకప్ కన్నా ముందు పాటలు పాడుతూ, నినాదాలు చేస్తూ ఊరేగింపు తీశాం. లాకప్ తర్వాత మాటలు, పాటలతో మా ఉద్విగ్నతను తగ్గించుకునే ప్రయత్నం చేశాం. ఖైదీలందరి స్థితి అదే. అర్ధరాత్రి మా లాకప్ దగ్గరికి సివిల్ డ్రెస్‌లో సూపరింటెండెంట్ వచ్చాడు. మేమందరం కటకటాల దగ్గరికి పరిగెత్తాం – 'ఖాన్‌సాబ్! ఉరిశిక్ష వాయిదా పడింది. బయట ఉంటే సెలబ్రేట్ చేసుకునేవాళ్లం' అని ఆ కటకటాల నుంచే ఇద్దరూ చేతులు చాపి ఆలింగనం చేసుకున్నారు. ఆ మర్నాడు ఉదయం మేం జైలర్‌ను కలిసినపుడు – ఉరితీసే శిరస్త్రాణం, తాడు, తలారి, కొత్త బట్టలు – కొలతలు, కుట్లు వగైరా తాను చేసిన హోమ్‌వర్క్ పనులు అన్నీ వృథా అయ్యాయని చాలా చిరాకు పడిపోయాడు జైలర్.

అట్లా 1974 నవంబర్‌లో వాళ్ల ఉరిశిక్ష ఆగిపోయింది. బయట వాళ్ల ఉరిశిక్ష రద్దు కొరకు సభలు, ఉద్యమాలు మొదలైనవి. సుప్రీంకోర్టులో గార్గ్, డానియల్ లతీఫ్ ఉరిశిక్ష రద్దు కొరకు పిటిషన్ వేశారు. పత్తిపాటి, శ్రీశ్రీ హైదరాబాద్‌కు వచ్చినపుడు జైలుకు తీసుకువచ్చి వాళ్లను చూపెట్టాడు. తెలంగాణలో ఎన్నో చోట్ల భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షల రద్దు కొరకు సభలు జరిగాయి. శ్రీశ్రీ స్వయంగా హుజూరాబాద్, మంచిర్యాల, బెల్లంపల్లి సభల్లో పాల్గొన్నాడు. హుజూరాబాద్‌లో సభ కరపత్రం వెనుకనే ఆ వేదిక మీద శ్రీశ్రీ రాసిన చిన్న విజ్ఞప్తి తర్వాత కాలంలో చాలా ప్రసిద్ధమైంది. శ్రీశ్రీ వాళ్లిద్దరినీ భూమ్యాకాశాలతో పోలుస్తూ వాళ్లు రోజన్‌బర్గ్ దంపతులవలె మేధావులు కారు. సాక్కో వాంజెట్టీల వలె అమాయకులు కారు. రైతాంగ విప్లవ కారులు, వాళ్లను ఉరితీసి ఇందిరాగాంధీ జార్ చక్రవర్తి కన్నా, నిజాం నవాబు కన్నా నియంత అని అనిపించుకోకూడదన్నాడు. ఒక హత్యారోపణలో దాస్టవ్‌స్కీకి మరణ శిక్ష పడితే ఆయనను కాల్చివేసే ముందు జార్‌చక్రవర్తికి అతడు రచయిత అని తెలిసి చంపొద్దని ఉత్తర్వులు పంపాడట.

తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కాలంలో ఉరిశిక్ష పడిన 11 మంది కమ్యూనిస్టు విప్లవ కారుల తరపున ఇంగ్లండు నుంచి ప్రిట్ అనే న్యాయవాది, సుప్రీంకోర్టు నుంచి డానియల్ లతీఫ్ వచ్చి వాదించడమే కాకుండా, పాప భయంతో ఉస్మానలీఖాన్ సంతకం పెట్టకపోవడం వల్ల కూడా 1948 సెప్టెంబర్ 17 సైనిక దాడి దాక వాళ్లను ఉరితీయలేదు. పార్టీపై నిషేధం ఎత్తివేసిన తర్వాత వాళ్లు విడుదలయ్యారు. (నల్ల నర్సింహులు ఒక్కడు జైలు నుంచి ముందే తప్పించుకుని షోలాపూర్ వెళ్లిపోయాడు) శ్రీశ్రీ తెచ్చిన జార్ చక్రవర్తి, నిజాం పోలికలు అందుకు అయితే 1975లోనే స్పెయిన్‌లో ఉరిశిక్ష పడిన ఐదుగురు యువకుల ఉరిశిక్ష రద్దు చేయవలసిందిగా నియంత ఫ్రాంకోకు విజ్ఞప్తి చేసిన ప్రధాని

ఇందిర తను మాత్రం అదే డిసెంబర్ 1న ఎమర్జెన్సీ చీకటి రోజుల ఆసరాతో ఈ రైతాంగ గెరిల్లాలనిద్దరినీ ఉరి తీసింది. కాని ఈ మధ్య కాలంలోనే మరణ శిక్షాస్మృతి న్యాయచరిత్రకు భూమయ్య, కిష్టాగౌడ్‌లు ఎన్నో వినూత్నమైన చేర్పులు చేశారు.

సుప్రీంకోర్టు కూడ భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షను ధృవపరచింది. జస్టిస్ కృష్ణయ్యర్ సుప్రసిద్ధ న్యాయవాది గార్గ్ వాదనలువిని, కన్నబిరాన్ లిఖితపూర్వక వాదనలు విని కూడ రాష్ట్రపతి మానవతా దృక్పథంతో క్షమాభిక్ష పెట్టవలసిందే తప్ప అత్యున్నత న్యాయస్థానం ముందున్న సాక్ష్యాధారాలు, సెషన్స్ కోర్టు, హైకోర్టు విచారణలు, తీర్పులు, తాము విన్న వాదనల నేపథ్యంలో శిక్ష ధృవపరచడం తప్ప చేయగలిగిందేమీ లేదన్నాడు.

రాష్ట్రపతి కూడ క్షమాభిక్షను తిరస్కరించిన నేపథ్యంలో తిరిగి 1975 మే 11న భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముహూర్తం నిర్ణయించింది. అప్పటికే మేమంతా బెయిలుపై విడుద లయ్యాం. కండిషనల్ బెయిలుపై నేను హైదరాబాద్‌లోనే 'పిలుపు' సంపాదకుడు ఎం. రంగనాథం గారి ఇంట్లో సీతారాంబాగ్‌లో ఉన్నాను. మే 10 సాయంత్రం జైలు ముందు నుంచి సైకిలుపై పోతున్న పిడిఎస్‌యు విద్యార్థి నాయకుడు మధుసూదన్‌రాజ్‌ను (ఆ తర్వాత కాలంలో సిపిఐ ఎంఎల్ ప్రతిఘటన రాష్ట్ర కార్యదర్శిగా ఎదిగి, 1995 జూలై 27న నగరంలోని అశోక్‌నగర్‌లోనే బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడు) పిలిచి జైలు గేటు ముందు ఉండే గార్డు 'రేపు భూమయ్య, కిష్టాగౌడ్‌లను ఉరితీయబోతున్నారు' అని చెప్పాడు. ఆయన అట్లాగే ఇసామియా బజార్‌లో ఉండే పత్తిపాటి ఇంటికి పోతే ఆయన లేడు. వేసవి సెలవులకు స్వస్థలం టంగుటూరు వెళ్లాడు. అటు నుంచి ఈస్ట్ మారేడుపల్లిలో ఉండే కె.జి. కన్నబిరాన్ ఇంటికి వెళ్లాడు. ఆయన తన జూనియర్ కె. నర్సింహచారితో రిట్ పిటిషన్ తయారు చేయించి, ఆయనతో కలిసి సి. వెంకటకృష్ణ, వెంకటరెడ్డి – అనే ముగ్గురు యువ న్యాయవాదులను వెకేషన్ బెంచిగా ఉన్న జస్టిస్ చిన్నపరెడ్డి, జస్టిస్ గంగాధరరావుల ఇంటికి పంపించాడు. ఈ వార్త నగరమంతా దావానలం వలె వ్యాపించింది. అందరం ముషీరాబాద్ జైలు ముందు గుమిగూడాం. ఎక్కువగా ఆర్ఎస్‌యు, పిడిఎస్‌యు విద్యార్థులు, ఎపిసిఎల్‌సి సభ్యులు, రచయితలు, న్యాయవాదులు, బుద్ధిజీవులు, కొందరం అప్పటికింకా న్యాయవాదిగా ఉన్న బిపి జీవన్ రెడ్డిగారి దగ్గరికి వెళ్లాం – చీకటి రాత్రి. ఆయన ఎవరిని తెలుసుకున్నాడో తెలియదు – వెకేషన్ బెంచి స్టే ఇచ్చిందని పరుగెత్తుకొచ్చి చెప్పాడు. చీకట్లో రాళ్లు తట్టుకొని పడిపోయాడు. అంత ఉద్వేగభరితమైన రాత్రి. అయితే అధికారికంగా ఉత్తర్వులు జైలుకు రావాలి. మళ్లీ ఒకసారి 1971 మే 10 అర్ధరాత్రి భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు ఆగిపోయినవి.

1975 మే 11న 'భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షల రద్దు కమిటీ' అనే ఒకే ఒక్క డిమాండ్‌తో ఒక విశాల ఐక్య వేదిక ఏర్పడింది. అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీకి చెందిన ఎస్. జైపాల్‌రెడ్డి కూడ సుల్తాన్ బజార్ క్లాక్‌టవర్ దగ్గర జరిగిన సభలో పాల్గొని ఉరిశిక్ష రద్దు చేయాలని డిమాండ్ చేశాడు. (బ్రహ్మానందరెడ్డి కేంద్రంలో హోంమంత్రిగా ఉన్నప్పుడు భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు గురించి ప్రయత్నం చేయడమే కాకుండా తర్వాత కాలంలో బీహార్‌లో ఐదుగురు ఎంసిసి రైతాంగ గెరిల్లాల ఉరిశిక్ష రద్దు కోసం కూడ అప్పటి హోంమంత్రి శివరాజ్ పాటిల్‌కు ఆయన విజ్ఞప్తి చేశాడు. సూత్రబద్ధంగానే ఆయన మరణశిక్షలకు వ్యతిరేకం).

ఇక దేశవ్యాప్తంగా జయప్రకాశ్ నారాయణ్, వాజపేయి మొదలు జార్జ్ ఫెర్నాండెస్ వరకు భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు కొరకు విజ్ఞప్తులు మొదలు ఉద్యమంలో భాగమయ్యారు. ప్యారిస్‌లో సుప్రసిద్ధ మార్క్సిస్ట్ మేధావి తారిఖ్ అలీ నాయకత్వంలో భారత రాయబార కార్యాలయం ముందు ప్రదర్శన జరిగింది. జీన్‌పాల్ సార్త్ర్, సైమన్‌డిబావ్రా మొదలు నోమ్ చామ్‌స్కీ వరకు ప్రపంచ వ్యాప్తంగా మూడు వందల మంది రచయితలు, మేధావులు భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు రద్దు చేయాలని డిమాండ్ చేశారు. లారెన్స్ లిఫ్‌ఘుల్జ్ అనే ఫ్రెంచి రచయిత 'ఫర్ హూమ్ బెల్ టాల్స్' అని ఒక వ్యాసం రాశాడు. పార్లమెంట్ సమావేశం మొదలయ్యే రోజు ఢిల్లీ బోట్ క్లబ్ దగ్గర కాగడాల ప్రదర్శన చేయాలని నిర్ణయించి ఆ బాధ్యత జార్జ్ ఫెర్నాండెస్‌కు అప్పగించారు. ఆ ప్రదర్శనలో జయప్రకాశ్ నారాయణ్, వాజ్‌పేయి కూడ పాల్గొంటారని నిర్ణయమైంది.

ఈలోగా ఆంధ్రప్రదేశ్‌లో విస్తృతంగా సభలు, సమావేశాలు, ఊరేగింపులు జరిగాయి. వరుసగా మంచిర్యాల, బెల్లంపెల్లిలో జరిగిన సభల్లో శ్రీశ్రీ, పత్తిపాటి పాల్గొన్నారు. అప్పటికే సికిందరాబాద్ కుట్ర కేసు సందర్భంగా శ్రీశ్రీ అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావుపై ఒక పాట రాసి ఉన్నాడు. (దూది పులి మీద పుట్ర) సుప్రసిద్ధమైన 'బానిసకొక బానిసకొక బానిసవోయ్ బానిసా! మానిసి జన్మానికిసీ మచ్చవు నరపీనుగా!' అందులోని చరణాలే. బెల్లంపల్లిలో భోరున వర్షం పడుతుంటే పదివేల మంది జనం ఇళ్ల చూర్లకింద, చెట్లకింద చేరి వింటూ ఉంటే శ్రీశ్రీ ఒక దూదిపులి బొమ్మను ఆ వానలో తడిపి – ఈ ప్రభుత్వాలు ఇట్లా దూది పులి వలె కరిగిపోయేవంటూ 'నక్సలైటు పోల్చినాడురా – నీ నెత్తిన నాటుబాంబు పేల్చుతాడురా!' అని పాడి వినిపించాడు.

శ్రీశ్రీ పాట విన్నారు గదా అని ప్రారంభించి పత్తిపాటి మాట్లాడి భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు చేయాలని డిమాండ్ చేసాడు. మర్నాడు ముఖ్యమంత్రి జలగం వెంగళరావుకు అదే విజ్ఞప్తితో కలిసాడు. అప్పటికే ఈ సభల రిపోర్ట్ తన ముందున్న వెంగళరావు 'ఇంకేం మీ అధ్యక్షుడు నాకు అల్టిమేటమ్ ఇచ్చాడు కదా' అని చెప్పి కేంద్ర ప్రభుత్వానికి భూమయ్య, కిష్టాగౌడ్‌లు రైతాంగ గెరిల్లాలు కానీ, నక్సలైట్లు కానీ కాదనీ – కనుక వాళ్లను రాజకీయ ఖైదీలుగా భావించనక్కర్లేదని, కేవలం హంతకులని రిపోర్ట్ పంపాడు.

ఇంక దేశంలో వేగవంతంగా జరిగిన పరిణామాల గురించి చెప్పనక్కర్లేదు. బీహార్‌లో బిజెపి నాయకత్వంలో అవినీతి వ్యతిరేక ఉద్యమం, గుజరాత్‌లో నవ నిర్మాణ సమితి అవినీతి వ్యతిరేక ఉద్యమం – అన్నిటినీ మించి చరిత్రాత్మకమైన మిలిటెంట్ రైల్వే సమ్మె – వెన్ను మీద ఆఖరి ఈక వలె ఇందిరాగాంధీ లోక్‌సభ ఎన్నిక చెల్లదని అలహాబాద్ కోర్టు ఇచ్చిన తీర్పు – జూన్ 25 అర్ధరాత్రి ఎమర్జెన్సీ ప్రకటింపబడి – దేశంలో భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు కోరిన యాక్టివిస్టులందరూ ఇంచు మించుగా జైలుపాలు కావడం, అజ్ఞాతంలోకి వెళ్లడమో జరిగింది.

ఆంధ్రప్రదేశ్‌లోనే జూన్ 25 అర్ధరాత్రి అరెస్టయిన మొట్టమొదటి వ్యక్తి పత్తిపాటి వెంకటేశ్వర్లు. అయినా ఊరుకోకుండా సుల్తాన్ బజార్

పోలీస్ స్టేషన్ నుంచి జోట్స్‌క్లబ్ కాగడాల ప్రదర్శన గురించి జార్జి ఫెర్నాండెస్‌కు ఫోన్ చేయడానికి ప్రయత్నించాడు. చంచల్‌గూడ జైలు నుంచి ఫెర్నాండెస్‌కు, సంబంధితులకు ఉత్తరాలు రాయడానికి ప్రయత్నించాడు. జూలై 4న సిపిఐ ఎంఎల్ పార్టీలన్నిటినీ నిషేధిస్తూ భారత ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేయడమే కాకుండా, ఎమర్జెన్సీ డిటెన్యూలకు జీవించే హక్కు తప్ప అన్ని ప్రాథమిక హక్కులు రద్దయ్యాయని కనుక ఎటువంటి ఫోన్లు, టెలిగ్రామ్‌లు, ఉత్తర ప్రత్యుత్తరాలు అనుమతించ వద్దని, అసలు వాళ్లకు కోర్టుకు వెళ్లే హక్కు కూడ లేదని తేల్చివేసింది. ఈ కాలమంతా జూన్ 25 అర్ధరాత్రే జార్జి ఫెర్నాండెస్ అజ్ఞాతంలోకి వెళ్లాడని ఆరోజు పత్తిపాటికి గానీ, మాకు గానీ తెలియదు.

ఇంక బయట భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు గురించి ప్రయత్నించే ఎవరైనా ఉన్నారా అంటే అది సిపిఐ. ముఖ్యంగా రాజ్యసభ సభ్యుడు భూపేశ్ గుప్తా. గంజ్‌లో భూమయ్య, కిష్టాగౌడ్‌లు. జైలు నిండా, జైళ్ల నిండా రాజకీయ డిటెన్యూలు వేల సంఖ్యలో. అట్లా ఐదు నెలలు గడచినవి. డిసెంబర్ 1 ఉదయం ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో లోపలి పేజీల్లో ఎక్కడో చిన్న వార్త – భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరితీతను ఆపించవల సిందిగా ఎంపి భూపేశ్ గుప్తా రాష్ట్రపతిని కలిసాడు అని.

మీడియా మీద అసాధారణమైన సెన్సార్‌షిప్ అమలవుతున్న ఎమర్జెన్సీ కాలం. ముఖ్యంగా ఇండియన్ ఎక్స్‌ప్రెస్, స్టేట్‌మెంట్‌లు సంపాదకీయాలు రాయకుండా బ్లాంక్‌గా నిరసన తెలుపుతున్న కాలం – ఎంపి రాష్ట్రపతిని కలిసాడు గనుక ప్రోటోకాల్ వల్ల అది వార్త అయింది – ఒక్క ఎక్స్‌ప్రెస్‌లోనే ఎట్లో సెన్సార్ కన్నుగప్పి ప్రవేశించినట్లున్నది.

మేం కొందరం వరంగల్ జైల్లో ఈ వార్త చదివాం. అంటే అప్పటికే ఏదో ఒకటి జరిగి ఉండాలి. ఉరితీయడమో – ఆగిపోవడమో – ఎట్లా తెలుసుకోవాలి? ఇంక జైల్లో ఎంత భావోద్విగ్నత ఉంటుందో ఊహించ వలసిందే. ఆరోజు ఎన్నడూ యూనిఫామ్‌లో రాని సూపరింటెండెంట్ జెఠానీ (ఆయనకు చర్మ వ్యాధి – గనుక యూనిఫామ్ వేసేవాడు కాదు) మొత్తం అధికారులతో, ఎక్కువ సిబ్బందితో మందీ మార్బలంతో వచ్చాడు. ఎం. ఓంకార్ ఎంఎల్ఎ కూడ గనుక చొరవ తీసుకొని ఈ వార్త చూపుతూ ఆయనను ఏమైందని అడిగాడు. 'తెలియద'ని ఏ భావమూ వ్యక్తం కాకుండా వెళ్లిపోయాడు. కావాలని ఆఖర్న మిగిలిన డిప్యూటీ జైలర్ శౌరయ్య కళ్లనిండా నీళ్లు, కళ్లు ఎర్రగా చింతనిప్పులవలె (ఇతడే మాకు ఇటువంటి వార్తలు అప్పుడప్పుడు చేరవేస్తూ సహాయం చేస్తుండేవాడు) అవునన్నట్లు తల ఊపుతూ వెళ్లిపోయాడు. అయినా మాకింకా ఆశ చావలేదు. పరిపరి విధాల ఆశనిరాశలతో రాత్రి లాకప్ అయి జైలంతా నీరవ నిశ్శబ్దంలో ఉండి, ఎవరి లాకప్‌లలో వాళ్లం ఆలోచనల్లో ఉన్నప్పుడు – గాలిలో తేలుతూ – నినాదాలు – అవి హైదరాబాద్ కోర్టుకు వెళ్లి తిరిగి వచ్చి జైలులో ప్రవేశిస్తున్న బర్ల యాదగిరి రాజు గొంతు – భూమయ్య, కిష్టాగౌడ్ అమర్ రహే – భూమయ్య, కిష్టాగౌడ్‌లకు జోహార్లు. అయిపోయింది.

బర్ల యాదగిరి రాజు వరంగల్ జిల్లా విప్లవోద్యమ నాయకుడు. మహబూబాబాద్‌కు చెందిన బడుగు వర్గాల యువకుడు. మానుకోట ప్రాంతంలోనే కాదు వరంగల్ జిల్లాలోనే కరుడుగట్టిన భూస్వామ్య శక్తులనెదిరించి పోరాడిన వాడు. ఎన్నో కేసుల్లో, సికిందరాబాద్ కుట్ర కేసులో కూడ ముద్దాయిగా – అప్పటికే కందిలచ్చి రెడ్డి హత్య కేసులో ఉరిశిక్ష పడి ఉన్నవాడు. (తర్వాత కాలంలో ఎమర్జెన్సీలోనే హైకోర్టులో సి. పద్మనాభరెడ్డి ఈ కేసు వాదించారు. హైకోర్టు కేసు కొట్టివేసింది.)

1975 డిసెంబర్ 3న శ్రీశ్రీ 'భూమ్యాకాశాలు' అని కవిత రాసుకున్నాడు.

'వాళ్లిద్దరినీ ఉరితీశారని అరవ పత్రికలో చదివినప్పుడు / వాళ్లిద్దరినీ ఉరితీశారని డైరీలో నోట్ చేసుకున్నాను / సమాజానికి కాలం పెట్టిన అప్పును / ప్రాణాలతో వాళ్లు తీర్చుకున్నారు...

వాళ్లిద్దరిలో ఒకడు భూమి / రెండోవాడు ఆకాశం

మరణం లేని మహదాశయమే మనకు వాళ్లిచ్చిన నిధి'

అదే డిసెంబర్‌లో శివసాగర్ 'ఉరికంబం వణికింది' అని కవిత రాసుకున్నాడు – 'ఉరితీయబడ్డ శిరస్సు సగర్వంగా చదివిన మానవుని ప్రోగ్రెస్ రిపోర్ట్ విని... ఉరితీయబడ్డ శిరస్సు పెదాలపై చెదరని చిరునవ్వును చూసి – ఈ రాత్రి ఉరికంబం గజగజా వణికింది.'

వీళ్లకు ఉరిశిక్ష పడిన నేపథ్యంలోనే తాను మే 1972లో ఉరిపాట (ఉరికంబం మీద నిలిచి ఊహాగానం చేసెద – ఉజ్వల గీతిక పాడెద – నా ఊహల ఉయ్యాలలోన మరో జగతి వూసులాడు) రాసానని శివసాగర్ తర్వాత కాలంలో రాసాడు.

'బ్లిట్జ్'లో రెగ్యులర్‌గా ఆఖరిపేజీ రాసే కె.ఎ. అబ్బాస్ 'ఆ కళ్లు మనల్ని చూస్తూ ఉంటాయి' అని – ఆ కళ్లను ఆ ఇద్దరూ దానం చేసారని తెలిసి రాసాడు.

భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దు ఉద్యమంలో భాగంగా మృణాల్‌సేన్ ఒడియా కథ 'షికారీ' ఆధారంగా 'మృగయా' అనే సినిమా తీసాడు. అందులో ఒక ఆదివాసీ యువకుణ్ని బ్రిటిష్ అధికారిని చంపినందుకు తీసిన ఉదంతం ఉంటుంది. భూమయ్య, కిష్టాగౌడ్‌లను ఉరితీసిన తర్వాత సినిమా హాళ్లలో ఇది ప్రదర్శించబడినప్పుడు ప్రేక్షకులకిది వీళ్ల కథ లాగే అనిపించి 'స్టాండప్' అని ముగిస్తే అంతే క్రమశిక్షణతో నిలబడి మనసులో జోహార్లు చెప్పుకున్నారు.

శిక్ష విధించిన దగ్గర్నించీ ఫాసీఘాట్ వైపే చూస్తూ ఆశ నిరాశల మధ్యన నిత్యం మరణిస్తూ బతుకుతున్న మానవులను చట్టబద్ధంగా హత్య చేసిన వ్యవస్థ ఎంత అనాగరికమైంది? రెండుసార్లు ఉరికంబం దాకా వెళ్లి తిరిగి వచ్చి మృత్యు వేదననంతా అనుభవించిన ఇద్దరు మానవులను మూడవసారి ఎమర్జెన్సీ చీకటి పాలన సాకుగా ఉరితీసిన వ్యవస్థ ఇంకెంత అనాగరికమైంది? కసబ్ ప్రేరేపిత కసాయి కావచ్చు. కానీ ఇది చట్టబద్ధమైన హంతక వ్యవస్థ.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం సభ్యులు)* వీ

మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.

# భోపాల్‌లో తగ్గని విషప్రభావం

***భోపాల్ దుర్ఘటన జరిగి ముప్పైఒక్క సంవత్సరాలు గడిచినా బాధితులు కలుషిత నీరు, కలుషిత వాతవరణంలోనే నివసిస్తూ తీవ్ర అనారోగ్యాలకు గురవుతున్నారనీ, వారికి న్యాయం జరిగే వరకు సమాజం అండగా నిలువాలనీ అంటున్నారు*** **పి.వి. రమణ**

భోపాల్ దుర్ఘటన జరిగి 2015 డిసెంబర్ 2కి 31 సంవత్సరాలు పూర్తవుతుంది. అత్యంత విషపూరితం, ప్రమాదకరమైన మిక్ వాయువు విడుదల కారణంగా ప్రమాదం జరిగిన నాటి నుండి 3 రోజులలోనే దాదాపు 20-30 వేల మంది మృత్యువాత పడ్డారు. 5-8 లక్షల వరకూ రోగాల పాలయ్యారు. నాటి నుండి నేటి వరకు లక్షలాది మంది అత్యంత బాధాకరమైన రోగాలకు గురౌతునే ఉన్నారు. ఇది చాలదన్నట్లు భోపాల్ గ్యాస్ దుర్ఘటన తర్వాత యూనియన్ కార్బైడ్ ఫ్యాక్టరీలోని విషపూరిత అవశేషాలను తొలగించడంలో పాలకుల నేరపూరిత నిర్లక్ష్యం కారణంగా భోపాల్ ప్రజలు మరింత ప్రమాదంలోకి నెట్టబడ్డారు. 32 ఎకరాల ప్రాంతంలో, భూగర్భంలో 4-8 మీటర్ల లోతు వరకూ మట్టి ప్రమాదకరమైన స్థాయిలో కలుషితమైపోయింది. 2010 జూన్‌లో నేషనల్ ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (ఎన్.ఇ.ఇ.ఆర్.ఐ) నేషనల్ జియోగ్రాఫికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (ఎన్.జి.ఆర్.ఐ) లు సంయుక్తంగా జరిపిన అధ్యయనం ప్రకారం ఆ ప్రాంత భూగర్భ జలాలన్నీ విషపూరిత హెక్సాక్లోరోసైక్లో హెక్సాన్, మెర్క్యురీ లాంటి ప్రమాదకరమైన రసాయనాలతో నిండిపోయిందని ప్రకటించారు. మొత్తం ఈ ప్రాంతంలో 11 లక్షల టన్నుల మట్టి కలుషితమైందని, దీన్ని ఐక్యరాజ్య సమితి పర్యావరణ కార్యక్రమాల సంస్థ (యు.ఎన్.ఇ.పి) తో పరీక్షలు చేయించాలని కేంద్ర ప్రభుత్వాన్ని పర్యావరణ పరిరక్షణ శాస్త్రవేత్తలు ఎప్పటినుండో డిమాండ్ చేస్తున్నారు.

గ్రీన్‌పీస్ సంస్థ అధ్యయనం ప్రకారం ఆ ప్రాంతమంతా కాన్సర్ రోగానికి గురిచేసే ప్రమాదకరమైన రసాయన వ్యర్థాలతోనూ, సీసం తోనూ కలుషితమైందని, ఇది 20 వేల నుండి 60 లక్షల రెట్లు ప్రమాదకరమైన అధిక స్థాయిలో ఈ కాలుష్యం ఉందని కూడా తేలింది. ప్రజలు ఉపయోగిస్తున్న ఒక పంపులో నీటిని పరీక్షించగా, ప్రపంచ ఆరోగ్య సంస్థ నిబంధనల ప్రకారం కాన్సర్ రోగానికి కారణమయ్యే కార్బన్ టెట్రా క్లోరైడ్ ఉండవలసిన స్థాయి కంటే వెయ్యి రెట్లు అత్యధిక స్థాయిలో ఉన్నట్లు ఒక అధ్యయనంలో తేలింది.

2013లో సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్‌మెంట్ (సి.ఎస్.ఇ) జరిపిన అధ్యయనంలో భాగంగా, గత 30 సంవత్సరాలుగా జరిపిన 15 అధ్యయనాలను సమీక్షించి, మొత్తం ఫ్యాక్టరీ ప్రాంతంలో ఉన్న గోతులన్నీ ప్రమాదకరమైన కాలుష్యంతో నిండి ఉన్నాయని తెలిపింది. దీని వలన చుట్టు ప్రక్కల ప్రాంతాలలో కూడా తాగు నీరు కాలుష్యంతో నిండి పోయి ఉన్నా కూడా, ప్రజలకు వేరే దారి లేక ఆ కలుషిత నీరునే వాడవలసి వస్తుందని కూడా వివరించారు.

"జాతీయ సరాసరి కన్నా భోపాల్‌లో పది రెట్లు ఎక్కువగా పిలలు అంగవైకల్యాతో పుడుతున్నారు. పుడుతున్న ప్రతి 25 మంది పిల్లల్లో కడుపులో ఉండగానే చిన్న తల, బాతు కాళ్లు, అతి తక్కువ బరువు లాంటి అనేక వైకల్యాతో పెరుగుతున్నారు. కడుపులో ఉండగానే చనిపోతున్న పిల్లల సంఖ్య 300 శాతం, పుట్టిన తరువాత కొద్ది రోజులకే చనిపోతున్న వారి సంఖ్య 200 శాతం పెరిగిపోయింది. కాన్సర్, టిబి, థైరాయిడ్ లాంటి రోగాలతో క్లినిక్‌కి వస్తున్న వారి సంఖ్య పెరిగిపోతుంది. యుక్త వయసు వచ్చిన అమ్మాయిలు రజస్వల కావడం ఆలస్యం కావడమే కాకుండా, అత్యంత బాధాకరమైన గర్భ సంబంధిత వ్యాధులతో బాధపడుతున్నారు. అనేకసార్లు గర్భ సంచినే తీసివేయడం కూడా జరుగుతుంది" అని భోపాల్ బాధితుల కోసం పనిచేస్తున్న సంభావన క్లినిక్‌కు చెందిన వైద్యులు వివరించారు.

ఆమ్నెస్టి ఇంటర్నేషనల్ అంచనా ప్రకారం భోపాల్‌లో దాదాపు 1,20,000 మంది తీవ్ర ఆరోగ్య సమస్యతో బాధపడుతున్నారు. దుర్ఘటన జరిగిన తరువాత ఇండియన్ కౌన్సిల్ ఫర్ మెడికల్ రిసెర్చ్ సంస్థ భోపాల్ బాధితుల ఆరోగ్య సమస్యలపై పరిశోధన మొదలు పెట్టి కేవలం ఆరు నెలల తరువాత ఎటువంటి కారణం చెప్పకుండానే అకస్మాత్తుగా నిలుపు చేసింది. అక్కడ ప్రజల ఆరోగ్య పరిస్థితిపై శాస్త్రీయమైన పరిశోధనలు జరిగి, తద్వారా సరైన వైద్య సౌకర్యాలు కల్పించే బాధ్యత నుండి ప్రభుత్వం అత్యంత బాధ్యతారహితంగా తప్పుకోవడం తీవ్రమైన నేర పూరిత చర్యగా పరిగణించాలి.

2004లో భోపాల్ దుర్ఘటన బాధితుల తరపున పోరాడుతున్న అలోక్ ప్రతాప్ సింగ్ మధ్య ప్రదేశ్ హైకోర్టులో ఈ విషపూరిత ఫ్యాక్టరీ వ్యర్థాలను తొలగించాని కేసు వేశారు. 2005లో హైకోర్టు రాంకీ ఎన్విరో ఇంజనీర్స్ లిమిటెడ్ (ఆర్ఇఇఎల్) అనే సంస్థకు ప్లాంట్‌లో ఉన్న వ్యర్థాలను భద్రంగా కూడగట్టి, స్టోర్ చేయాల్సిందిగా బాధ్యత అప్పగించారు. రాంకీ సంస్థ ఈ విషపూరిత వ్యర్థాలలో 396 టన్ను అతి ప్రమాదకరమైనవిగా, 39టన్నులు లైమ్ స్లడ్జ్ గా గుర్తించారు. ఇందులో లైమ్ స్లడ్జ్‌ను ఇండోర్ దగ్గర ఉన్న పితాంపూర్‌కు 4 లారీలో రహస్యంగా రవాణా చేశారు. ఈ వ్యర్థాలను రవాణా చేసే కార్యక్రమం జరిగినపుడు దాని ప్రభావం వలన చుట్టు ప్రక్క ప్రాంతాలలో ఉన్నవారిలో దాదాపు 100 మంది హాస్పిటల్ పాలయ్యారు.

పితాంపూర్‌కు తీసుకువెళ్లిన రాంకీ ఆ వ్యర్థాలను గొడౌన్‌లో భద్రపరచకుండా, నిర్లక్ష్యంగా బయట ప్రాంతాలలో కుప్పుగా పోసి వాటిపై టార్పాలిన్స్ కప్పి బరువుకోసం పాతటైర్లను ఏర్పాటు చేశారు. తమ గ్రామానికి ఈ విషపూరిత వ్యర్థాలను తేబోతున్న వార్త విన్న పితాంపూర్ గ్రామస్తులంతా పితాంపూర్ బచావో సమితి ఆధ్వర్యాన నిరసన ప్రదర్శనలు ప్రారంభించారు. పితాంపూర్‌లో రాంకీ సంస్థకు ఉన్న వ్యర్థాలను శుద్ధి చేసే ప్లాంటుకు, భోపాల్ నుండి తెచ్చిన అత్యంత

ప్రమాదకరమైన విషపూరిత వ్యర్థాలను శుద్ధి చేసే శక్తి సామర్థ్యాలు లేవు. ఈ విషయాన్ని పర్యావరణ పరిరక్షణ సంస్థలు నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ కు తెలియచేసి ప్రమాద నివారణా చర్యలు చేపట్టాలని కోరారు. భోపాల్‌లో మిగిలిన 336 టన్నుల వ్యర్థాలను తెస్తే, ప్రజలందరూ సామూహికంగా ఆమరణ నిరాహార దీక్ష కొనసాగిస్తామని సమితి ద్వారా హెచ్చరించడంతో ఈ కార్యక్రమాన్ని ప్రస్తుతానికి నిలుపుదల చేశారు.

అక్టోబర్ 2006లో హైకోర్టు ఈ విషపూరిత వ్యర్థాలను గుజరాత్, అంకలేశ్వర్‌లో ఉన్న బారుచ్ ఎన్విరాన్‌మెంటల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్స్ లిమిటెడ్ కంపెనీకి తరలించాలని ఆదేశించింది. మొదట దీనికి ఒప్పుకున్న గుజరాత్ సంస్థ, ప్రమాదకర వ్యర్థాలకు వ్యతిరేకంగా జరుగుతున్న అక్కడి ప్రజల నిరసన కారణంగా ఈ ఒప్పందాన్ని రద్దు చేసింది. 2010లో అప్పటి కేంద్ర పర్యావరణ శాఖా మంత్రి జైరామ్ రమేష్ పితాంపూర్ వచ్చి అక్కడి ప్రజలకు విషపూరిత వ్యర్థాలను డంప్ చేసినందుకు క్షమాపణలు చెప్పడం జరిగింది. భవిష్యత్తులో అలా జరగదని హామీ కూడా ఇచ్చారు. ఆ రాష్ట్ర ఆర్థిక మంత్రి జయంత్ మలేయా ఆ ప్రాంతంలో ఉన్న యశ్వంత్ సాగర్ సరస్సు ద్వారా ఇండోర్ నగరానికి త్రాగునీటి సరఫరా జరుగుతుంది కాబట్టి, ఈ విషపూరిత వ్యర్థాలను అక్కడ డంప్ చేస్తే ప్రమాదమని చెప్పవలసి వచ్చింది.

జూన్ 2011లో హైకోర్టుకు కేంద్ర ప్రభుత్వం ఈ విషపూరిత వ్యర్థాలను నాగపూర్‌లో ఉన్న డిఫెన్స్ రీసెర్చ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్ కు తరలిస్తామని అఫడవిట్ సమర్పించింది. కానీ నాగపూర్‌లో ప్రజలు ఈ విషపూరిత వ్యర్థాలను తమ ప్రాంతానికి తెస్తే ప్రమాదం కాబట్టి వాటిని ఎట్టి పరిస్థితిలోనూ తీసుకురావద్దని నిరసనలు కొనసాగించారు. విదర్భ ఎన్విరాన్‌మెంటల్ యాక్షన్ గ్రూప్ బొంబాయి హైకోర్టులో ఈ విషపూరిత వ్యర్థాల తరలింపును నిలుపుదల చేయమని కేసు వేసింది. నవంబర్ 2011లో మహారాష్ట్ర కాలుష్య నియంత్రణ మండలి పై సంస్థకు విష వ్యర్థాలను తీసుకుపోవడానికి ఇవ్వాల్సిన నో అబ్జెక్షన్ సర్టిఫికెట్ ఇవ్వడానికి నిరాకరించింది. 2012లో జర్మనీకి చెందిన బహుళజాతి సంస్థ జిఐజెడ్. ఈ వ్యర్థాలను 25 కోట్ల రూపాయల ఖర్చుతో తమ హాంబర్గ్ ప్లాంటులో శుద్ధిచేయడానికి ఒప్పందం కుదుర్చుకున్నారు. కానీ జర్మనీలో కూడా ప్రజలు ఈ విషపూరిత వ్యర్థాలకు వ్యతిరేకంగా నిరసనలు తెలియజేయటం వలన ఆ కంపెనీ కూడా ఒప్పందాన్ని రద్దు చేసుకుంది.

ఇన్ని అవరోధాల తర్వాత 2015 ఆగస్ట్‌లో మధ్యప్రదేశ్ పర్యావరణ పరిరక్షణ సంస్థ ఆధ్వర్యంలో 10 టన్నుల వ్యర్థాలను కాల్చి బూడిద చేశారు. దీని ఫలితాలు ఇంత వరకూ తెలియలేదు. "పితాంపూర్‌లో భస్మం చేసిన వ్యర్థాలు మొత్తం వ్యర్థాలలో కేవలం అతి చిన్న భాగం మాత్రమే. అసలు సమస్య ఇంకా అలాగే ఉంది" అని భోపాల్ ప్రజల తరపున పోరాడుతున్న నాయకుడు సారంగి అన్నారు. యూనియన్ కార్బైడ్ కంపెనీ ఆవరణలో ఉన్న విషపూరిత వ్యర్థాలు సూర్యరశ్మి ద్వారా ఆవిరి రూపంలో, వర్షపు నీటి ద్వారా భూమిలో కలిసిపోతున్నాయి. 'మొదట భోపాల్ గ్యాస్‌తో, ఇప్పుడు కలుషిత నీటితో జీవించాల్సి వస్తుందని' ఆ ప్రాంత ప్రజలు వాపోతున్నారు. ప్లాంట్ పరిసర ప్రాంతంలో పుట్టిన 2 వేల మంది పిల్లలు అనేక శారీరక లోపాలతో పుట్టినట్లుగా ఒక అధ్యయనంలో తేలింది. 'ఈ ప్రాంతంలో మంచి నీరు కలుషితమైందని మొదట మాకు తెలియలేదు. కానీ ఇప్పుడు తెలిసినా ఏమీ చేయలేని పరిస్థితులలో ఉన్నాం' అని ప్రజలు తమ గోడును వివరిస్తున్నారు.

1989లో న్యాయస్థానానికి బయట జరిగి, సుప్రీంకోర్టు కూడా అంగీకరించిన ఒప్పందం ప్రకారం, అత్యంత అన్యాయమైన నష్టపరిహారం 47 కోట్ల డాలర్లను పంచితే, చనిపోయిన వారి కుటుంబాలకు 62వేల రూపాయలు, చావకుండా బ్రతికిన వారికి 25వేల రూపాయలు వచ్చాయని తెలుస్తుంది. అంటే భోపాల్ ప్రజల ప్రాణాల విలువ ఎంత చవకో మన కోర్టులు తేల్చాయి. అమెరికా, బోస్టన్ దగ్గరలో ఉన్న ఓబర్న్ పట్టణంలో డబ్ల్యు.ఆర్.గ్రేస్ అనే బడా కంపెనీకి చెందిన ట్రైక్లోరో ఎథిలీన్ అనే విషపూరిత రసాయనం ఆ ప్రాంత నీటి వనరులలోకి చేరిన కారణంగా 8 మంది అమెరికన్ ప్రజలు లుకేమియా బారిన పడినట్లు తేలడంతో, ఆ కంపెనీ ప్రతీ ఒక్కరికీ దాదాపు ఒక కోటి డాలర్లు నష్టపరిహారాన్ని చెల్లించింది. దీన్ని బట్టి అమెరికన్ ప్రజల ప్రాణం విలువలో భారత ప్రజల ప్రాణం విలువ ఎన్ని రెట్లు తక్కువ ఉందో గమనించాలి. 2010లో అమెరికాలోని గల్ఫ్ ఆఫ్ మెక్సికో సముద్రంలో బ్రిటిష్ పెట్రోలియం కంపెనీ ఆయిల్ కోసం డ్రిల్లింగ్ చేసినప్పుడు 11మంది కార్మికులు చనిపోయి, ఆయిల్ అంతా సముద్రంలో లీక్ అయినందువల్ల ఒబామా ఆ కంపెనీని తీవ్రంగా హెచ్చరించడమే కాకుండా నష్టపరిహారంగా కంపెనీ చేత ముందుగానే 20 బిలియన్ డాలర్లు జమచేయించిన సంగతి ప్రపంచానికి తెలుసు. భోపాల్ ప్రమాదంతో పోలిస్తే, గల్ఫ్ ఆఫ్ మెక్సికో ప్రమాదం చాలా చిన్నది. కాని వేలాది మంది మరణించి, 31 సంవత్సరాల నుండి లక్షలాది మంది రోగాల పాలవుతున్న భోపాల్ ప్రమాదానికి 47 కోట్ల డాలర్ల నష్ట పరిహారమూ, 11 మంది చనిపోయి చుట్టు ప్రక్క పర్యావరణం దెబ్బతిన్న దానికి 2 వేల కోట్ల డాలర్లు నష్టపరిహారం అంటే సామ్రాజ్యవాద న్యాయం ఎలా ఉంటుందో అర్థమౌతుంది. న్యాయమైన అదనపు నష్టపరిహారం కోసం భోపాల్ ప్రజలు నేటికీ పోరాటం కొనసాగిస్తూనే ఉన్నారు.

భోపాల్ ప్రమాదం జరిగి నేటికి 31 సంవత్సరాలు గడిచిపోయినా ఈ నాటికీ అక్కడ ప్రమాదకరమైన విషపూరిత వ్యర్థాలను తొలగించడంలో ప్రభుత్వం ఎంత నిర్లక్ష్యంగా, బాధ్యతారహితంగా వ్యవహరిస్తుందో అర్థమౌతుంది. 1984లో భోపాల్ ప్రజల ప్రాణాలను బలిగొన్న బహుళజాతి కంపెనీ యూనియన్ కార్బైడ్, దాని మాతృ సంస్థ డౌ కెమికల్స్ కంపెనీని బాధ్యులను చేసి ఫ్యాక్టరీ ప్రాంతంలో ఉన్న విషపూరిత వ్యర్థాలను వారే తొలగించే విధంగా పాలకులే ఆదేశించాలి. కానీ తమ సామ్రాజ్యవాద అనుకూల విధానాల కారణంగానే బహుళజాతి కంపెనీలను ఆ బాధ్యతనుండి తప్పించడమే కాకుండా, నేటికీ ఆ వ్యర్థాల వలన బలౌతున్న భోపాల్ ప్రజల ప్రాణాలు రక్షించడానికి ఎటువంటి చర్యలు తీసుకోకపోవడాన్ని పాలకుల దుర్మార్గ వైఖరి స్పష్టంగా తెలియజేస్తుంది. కేవలం భోపాల్‌లోనే కాదు, సామ్రాజ్యవాద విధానాలు కొనసాగుతున్న అన్ని ప్రాంతాలలోనూ ఇటువంటి ప్రజల ప్రాణాలు తీసే విధ్వంస నమూనాలు కోకొల్లలుగా దర్శనమిస్తున్నాయి. నేటికీ భోపాల్ ప్రజల ప్రాణాలను బలిగొంటున్న ఈ విషపూరిత వ్యర్థాలను తొలగించాలని, న్యాయపరమైన నష్టపరిహారం చెల్లించాలని డిమాండ్ చేస్తున్న భోపాల్ ప్రజల పోరాటానికి మద్దతునిద్దాం.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# ముంచుకొస్తున్న 'ఛాందస'వాద ముప్పు

***పాలకులు అధికారం కోసం రాజకీయాల్లో మత ప్రాబల్యాన్ని చొప్పిస్తూ ప్రజల మధ్య వైరుధ్యాలను పెంచి పోషిస్తున్నారనీ, ఇది సమాజ వికాసానికి ఆటంకం అవుతోందనీ అంటున్నారు విద్యాభూషణ్***

'భిన్నత్వంలో ఏకత్వం' భారత సంస్కృతీ సంప్రదాయాలకు ఇరుసు. ఈ కారణంగానే రాజ్యాంగ రీత్యా భారత్, సార్వభౌమ, సామ్యవాద లౌకిక, ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యంగా గణతికెక్కింది. ఇక లౌకికవాద మంటే, మతస్వేచ్ఛ, హేతువాదం, భౌతికవాదం, మానవతావాదుల పట్ల సహనం, గౌరవం అని ఎ.ఆర్. బ్లాక్ షీల్డ్ నిర్వచించారు. లౌకిక దేశం తన పౌరులకు 'మత స్వేచ్ఛ'నిస్తుంది. రాజ్యాంగ బద్ధంగా అధికారం ఏ ఒక్క మతానికి చెందదు. మతంతో జోక్యం చేసుకోదు. మతాన్ని ప్రోత్సహించడం సైతం చేయదు. ఇదీ లౌకికవాద ఆచరణా సారాంశం. కానీ నేటి ఎన్‌డిఏ పాలన ఆచరణలో ఇందుకు భిన్నంగా ఉంది. భారతదేశమన్నది రాష్ట్రాల సమాఖ్య అనీ, రాజ్యాంగరీత్యా ప్రజలకు ప్రాప్తించిన భావ ప్రకటనా స్వేచ్ఛ, మతస్వేచ్ఛ, శాస్త్రీయ దృక్పథం వంటి మౌలికంశాలకే నీళ్లొదిలేస్తుంది. ఇటీవల కేంద్రం ఈ విషయాలను అనేక సందర్భాల్లో దిక్కరించింది. ఈ రాజ్యాంగ తిరస్కారం ప్రజాస్వామ్య మనుగడకే కాకుండా, భవిషత్ మనుగడకే తీరని ప్రమాదం. కారణం ఛాందసవాదులు, మన రాజ్యాంగంలో మనవని చెప్పుకునే అంశాలు మృగ్యమయ్యాయని, మనస్మృతే ప్రపంచ సమ్మతిని – విధేయతను సాధించిందనే వక్ర భాష్యాలకు తావివ్వడం. క్రమంగా ఓ 'ఆచరణ'ను ప్రతిపాదించడం జరుగుతూ ఉంది.

నిజానికి 'మతం' అంటే 'అభిప్రాయం' అనే అర్థాన్ని భావవాదులు చెప్తారు. జ్ఞానం వికసించని పురాతన కాలంలో మూఢ విశ్వాసాలకు ప్రజల జీవితాల్లో ప్రమేయం ఉండేది. ఈ విశ్వాసాల విధాన క్రమమే 'మతం'గా రూపొందింది. కాలక్రమంగా జ్ఞానం వికసించి, విషయ మూలాలు అవగతమైన వేళ మతాధిపతులు, ఏలికలు తమ ఆధిపత్యాన్ని నిలుపుకునేందుకు మతాన్ని ఆసరా చేసుకున్నారు. సామాన్యులను ఈ మత గ్రంథాలకు దూరంగా నెట్టేస్తూ, భావోద్వేగాల దోపిడీలో సాధనంగా మతాన్ని ఉపయోగించారు. ఫలితంగా ప్రతీ ఒక్కరూ మతాన్ని ఓ గుర్తు లక్ష్యంతో ఆదరిస్తున్నారు. ఈ కారణంగానే నేటి పాలకులు హిందూత్వాన్ని అగ్రవర్ణ పెట్టుబడిదారీ, బహుళజాతి సంస్థల దోపిడీకి ఎర వేస్తున్నారు. అడ్డంకులనదిగమించే యత్నానికి పాల్పడుతున్నారు.

కాల క్రమేణా పాలనలో మత ప్రమేయాన్ని జొప్పించడం మనం గమనించవచ్చు. ప్రగతి చాటున విజ్ఞాన శాస్త్ర అధ్యయనానికి మహారాష్ట్ర ప్రభుత్వం మదరసాలలో చదవడాన్ని నిషేధిస్తే, అదే సరసన గుజరాత్ ప్రభుత్వం ఉర్దూ మాధ్యమ పాఠశాలలను మూసేసింది. హిందూ విద్యార్థులకు కాషాయ రంగు దుస్తులను, ముస్లిం విద్యార్థులకు ఆకుపచ్చ రంగు యూనిఫారాలను కేటాయించింది. లౌకిక విలువలను ఆపాదించాలనే యత్నానికి పాల్పడిన ఎన్‌సిఇఆర్‌టి సంచాలకులు పర్వీన్ సింక్లెయిర్‌ను పదవి నుంచి తొలగించడం జరిగింది. లౌకిక విలువలను, శాస్త్రీయతను ప్రచారం చేసి ప్రజా ఉద్యమ నేతలను (గోవింద్ పన్సారే, దాభోల్కర్, కలబుర్గి) సనాతనం మట్టుబెట్టింది. అంతటితో ఆగకుండా పలువురు సామాజిక కార్యకర్తలకు హెచ్చరికలు జారీ చేసిన వైనాన్నీ మనం చూశాం. పేదరికాన్ని ఆసరా చేసుకుని మత మార్పిళ్లను నిర్వహించడం, పురాణ గాథలను యదార్థాలని ప్రచారం చేయడం, మూఢ విశ్వాసాల ఆసరణను ప్రకోపించ చేయడం సంఘ్ పరివార్ లక్ష్యాలుగా చేపట్టడం వింటూనే ఉన్నాం. ఇంతటితో ఆగిపోకుండా, సంఘ పరివార్ నేత మోహన్ భగవత్ 'ఈ దేశంలోని ముస్లింలు, క్రైస్తవులు సైతం హిందువులే' నని ప్రకటించడం కాకతాళీయం కాదు. 'పరమత సహనం' గురించి ఘోషించిన ఈ దేశంలో పరమత చిత్రాలను, పుస్తకాలను సైతం బహిష్కరించారు. ఎవరు ఎవరిని ప్రేమించాలో, ఎవరిని పెళ్లి చేసుకోవాలో? యువతులు స్త్రీలు ఏ తరహా దుస్తులు ధరించాలో? నిర్దేశించే వరకూ వెళ్లింది వీరి వ్యవహారం. చివరకు ఏ మతస్థులు ఏం తినాలో కూడా నిర్ణయించేది వీరే. ఇందుకు తాజా ఉదాహరణ ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో దాద్రిలో గోమాంసం తిన్నాడన్న ఆరోపణతో సెప్టెంబర్ 27న రాళ్లతో కొట్టి చంపిందీ మూఢత్వం! ఆపై దాన్నో చర్చనీయాంశంగా సైతం చేసింది.

ఈ మత రాజకీయానికి పునాది మాత్రం గతంలోనే పడింది. ఒకనాడు మతానికి అతీతంగా నిక్షిప్త నిధుల కోసం, మత మందిరాలపై దోపిడీలు సాగేవని చరిత్రలో చదువుకున్నాం. ఆ తరువాత కాంగ్రెస్ హయాంలో 1985వ సంవత్సరంలో షాబానో కేసులో ముస్లింలైనా విడాకులిచ్చిన భార్యలకు మనుగడ కోసం మనోవర్తి చెల్లించాల్సిందేనని చారిత్రాత్మక తీర్పు ఈ దేశ అత్యున్నత న్యాయస్థానం వెలువరించింది. దేశాన్ని 21వ శతాబ్దిలోకి పరుగులు తీయిస్తానన్న యువనేత రాజీవ్‌గాంధీ, 'ఇది రాజకీయ ప్రయోజనం కోసం ఇచ్చిన తీర్పని, చట్టం ద్వారా రద్దు చేయడం ఈ గడ్డపైనే చూశాం. అంటే దేశ అత్యున్నత న్యాయస్థాన తీర్పును 'మత రాజకీయం' అధిగమించేసిందన్నమాట. ఆ తరువాత ఆయోధ్యలో 'బాబ్రీ'ని కూల్చేస్తుంటే వినోదంగా చూస్తూ ఊరుకున్న నాటి పివి గారిది ఎంత రాజకీయ చతురతో, ఈ కేసులో బాధ్యులైన అద్వానీ, ఉమా భారతి (నేటి కేంద్ర మంత్రి) కళ్యాణ్ సింగ్‌లను ఉపేక్షించడం అంతే రాజకీయ చతురత! పైగా ముంబై అల్లర్ల ఘటనలో గానీ, గుజరాత్ మారణకాండలో బాధ్యులైన వారిపట్ల ఉదాసీనత గానీ, ఉపేక్షించడం గానీ తగదు. అయినా 'జరిగిందీ' అంటే అదంతా రాజకీయమే! ఈ విధంగా మతాన్ని రాజకీయానికి అండగా చేస్తే జరిగే పరిణామాలే ఇవి. అందుకనే...

వారి-వారి ప్రాభవానికి పట్టం కట్టేందుకై పాలకులు 'చరిత్ర'ను సైతం తిరగరాయించడానికి సమాయత్తమవుతున్నారు. సంస్కృతాన్ని

దైవ భాషగా ప్రోత్సహిస్తున్నారు. గత పార్లమెంటరీ ఎన్నికల్లోనే అయోధ్యలో రామాలయ నిర్మాణాన్ని ఎన్నికల ప్రణాళికలో పొందు పరిచారు. జమ్ము-కశ్మీర్‌లో 370 అధికరణను రద్దుచేయాలంటూ, ఉమ్మడి పౌరస్మృతిని (కామన్ సివిల్ కోడ్) చర్చనీయాంశం చేస్తున్నారు. మరోవైపు పౌరులందరికీ 'మతాతీత' పౌర నిబంధనావళిని అమలు చేయాలంటారు. ఇదే నోటితో తమ పార్టీకి ఓటు వేయని వారంతా అక్రమ సంతానమని, హిందువులు కారంటూ పేట్రేగి ఇదంతా లౌకిక వాదమేనంటూ చిందులేస్తున్నారు. ఇటీవల గుజరాత్‌లో లేవనెత్తిన 'రిజర్వేషన్స్ ఉద్యమాన్ని, రాజస్థాన్‌లో చట్టం చేసైనా రాజ్యాంగాన్ని సవరించాల్సి ఉందని సూచించడం ఏ దిశగానన్నది విజ్ఞులు యోచించాలి. పాలకుల వ్యాఖ్యానాలు, చేష్టలు రాజ్యాంగానికి కట్టుబడే ఉన్నాయా? లేకుంటే ఏదో ఓ మతానికి కొమ్ము కాస్తున్నాయా?

తరతమ బేధాలతో మతాలన్నీ మూఢత్వాన్ని అజ్ఞానాన్ని పెంచి పోషించేవే. యుగ యుగాల సంస్కర్తల పునరాలోకించాలి. ఈ సందర్భంగానే అశాస్త్రీయ భావజాలం ఎంత వరకూ వెళ్లిందో తెలియ జెప్పేందుకో ఉదాహరణ. దీనానాథ్ బాత్రే అనే సంఘ పరివార్ కార్యకర్త తను రాసిన ఓ పుస్తకంలో, 'ఇండియా అనేది 'శూద్ర' పేరని, దాన్ని వాడకూడదనీ' రాశాడు. పైగా ఈ పుస్తకాన్ని దేశ వ్యాప్తంగా ఓ పాఠ్యాంశంగా ప్రవేశపెట్టాలని నిర్ణయించారట. అంటే ఎటుపోతున్నాం మనం? ఇది పురోగమనమా? తిరోగమనమా?

ప్రస్తుత పాలకుల ఉక్రోషాన్ని ఎత్తిచూపే మరో ఉదాహరణ. గ్రీన్‌పీస్ సంస్థ లైసెన్సుని కేంద్రం ఏకపక్షంగా రద్దు చేయడం. ఈ సంస్థ చేసిన నేరం నేరం ఏంటంటే...? అభివృద్ధి ముసుగులో ప్రభుత్వాలు ఆర్భాటంగా చేపట్టే ప్రాజెక్టులు, బడా బాబులకు మేలు చేస్తూ, దళితులు - గిరిజనుల బతుకులను ఎలా నాశనం చేస్తున్నాయో విశదీకరించడం. భారీ ప్రాజెక్టుల వలన 'పర్యావరణం' ఎలా దెబ్బతింటుందో, సామాన్య జీవనం ఎలా చిన్నా-భిన్నమవుతుందో తెలియజెప్పడం, ప్రజాభిప్రాయ సేకరణ, నిరసనలను వ్యక్తం చేయడం. సంస్థ మనుగడను నివారించేందుకు, సంస్థ ఆర్థిక మూలాలపై దెబ్బతీయాలని కేంద్రం సంకల్పించింది. గ్రీన్‌పీస్ సంస్థకు సహకరిస్తున్న విదేశీ నిధులపై కొరడా ఝులిపించింది. విదేశీ సహాయ సహకారాలకై సంస్థ పొందిన లైసెన్సును ఏకపక్షంగా రద్దు చేసేసింది. పైగా గ్రీన్‌పీస్ సంస్థ దేశ పన్నుల చట్టాలను ఉల్లంఘిస్తుందని ఆరోపిస్తూ, ఏప్రిల్ మాసంలోనే బ్యాంకు ఖాతాలను స్తంభింపజేసింది. అయితే ఖాతాల స్తంభనకు బలీయ కారణం చూపలేదంటూ, ఢిల్లీ హైకోర్టు సంస్థ ఖాతాలపై ఆంక్షలను ఎత్తి వేసింది. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా? ఏకంగా లైసెన్సునే రద్దు చేసిందీ ప్రజాస్వామ్య ప్రభుత్వం. ఇప్పటికి సుమారు తొమ్మిది వేల స్వచ్ఛంద సేవా సంస్థలు ఈ తరహా వేటుకు బలయ్యాయన్నది ఓ అంచనా. అయినా ఈ ప్రభుత్వం చేస్తుందేమిటి? తెల్లారితే విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తూ, విస్తృత రాయితీలను కల్పిస్తూ నిధుల కోసం వెంపర్లాడడమేగా. అదీ 'అభివృద్ధి' ముసుగులో. స్వచ్ఛంద సంస్థలు దేశ పేదవారి మనుగడకైనా పరితపిస్తుండగా, ప్రభుత్వం వారి నిరసన గొంతును నొక్కే ప్రయత్నం చేస్తుంది. నిప్పును గుడ్డలో మూటకట్టే యత్నం లాంటిదే ఇది. చైతన్యం చిదిమేయడం అంటే!

ఈ నేపథ్యంలో మత ఛాందసవాద ప్రమాదం రోజు రోజుకూ పెరుగుతూ ఉందనేది కాదనలేని వాస్తవం. ఇప్పటికే మత ఛాందవాదం అరబ్-ముస్లిం దేశాల్లో తిష్టవేసుకుని ప్రపంచ మనుగకే ఓ సవాల్‌గా నల్చిన వైనం మనముందుంది. ఇది సామ్రాజ్యవాద ప్రాభవానికి ఓ వనరుగా సైతం దోహదపడుతున్నదీ వాస్తవమే. సామ్రాజ్యవాదనికి ఏమేరకు దోహదపడుతుందో అదే స్థాయిలో సామాన్యుని జీవనాన్ని ఛిద్రం చేస్తున్నదీ అంతటి అక్షర సత్యం. ఆధునేక భారతం, హిందూ ఛాందసవాద భారిన పడి 'ఎన్‌డిఎ' ముసుగులో మరింత అస్థిరత్వానికి గురవుతుందన్నది కనిపించని వాస్తవం. ముస్లిం దేశాల్లో 'ఇస్లా' ఛాందసవాదం అస్థిరతకు కీలకమైతే, భారత్‌లో 'హిందూ' ఛాందసవాదం అస్థిరతకు పోస్తుంది. ఈ రెండు ఛాందసవాదాల విస్తరణకు చాలా దగ్గరి పోలికలున్నాయి. ఈ రెండు భిన్న ఛాందసవాదాల మధ్య ఏకీభావాన్ని సైతం మనం గతంలోనే గుర్తించగలుగుతాం. అంటే స్వాతంత్రోద్యమ కాలంలోనే, నాటి సామ్రాజ్యవాద వ్యతిరేక, విశాల దేశ భక్తియుత ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడంలో ఆర్‌ఎస్‌ఎస్, ముస్లిం లీగ్‌లు సమిష్టిగా కృషి చేశాయి. వలసవాదుల ప్రయోజనాలను కాపాడడంలో ఈ రెండు శక్తులు కాస్తా కుడి-ఎడమ గానే వ్యవహరించాయి. ఇలా ప్రారంభమైన ఈ సయోధ్య నేటికి విస్తరించే క్రమంలో కొన్ని సారూప్యతలనూ పునికి పుచ్చుకున్నాయి. అవి ఏంటంటే? ఫత్వాలను జారీ చేయడం. ఫత్వాల అమలు హత్యలకు సైతం దారి తీయడం. ఇందుకోసం విచ్చలవిడిగా ఆయుధాలను వినియోగించడం. ఆధునిక నాగరిక జీవనంలో, సందర్భోచితంగా మధ్యయుగం నాటి మత సంస్కరణోద్యమ ఫలితాలను, లక్ష్యాలను అన్వయించుకోవడంలో ఏకీభావం ఉంది. హిందూ-ఇస్లాం ఛాందసవాదాల మధ్య ఇవి ఏకీభావ పోలికలు ఇవైతే, కొన్ని తేడాలు సైతం ఉన్నాయి. 1979 వరకూ ఇస్లాం ఛాందవాదం ఒకటిగానే ఉంది. అమెరికా సామ్రాజ్యవాద అనుకూల-ప్రతికూలతల ఫలితంగా 'చీలిక' అనివార్యమైంది. 1990 నాటికి అది మరింతగా విస్తరించింది. అమెరికా అనుకూల ప్రభుత్వాలు గల ఈజిప్టు, సౌది-అరేబియా, కువాయిట్, ఇతర గల్ఫ్ దేశాలు ఒక ధోరణిని చేపట్టాయి. ప్రజా హక్కులను ముఖ్యంగా మహిళల హక్కులను 'హరియత్' పేరిట అణిచేందుకు అమెరికా తొత్తు ప్రభుత్వాలు ఈ ఛాందసవాదాన్ని వాడుకుంటున్నాయి. ఇక రెండోది అమెరికా సామ్రాజ్యవాద దురాక్రమణ వ్యతిరేక సాయుధ తిరుగుబాట్లకు సారధ్య వహిస్తున్న కొన్ని 'ఇస్లాం' తీవ్రవాద సంస్థలు తమ రాజకీయ లక్ష్య సాధన కోసం ఈ ఛాందసవాదాన్ని వినియోగించుకుంటున్నాయి. అయితే ఈ పరిస్థితి 'హిందూ' ఛాందసవాదానికి లేదు. ఇది సర్వవేళలా విదేశీ సామ్రాజ్యవాదానికి ఊడిగం చేసేందుకు, దాన్ని బలపర్చేందుకు సంసిద్ధంగా ఉంటుంది. అవసరం అయితే/అనుకుంటే, తమ దేశ ప్రజల బతుకుల్ని బలి పెట్టేందుకు సైతం వెనుకాడదు. ఇక ఫత్వాల విషయానికొస్తే, ఇస్లాం ఛాందసం సల్మాన్ రష్దీ, తస్లిమా వంటి లౌకిక వాదుల రచనలను నిషేధిస్తే, బిపిన్‌చంద్ర-రోమిల్లా థాపర్‌ల రచనలపై హిందూ ఛాందవాదం విరుచుకుపడింది. ఇలాగే ముస్లిం మహిళల 'బురఖా వ్యవస్థ' పటిష్టత కోసం, 'ఇస్లాం' ఛాందసవాదులు నడుంబిగిస్తే, మధ్య యుగపు రాజ్య మందిరాల స్త్రీలలో కొనసాగిన (ఘోష) అంతపుర సంప్రదాయ పునరుద్ధరణకై హిందూ ఛాందసవాదం ఓ అడుగు ముందుకు వేసింది. ఇస్లాం దేశాల్లోని ప్రాచీన బౌద్ధరామాలపై 'ఇస్లాం' ఛాందవాదం దాడులు చేసి కూల్చేస్తే, హిందూ ఛాందవాదం బాబ్రీ మసీదును కూల్చేసింది. అయితే, ఆధునికంగా హిందూ ఛాందవాదం, హిందూ మత పరివర్తనకు తీవ్ర యత్నాన్ని మొదలుపెట్టింది. గుప్తుల కాలం తరువాత, శంకరాచార్యులు, మధ్య చార్యులు, రామానుజా చార్యుల

# రాష్ట్రాల నిధులను పిండుకొంటున్న కేంద్రం

***పన్నులలో రాష్ట్రాలకు రావాల్సిన వాటాలలో కోతలు విధిస్తూ కేంద్రం రాష్ట్ర ఆదాయాలకు గండికొడుతున్న తీరును వివరిస్తున్నారు* వి. హనుమంతరావు**

**మా**మూలుగా మన ఇళ్లల్లో పెత్తనం సంపాదించేవాడిదే. తాత, ముత్తాతల ఆస్తులుంటే వాళ్లు రాసిన విల్లు ప్రకారం విభజన జరుగుతుంది. అలాంటి విల్లు లేకపోతే, ఆ ఆస్తుల మీద ఇంట్లో ఉండే ముసలమ్మలదే పెత్తనం.

కాని దేశంలో ఆస్తులు, అప్పులు బ్రిటిష్ పాలకుల నుంచి కాంగ్రెస్ పార్టీకి సంక్రమించాయి. కేంద్ర ప్రభుత్వంతో పాటు ఛప్పన్నారు రాష్ట్రాలున్నాయి కాబట్టి ఇక ముందు కేంద్రం, రాష్ట్రాల మధ్య ఆర్థిక సంబంధాలు ఎలా ఉండాలి అనే విషయాన్ని రాజ్యాంగం నిర్దేశించింది. ఫలనా ఫలనా ఆర్థిక విషయాలు కేంద్ర, రాష్ట్ర పరిధుల్లో, మరికొన్ని అధికారాలు ఉభయుల అధీనంలో ఉంటాయని నిర్దేశించింది. ఆ ప్రకారం జరిగిందా అని చూడబోతే, బ్రిటిష్ కాలం నాటి సీనియర్ అధికారులే స్వతంత్ర భారతంలో కొనసాగుతుండడంతో, బ్రిటిష్ పాలనా పద్ధతులు అంటే దేశం మొత్తం ఆర్థిక పెత్తనం బ్రిటిష్ పాలనా పద్ధతుల ప్రకారం సర్వాధికారాలు ఢిల్లీ చేతుల్లో ఉంటూ వచ్చాయి. ఆ పద్ధతులకే అలవాటు పడిన కేంద్ర అధికారులు రాజ్యాంగంలో ఎలా రాసి ఉన్నా, ఆచరణలో వీలైనన్ని అధికారాలు కేంద్రం చేతుల్లోనే ఉండేలా పరిపాలన కొనసాగిస్తూ వచ్చారు. ఆచరణలో రాష్ట్రాల ఆర్థికాధికారాలు కుంచించుకుపోవడమో, రాజ్యాంగం ప్రకారం రాష్ట్రాలకు దాఖలు పరచకపోవడమో జరుగుతూ వచ్చింది. రాష్ట్రాల అసంతృప్తిని గమనించిన కేంద్రం ఈ విషయాన్ని పరిశీలించమని సర్కారియా కమిషన్‌ను నియమించగా, ఆ కమిషన్ సిఫార్సులను అరకొరగా అమలు పరచడంతో రాష్ట్రాల అసంతృప్తి రావణాసురిని కాష్టంలా కొనసాగుతూనే వచ్చింది. ఈ నేపథ్యంలో రాజ్యాంగం నిర్దేశించిన ప్రకారం ఫైనాన్స్ కమిషన్ అనే వ్యవస్థను ఏర్పాటు చేసింది. దీని సభ్యులను రాష్ట్రపతి నియమిస్తారు. ఈ వ్యవస్థ ఐదేళ్లకొకసారి సమావేశమై, రాష్ట్రాలు ఈ విషయమై అందజేసిన మెమొరాండంలను పరిశీలించి, చేసే సిఫార్సులను కేంద్రం ఆమోదిస్తుంది. ఇదీ పద్ధతి. కాని అలా జరుగుతుందా?

ఇక్కడ మరో విషయం పరిగణనలోకి తీసుకోవాలి. రాజ్యాంగం ప్రకారం మనది ఫెడరల్ వ్యవస్థ. యూనిటరీ వ్యవస్థ కాదు. అంటే దేశ వ్యవహారాలన్నీ కేంద్ర అధికార పరిధిలో ఉండవు. పైనే చెప్పినట్లు, కేంద్రం, రాష్ట్రం అధికారాలు ఫలానా ఫలానా అని, కొన్ని అధికారాలు కేంద్రం, రాష్ట్రం ఉభయుల పెత్తనంలో ఉంటాయి. కాని ఆచరణలో కేంద్రం ఈ నియమ నిబంధనలను ఉల్లంఘిస్తూనే ఉంది. ఉదాహరణకు ఇదివరకు రాసిన వ్యాసాల్లో ఉదహరించినట్లు, వ్యవసాయం రాష్ట్రాధికారుల లిస్టులో ఉంది. కాని ఆచరణలో ఏ రాష్ట్రం ఏమి అందించాలి, ఎరువులు పంపకం, మార్కెటింగ్, పంట రుణాలు లాంటి విషయాలన్నింటినీ కేంద్రమే నిర్ణయిస్తుంది. ముఖ్యంగా ఆర్థిక విషయాల్లో కేంద్రానిదే పెద్దచేయ్యి కాబట్టి, కేంద్రంలో ఉన్న బ్యూరాక్రట్లు బ్రిటిష్

---

ద్వారా ఈ పరివర్తనకు బీజం పడి ఆధునీకరింపబడిందీ హిందూత్వం. ఈ క్రమంలోనే వర్తమాన హిందూత్వం తీవ్రంగా యత్నించడంతో, 'ఇస్లాం' ఛాందవాదానికి ధీటుగా 'హిందూ' ఛాందవాద ప్రమాదం నానాటికీ పెరుగుతూ ఉందనేది కాదనలేని వాస్తవం. ఈ ప్రయాణ గమ్యం ఏంటంటే, 'మా మతం గొప్పది–మా దేవుడే సర్వోన్నతుడు' అని కీర్తించే వరకూ. దీంతో పరమతాలపై విద్వేషం ఆపై మతోన్మాదంగా రూపాంతరం ఫలితంగా పరమతాల దేవుళ్ల మీద దాడులకు ప్రకోపిస్తుంది. కడకు రాజకీయ అవసరాలకు మతాన్ని వడుకోచూసే శక్తులను 'మత ఉగ్రవాదులు'గా మార్చే ప్రమాదం పొంచి ఉన్నట్లే!

ఛాందవాద ప్రమాదం పొంచి ఉందనేందుకు ఈ తాజా పరిణామం ఊతం ఇస్తుంది. గత సెప్టెంబర్ రెండు నుంచి నాలుగు వరకూ రాష్ట్ర స్వయం సేవక్ సంఘ్ (ఆర్ఎస్ఎస్) కేంద్రానికి మధ్య జరిగిన అవగాహనా భేటీ, దేశ పాలనా వ్యవహారంలో ఆర్ఎస్ఎస్ నియంత్రణా ధాటిని చెప్పకనే చెపుతుంది. అయితే తమ సమావేశం కేవలం సమాచార మార్పిడి కోసమేనని ఇరుపక్షాలు పైకి చెపుతున్నా, తమ మతతత్వ ఎజెండాను అమలు పరిచేందుకే కేంద్రానికి ఓ దిశా నిర్దేశం చేసేందుకే నన్నది సుస్పష్టం!

ఎన్‌డిఎ ప్రభుత్వానికి 'పరివార్' రిమోట్ కంట్రోల్‌గా పనిచేస్తుందని, లౌకిక ప్రజాస్వామ్య వాదులు, ప్రతిపక్షాలు ఆందోళన చేస్తుండగా, అవన్నీ ఆరోపణలేనని తీసిపడేసిన బిజెపి–పరివార్ ముసుగును తొలగించి ధీటుగా, ధాటిగా ముందుకొచ్చిన సందర్భం ఇది. సమావేశనంతరం ప్రభుత్వం పనితీరుపై మాట్లాడనే లేదని, ఆర్ఎస్ఎస్ కేవలం సలహా ఇచ్చిందనే హోం మంత్రి, ఆ మరుసటి రోజునే విద్య – సంస్కృతి – ఆర్థికం – జాతీయ భద్రత, సామాజిక సామరస్యతలపై చర్చించినట్లు అంగీకరించక తప్పలే. మరి ఇది దేన్ని సూచిస్తుంది?

లౌకిక భారతదేశాన్ని మతతత్వ ఛాందసానికి రాజకీయ నియంత్రణా శక్తిగా, పదోన్నతినిస్తే అది రాజ్యాంగ విరుద్ధం కాదా? పోరాడి సాధించుకున్న స్వతంత్ర్యానికి – ప్రజాస్వామ్యానికి 'అవహేళనే'గా ఇది! రాజ్యాంగం మీద ప్రమాణం చేసిన వ్యక్తులు, రాజ్యాంగ సూత్రాలకు, ప్రమాణాలకు తిలోదకాలివ్వడం కాదా ఇది! ప్రజాస్వామ్య విలువిలను మంటగలపడమే కదా! సమాజంలో చీలికలు తెచ్చి దేశ సమగ్రత, భద్రతలకు భంగం కల్పించే 'ఛాందస' శక్తులను అణచివేయాల్సింది పోయి, వాటి మార్గదర్శకత్వంలో పనిచేయాలనుకోవడం జాతికే విపత్తు. ఈ ప్రమాద పరిణామాలను ప్రజాస్వామ్య వాదులంతా గుర్తించి, గర్జించాలి!

*(రచయిత పాత్రికేయులు)* వీ

కాలం నాటి పరిపాలనా విధానాలనే కాస్త ఇటుగా కేంద్రానికే అనుకూలంగా నిర్ణయాలు చేస్తూ వస్తూండడంతో, రాష్ట్రాలు పదే రాజకీయ, పరిపాలనా స్థాయిల్లో ఢిల్లీకి పరుగులు పెట్టాల్సి వస్తుంది. కేంద్రంలో, రాష్ట్రంలో ఒకే రాజకీయ పార్టీ పరిపాలిస్తుంటే ఒక రకంగా, వేర్వేరు పార్టీలైతే వేరే విధంగా ప్రవర్తించడం జరుగుతూ వస్తుంది. ఉదాహరణకు రైల్వేలు తీసుకుంటే, కేంద్రంలో ఉన్న రైల్వే మంత్రి తన రాష్ట్రంలో రైల్వేలకు పెద్దపీట వేయడం మనం చూస్తున్నాం. ఇటు రాష్ట్రాలు కూడా ఎత్తుకు పైఎత్తు వేయడం జరుగుతుంది. ప్రణాళికా సంఘానికి, ఫైనాన్స్ కమిషన్‌కు ఒకే విషయం గురించి రెండు రకాల గణాంకాలను పేర్కొని, ఎక్కువ నిధులు రాబట్టుకోవడానికి ప్రయత్నించడం జరుగుతుంది. ఎంత లేదన్నా, కేంద్రానిదే పై చేయి ఉంటుంది కాబట్టి, రాష్ట్రాలకు అన్యాయం జరగవచ్చుననే ముందు చూపుతో రాజ్యాంగంలోనే ఫైనాన్స్ కమిషన్‌ను ఏర్పాటు చేయాలని రాజ్యాంగం నిర్దేశించింది. కాని కేంద్రం రాష్ట్రాలకు నిధులను పంచడానికి వీలులేని విధంగా సెస్‌లను, సర్ ఛార్జీలను విధించి, ఆ రాబడులను రాష్ట్రాలకు పంపిణీ నుంచి మినహాయించే అడ్డదారి తొక్కింది. అన్ని రాష్ట్రాల తలసరి ఆదాయం ఒకే స్థాయిలో ఉండదు. ఈ వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకొని అన్ని రాష్ట్రాలకు సమన్యాయం చేయాల్సిన ఫైనాన్స్ కమిషన్‌కు ఈ సెస్‌లు, సర్ ఛార్జీల విధానం దాని గొంతుకు అడ్డం పడింది. ఈ నిధులు దేశం అంతటి నుంచి వసూలు చేస్తుంది కాని అందులో రాష్ట్రాలకు వాటా ఇవ్వకపోవడం కేంద్రం – రాష్ట్రాల మధ్య సంబంధాల సమతుల్యత లోపించింది. ఇది రాష్ట్రాల దోపిడీ కాక మరేమిటి?

కార్పొరేట్లకు దాసానుదాసులైన చిదంబరం గాని, ప్రస్తుతం మోడీ ప్రభుత్వం గాని కార్పొరేట్లకు అనుకూలంగా ఎక్సైజ్, కస్టమ్స్ సుంకాలు తగ్గిస్తూ రావడం జరుగుతోంది. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే గత ఐదారు సంవత్సరాలుగా ప్రతీ ఏడాది ఐదారు కోట్ల మేరకు రాయితీలు ఇస్తూ వస్తోంది. ఈ సుంకాలు రాజ్యాంగ ప్రకారం రాష్ట్రాలతో పంచుకోవాలి. కాగా ఆ మేరకు రాష్ట్రాలకు రావాల్సిన వాటా తగ్గుతుంది. ఫైనాన్స్ కమిషన్‌ను ప్రతీ ఐదు సంవత్సరాలకొకసారి ఏర్పాటు చేస్తుంది. ఫలానా విషయాలను పరిశీలించి సిఫార్సు చేయాలని ఆదేశిస్తుంది. ఇవన్నీ మామూలుగా ఇప్పటిదాకా ప్రతీ కమిషన్‌కు ఇచ్చే ఆదేశాలే. కాని అప్పుడప్పుడు అదనంగా కొత్త విషయాలను – ఇవి కేంద్రానికి అదనంగా నిధులు సమకూర్చే విషయాలు – చేరుస్తుంటుంది. వాటి ఫలితంగా వచ్చే అదనపు నిధులు కేంద్రం బొక్కసంలోకి చేరుతాయి. రాష్ట్రాలకు ఇందులో వాటా ఉండదు.

కామన్‌గా అన్ని రాష్ట్రాలకు ఉండే సమస్యల పరిష్కారానికి కావాల్సిన నిధులను సమకూర్చే కేంద్ర ప్రతిపాదిత పథకాలను కేంద్రం చాలా కాలానికి ముందే ప్రవేశపెట్టింది. ఈ పథకాల్లో ముఖ్య షరతు ఏమిటంటే ఆ పథకాల అమలుకయ్యే ఖర్చులో సుమారు 75 శాతం నిధులను సమకూరుస్తుంది. మిగతా 25 శాతం నిధులు ఆయా రాష్ట్రాలు సమకూర్చాలి. నిర్ణీత కాలంలో అప్పటి వరకూ ఎంత ఖర్చు చేయాలి, ఎంత వరకు ప్రతిపాదిత పథకాలు అమలయ్యాయి అనే సమాచారం పంపితేనే తర్వాత విడత నిధులు విడుదల చేస్తుంది కేంద్రం. కేంద్రమే నిధుల కొరతతో సతమతమవుతుంటే రాష్ట్రాల పరిస్థితి మరింత క్లిష్టంగా ఉంటుంది. అలాంటప్పుడు నిధులు విడతలుగా విడుదల చేయడంలో ఆలస్యం అయితే, చేయాల్సిన పనులు వివిధ స్థాయిల్లో నిలిచిపోతాయి. కాంట్రాక్టర్ల ఒత్తిడి పెరుగుతుంది. లక్ష్యాల సాధన కుంటుపడుతుంది. లబ్ధిదారులు లబోదిబో అంటారు. ఈ పథకాలు సరిగ్గా అమలు జరుగుతున్నాయా లేదా అని కేంద్ర మంత్రులు, సీనియర్ అధికారులు టూర్లు బయలుదేరతారు. ఈ ఖర్చు కూడా ఆ పథకానికయ్యే ఖర్చులో భాగం.

రాజీవ్‌గాంధీ హయాంలో ప్రవేశపెట్టిన మంచి పథకం పంచాయితీలను రాజ్యాంగబద్ధం చేయడం. ఆ నిర్ణయం అమలులో భాగంగా రాష్ట్ర ప్రభుత్వాలు అందుకు కేటాయించిన ఉద్యోగులు, నిధులు పంచాయితీలకు బదలాయించడం. రాష్ట్రాలు ఆ పని చేయలేదు (కాగితం మీద తప్ప) 27 అధికారాల బదలాయింపులో ఏ రాష్ట్రమూ పూర్తిగా అధికారాలు బదలాయించిన దాఖలాలు లేవు. వీటికి కావాల్సిన నిధులు ప్రణాళిక సంఘం విడుదల చేస్తుంది. మోడీ వచ్చి ప్రణాళిక సంఘాన్నే ఎత్తేశారు. 14వ ఫైనాన్స్ కమిషన్ 32 శాతం నిధులను 42 శాతానికి పెంచాలని సిఫార్సు చేసింది. కేంద్రం ఈ సూచనను ఒకపక్క అమలు పర్చాలని నిర్ణయిస్తూ అదే సమయంలో కేంద్ర ప్రతిపాదిత పథకాలను తెగ్గోసింది. ఇది కుడి చేత్తో ఇచ్చి ఎడమ చేత్తో లాగేసుకోవడమే.

పైన సెస్‌లు, సర్ ఛార్జీలు విధించి కేంద్రం వాటి ద్వారా వచ్చిన ఆదాయాన్ని రాష్ట్రాల వాటా ఇవ్వకుండా తన బొక్కసంలో జమచేసుకొంటుందని, ఇది రాష్ట్రాలకు అన్యాయం చేయడమేనని (ఈ సెస్‌లు, సర్ ఛార్జీలుగా రాష్ట్రాల్లో వసూలు చేసినవే) చెప్పుకున్నాం. అలాగే కేంద్ర పన్నుల్లో రాష్ట్రాల వాటా గురించి కూడా చెప్పుకొన్నాం. ఈ రెండింటి గురించిన గణాంకాలు చూడండి. 2001-02 నుంచి 2010-11 మధ్య కాలంలో, రాష్ట్రాలకు పంచకుండా కేంద్రం తన జేబులో వేసుకున్న మొత్తం రు. 6454 కోట్ల నుంచి 2010-11లో రు. 87159 కోట్లు! అలాగే కేంద్రం వసూలు చేసే పన్నుల్లో రాష్ట్రాలకు రాజ్యాంగం ప్రకారం ఇస్తున్న వాటా (స్థూల జాతీయాదాయంలో శాతంగా 2.38 శాతం నుంచి 2.76 శాతానికి మాత్రమే పెరిగింది. ఇంత తక్కువ శాతం పెరగడానికి కారణం పన్నులు పెంచకుండా సెస్‌లు, సర్ ఛార్జీలు భారీగా పెంచడమే. ఇది కేంద్రం రాష్ట్రాలను కావాలనే మోసం చేయడం కాక మరేమిటి?

రాజ్యాంగం ప్రకారం కేంద్రం వసూలు చేసే పన్నులు రాష్ట్రాలతో పంచుకోవాలి. కాని జరుగుతున్నదేమంటే సెస్, సర్ ఛార్జీలనే అదనపు పన్ను వసూలు చేసి తన జేబులో వేసుకోవడమే. దీని ఫలితంగా ఫైనాన్స్ కమిషన్లు కేంద్ర స్థూల పన్ను ఆదాయంలో రాష్ట్రాల వాటా 2000-05లో 29.5 శాతం కాగా 2010-15లో 32 శాతానికి పెంచాలని ఫైనాన్స్ కమిషన్లు సిఫార్సు చేయగా, వాస్తవంలో రాష్ట్రాల వాటా 26 నుంచి 28 శాతానికి మాత్రమే కేంద్రం పెంచింది. సెస్‌లు, సర్ ఛార్జీల వసూలుతో కేంద్ర ప్రభుత్వ ఆదాయం పెరిగింది కాని ఆ పెరుగుదల రాష్ట్ర ప్రభుత్వాల ఆదాయంలో కానరాలేదు. 14వ ఫైనాన్స్ కమిషన్ ఈ శాతాన్ని 32 నుంచి 42కు పెంచితే, ఒకపక్క ఆ సూచనను కేంద్రం అంగీకరిస్తూ, రెండో పక్క కేంద్ర ప్రతిపాదిత పథకాలు కొన్నింటికి కేంద్రం ఇచ్చే నిధులను తగ్గించి, లేదా ఉపసంహరించి తన సర్ ఛార్జీలు, సెస్‌లను మాత్రం వసూలు చేసుకుంటూనే ఉంది.

చాలా కాలంగా కేంద్రం వసూలు చేసే పన్నుల్లో 50 శాతం రాష్ట్రాలకు ఇవ్వాలని పార్టీ విభేదాలు లేకుండా చాలా రాష్ట్రాలు డిమాండ్ చేస్తూనే ఉన్నాయి. కేంద్రం ఈ కోర్కెను నిరాకరిస్తూనే ఉంది. రాష్ట్రాలు తమ ఆర్థిక ఇబ్బందుల నుంచి బయట పడాలంటే వారి కోర్కెను అన్ని రాష్ట్రాలు కలిసి కేంద్రం మీద ఒత్తిడి తీసుకొని రావడం ఒకటే మార్గం. తాజా ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడు వై.వి. రెడ్డి ఈ వాటాను 42 శాతానికి పెంచారు కాబట్టి ప్రస్తుతానికి మిగతా ఎనిమిది శాతం పెంచి, కేంద్ర రాష్ట్ర సంబంధాలను ఒక గాడిన పడడానికి తోడ్పడాలి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# వ్యవసాయ రంగంలో సంక్షోభం

***కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవసాయ రంగం పట్ల చూపుతున్న నిర్లక్ష్య వైఖరికి తోడు, ప్రకృతి వైపరీత్యాల వల్ల వ్యవసాయ రంగం కుదేలవుతోందనీ, ఇది తీవ్ర సంక్షోభానికి దారితీస్తోందనీ అంటున్నారు* ఇప్ప వీరారెడ్డి**

పెట్టిన పెట్టుబడి మునిగిపోవడం (ఒక రకంగా చెప్పుకుంటే పెట్టుబడి సచ్చిపోవడం) ఎప్పుడైనా విన్నామా? అంటే విన్నాం. పెట్టుబడి మునిగిపోవడం కూడా అరుదుగా అప్పుడప్పుడు వింటూనే ఉన్నాం. కాని అవి ప్రత్యేక సందర్భాలు. వ్యక్తులు వ్యక్తిగతస్థాయిలో నిర్వహించుకునే పారిశ్రామిక-వర్తక-వాణిజ్య సంస్థల్లో ఆయా వ్యక్తులకు సంబంధించిన నిర్వహణా లోపాల (దోపిడీ నైపుణ్యాల లోపం) కారణంగా నష్టాలు రావడం - సంస్థలు మునిగిపోవడం అప్పుడప్పుడు వింటూనే ఉన్నాం. కాని ఒక సామాజిక విషయంగా కోట్లాది మంది వ్యక్తిగత వ్యాపకంగా నిర్వహిస్తూ, అంతకంటే మరికొన్ని రెట్ల ఎక్కువ మంది జీవికకు అత్యంతావశ్యకమైన అవసరాన్ని (ఆహారాన్ని) తీర్చే ఒకానొక రంగంలో, ఎడతెరపి లేకుండా లక్షలాది మందికి సంబంధించిన కోట్లాది రూపాల పెట్టుబడులు మునిగిపోతున్నాయి. ప్రతి ఏటా లక్షల సంఖ్యలో వారికి తెలిసిన ఏకైక జీవనోపాధి అయిన ఆ వ్యాపకాన్ని ఒదిలేస్తున్నారు. ఆ 'వ్యాపకం' ఆ 'రంగం' వ్యవసాయం-వ్యవసాయ రంగం అనేది ఈ పాటికే అర్థమయి ఉంటుంది.

'పెట్టుబడి' అనే శబ్దం వినగానే మనకు గుర్తొచ్చేది పారిశ్రామిక-సేవ - వర్తక - వాణిజ్య రంగాలు మాత్రమే. కాని వ్యవసాయ రంగం గుర్తుకురాదు. గుర్తొచ్చినా మిగితా రంగాలతో పెట్టుబడికి ఉన్న సంబంధాన్ని మాట్లాడుకున్నండగా, వ్యసాయ రంగంలో పెట్టుబడికి ఉన్న సంబంధాన్ని అంతగా మాట్లాడుకోం! 'పెట్టిన పెట్టుబడికి లాభం రాకపోతే పరిశ్రమను ఎవడు నిర్వహిస్తాడు' అంటూ పెట్టుబడికి లాభం రావడం ఒక జన్మ హక్కు అయినట్టుగా, పెట్టుబడికి లాభం లేకపోతే వ్యవసాయాన్ని ఎవరు చేస్తారని మాట్లాడుకోవడం లేదు. ఎందుకు? పంటపొలాల్లో పనిచేస్తున్న పెట్టుబడికి కూడా లాభం రావలసిందే అని ఎందుకు మాట్లాడడంలేదు? ఇంతకాలం మాట్లాడకున్నా ఇప్పుడా అవసరం వచ్చింది.

అన్ని రంగాల్లో ఆది రంగం 'పెద్దన్న'గా చెప్పుకోవలసినది వ్యవసాయ రంగమే. అయినా, ఆ తర్వాత పుట్టిన వర్తక - వడ్డీ రంగాలు, ఆ తర్వాత 'కడగొట్టు' రంగం అయిన 'పారిశ్రామిక రంగం'లో పనిచేస్తున్న 'పెట్టుబడి' పెద్దన్నగా వయసు మీరి జీవిత చరమాంకంలో ఉన్న 'వ్యవసాయ రంగం'లోని పెట్టుబడిని కబళిస్తుంది! ఇది నిజం. వ్యవసాయ రంగంలో గత మూడు దశాబ్దాలుగా జరుగుతున్నది ఇదే! ఎందుకు?

పెట్టుబడి మునిగిపోవడం అన్నది పెట్టుబడికే నచ్చని మాట! అవును, పెట్టుబడనేది ఏ రంగంలో పనిచేసినా 'ఇంతింతై-వటుడింతై' అన్నట్లు, 'క్షణ-క్షణా'నికి 'రెట్లు - రెట్లు'గా పెరిగిపోతూనే ఉంది. అది దాని సహజ లక్షణం. అట్లా దాని పరిమాణాన్ని పెంచుకోకపోతే అది పెట్టుబడే కాదు. కానీ ఈ కోణంలో వ్యవసాయ రంగాన్ని మినహాయించాలి. వ్యవసాయ రంగంలో పెట్టుబడి మునిగిపోతుంది! వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న పెట్టుబడి తన సహజ స్వభావాన్ని ప్రదర్శించలేక నిజంగానే సచ్చిపోతుంది. ఈ విషయం గత మూడు దశాబ్దాలుగా రుజువవుతూనే ఉంది.

దేశవ్యాప్తంగా లక్షల సంఖ్యలో రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. ఈ సంఖ్య తెలుగు రాష్ట్రాల్లో వేలల్లో పెరిగిపోతోంది. ఒక్క తెలంగాణలోనే రోజు పది మందికి తగ్గకుండా రైతులు ప్రాణాలు తీసుకుంటున్నారు. కొన్నాళ్లు పోతే రైతు 'ఆత్మహత్య' నమోదుకాని ఊరు లేదన్నా ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు!

దేశ వ్యాప్తంగా లక్షలాది మంది రైతులు తమ జీవనోపాధి అయిన వ్యవసాయ భూముల్ని శ్రమ దోపిడీతో కోట్లాది రూపాయల సంపదతో పులిసి (బలిసి) పోతున్న పారిశ్రామిక - వ్యాపార - వడ్డీ పెట్టుబడి దారులకు, అక్రమ సంపాదనతో ఆస్తులు పోగేస్తున్న జడ్జీలకు - లాయర్లకు, పోలీసు - రెవెన్యూ - విద్యుత్ - నీటి పారుదల - వ్యవసాయ - కార్మిక - ఆదాయ - ఎక్సైజ్ - అటవీ - పరిపాలన (సెక్రటేరియట్ - కలెక్టరేట్) శాఖలకు సంబంధించిన ప్రభుత్వ ఉన్నతాధికారులకు, కాంట్రాక్టర్లకు, ప్రజా ప్రతినిధులుగా ఉన్నత స్థానాల్లో కొనసాగిన - కొనసాగుతున్న రాజకీయ నాయకులకు, శ్రమతో సంబంధం లేకుండానే చేస్తున్నదానికి కోట్లాది రూపాయలను ప్రతిఫలంగా పొందుతున్న నటులకు, శ్రమ విలువ కంటే కూడా అత్యధిక వేతనాలు పొందుతున్న ప్రొఫెసర్లకు, లెక్చరర్లకు, డాక్టర్లకు చౌకగా అమ్మేస్తున్నారు. ఇప్పుడు తెలంగాణలోని ఏ మండలాన్ని తీసుకున్నా ఆ మండలంలోని కనీసం ఐదారు గ్రామాల్లోనైనా పై సెక్షన్లకు సంబంధించిన వాళ్ల ఫామ్ హౌజ్‌లు, గెస్ట్ హౌజ్‌లు, అగ్రిగార్డెన్స్ కనపడుతున్నాయి.

పెట్టిన పెట్టుబడి మీద లాభాన్ని ఆశించకుండా, లాభాన్ని రాబట్టకుండా పరిశ్రమను నిర్వహించే పెట్టుబడిదారుడెవడైనా ఉంటాడా? సరుకుని ఉత్పత్తి చేయించే క్రమంలో ఖర్చు అయిన పెట్టుబడి మాత్రమే సరుకు అమ్మకం ద్వారా తిరిగి వస్తుందా? సరుకు అమ్మకం ద్వారా వచ్చే మొత్తం ఖర్చయినా పెట్టుబడి కంటే తక్కువ ఉంటుందా? ఎక్కువుంటుందా?

ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి ఆర్థిక శాస్త్రం తెలియ నక్కరలేదు. లోకజ్ఞానం ఉంటే చాలు. సరుకు తయారయ్యే క్రమంలో ఖర్చయిన పెట్టుబడి కన్నా, సరుకు అమ్మకం ద్వారా వచ్చే మొత్తం తప్పకుండా ఎక్కువే ఉంటుంది. పెట్టుబడి కూడా రాని సంగతి వదిలేద్దాం. సరుకు సరుకు అమ్మకం ద్వారా పెట్టుబడి మాత్రమే వచ్చినా కూడా ఈ భూ మండలం మీద ఎవ్వడూ (పెట్టుబడి దారుడు) కూడా ఏ పరిశ్రమను నిర్వహించడు. ఇదిట్లా జరుగుతుందని తెలియడానికి తిరుగులేని నిదర్శనం పెట్టుబడి దారుల వద్ద పోగుపడుతున్న కోట్ల రూపాయల సంపద రాసులే (పెట్టుబడిదారులే). ఏ పెట్టుబడిదారుని ఆస్తులు (సంపద)

లెక్క చూసినా అది నిన్నటి కంటే 'ఇవ్వాళ', ఇవ్వాళ కంటే 'రేపు' (క్రితం క్షణం కంటే కూడా) తప్పకుండా పెరిగే ఉంటుంది.

మరి ఈ తిరుగులేని సత్యం వ్యవసాయ రంగంలో ఎందుకు తలకిందులవుతుంది? రైతు కూడా తన వ్యవసాయంలో ఖర్చు చేస్తున్న పెట్టుబడిని తన ఉత్పత్తులైన 'పంటలను' అమ్మకం ద్వారా వెనక్కి తీసుకుంటున్నప్పుడు వచ్చే మొత్తం కూడా ఖర్చయిన పెట్టుబడి కంటే ఎక్కువ ఉంటుందా? తక్కువ ఉంటుందా? అంతే ఉంటుందా? పెట్టుబడి అనేది ఎక్కడ పనిచేసినా లాభాన్ని తీసుకురాకుండా ఒట్టి చేతుల్తో రాదనేది మనకు పారిశ్రామిక – సేవా రంగాల్లో కనపడుతున్న సత్యం. అదే సూత్రం వ్యవసాయ రంగంలో కూడా రుజువవ్వాలి.

కాని అట్లా జరగడం లేదు. రైతు తన ఉత్పత్తులను (పంటలను) అమ్మడం ద్వారా తనకు ఖర్చయిన పెట్టుబడితో పాటు దానికి తగ్గట్లు (పరిణామానికి తగ్గట్లు) లాభాన్ని కూడా ఖచ్చితంగా పొందాలి. ఆ ఎక్కువొచ్చే లాభం సంగతి కూడా వదిలేద్దాం. అసలు ఖర్చయిన పెట్టుబడైనా రావాలి కదా? ఖర్చయిన పెట్టుబడి కూడా రావడం లేదని ప్రతి సంవత్సరం పెట్టుబడి మునిగిపోతూనే ఉందని వ్యవసాయరంగ పరిస్థితిని చూస్తూనే తెలుస్తుంది.

ఇందుకు సాక్ష్యం నిండా అప్పుల్లో మునిగి ఆస్తులు అమ్ముకుంటున్న రైతులు కొందరైతే, ఉన్న ఆస్తి మొత్తం అమ్మినా అప్పులు తీరని రైతులు కొందరు. మరొకవైపు అమ్ముకోవడానికి ఆస్తులు లేని కౌలు రైతులు (ఆత్మహత్యలు చేసుకుంటున్న వాళ్లలో వీళ్ల సంఖ్యే ఎక్కువ.) ఆస్తులున్నా కన్న కొడుకుల భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని అమ్ముకోవడం ఇష్టం లేక, అవమానాలు భరించలేక ఆత్మహత్యలు చేసుకుంటున్న వాళ్లు ఎంతోమంది.

అసలు వ్యవసాయ రంగంలోనే ఎందుకీ సంక్షోభం? పారిశ్రామిక – సేవారంగాల్లో లేని–రాని సంక్షోభం వ్యవసాయ రంగంలోనే ఎందుకని? పారిశ్రామిక రంగ పెట్టుబడులకు రాని నష్టాలు వ్యవసాయ పెట్టుబడులకే ఎందుకొస్తున్నాయి? వ్యవసాయంతో సంబంధం లేని పారిశ్రామిక శాఖల సంగతి వదిలేద్దాం. పూర్తిగా వ్యవసాయోత్పత్తుల మీదనే ఆధారపడిన పారిశ్రామిక శాఖల గురించే మనం మాట్లాడుతున్నది. ఇలాంటి వ్యవసాయాధారిత పరిశ్రమలు నష్టాలపాలై వాటి అధిపతులు ఆత్మహత్య లు చేసుకున్న సందర్భాలు ఎప్పుడైనా, ఎక్కడైనా కనబడుతాయా?

10 ఎకరాల విస్తీర్ణంలో పత్తి మిల్లును నిర్వహిస్తున్న పెట్టుబడిదారు నికేమో కోట్లాది లాభాలా? ఆ పత్తి మిల్లును సంవత్సరం పొడువునా సరిపడే ముడి సరుకుని (పత్తి) అందిస్తున్న వందలాది మంది (వందలాది ఎకరాల్లో) పత్తి రైతులకేమో పస్తులు, అప్పులు – ఆత్మహత్యలా? ఏం జరుగుతున్నట్లు?

దారం ఉత్పత్తి కోసం పత్తిమిల్లులో పనిచేస్తున్న పారిశ్రామిక పెట్టుబడికేమో లాభాలా? పత్తి ఉత్పత్తి కోసం పంట పొలాల్లో పనిచేస్తున్న వ్యవసాయ పెట్టుబడికేమో నష్టాలా! ఇదెక్కడి న్యాయం? ఎందుకిట్లా జరుగుతుంది?

ఇది ఒక్క పత్తి పంట విషయంలోనే కాదు, దేశ వ్యాప్తంగా కోట్లాది ఎకరాల్లో సాగవుతున్న పత్తి – ధాన్యం – గోధుమలు – వేరు శనగ (నూనె గింజలు) పప్పు ధాన్యాలు – పసుపు – మిర్చి – చెరుకు – మొక్కజొన్న – సోయా – ఆలు – టమాట – పండ్లు తదితర ఎన్నో రకాల వ్యవసాయోత్పత్తులను, తమ రక్తం దారపోసి పండిస్తున్న లక్షలాది రైతాంగం అప్పుల్లో మునిగిపోయి ఆత్మహత్యలు చేసుకుంటే, ఈ ఉత్పత్తులనే తమ పారిశ్రామికోత్పత్తులకు ముడి సరుకులుగా తీసుకుంటున్న వేలాది నూనె మిల్లులు, అటుకుల మిల్లులు, కారం – పసుపు పొడుల మిల్లులు, పప్పు మిల్లులు, గోధుమ పిండి మిల్లులు, పంచదార పరిశ్రమలు, చిప్స్ పరిశ్రమలు, పండ్ల రసాలు, పచ్చళ్ల పరిశ్రమలు ఇట్లా అనేక రకాల మిల్లు యజమానులు మాత్రం కోట్లాది రూపాయల లాభాల్లో మునిగి తేలుతున్నారు.

ఎందువల్ల? మరొకవైపు వ్యవసాయానికి అవసరమైన ఉత్పత్తి సాధనాలను ఉత్పత్తి చేస్తున్న (ఎరువులు, పురుగు మందులు, విత్తనాలు, యంత్రాలు) పారిశ్రామిక పెట్టుబడి దారులు కూడా రోజు రోజుకు అపర కుబేరులవుతున్నారు. ఏం కారణం? పారిశ్రామిక ఉత్పత్తుల్లో రాని నష్టాలు, వ్యవసాయోత్పత్తుల అమ్మకాల్లోనే ఎందుకొస్తున్నాయి? అసలు వ్యవసాయ మార్కెట్లో ఏం జరుగుతుంది?

ఏ సరుకైనా మార్కెట్ కొచ్చేది అమ్మకం కోసమే. మార్కెట్లో జరిగేదంతా సరుకు డబ్బుతో మారడం, డబ్బు సరుకుతో మారడమే. అయితే ఇది తప్పనిసరిగా సమాన విలువల మధ్యే జరగాలని, అందులోనే తన లాభాన్ని (తన సరుకుని తయారు చేసిన కార్మికుల అదనపు శ్రమను) అమ్మకం దారు తీసుకుంటాడనేది ఆర్థిక నియమం. పారిశ్రామికోత్పత్తుల విషయంలో నిజం అవుతున్న ఈ నియమం వ్యవసాయోత్పత్తుల విషయంలో మాత్రం ఘోరంగా ఉల్లంఘించ బడుతుంది. రైతుకు లాభం మాటేమో గాని, ఉత్పత్తి ఖర్చులు కూడా ముడి పడడం లేదు. కొనుగోలు దారుడైన పెట్టుబడిదారుడు రైతు ఉత్పత్తి విలువకు సమానమైన ధర చెల్లించడం లేదు. దాన్నే ముడి సరుకుగా వాడుకుని వాడు ఉత్పత్తి చేస్తున్న పారిశ్రామికోత్పత్తులను వాటి విలువ కంటే అధిక ధరలకు అమ్ముకుంటూ అనంతమైన లాభాల్ని ఆర్జిస్తున్నాడు.

ఒక ఉదాహరణ ప్రకారం, ఒక క్వింటల్ ధాన్యం మద్దతు ధర 1400 రూపాయలనుకుంటే, ఆ ధాన్యం నుండి 60 కిలోలల బియ్యం ఉత్పత్తవుతాయి. అంటే కిలో బియ్యం ధర 23 రూపాయల 30 పైసలు. ఆ లెక్కన క్వింటల్ బియ్యం ధర 2330 రూపాయలన్నమాట. ఈ ధరతో ఉత్పత్తి చేసిన బియ్యాన్ని పెట్టుబడిదారుడు సాధారణ రోజుల్లోనే 5 వేల రూపాయలకు మార్కెట్లో అమ్ముకుంటాడు. తేడా రెండు వేల ఆరు వందల డెబ్బై రూపాయలు. మిల్లింగ్ – ట్రాన్స్‌పోర్ట్ ప్రక్రియల ఖర్చు కింద 170 రూపాయలను తీసేసినా ఇంకా రెండు వేల ఐదు వందల రూపాయల లాభాన్ని పెట్టుబడిదారుడు సొంత చేసుకుంటాడు. ఇందులో మూడవ వంతు (సుమారు 800 రూపాయలు) ధాన్యాన్ని ఉత్పత్తి చేసిన రైతుకు కేటాయించినా, రైతు ధాన్యానికి మద్దతు ధర 1400+800 కలిపి 2200 రూపాయలకు పెరగవలసి ఉంటుంది. కాని ఆ ధరను మద్దతు ధరగా ప్రభుత్వాలు ప్రకటించవు.

అట్లా ప్రకటించినట్లయితే పెట్టుబడిదారులు ఊరుకోరు కదా! పెట్టుబడిదారుల ప్రమేయంతో, వాళ్ల ప్రయోజనాల కోసమే ఇంతింత తక్కువగా మద్దతు ధరను నిర్ణయిస్తున్న ప్రభుత్వాలు, 'ఈ విధానం రైతు శ్రేయస్సు కోసమే' అన్నట్లు మాట్లాడడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. రైతు వ్యవసాయోత్పత్తుల విలువకు సమానమైన ధరను పెట్టుబడి దారులు చెల్లించేటట్లుగా చూడాల్సింది పోయి, తమ ఉత్పత్తుల అమ్మకంలో ఘోరంగా మోస పోతున్న రైతుకు 'కనీస మద్దతు ధర మంత్రాన్ని ఉపదేశిస్తుంది! ఎంత మోసం?

అసలు వ్యవసాయోత్పత్తుల విషయంలోనే మద్దతు ధర అవసరం ఎందుకొస్తుంది? ఇంత వరకు ఈ ప్రశ్నను రైతులు అడిగింది లేదు. కాని అడగాలి. సరుకు విలువకు తగ్గట్లు సమాన ధరతో (కొన్ని సార్లు అంతకంటే ఎక్కువ ధరతో కూడా) పారిశ్రామిక ఉత్పత్తి దారులు తమ

ఉత్పత్తులను అమ్ముకుంటున్నట్లే 'మా ఉత్పత్తులను కూడా విలువకు తగ్గ సమాన ధర చెల్లించి పారిశ్రామిక పెట్టుబడిదారులు కొనుగోలు చేయాలి.' వాళ్ల ఉత్పత్తులకవసరం రాని మద్దతు ధరలు మాకెందుకు? అని ప్రభుత్వాన్ని నిలదీయాలి.

'కనీసపు మద్దతు ధర' విధానమే ఒక మోసమని గ్రహించాలి. ఇది పెట్టుబడిదారులను 'తక్కువ ధరలకే కొనండి, కాని కనీసం ఫలానా ధరకైనా కొనండి' అని బతిమాలినట్లు లేదూ! ఒక అలవాటైన అవాస్తవం మీద ప్రశ్నలుండవన్నట్లు ఈ విధానం ఎన్నాళ్ల నుంచో అమలువుతున్నా ఇందులో ఉన్న అహేతుకతను ఆలోచించడం లేదు. కనీసపు మద్దతు ధర అంటే బలవంతంగా కొనే స్థితిలో కొనుగోలుదారు (పెట్టుబడిదారుడు) బతిమిలాడి అంటగట్టే స్థితిలో అమ్మకం దారు (రైతు) ఉన్నట్లు కాదూ అర్థం? ఎన్నాళ్ల నుంచో మార్కెట్లో జరుగుతున్నదంతా ఇదే!

ప్రభుత్వానిది పక్షపాత ధోరణి కానట్లయితే పెట్టుబడిదారుల ఉత్పత్తుల విషయంలో గరిష్ఠ అమ్మకం ధర (ఎంఆర్‌పి) కాకుండా కనిష్ఠ అమ్మకం ధర (ఎల్‌పి) విధానానికి చట్టం తెస్తుందా? పారిశ్రామికోత్పత్తుల విషయంలో ఎక్కువలో ఎక్కువ ఎంతవరకు అమ్ముకోవచ్చో (ఎంఆర్‌పి) అనే విధానమా? వ్యవసాయోత్పత్తుల విషయానికి వచ్చే సరికి తక్కువలో తక్కువ ఇంతవరకు కొనవచ్చు (ఎంఎస్‌పి) అనే విధానమా? ఒక చోట అమ్మేవాడికి ప్రయోజనం! ఇంకో చోట కొనేవాడికి ప్రయోజనం! రెండు చోట్లా ఏకైక ప్రయోజనకారి పెట్టుబడిదారే! రెండు చోట్ల నష్టపోయేది రైతులే!

దీన్ని బట్టి ఈ ప్రభుత్వానిది పారిశ్రామిక వర్గ పక్షపాతమని ఖచ్చితంగా చెప్పవచ్చు. కాదని ప్రభుత్వాలు వాదించ దలిస్తే ఇప్పుడున్న మద్దతు ధరలను కనీసం రెండు రెట్లయినా పెంచాలి. అట్లయితేనే రైతు తను ఖర్చు చేసిన పెట్టుబడితో పాటు, సరుకులో ఉన్న తన అదనపు విలువ (శ్రమ)ను తను పొందగలడు. పారిశ్రామికోత్పత్తుల విషయంలో నిర్ణయించ బడుతున్న 'ఎంఆర్‌పి' లో ఎంత లాభం ఉందో కొనుగోలు దారునికి తెలియదు. అదెంతకు తయారయిందో తెలిస్తే కదా లాభం తెలిసేది. కాని వ్యవసాయోత్పత్తులకు నిర్ణయించబడుతున్న కనీసపు మద్దతు ధర (ఎంఎస్‌పి) మాత్రం ప్రభుత్వం ప్రకటిస్తుంది. వ్యవసాయోత్పత్తులకు ప్రకటించబడుతున్న మద్దతు ధరలన్నీ కూడా వాటి ఉత్పత్తి ధర (కాస్ట్ ప్రైస్)ను మించవు. చాలా వ్యవసాయోత్పత్తులకు ప్రకటించిన ఎంఎస్‌పిలు కాస్ట్‌ప్రైస్ కంటే కూడా తక్కువే! ఇంక వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న పెట్టుబడులు మునిగిపోకుండా ఏమవుతాయి?

ప్రభుత్వం ప్రకటిస్తున్న మద్దతు ధరలు, రైతుకయ్యే వ్యవసాయోత్పత్తుల ఉత్పత్తి ధర (కాస్ట్ ప్రైస్) కంటే కూడా తక్కువని ఎట్లా చెప్పొచ్చుంటే, రైతు క్షేత్ర స్థాయిలో సాధిస్తున్న ఎకరా సగటు దిగుబడి – దాని కోసం అయ్యే సగటు ఉత్పత్తి ఖర్చు, ప్రభుత్వం లెక్కకడుతున్న ఎకరా సగటు దిగుబడి కంటే తక్కువగానూ, సగటు ఉత్పత్తి ఖర్చుకంటే ఎక్కువగానూ ఉంటుంది. స్పష్టంగా చెప్పాలంటే ప్రభుత్వం దృష్టిలో తక్కువ ఖర్చు – ఎక్కువ దిగుబడి, క్షేత్ర స్థాయిలో రైతుకు ఎక్కువ ఖర్చు, తక్కువ దిగుబడి. దీని ప్రకారంగా ఏదేని ఒక ఒక పంటకు క్వింటాల్‌పై రైతుకయ్యే ఉత్పత్తి ఖర్చుకంటే కూడా ప్రభుత్వం ప్రకటిస్తున్న కనీసపు మద్దతు ధరే ఎంతో తక్కువగా ఉంటుంది!

ఇంత సంక్షోభం కొనసాగుతున్నా మన వ్యవసాయ రంగానికి సంబంధించిన మంచి స్థితిని కూడా చెప్పాలి. ఇప్పటికైతే ఈ దేశ వ్యవసాయ రంగ 'ఉత్పత్తి'లోకి కార్మికుల అదనపు విలువతో బలిసిన బడా పెట్టుబడుల ప్రవేశం జరగలేదు. ఈ పెట్టుబడులన్నీ వ్యవసాయ క్షేత్రాలకు బయట తమ పారిశ్రామికోత్పత్తులకు వ్యవసాయోత్పత్తులను ముడి సరుకుగా తీసుకునే పాత్రకే పరిమితమయ్యాయి.

ఈ దేశ వ్యవసాయ రంగం మెజారిటీగా చిన్న చిన్న కమతాలను స్వంతాస్థులుగా కలిగి ఉన్న చిన్న – సన్నకారు రైతాంగం, ఇతర వ్యాపకాలతో జీవనం వెళ్లదీస్తున్న సెక్షన్ల భూములను సేద్యం చేస్తున్న పేద కౌలు రైతులతో పాటు, చిన్న పెట్టుబడులతో రైతుల భూములను కౌలుకు సేద్యం చేయిస్తున్న చిన్న పెట్టుబడిదారీ కౌలు రైతులతో నిండి ఉంది. ఇదంతా మంచి పరిస్థితే అయినా, మరో కోణంలో ఇప్పటి ఈ సంక్షోభ పరిస్థితికి కూడా ఇదే పరిస్థితి కారణం అవుతుంది.

అదెట్లా అంటే, వీళ్ల ఉత్పాదక శక్తి చాలా తక్కువ. అదీ కాక పారిశ్రామిక రంగంతో పోలిస్తే వ్యవసాయ రంగం 'లోయర్ కంపోజిషన్' (పెట్టుబడిలో స్థిరకన్నా ఉత్పత్తి సాధనాల విలువ) అస్థిర (జీతాల మొత్తం) ఎక్కువకు చెందినది. ఈ కారణంగా వ్యవసాయోత్పత్తులు ఎక్కువెక్కువ అదనపు విలువతో నిండి ఉండి వాటి విలువ సహజంగా ఎక్కువుంటుంది. (ఏదేని సరుకు విలువలో ఉన్న అదనపు విలువకు కారణం శ్రామికులే నన్న సంగతి మరిచిపోకూడదు) అదీగాక వ్యవసాయోత్పత్తుల అమ్మకంలో ఉన్న అసౌకర్యం ఏమిటంటే, ఇవి నేరుగా జీవితావసర వినియోగ ఉత్పత్తులు కావు.

ముందు చెప్పుకున్నట్లు పారిశ్రామికోత్పత్తులకు ముడి సరుకులుగా మాత్రమే ఉపయోగపడే స్థితిలో ఉంటాయి. అంటే కొన్ని కోట్ల మంది రైతాంగం ఉత్పత్తి చేస్తున్న వ్యవసాయోత్పత్తులను కొన్ని వేల మందో కాకుంటే కొన్ని లక్షల మందో పారిశ్రామిక వేత్తలు తమ ఉత్పత్తులకు ముడి సరుకులుగా మాత్రమే వాడుకోవాల్సిన ప్రత్యేక పరిస్థితి. ఏ సరుకు విషయంలోనైనా ఉత్పత్తిదారులు తక్కువ ఉండి, వినియోగదారులు ఎక్కువ ఉండాలి. కాని వ్యవసాయోత్పత్తుల విషయంలో ఉత్పత్తిదారులు (రైతులు) కోట్లల్లో, వినియోగదారులు (పారిశ్రామిక పెట్టుబడిదారులు) వేలు – లక్షలు. ఈ విధమైన ప్రత్యేక పరిస్థితుల కారణంగానే వ్యవసాయోత్పత్తులను పారిశ్రామిక పెట్టుబడిదారులకు బలవంతంగా అంటగట్టాల్సిన పరిస్థితుల్లో రైతాంగం ఉండవలసి వస్తుంది.

దీన్ని అవకాశంగా తీసుకుంటున్న పారిశ్రామిక పెట్టుబడిదారులు రైతు వ్యవసాయోత్పత్తుల విలవకు తగ్గట్లు ధరలు ఇవ్వడానికి నిరాకరిస్తూ, అత్యంత అధ్వాన్నపు స్థాయిలో ధరలను నిర్ణయిస్తున్నారు. పేద రైతాంగం తన ఉత్పత్తులను అమ్ముకోకుండా ఆపుకోలేని దుస్థితిలో 'కనీసం కూళ్లు మిగిలినా చాలు' అనుకుంటూ తమ ఉత్పత్తులను అమ్ముకుంటున్నారు. ఈ కారణంగా వ్యవసాయ రంగం నుంచి ఎంతో అదనపు విలువ పారిశ్రామిక రంగానికి తరలిపోతుంది. మొదట చెప్పినట్లు పారిశ్రామిక రంగంలో పనిచేస్తున్న 'పెట్టుబడి' వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న 'పెట్టుబడి'ని కబలిస్తుందన్నదానికి అర్థం ఇదే!

పారిశ్రామిక రంగంలో పనిచేస్తున్న పెట్టుబడి లాభం రాబట్టు కోవడానికి, వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న పెట్టుబడికి ఆ అవకాశం లేకపోవడానికి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో ఉన్న ఒక ప్రత్యేక పరిస్థితిని కూడా చూడాలి. పారిశ్రామిక రంగంలో వివిధ శాఖల్లో పనిచేస్తున్న పెట్టుబడులు ఒకదానితో ఒకటి పోటీ పడడం వల్ల లాభాన్ని సమానంగా పంచుకునే ఏర్పాటు ఒకటి నిరంతరం జరుగుతుంది. ఉత్పత్తి శక్తిని పెంచి ఇతరులకంటే తక్కువ ఖర్చుతో సరుకునుత్పత్తి చేసి ఇతరులు అమ్మే ధరకే అమ్మి, వీలైతే ఇతరులకంటే కూడా కొంత తగ్గించడం ద్వారా ఎక్కువ సరుకును అమ్మి ఎక్కువ లాభాలను పొందడంలో ఈ పోటీ. ఈ పోటీలో తక్కువ లాభాలతో సంతృప్తి చెందని పెట్టుబడులు

# ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక హోదాపై పోరు

***వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యే హోదా కోరుతూ ఇతర పార్టీలను కలుపుకు పోకుండా నియంతృత్వంగా వ్యవహరిస్తుంటే, టిడిపి విషయాన్ని పక్కదారి పట్టిస్తున్న తీరును వివరిస్తున్నారు వై.ఎచ్.కె. మోహన్‌రావు***

ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా కోరుతూ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు జగన్మోహన్‌రెడ్డి చేస్తున్న పోరాట ఒరవడి ఒంటెద్దు సాగుబడిలా ఉంది. మరో కోణంలో ఆ పార్టీని నడిపే తీరులో జగన్మోహన్‌రెడ్డి ప్రధాని నరేంద్రమోడీని ఆదర్శంగా స్వీకరించినట్లుగా తోస్తుంది. అన్నీ తానై, తానే అన్నై అన్నచందంగా జగన్ ప్రవర్తన కనిపిస్తుంది. హోదా సాధన కోసం పోరాట కాడిని తనొక్కడే భుజాన వేసుకుని సాగడం సమంజసంగా లేదు. మరోవైపు కాడికిందకొస్తామని స్వచ్ఛంద సంకేతాలిస్తున్న సిపిఎం, సిపిఐ, కాంగ్రెస్ పార్టీలను కలుపుకుని పోకపోవడం జగన్మోహన్‌రెడ్డి ఒంటరి పోకడకు దర్పణం పడుతుంది.

బిజెపి జాతీయ అధ్యక్షునిగా ఉన్న అమిత్‌షా నుండి పార్టీలో ఒక వెలుగు వెలిగిన అధ్వానీ వంటి జాతీయ స్థాయి నాయకులకు సైతం ప్రాధాన్యత లేకుండా విశ్వరూపంతో స్వైర విహారం చేస్తున్న ప్రధాని మోడీ శైలిని జగన్మోహన్‌రెడ్డి భాగా ఒంటబట్టించుకున్నట్లుగా ఉంది. పార్టీలో మరొకరి స్వరం వినిపించకూడదు, మరొకరు మీడియాకు దగ్గర కాకూడదు, ఇతరేతరుల ప్రాపకం ఎంత మాత్రం సహించలేని ధోరణిలో ఇరువురి ప్రయాణం సాగుతుందని రాజకీయ విశ్లేషకులు అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

అయితే చట్ట సభలో మాత్రం జగన్మోహన్‌రెడ్డి కంటే మోడీ వ్యవహార శైలే కొంత మెరుగనిపిస్తుంది. బహిరంగ సభలలో, ఇతర కార్యక్రమాల్లో రెండు చేతులు చాపి, స్వరాన్ని ఉచ్ఛ స్థితిలోకి తీసుకువెళ్లి, హావభావాలు ప్రదర్శించే మోడీ పార్లమెంట్ ఉభయ సభల్లో ఎక్కువ సమయం మౌనం వహిస్తూ గంభీరంగా ప్రేక్షకపాత్ర వహిస్తారు. తన సహచర మంత్రులకూ, పార్టీ సభ్యులకూ అవకాశాలనిచ్చి తను తప్పుకుంటాడు.

ఈ కోవలో జగన్మోహన్‌రెడ్డిని విశ్లేషించుకుంటే అసెంబ్లీలో కూడా అన్నీ తానై ప్రవర్తిస్తున్నారు. ఇతరత్రా తమ పార్టీ శాసనసభ్యులకు మాట్లాడే అవకాశాలను తాను అతి తక్కువగా విడిచిపెడుతున్నాడు. జగన్మోహన్‌రెడ్డి విషయ సంపదతోనే శాసనసభకు వస్తున్నాడు. సమస్యలపై లోతుగానే చర్చిస్తున్నాడు. అయితే జగన్మోహన్‌రెడ్డి విమర్శలకూ, ప్రజా సమస్యల ప్రస్తావనకూ సమాధానాలు వెతుక్కోలేని పాలకవర్గ 'దేశం' శాసనసభ్యులూ, మంత్రులూ ప్రతిపక్ష నాయకుడు లక్షల కోట్లు ప్రజాధనం దిగమింగిన దోషి అంటూ వ్యక్తిగత దూషణలకు దిగుతూ చర్చలను పక్కతోవ పట్టిస్తారు. 16 నెలల పాటు రిమాండు ఖైదీగా ఉన్న జగన్మోహన్‌రెడ్డి అంటూ ధ్వజమెత్తి గందరగోళం సృష్టిస్తారు. తండ్రి ఫ్యాక్షనిష్టని, జగన్ ఫ్యాక్షనిష్టని రెచ్చగొడతారు.

ఇలాంటి పూర్వ రంగంలో కూడా పార్టీలోని సీనియర్లను, విషయంపై భాగా మాట్లాడగలిగిన వారిని ఆయన ప్రోత్సహించడనేది సర్వత్రా వినవస్తున్న వ్యాఖ్య. ప్రజా సమస్యలపై చర్చకు ఇతరులకు కూడా స్వేచ్ఛనిస్తే బహుశా దూషణల పర్వం, వ్యక్తిగత విమర్శలు చాలా మేరకు

---

త్వరత్వరగా ఆ శాఖలను వదిలిపెట్టి ఎక్కువ లాభాల శాఖల్లోకి మారిపోతాయి. దీనితో లాభాలను అన్ని పెట్టుబడులు సమానం చేసుకుంటాయి. అయితే ఈ విధమైన ఏర్పాటు వ్యవసాయ రంగంలో లేదు. పారిశ్రామిక రంగం వివిధ శాఖలు (సిమెంట్ – కాగితం – బొగ్గు – హోటల్స్ తదితర) గా విభజించబడినట్లుగా వ్యవసాయ రంగంలో శాఖల విభజన లేదు. వ్యవసాయ రంగం మొత్తం ఒకే శాఖగా ఉంది. ఈ పరిస్థితుల్లో వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న పెట్టుబడి కూడా సామాజిక అదనపు విలువలో తన పరిమాణానికి తగ్గట్లు 'సమాన పెట్టుబడికి సమాన లాభం' పునాదిపై 'జనరల్ లాభం రేటు' ప్రకారంగా అదనపు విలువను రాబట్టుకోవాలంటే వ్యవసాయ రంగంలో కూడా శాఖల విభజన జరగాలి.

వ్యవసాయ రంగంలో సంపూర్ణంగా పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందాలి. భారీ పెట్టుబడుల ప్రవేశం జరగాలి. ఉత్పత్తి శక్తులు పెరగాలి. వందల – వేల ఎకరాల మీద ఏకవ్యక్తి యజమాన్యం ఉండాలి. అప్పుడు వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న పెట్టుబడి కూడా అదనపు విలువను రాబట్టుకుంటుంది. అయితే ఇట్లా పరస్థితుల్లో మార్పు రావడం అంటే ఇప్పుడు వ్యవసాయ రంగంలో కొనసాగుతున్న చిన్న – సన్నకారు – పేద కౌలు రైతాంగాన్ని వాళ్ల వాళ్ల పంట పొలాల నుండి తరిమేయడమే ఖచ్చితంగా పేద రైతాంగం తమ భూముల్లోనే కూలీలుగా మారిపోయిన పరిస్థితి అన్నమాట.

ఇదంతా ఇప్పటికైతే జరగలేదు గాని, రైతాంగం నుంచి ఎలాంటి ప్రతిఘటన లేనట్లయితే ఆ పరిస్థితిని సమీప భవిష్యత్తులో మనమందరం చూస్తాం. ఇప్పటికే సమాజంలోని సకల రంగాలను కబలించిన పెట్టుబడి వ్యవసాయ రంగాన్ని కూడా కబళించడానికి 'పొలం గట్టు' మీద కాచుక్కూర్చుంది.

పాలక వర్గాలు కూడా ఒకరిని మించి మరొకరు తమ పెట్టుబడి ప్రభువులకు వ్యవసాయ రంగాన్ని అప్పజెప్పడానికి పోటీ పడుతున్నారు. అందుకోసమే దివాళాకోరు వ్యవసాయ విధానాలను అమలు పరుస్తున్నారు. దానితో వ్యవసాయ రంగంలో తీవ్ర సమస్యలను సృష్టిస్తున్నారు. భూములు వదులుకునేందుకు రైతులను మానసికంగా సిద్ధం చేస్తున్నారు. చిన్న, సన్నకారు, మధ్యతరగతి, కౌలు రైతాంగం చేతి నుండి బలిసిన పారిశ్రామిక – వర్తక – వడ్డీ పెట్టుబడిదారుల చేతుల్లోకి వ్యవసాయ రంగం బదలాయించబడక ముందే, రైతాంగం ఉద్యమించక తప్పదు. ఆ ఉద్యమాన్ని బలపరుద్దాం. దాంట్లో బాగమవుదాం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

తగ్గవచ్చుని, ప్రజా సమస్యలపై దృష్టి కేంద్రీకరించడం జరుగుతుందని ఆ పార్టీ అభిమానులు కూడా అంటున్నారు.

హోదా కోరుతూ ఇటీవల గుంటూరు కేంద్రంగా వైఎస్ఆర్‌సిపి అధినేత జగన్ చేపట్టిన నిరవధిక నిరాహార ధీక్ష సందర్భంలో ఎపి సిపిఎం కార్యదర్శి మధు, సిపిఐ నేతలు ముప్పాళ్ల నాగేశ్వరరావు ఇతరులు వేదిక వద్దకు వచ్చి తమ పార్టీల మద్దతు ప్రకటించారు. కాంగ్రెస్ పార్టీ తన సంఘీభావాన్ని తెలిపింది.

అయితే ఎపిలో అతిపెద్ద ప్రతిపక్ష పార్టీ అయిన వైఎస్ఆర్‌సిపి అధ్యక్షుడు ప్రజా పోరాటాలలో ఈ పార్టీలను ఎందుకు కలుపుకుపోవడం లేదనేది అర్థం కాని పరిస్థితి. జగన్మోహన్‌రెడ్డికి మద్దతు, సంఘీభావం ప్రకటించిన పార్టీలు ఎలాంటి భేషజాలు లేకుండా ప్రజా సమస్యలపై పోరాటాలకు తాము ఎవరితోనైనా కలిసి ప్రయాణం చేస్తామని స్పష్టం చేశాయి. ఎన్నికలు, సీట్ల పంపకాలు, సర్దుబాట్ల గురించి ఆలోచించడానికి మూడున్నరేళ్ల వరకూ సందర్భం కాదు కదా? సాధారణ ఎన్నికలు ఇప్పట్లో లేవుకదా? ఏమిటి జగన్మోహన్‌రెడ్డి సంకోచం, సంశయం? ఎందుకు అంతర్మధనం చెందుతున్నారు? ఆయన తీరులోని అంతరార్థం ఏమిటి? రాజకీయ వాదులకు అర్థం కాకుండా ఉంది. వారి పార్టీ శ్రేణులైతే జగన్ ప్రవర్తన అవగతానికిరాక తలలు పట్టుకుంటున్నారు.

ఇప్పటికే జగన్మోహన్‌రెడ్డి పార్టీలోని సీనియర్ల అభిప్రాయాలకు గౌరవం ఇవ్వరని, ఏకపక్ష నిర్ణయాలలో అనుభవ కొరత కనిపిస్తుందని, పార్టీ నాయకత్వాన్ని సరిగా పనిచేయించడం లేదని, రెండవ తరగతి నాయకత్వ నిర్మాణంపై దృష్టిపెట్టడం లేదనే ప్రచారం నడుస్తుంది. పార్టీ కార్యక్రమాల నాణ్యత కొరవడుతుందని, గ్రామ స్థాయి నుండి పార్టీని ప్రణాళికాబద్ధంగా బలోపేతంచేసే విషయంపై శ్రద్ధచూపడం లేదని స్వరాలు వినవస్తున్నాయి.

దిశా నిర్దేశంలేని పోరాటాలతో పార్టీ నాయకులు, కార్యకర్తలు ఊపిరి తీసుకోలేని ఇబ్బడిముబ్బడి కార్యక్రమాలు చేపడుతున్నాడని, పాలక పార్టీపై ఉధృతమౌతున్న ప్రజా వ్యతిరేకతను అనుకూలంగా మలుచుకోవడంలో సఫలం కాలేకపోతున్నాడని, కొన్నికొన్ని సందర్భాల్లో నియంత పోకడ గోచరిస్తుందనే ఆ పార్టీ నేతల అసంతృప్తికి హోదాపై కలిసి వస్తామంటున్న ఇతర పార్టీలను కలుపుకుని పోకపోవడం అనే అంశం బలాన్ని చేకూర్చుతుంది. ఎన్నికలతో, రాజకీయాలతో సంబంధంలేని కేవలం రాష్ట్ర ప్రయోజనాలను ఆశించే స్వచ్ఛంధ సంస్థలను కూడా కలుపుకు పోవడంలో జగన్ విఫలమౌతున్నాడని వ్యాఖ్యలు వినవస్తున్నాయి.

ఇకపోతే హోదాపై బాబునోట మాట పెగలడం లేదు. బహుశా నోటికి తనంతటతానే తాళం పెట్టుకున్నట్లుగా ఉంది. హోదాపై మాట్లాడకుంటే పోనీ, మోడీ పైననూ, కేంద్ర ప్రభుత్వం పైననూ ఆయన పొగడ్తలు గుప్పిస్తున్నాడు. రాష్ట్రానికి ఈ పాటికే చాలా ఇచ్చి ఆదుకున్నారని మోడీని కీర్తిస్తున్నాడు.

అప్పటి ప్రధాని మన్మోహన్ సింగ్ పార్లమెంట్‌లో ఎపి ప్రత్యేక హోదాపై ఇచ్చిన ఐదు ఏళ్లు కాలం చాలదని రాజ్యసభలో వెంకయ్యనాయుడు ప్రతిపాదించిన పది సంవత్సరాల తీర్మానానికీ, తిరుపతిలో మోడీతో సంయుక్తంగా జరిగిన ఎన్నికల ప్రచారంలో పదేళ్లు చాలదు 15 ఏళ్లు కావాలని తను కోరిన సంగతికీ బాబు ఎన్నో వాగ్దానాల వలనే గోదావరి పుష్కరాలలో తర్పణ విడిచినట్లుగా స్పష్టమౌతుంది. పైగా హోదా ఎట్లాగూ రాదనే నమ్మకానికి వచ్చిన బాబు హోదా సంజీవనీ కాదంటూ ప్రజల ఆలోచనలను మళ్లించడానికి ప్రయత్నించి ఆగ్రహాన్నే చవిచూశారు. హోదా సంజీవనీ కాకపోతే ఇప్పటి వరకూ ఎందుకు దానికోసం జపం, తపం చేశారని ప్రజలు సూటిగానే ప్రశ్నించారు. సమాధానం లేదు. గట్టిగా అడిగే పరిస్థితీ లేదు. బహుశా బాబు మోడీ అంటే ఏమిటో పూర్తిగా అవగతం చేసుకుని ఉంటాడు. ఆయన అసలు నైజం బాబు దర్శించి ఉంటాడు. తన పరిస్థితిని అంచనా కట్టుకుని అడుగులు వేస్తున్నాడు. జరుగుతున్న పరిణామాలు బాబుని నిశ్శబ్ధ స్థితికి నెట్టివేస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం రాష్ట్రానికి ఇక ఏమీ ఇవ్వకపోయినా కేంద్ర ప్రభుత్వానికి గానీ, మోడీకి గానీ, ఆ పార్టీ శ్రేణులకు గానీ రుచించని ఎలాంటి వ్యాఖ్య చేయలేని అశక్తతకు బాబు చేరుకున్నట్లు వెల్లడవుతుంది.

పక్కనున్న తెలంగాణ రాష్ట్ర సిఎం కెసిఆర్ ఇరుకునపడ్డ వైనాన్ని లెక్కగట్టుకుని తను ఎట్లా ప్రవర్తించాలో రచించుకుంటున్నాడు. ఈపాటికే ఫోన్ ట్యాపింగ్ కేసులో పీకలలోతులో ఉన్న కెసిఆర్ మెడకు ఇప్పుడు సిబిఐ కేసు చుట్టుకుంది. ఎప్పుడో ఏడేళ్ల క్రితం కేంద్రంలో నిర్వహించిన కార్మికశాఖా మంత్రి పదవితో చేసిన చట్టవ్యతిరేక సంతకాల కేసు ఇప్పుడు సిబిఐ రూపంలో వచ్చిన ఉరితాడులా శిరస్సుపై వేలాడుతుంది. చిక్కుల్లో పడిన కెసిఆర్‌ను చూసి తను అయినా ఇంతేకదా? అని ఆందోళన చెందుతున్నట్లుంది బాబు.

ఒక పర్యాయం సిబిఐ వేటు రుచిచూడవలసిన ఇక్కట్టు నుండి సాంకేతికంగా బయటపడి ఊపిరి పీల్చుకున్న బాబు ఆ దిశగా ఆలోచించి హోదా విషయంలోనూ, ఆర్థిక సహాయం విషయంలోనూ మోడీని ప్రశ్నించకపోవడం అసాధరణ అంశమని భావించడం పొరపాటే అవుతుంది. ఇప్పటికి నోటుకు ఓటు కేసు చార్జిషీట్‌లో 23 పర్యాయాలు ప్రస్తావించిన బాబు నామం మెడమీద కత్తిలా తళుకుమంటుంది. అందుకే మోడీవద్ద బాబు 'రాముడు మంచి బాలుడు' అన్న చందంగా ప్రవర్తిస్తున్నాడు. మోడీ పేరు వినిపిస్తే చాలు 'వాయుపుత్ర ఆంజనేయుడిలా' చాలా ఇచ్చారంటూ భజన చేస్తున్నాడు.

అందుకే మోడీ పంపిన యోగా గురువు జగ్గీబాబాతో కలిసి వృత్త నృత్యం కూడా చేశాడు. జగ్గీబాబా ఆశ్రయానికి అమరావతి రాజధాని పరిసరాలలో వందల ఎకరాలు ధారాదత్తం చేసి బాబాను సంతృప్తి పరచడం ద్వారా మోడీని సంతోష పెట్టాడు. జగ్గీబాబా వచ్చి వెళ్లిన తర్వాత బాబు రాష్ట్ర హక్కుల సాధనలో విరాగిగా మారాడా? అన్న సంశయం కలుగుతుంది. ఇచ్చిన దానితో, ఉన్నదానితో కేంద్రం విషయంలో సంతృప్తి చెందాలనుకుంటున్నట్లుగా ఉన్నది ఆయన తీరు. మోడీ రాష్ట్రానికి ఏమీ చేయకపోయినా బాబు ఎటువంటి వ్యతిరేక వ్యాఖ్య చేయలేని నిస్సత్తువలోకి వెళ్లాడు. మోడీ నొచ్చుకుంటే తనపని 'గోవిందా' అనుకున్నాడేమోననే అనుమానం వస్తుంది.

ఒకవైపు బిజెపి నాయకులు వరుసపెట్టి ఒంటికాలిపై లేస్తూ చంద్రబాబునూ, ఆయన మంత్రివర్గ సభ్యులనూ, 'దేశం' ప్రశేణులనూ దుయ్యబడుతున్నా తమను కాదన్నట్లుగా వ్యవహరిస్తున్నాడు. 'దేశం' వర్గాలు రాష్ట్రాన్ని వరుసబెట్టి దోచుకుంటున్నారని ధ్వజమెత్తినా విననట్లుగా ప్రవర్తిస్తున్నాడు.

ఈ పరిణామాలకు సమాధానాలుగా తమ మౌనానికి కారణం మిత్ర ధర్మమనే చీకటి తెరనొకదానిని అడ్డుపెట్టుకుంటూ తప్పుకు పోతున్నాడు. కేంద్ర ప్రభుత్వ ధోరణిపై సిఎం బాబు, 'దేశం' శ్రేణులు అనుసరిస్తున్న మెతక వైఖరికి కారణాలుగా వారు చెప్పుకుంటున్న భాష్యాలు అంత సమంజసంగా లేవు. అదే విధంగా విభజన బిల్లులో ప్రస్తావించిన అంశాలు, ప్రత్యేక హోదా, ఎన్నికల ప్రచారంలో మోడీ నోటివెంట వెలువడిన వాగ్దానాలు రాష్ట్రానికి ఒనగూర్చకపోతే బిజెపి ఎపి ప్రజా వ్యతిరేకతను మూటగట్టుకోవడం ఖాయం.

*(రచయిత పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు)* వీ

# ప్రత్యేక హోదాతో ప్రయోజనమేంటి?

***ప్రజల మౌలిక సమస్యలకు ప్రత్యేక హోదా మాత్రమే పరిష్కారం కాదనీ, ప్రత్యేక హోదా పేరుతో ప్రజలను అసలు సమస్యలను నుండి తప్పుదోవ పట్టిస్తున్న రాజకీయ పార్టీల తీరును వివరిస్తున్నారు ఎం. కె. కుమార్***

ఆంధ్రప్రదేశ్‌కి ప్రత్యేక హోదా కల్పిస్తారా లేదా అనే విషయంపైనే రాష్ట్ర రాజకీయాలంతా తిరుగుతున్నాయి. ఎపికి ప్రత్యేక హోదా కల్పించాలని ప్రతిపక్షం, వామపక్షాలు ఉమ్మడిగా తూతూ మంత్రంగా ఆందోళన నిర్వహిస్తున్నాయి. ప్రత్యేక హోదా వస్తే రాష్ట్రం స్వర్ణమయం అవుతుందని అందరకీ ఉపాధి దొరుకుతుందని, పొలాలు పచ్చగా ఉంటాయనే భ్రమల్లో ప్రజలనుంచుతున్నారు. రాష్ట్రంలోని అన్ని సమస్యలకు ప్రత్యేకహోదా ఏకైక పరిష్కారమని ప్రజలని మభ్యపెడు తున్నారు, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు విషయంలోను ఇదేవిధంగా ప్రజలన్ని మభ్యపెట్టారు. తెలంగాణ రాష్ట్రం అవతరించిన తర్వాత దారిద్ర్యం, నిరుద్యోగ సమస్య, ద్రవ్యోల్బణం, రైతు ఆత్మహత్యలు, అన్ని రకాల మౌలిక సమస్యలు గతంలో కన్నా ఎక్కువగా కొనసాగుతుండటాన్ని ప్రజలు చూస్తూనే ఉన్నారు. అందుకే దిగువ మధ్యతరగతికి చెందిన ప్రజలు ఆత్మహత్యలకు పాల్పడుతూ ప్రత్యేక హోదా ఎపికి ఇవ్వాలని తమ ప్రాణాలను తీసుకుంటున్నారు. వీటికి బలిదానాలు, అమరవీరులని పేరుపెట్టి తెలంగాణ రాకముందర రాజకీయపార్టీలు ప్రజల చావులను ఉపయోగించుకున్నట్టే ఎపిలోను రాజకీయ పార్టీలు ఉపయోగించుకుంటున్నాయి. ప్రత్యేగ హోదా రావడం వల్ల ఎపికి కొంత ఉపశమనం జరుగుతుందనే విషయం నిజమే కాని, రాష్ట్రం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలను ఇది పరిష్కరించదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చిన అనతికాంలోనే తమ వాగ్దానాలనుండి వైదొలగాయి. అవినీతి, ఆశ్రిత పక్షపాతంతో జనకంతక పాలనను అందిస్తున్నాయి. ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించడంలో వైఫ్యలం చెందాయి. విదేశీ పెట్టుబడులతోనే అభివృద్ధి సాధ్యమవుతుందని పచ్చని పంటపొలాలను అప్పనంగా వారికిచ్చివేస్తున్నారు.

ప్రత్యేగ హోదా వల్ల రాష్ట్రానికి కలిగే ప్రయోజనాలను ప్రజలకు చెప్పడంలో పాలకవర్గాలు, ప్రతిపక్షాలు విఫలమవుతున్నాయి. రాష్ట్రంలో 8కి పైగా జిల్లాలు వెనుగబాటుకు గురైవున్నాయి. అక్షరాస్యత 67 శాతం మాత్రమే నమోదైవుంది. మహిళల్లో అక్షరాస్యత 60 శాతానికి మించిలేదు. ప్రతి వెయ్యిమందికి పిల్లల మరణాల రేటు 39గా ఉంది. వ్యవసాయం తీవ్ర సంక్షోభంలో ఉంది. సీమ, ఉత్తరాంధ్ర జిల్లాలలో వర్షాధార పంటనే పండిస్తున్నారు. కృష్ణా డెల్టా ప్రాంతంలోనే రైతు రెండు సార్లు పంటను పండించలేక పోతున్నారు. మరోవైపు విభజన చట్టంలోను ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో ఏర్పడే లోటును కేంద్రం తీరుస్తానంది. లోటు బడ్జెట్‌కు 13000 కోట్లు కేంద్రం ఇవ్వాల్సివుంది. రాజధాని నిర్మాణానికి విభజన చట్టంలో సాయం అందిస్తామని పేర్కొన్నారు. రాజధాని మౌలిక సదుపాయాలకు 45,000 కోట్ల రూపాయలు అవసరమవుతాయని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి ఇచ్చిన లేఖలో పేర్కొంది. పారిశ్రామిక ప్రగతికి పన్ను రాయితీలు కల్పించే అధికారం కేంద్రానికే ఉంటుంది. సామాజిక, ఆర్థిక అభివృద్ధికి, వెనుకబడిన ప్రాంతాల, ప్రజల అభివృద్ధికి ప్రత్యేక కమిటీని వేసి శాస్త్రీయమైన పద్ధతిలో పరిష్కారాలను కనుగొనాల్సివుంది. ఎపి విజభన చట్టం ప్రకారం కేంద్రం సహాయం అందించకలిగితే అహ్మదాబాద్, రాయ్‌పూర్ రాజధానుల తరహాలో అమరావతి అభివృద్ధి చెందుతుందని మేధావులు ఆశిస్తున్నారు. దేశంలో ప్రత్యేక హోదా పొందిన రాష్ట్రాలు 11 వరకు ఉన్నాయి. జమ్ము కాశ్మీర్, హిమాచల్ ప్రదేశ్, ఉత్తరాఖండ్, అరుణాచల్ ప్రదేశ్, సిక్కిం, హిమాచల్ ప్రదేశ్. అస్సాం, మణిపూర్, మేఘాలయ, మిజోరాం, నాగాలాండ్, త్రిపుర ప్రత్యేకహోదా పొంది కేంద్రం సాయం అందించినప్పటికీ వాటిలో అభివృద్ధి అంతా రాజధాని ప్రాంతంలోనే కేంద్రీకృతమైంది. అభివృద్ధి వికేంద్రీకరణ జరుగకపోవడం వల్ల మిగిలిన రాష్ట్రాల ప్రజల కష్టాలకు, ప్రత్యేక హోదా కల్గివున్న రాష్ట్ర ప్రజల కష్టాలకు పెద్ద తేడా లేదు. అందుకే ప్రత్యేక హోదా వల్ల ఏదో ఒరుగుతుందనే భ్రమల్లో నుండి ప్రజలు భయటపడాల్సి ఉంది. ప్రత్యేక హోదా ఇచ్చినంత మాత్రాన రాష్ట్రంలోని అన్ని ఖర్చుల్లో 90 శాతం కేంద్రం భరిస్తుందని అనుకోవడం వట్టి భ్రమ మాత్రమే. సాధారణంగా రాష్ట్రాలకు కేంద్రం 30 శాతం నిధులనిస్తుంది. ప్రత్యేక హోదా కల్గిన రాష్ట్రాలకు 30 శాతంతో పాటు మరో 60 శాతం అదనంగా నిధులనిస్తుంది. సంవత్సర కేంద్ర రెవెన్యూను బట్టి ఈ నిధుల విడుదల ఉంటుంది. ప్రత్యేక హోదా కల్గిన రాష్ట్ర ప్రణాళిక, ప్రణాళికేతర ఖర్చు, సంక్షేమ పథకాలు మిగిలిన అన్ని అంశాలను దృష్టిలో ఉంచుకునే ఈ నిధుల కేటాయింపు ఉంటుంది.

2013-14 ఆర్థిక సంవత్సరానికి ప్రత్యేక హోదా కల్గిన 11 రాష్ట్రాలకు 15 వేల కోట్లు మాత్రమే కేంద్రం ఇచ్చింది. అంటే ఒక రాష్ట్రానికి 1500 కోట్ల కన్నా తక్కువే కేటాయించింది. దేశంలోని మిగిలిన రాష్ట్రాలకు 30 శాతం చొప్పున 40,000 కోట్ల గ్రాంటునిచ్చింది. ఈ లెక్కన రాష్ట్రానికి 90 శాతం కేంద్రం గ్రాంటుగా ఇస్తే ఆంధ్రప్రదేశ్‌కి వచ్చేది 5,500 కోట్లు మాత్రమే. దీన్ని బూతద్దంలో చూపించి రాజకీయపార్టీలు ప్రజల్ని మభ్యపెడుతున్నాయి. ప్రజల భావోద్వేగాలను రెచ్చగొడుతూ వారిని ఆత్మహత్యలవైపు నెడుతున్నాయి. అందుకే చంద్రబాబు ప్రభుత్వం విదేశీ బ్యాంకుల వైపే ఎక్కువగా మొగ్గుచూపుతోంది. కేంద్రం ఇచ్చే నిధుల కన్నా, ఈ బ్యాంకుల నుండే ఎక్కువగా నిధులు వచ్చే అవకాశముంది.

విదేశీ ప్రాజెక్టులకు సైతం కేంద్రమే ఆమోదం తెలపాలి. నీతి అయోగ్ కింద షార్టటర్మ్ ప్రాజెక్టుకు కేంద్రం నుండి నిధులొచ్చే అవకాశం ఉంది. ఎపి రాజధాని అభివృద్ధి సంస్థ(సిఆర్‌డిఎ)కు ముఖ్యంగా పన్నురాయితీని కేంద్రం ఇవ్వాలి. హిమాచల్‌ప్రదేశ్, బుందేల్‌ఖండ్‌కు ఈ తరహా రాయితీ ఇచ్చారనే విషయాన్ని ఆర్థికనిపుణులు పేర్కొంటున్నారు. ప్రత్యేక హోదాతో నిమిత్తం లేకుండా పారిశ్రామిక రాయితీలివ్వాలనే వాదన రాష్ట్ర ప్రభుత్వం చేస్తోంది. ఈ ప్రత్యేక హోదా కేవలం ఎపికి ఐదేళ్ల వరకే ఉంటుంది.

ప్రస్తుత రాజకీయ విశ్లేషకుల అంచనాల ప్రకారం రాబోయే ఎన్నికల్లో రాష్ట్రంలో బి.జె.పి, తెదేపా మధ్యనే గట్టి పోటీ వుంటుందని భావిస్తున్నారు. కేంద్రంలో బిజెపికి ప్రత్యామ్నాయంగా ఎదిగే ప్రత్యామ్నాయ రాజకీయ శక్తి ఏదీ లేకపోవడం వల్ల కేంద్రంలో మళ్లీ బిజెపి రావడానికే అన్ని అవకాశాలున్నాయి. ఈ నేపథ్యంలో రాష్ట్రానికి ప్రత్యేక హోదా ఇస్తే, ఆ క్రెడిట్ చంద్రబాబుకే వెళుతుంది. అది బిజెపికి నష్టదాయకం. అందుకే ప్రత్యేక హోదాను మించి ప్రత్యేక ప్యాకేజీని ఇస్తామని మోదీ ప్రభుత్వం పేర్కొంటోంది. ఈ రెండు పార్టీల రాజకీయ ఆధిపత్యాలలో ఆంధ్రరాష్ట్ర ప్రజలు పావులుగా మారడమే ఇక్కడి విషాదం.

గతంలో బిజెపి పదేళ్లపాటు ప్రత్యేక హోదా కావాలని అడిగి, ఇప్పుడు ప్రత్యేక హోదానే ఇవ్వనంటోంది. ప్రత్యేక హోదా జాప్యానికే రాష్ట్ర ప్రజలు భరించలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ప్రత్యేక హోదా ఇవ్వాలనే బిజెపికి మద్దతుగా రాష్ట్ర ప్రజలు ఓటు వేశారనే విషయాన్ని వారు విస్మరిస్తున్నారు. ప్రత్యేక హోదాకు 14వ ఆర్థిక సంఘం అభ్యంతరాలు తెల్పిందని ప్రస్తుత ఆర్థిక సంవత్సరానికి ప్రత్యేక హోదా ఎవ్వరికీ ఇవ్వడం కుదరదని కేంద్ర నాయకత్వం సెలవిస్తోంది. కొండ ప్రాంతాలు, రాతి ప్రదేశాలు, ఆర్థికంగా, సరైన వసతులు లేని రాష్ట్రాలకు, జనాభా తక్కువగా ఉండడం, దేశ సరిహద్దుల వెంబడి ఉండే రాష్ట్రాలకే ప్రత్యేక హోదా ఇప్పటివరకు అమలవుతోందని కేంద్రం మరోవైపు వాదిస్తోంది. ప్రత్యేక హోదా ప్రజల్లో బలమైన సెంటిమెంటును సృష్టించింది. దానికి తోడు సెలబ్రిటీలు, రాజకీయ పార్టీలు ప్రత్యేక హోదా అనే తావీదులతో రాష్ట్రం సమస్య నుండి దూరమవుతుందని తప్పుడు ప్రచారం చేస్తున్నారు.

ప్రజల్లో పెరుగుతున్న అసహనాన్ని ఉద్యమాలవైపు మళ్లించకుండా అధికారపార్టీ జాగ్రత్తలు తీసుకుంటూ ప్రజల్ని మభ్య పెట్టాలని చూస్తోంది. పొరుగు రాష్ట్రాలకన్నా ఆంధ్రప్రదేశ్ ఆర్థికంగా వెనుకబాటుకు గురైందనే వాస్తవాన్ని పాలకులు గుర్తించాలి. నీతి ఆయోగ్ రోడ్ మ్యాప్‌ను రూపొందిస్తుందని, తదుపరి ప్రధాని ఆమోదంతో రాష్ట్రానికి ప్యాకేజి వస్తుందని కేంద్రం మభ్య పెడుతోంది. కేంద్రం ఇప్పటికే వెనుబడిన జిల్లాకు 350 కోట్లు, రాజధాని నిర్మాణానికి 1500 కోట్లు, పోలవరానికి 250 కోట్లు, ఆర్థిక లోటుకు 2700 కోట్లు ఇచ్చినట్టు ప్రభుత్వ వర్గాలు చెప్తున్నాయి. వీటిని ఏ విధంగా ఖర్చు చేశారో ప్రభుత్వం శ్వేతపత్రం విడుదల చేయాల్సిన అవసరముంది. ఈ లెక్కన ప్రత్యేక హోదాకి ఇవ్వాల్సిన దానికన్నా ఎక్కువే ఇచ్చామని కేంద్రం మరోపక్క బుకాయిస్తోంది. మరోవైపు విద్యారంగానికి 24 శాతం నిధులిచ్చినట్టు రాష్ట్రం ప్రకటించింది.

ఏ రాజకీయ పార్టీ అధికారంలోకి వచ్చినా ఇచ్చిన హామీలు నిలబెట్టుకోలేదనే విషయం ప్రజలకు తెలిసిందే. ఈ నేపథ్యంలో బిహార్‌కు 1.50 లక్షల కోట్ల ప్యాకేజీని బిజెపి ఇస్తాననడం హాస్యాస్పదంగా అనిపించవచ్చు. చంద్రబాబు కేంద్రానికి 200 పేజీల నోట్‌ను సమర్పిస్తూ, తమకు 1.50 లక్ష కోట్ల ప్యాకేజీ ప్రకటించాలని కోరాడు. అంతేగాకుండా రైల్వే ప్యాకేజీలు, రైల్వే ట్రాక్‌లు, అంతర్జాతీయ విమానాశ్రయాలు, గోరఖ్‌పూర్ తరహా ఏఐఐ, నిట్‌లు, మెట్రో రైల్ ప్రాజెక్టు, రింగ్ రోడ్లు కావాలని కోరాడు. వీటివల్ల పట్టణీకరణ పెరిగుతుందే తప్ప ప్రజల కొనుగోలు శక్తి పెరగదు.ప్రత్యేకహోదా కన్నా ప్యాకేజీలో ఎక్కువగా లాభాలున్నప్పుడు అదే మంచిదని అనిపించవచ్చు. హోదాలు, ప్యాకేజీల వల్ల 90 శాతంగా ఉన్న సామాన్యుడికి ఒరిగేదేమీ లేదు. నిరుద్యోగ సమస్య తీరదు. విదేశీ పెట్టుబడులు రాష్ట్రంలోకి 2 లక్షల కోట్లకు పైగా వచ్చినా అవన్ని సేవారంగానికి పరిమితమౌతాయి. దీనివల్ల మొత్తం 5 వేల ఉద్యోగాలొచ్చినా మన రాష్ట్రానికి చెందిన వారు 500కి మించి ఉండరు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు అధిక కొనుగోలు శక్తి ఆధారంగా పబ్‌లు, మల్టీప్లెక్స్‌లు, బ్రాండెడ్ వస్తువులకు గిరాకీ పెరగచ్చు. అంతేగాని రైతుకు, మధ్యతరగతికి, దిగువ మధ్యతరగతికి, కార్మికుడికి, మహిళకి ఏమీ లాభం ఉండదు. ఈ తరహా అభివృద్ధి వ్యవసాయ ఆధారిత సమాజానికి పూర్తిగా విరుద్ధమైనది. కమ్యూనిస్టు మద్యేతరహాగా పెట్టుబడులు అన్ని రంగాలలోను విస్తరించాలని కోరుకుంటున్నారు. లాభాల ప్రాతిపదికన పెట్టుబడులు వస్తాయి కాని, సంక్షోభంలో ఉన్న వ్యవసాయరంగంలోకి పెట్టుబడులు రావు. ప్రభుత్వమే ఆ రంగానికి రాయితీలు, సబ్సిడీలు, గిట్టుబాటు ధరలు కల్పించాలి.

ఈ నేపథ్యంలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ప్రజల నమ్మకాలను వమ్ముచేస్తూ, విశ్వసనీయతను కోల్పోతున్నాయి. ప్రతిపక్షాలు కేవలం పేక్షక పాత్రకే పరిమితమయ్యాయి. సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొన్న ఉద్యోగుల, వివిధ సామాజిక బృందాలు తమకేం పట్టనట్టు మసులుకుంటున్నాయి. హోదాలు, ప్యాకేజీలు సామాన్యుడి బ్రతుకును ఏ మాత్రం మెరుగుపర్చలేవు. కేంద్రం ఇచ్చే నిధులను మొదటగా విద్య, వైద్య, ఉపాధి రంగాలను అభివృద్ధి చేసేవిధంగా ఖర్చు చేయాలి. సమాజపు అంచుకు నెట్టివేయబడ్డ 70 శాతం ప్రజలకు మౌలిక సౌకర్యాలను కల్పించకుండా రాజధాని అభివృద్ధి పేరిట లక్షల కోట్ల రూపాయలను వృధా చేయడం సరికాదు. కార్యానిర్వాహక భవనాలకు 500 కోట్లు మించి కావు. అభివృద్ధి వికేంద్రీకరణ జరపకుండా, మెజారిటీ ప్రజానీకం జీవన ప్రమాణాలు మెరుగపడకుండా ఏర్పడే రాజధాని వల్ల ధనికవర్గానికి, అధికారపార్టీకి తప్ప ఎవ్వరికీ ప్రయోజనం లేదు.

రాష్ట్రం విడిపోకముందు పార్లమెంట్‌లో ప్రత్యేక హోదాపై చర్చ జరిగింది. యుపిఎ ప్రభుత్వం పుణ్యమాఅని విభజన చట్టంలో ఆ అంశాన్ని చేర్చలేదు. పార్లమెంట్ సాక్షిగా బిజెపి తాము అధికారంలోకి వస్తే ఏపికి 10 సంవత్సరాల పాటు ప్రత్యేకహోదా ఇస్తానని చెప్పి, తన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేక రాష్ట్ర ప్రజల ముందర దోషిగా నిలుచుంది. పాలకవర్గం, ప్రతిపక్షాలు ఉమ్మడిగా ప్రత్యేకహోదా అంశానికి సంబంధించి నిరసనలు, ఆందోళనలు, వినతిపత్రాలు ఇస్తూ ప్రజలకేదో మంచి చేస్తున్నామనే అపోహను కల్పిస్తున్నారు. నిజానికి ప్రత్యేకహోదా వల్ల పెద్ద ప్రయోజనం ఏమీ ఉండదని చెప్పాల్సిన మేధావులు సైతం పెదవి విప్పడం లేదు. ప్రత్యేకహోదా రాష్ట్రానికి ఇస్తే కలిగే ప్రయోజనమేంటో ఇతమిద్దంగా రాజకీయ పార్టీలు ప్రజల ముందర ఉంచడం లేదు. ప్రత్యేకహోదా వస్తే

రాష్ట్రం స్వర్ణాంధ్రమయమౌతుందని, అన్ని సమస్యలకు పరిష్కారం లభిస్తుందని సెలబ్రిటీలకు మొదలు సమైక్యాంధ్ర మేధావుల వరకు వాదిస్తున్నారు. ఈ నేపథ్యంలో దిగువ మధ్యతరగతి వర్గంలోని క్రింది కులాలు ప్రత్యేకహోదా రాకపోతే రాష్ట్ర భవిష్యత్తు ఏమైపోతుందోనని భయపడి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. రాజకీయ పార్టీలు దీనికి బాధ్యత మీదరంటే మీరని వాదించుకుంటున్నారు. హోదావల్ల ఏమీ ఒరగదనే విషయం చెప్పకుండా ఆత్మహత్యలు చేసుకున్న సామాన్యులను అమరవీరులని, హోదా కోసం బలిదానం చేశారని ప్రజల్లో భావోద్వేగాలను రెచ్చగొడుతున్నారు. మరికొన్ని బలిదానాలు హోదాకు అవసరమని చెప్పకనే చెపుతూ అమరవీరుల కర్మాగారాన్ని నెలకొల్పే పనిలో పడ్డారు.

ప్రత్యేకహోదా ఇచ్చే రాష్ట్రాలకు కేంద్రం 70 శాతం గ్రాంటుగా ఇస్తుంది. దీన్ని తిరిగి చెల్లించనవసరం లేదు. మిగిలిన 30 శాతం రుణంగా అందజేస్తుంది. ఈ నిధులను ప్రణాళికా సంఘం కేటాయిస్తుంది. పంచవర్ష ప్రణాళికలకు కేటాయించిన నిధుల నుండి ఈ మళ్లింపు వుంటుంది. దీనితో పాటు ఎక్సైజ్ పన్ను, ఆదాయ పన్నుతోపాటు కేంద్రం విధించే ఇతర పన్నుల నుండి 10 సంవత్సరాల పాటు పూర్తిగా పన్ను మినహాయింపును పొందవచ్చు. ఈ అంశం ప్రత్యేకహోదాతో సంబంధం లేకుండా రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వాన్ని అడగవచ్చు. ప్రణాళికా సంఘాన్ని కేంద్రం రద్దు చేసి రాష్ట్రాలకు కేంద్రం ఇచ్చే నిధులను నిలిపివేసింది. నీతి ఆయోగ్ కింద రాష్ట్రాలకు నిధులు ఏమన్నా వస్తాయని అనుకున్నా, అందులో రాష్ట్రాలకు నిధుల కేటాయింపు ప్రస్తావనే లేదు.

రాష్ట్ర రెవెన్యూ లోటును తీర్చడానికి ప్రత్యేకహోదా ఉపయోగపడదు. కేంద్ర పథకాలను రాష్ట్రంలో అమలు పర్చడానికి ఇస్తున్న 7000 వేల కోట్లను పెంచడానికి అవకాశమున్నప్పటికీ, అది పూర్తిగా కేంద్రం చేతిలో ఉంటుంది. రాష్ట్రం ప్రవేశపెట్టిన సంక్షేమపథకాలకు తీసుకున్న విదేశీ రుణం సుమారు 820 కోట్లు, ప్రత్యేకహోదా ఇచ్చినప్పటికీ కేంద్రం ఇందులో 20 శాతానికి మించి భరించదు. విభజన నేపథ్యంలో ఏర్పడ్డ 16,000 కోట్ల రెవెన్యూ లోటును కేంద్రమే భరించాలని విభజన చట్టంలో పేర్కొన్నారు. ఇందుకుగాను కేంద్రం 2700 కోట్లు ఇచ్చివేసిందని పాలకవర్గం పేర్కొంటోంది. రెవెన్యూ ఆదాయాన్ని పెంచుకోవడానికి ప్రజలపై పన్ను భారాన్ని మోపడానికి ప్రభుత్వం ఇప్పటికే సిద్ధపడింది. రాజధాని ప్రాంతంలో ఈ పన్నుమోత ఎక్కువుగా ఉండబోతోందని రాష్ట్ర మంత్రి వర్గం లీకునిస్తోంది. కేంద్రం నిధులనిస్తున్నప్పటికీ, ప్రజలపై పన్ను భారాన్ని మోపడంపై సర్వత్రా విమర్శలు వస్తున్నాయి.

ప్రత్యేక హోదా కన్నా ప్యాకేజీనే మేలని చంద్రబాబు కేంద్రప్రభుత్వాన్ని 1.5 లక్షల కోట్ల రూపాయలు రాష్ట్రానికి ఇవ్వాలని తన 200 పేజీల నోట్‌లో పేర్కొన్నాడు. అంటే ప్రత్యేకహోదా కేంద్రం ఇవ్వదనే విషయాన్ని తెదేపాకు స్పష్టంగా ముందే తెలుసుననే విషయం దీనిద్వారా తేటతెల్లమవుతోంది. హోదాకిచ్చే నిధులు, పన్ను మినహాయింపు కన్నా ప్యాకేజీల ద్వారానే ఇంకా ఎక్కువుగా నిధులు ఇవ్వనున్నట్టు కేంద్రం వెంకయ్యానాయుడు ద్వారా చెప్పిస్తోంది. ఎన్నికల వాగ్దానం మేరకు బిహార్‌కు ప్రకటించిన లక్షా యాభైవేల కోట్ల ప్యాకేజీనే ఆంధ్రప్రదేశ్‌కి ఇవ్వాలని టిడిపి అడుగుతూ బిజెపిని ఇరుకున పెట్టే ప్రయత్నం చేస్తోంది. మరోవైపు హోదా నుండి ప్రజల ఆలోచనలను ప్యాకేజీవైపు మళ్లించడానికి పాలకవర్గాలు పావులు కదుపుతున్నాయి. పచ్చని పంట పొలాల్లో రాజధాని, ఉత్తిపుణ్యానికి పుష్కరాల్లో చనిపోయిన సాధారణ జనం సంఘటన, ఇసుకమాఫియాకు అండదండలందిస్తూ నిజాయితీ అధికారులపై చర్యలు, రైతు ఆత్మహత్యలు, తాండవిస్తున్న కరువు లాంటి అంశాలపై ప్రజలు మాట్లాడకుంటా వారి దృష్టిని మర్చడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వేసిన హోదా, ప్యాకేజీ ఎత్తుగడ బాగానే పనిచేస్తోంది.

భూమిపైనా, ఉత్పత్తి పైనా ప్రజల ఆజమాయిషీలేదు. ప్రభుత్వం రాజధాని, రింగ్‌రోడ్డు, సెజ్, కారిడార్ పేరుతో సొంత భూమిని ఎప్పుడు లాక్కుంటుందో తెలియక ప్రజలు భయాందోళనకు గురౌతున్నారు. ఆరుగాలం శ్రమపడి పంటను ఉత్పత్తి చేసినా గిట్టుబాటు ధర ఉండదు. భూమి తమ ఆధీనంలో లేని ప్రజలు కౌలు రైతులుగా కొనసాగడం ఎక్కువైంది. భూస్వామ్య విధానం కొనసాగింపుకు ప్రత్యక్ష ఉదాహారణ కౌలు రైతు, వారి ఆత్మహత్యలే. భూమి, ఉత్పత్తి సాధనాలు రెండు లేని ప్రజలు పొట్టకూటి కోసం వ్యవసాయకూలీలుగా చెలామణీ అవుతున్నారు. రాజధాని పేరుతో ప్రభుత్వమే భూమిని కార్పొరేట్ వర్గానికి ధారాదత్తం చేస్తోంది.

ఉత్పత్తి సాధనాలను ఇప్పటికే తన గుప్పెట్లో పెట్టుకున్న కార్పొరేట్ వర్గం వ్యవసాయంపై ఆధారపడ్డ వివిధ రకాల శ్రేణులను రోజువారీ కూలీలుగా మార్చివేస్తుంది. భూస్వామ్య, పెట్టుబడిదారీ అభివృద్ధి చట్రంలో ప్రజలు నిర్బంధ శ్రామికులుగా మారిపోతారు. రూపంలో మాత్రమే తేడావుంటుంది. కూలీకెళ్లే వ్యక్తి పంచె బదులు ప్యాంటు వేసుకుంటాడు. రోజు కూలీ కొంత ఎక్కువ పొందుతాడు. ఈ జాక్‌పాట్ కూడా 15 శాతం ప్రజలకే దక్కుతుంది. ఈ అసమ సామాజిక వ్యవస్థను అభివృద్ధని రాజ్యం పేరు పెట్టింది. ఈ అభివృద్ధిలో నిపుణులకే ప్రాధాన్యత ఉంటుంది కాని, సాంప్రదాయ నైపుణ్యాన్ని కల్గివున్న రైతు, వృత్తిదారుకు ఇందులో ప్రవేశముండదు.

వ్యవసాయాభివృద్ధికి అవసరమైన చిన్న, పేద రైతును, వ్యవసాయ కూలీలను బలవంతంగా రాజ్యం ఆ రంగం నుండి గెంటివేస్తోంది. వీరి నైపుణ్య శ్రమతోనే వ్యవసాయరంగం అభివృద్ధి చెందాలి. అయినా రాజ్యం వీరి నైపుణ్యాన్ని ఉపయోగించుకోదు. వీరు పారిశ్రామిక వాడకు వలస వెళ్లినా ఉపాధి దొరక్క అసంఘటిత శ్రామికులుగా తయారవుతారు. పట్టణాలలోని నాలుగు రోడ్ల కూడలిలో పనికోసం గుంపుగా మూగి ఉండేది ఈ ప్రజలే.

తాజా కేంద్ర గ్రామీణాభివృద్ధి గణాంకాల ప్రకారం రాష్ట్రంలో ఉపాధి లేని వారు 58 శాతంగా ఉన్నారు. ఈ ప్రజల్ని అభివృద్ధిలో భాగస్వామ్యం చేయకుండా, బయటి శక్తులు నిర్ణయించే అభివృద్ధి నిజమైన అభివృద్ధి కాదు. ఈ అభివృద్ధి కోసమే రాజకీయ పార్టీలు హోదాలు, ప్యాకేజీలు అడుగుతూ, దీనికోసం ప్రజల్ని ఆత్మహత్యలు చేసుకోమంటున్నాయి. ప్రత్యేక హోదాలు, ప్యాకేజీలు వల్ల సామాన్యుడికి ఒరిగేదేంలేదు. కాబట్టే, మా భూములు మాకివ్వాలని రాజధాని రైతులు, వేతనాలు పెంచాలని కార్మికులకు, ఉపాధి కావాలని మెజారిటీ ప్రజానీకం ఆందోళనలు చేస్తున్నారు.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# ఆదివాసుల హక్కులను హరిస్తున్న ప్రభుత్వాలు

***ప్రభుత్వాలు మారినా, పాలకులు మారినా ఆదివాసులపై అమలవుతున్న విధ్వంసక విధానాలు మారలేదంటూ, ఆదివాసుల మనుగడను ప్రశ్నార్థకంగా మారుస్తున్న తీరును వివరిస్తున్నారు* మండి నాగమణి**

ప్రభుత్వాలు మారాయి గాని మన్యం మూలవాసులపై యుద్ధం ఆగలేదు. పాలకుల యుద్ధ నీతిలో మార్పులేదు. కార్పొరేట్ సంస్థల కనుసన్నలలోనే ఇక్కడ రాజ్య పాలన సాగుతుంది. కార్పొరేట్ సంస్థలు రాజ్య విభాగాలన్నింటిని తమ ప్రభావానికి గురి చేస్తున్నాయి. గతంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా కొనసాగిన కాలంలో వాడిన పంథానే నేడు కూడా కొనసాగిస్తామని చంద్రబాబు మహోటంగానే ప్రకటిస్తూ వస్తున్నాడు. మావోయిస్టు రహిత ఆంధ్రప్రదేశ్‌గా తీర్చిదిద్దుతామనే సాకుతో ఆపరేషన్ గ్రిన్‌హంట్‌ను తీవ్రతరం చేస్తూ గ్రీన్‌హంట్ కొనసాగిస్తాం. బాక్సైట్ తవ్వకాలు చేపడతం. మూల వాసుల్లో వెలుగులు నింపుతాం. అనే నినాదంతో ముందుకు పోతున్న చంద్రబాబు టిడిపి పాలన మౌలికంగా మూల వాసులకు వ్యతిరేకమైనది.

రాజ్యాంగంలోని 5వ, 6వ షెడ్యూళ్లు, గిరిజన ప్రాంతాల్లో గవర్నర్ల అధికారులు, గిరిజన సలహా మండళ్ల నిర్ణయాలు, ఎపి 1/70 చట్టం, కాగితాలకే పరిమితమవుతున్నాయి. ఆదివాసుల సంక్షేమం కోసం రూపుదిద్దుకున్న అటవీ హక్కుల గుర్తింపు, స్వీయ పాలన (పీసా) చట్టాల్లో మార్పుల పేరిట వాటి అమలును అటకెక్కించేశారు. జల్, జంగల్, జమీన్‌పై హక్కు ఆదివాసులకు మాత్రమే ఉన్నదనే విషయాన్ని ఈ చట్టాలన్నీ రుజువు చేస్తున్నాయి. ఈ చట్టాలను అమలు చేయాలని మన్యం వాసులు బలంగా ప్రశ్నిస్తున్నారు. ఆ ప్రజాస్వామిక అనచివేత, అక్రమ నిర్బంధం, గ్రామాలపై ప్రత్యేక పోలీసు బలగాల మూకుమ్మడి దాడులను నిలిపివేయాలని డిమాండ్ చేస్తున్న మన్యం ఆదివాసులందరిని ప్రభుత్వం అసాంఘిక శక్తులుగా, అభివృద్ధి నిరోదకులుగా నిర్ధారించబడడం, ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామిక దేశమైన భారతదేశంలోనే చెల్లింది. విశాఖ ఏజెన్సీ ప్రాంతంలోకి వేలాది కేంద్ర పారా మిలటరీ బలగాలు, రాష్ట్ర ప్రత్యేక పోలీసు బలగాలు, గ్రేహౌండ్స్ బలగాలను దించిన ప్రభుత్వం, 60 శాతం భూభాగంలోని 11 మండలాల్లో విస్తరించిన ఆరున్నర లక్షల మంది ఆదివాసి ప్రజల జీవించే హక్కులను కాలరాస్తుంది. ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కును గ్యారంటీ చేసిన రాజ్యాంగ ఆదేశిక సూత్రాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఉల్లంఘిస్తున్నాయి.

బాక్సైట్ తవ్వకాలకు వ్యతిరేకంగా ఆదివాసులు పెద్ద ఎత్తున ఉద్యమిస్తున్నా చంద్రబాబు ప్రభుత్వం తనపని తాను చేసుకుపోతుంది. బాక్సైట్ తవ్వకాలతో తాము జీవనాధారం కోల్పోతామని, తమ ఉనికికే ముప్పు వాటిల్లుతుందని ఏడాదిగా మన్యం వాసులు ఉద్యమిస్తున్నారు. కానీ తాము బాక్సైట్ తవ్వకాలు జరిపితీరుతామని ముఖ్యమంత్రి చంద్రబాబు పలుమార్లు చెపుతూ వస్తున్నారు. ఆ దిశగా కార్యాచరణ చేపట్టాలని ఉన్నతాధికారులకు స్పష్టమైన ఆదేశాలు ఇచ్చారు. అందుకు తగ్గట్టుగానే విశాఖ, తూర్పు గోదావరి ఏజెన్సీ ప్రాంతంలో రెవెన్యూ అధికార్లు సర్వే పూర్తి చేశారు. విశాఖ జిల్లాలో ఆరు వేల ఆదివాసి కుటుంబాలను తరలించాల్సి ఉంటుందని నివేదిక సమర్పించారు. వాటిలో జెర్రెల ప్రాంతంలోనే అత్యధికంగా మూడు వేల కుటుంబాలు ఉండడం గమనార్హం. బాక్సైట్ ప్రజా ఉద్యమాన్ని అణచివేసేందుకు ప్రభుత్వం భారీ పోలీసు బలగాలను విశాఖ మన్యంలో మోహరించింది. మరోవైపే కేంద్రంపై ఒత్తిడి తీవ్రతరం చేసింది. ప్రత్యేక హోదాతో పాటు విభజన చట్టంలోని అంశాలపై ఉదాసీనంగా ఉన్న ప్రభుత్వం బాక్సైట్ తవ్వకాల కోసం మాత్రం కేంద్రంపై తీవ్రస్థాయిలో ఒత్తిడి తెచ్చింది.

మార్కెట్ శక్తుల ప్రయోజనాలే ప్రథమ ప్రాధాన్యతగా గుర్తించి పని చేస్తున్న బిజెపి, ఎన్‌డిఎ ప్రభుత్వం విశాఖ మన్యంలో బాక్సైట్ గనుల తవ్వకాలకు పచ్చజెండా ఊపుతోంది. అందులో భాగంగా మొదటి దశలో విశాఖ మన్యంలోని జెర్రెల బ్లాక్‌లో బాక్సైట్ తవ్వకాలకు అనుకూలంగా కేంద్ర అటవీ మంత్రిత్వ శాఖ సూత్రపాయ ఆమోదం తెలిపింది. ఈ మేరకు రాష్ట్ర ఖనిజాభివృద్ధి సంస్థ (ఎపిఎండిసి) కు లేఖ కూడా రాసింది. దాంతో బాక్సైట్ తవ్వకాల దిశగా రాష్ట్ర ప్రభుత్వం కార్యాచరణను వేగవంతం చేయడానికి, గ్రీన్‌హంట్ యుద్ధాన్ని చంద్రబాబు ముందుకు తీసుకెలుతున్నారు. అందులో భాగంగానే విశాఖ ఏజెన్సీ ప్రాంతమంతటా పారా మిలటరీ బలగాలతో, ప్రత్యేక సాయుధ బలగాలతో నింపేశారు.

పొరుగున ఉన్న ఒడిస్సాలో నవీన్ పట్నాయక్ ప్రభుత్వంతో సమన్వయం నెరుపుతూ గ్రీన్‌హంట్‌నూ కొనసాగిస్తోంది. ఈ యుద్ధం మొదలైనప్పటి నుండి విశాఖ ఏజెన్సీ ప్రాంతంలో జరిగిన విధ్వంసాన్ని అధ్యయనం చేస్తే పాలకుల అభివృద్ధి, అణచివేతల అసలు స్వభావం అర్థమవుంది. ప్రజలను అణచివేయడంలో హీన చరిత్ర కలిగిన చంద్రబాబు నవ్యాంధ్రలో ప్రమాణ స్వీకారం చేసిన కొద్దిరోజులకే నల్లమల అటవీ ప్రాంతం దగ్గర్లో బూటకపు ఎన్‌కౌంటర్ చేసి ముగుర్ని పొట్టన పెట్టుకున్నాడు. ఆ ముగ్గురిలో ఇద్దరు ఆదివాసులే. ఈ బూటకపు ఎన్‌కౌంటర్ ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగమని గుర్తించకపోతే ఈ యుద్ధ స్వభావం తెలియనట్లే.

బాక్సైట్ తవ్వకాల పేరుతో అరాచకం జరుగుతోంది. భద్రత కల్పించి భరోసా ఇవ్వాల్సిన ప్రభుత్వమే ఇక్కడి మూలవాసులను కంటి మీద కునుకు లేకుండా చేస్తోంది. బాక్సైట్ తవ్వకాలకు వ్యతిరేకంగా కదులుతున్న ప్రజా కదలికలను ఎక్కడికక్కడ వివిధ పద్ధతుల్లో అడ్డుకోవడంతో పాటు, ప్రజల్లో భయోత్పాతాన్ని సృష్టించడం కోసం ఐదు సందర్భాల్లో ప్రజలపై కాల్పులు జరిపి టెర్రర్ వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. ఇది భవిష్యత్‌లో మరింత పెరిగే అవకాశం కనిపిస్తున్నది.

ఆంధ్ర–ఒడిస్సా సరిహద్దు ప్రాంతంలో అటు నవీన్ పట్నాయక్ ఇటు చంద్రబాబులు కూడా సామ్రాజ్యవాద దళారీ నిరంకుశ బూర్జువా, భూస్వామ్య వర్గాల ఏజెంట్లుగా కొనసాగుతూ ఈ గ్రీన్‌హంట్ అణచివేత దాడుల్లో ఒకేగూటి పక్షుల్లాగా వ్యవహరిస్తున్నారు. సరిహద్దు గ్రామాల్లో సిఆర్‌పిఎఫ్‌ను, బిఎస్ఎఫ్, గ్రేహండ్స్, ఎస్ఒజి కీప్‌ను ప్రయోగిస్తూ స్త్రీలపై అత్యాచారాలు, ఆదివాసులపై హత్యాచారాలు కొనసాగిస్తున్నారు. ఒడిస్సా రాష్ట్రంలోని మల్కన్‌గిరి జిల్లా కుడుముల గుమ్మ బ్లాక్‌లో చయపడ గ్రామ ఆదివాసి మహిళపై అత్యాచారానికి తెగబడ్డారు.

నారింగ్‌జోల గ్రామం వద్ద బలిమెల నదిపై పడవలో ప్రయాణిస్తున్న గిరిజనులపై బిఎస్‌ఎఫ్ బలగాలు కాల్పులు జరిపి ఒకర్ని హత్య చేయగా, మరోకరు తీవ్రంగా గాయపడ్డాడు. అనంతరం చికిత్స నిమిత్తం తరలించి అటునుంచి అటే మాయం చేశారు. దబ్బలపాడు, రోళ్లగడ్డ గ్రామాలపై సాయుధ బలగాల మూకుమ్మడి దాడుల్లో ఒక మహిళ మరణించగా, ఒక ముక్కుపచ్చలారని బాలుడు తీవ్రంగా గాయపడ్డాడు. విశాఖ జిల్లాలో ముంచంగిపుట్ మండలం గోబోర్‌పడ్ అటవీ ప్రాంతంలో గ్రేహండ్స్ బలగాలు ఏకపక్షంగా కాల్పులు జరిపి సూర్యం (ప్రకాశం జిల్ల వాసి) ను పొట్టన పెట్టుకున్నారు. సాయుధ బలగాలు చేస్తున్న హత్యలు, అత్యాచారాలు బయటి ప్రపంచానికి తెలియడం లేదు. ఎందుకంటే ఈ ప్రాంతాల్లోకి హక్కుల సంఘాలు కానీ, మీడియాను గానీ అనుమతించడం లేదు. రహస్యంగా పోవాల్సిందే.

ఆదివాసి అస్థిత్వాన్ని రద్దు చేయడానికి మార్కెట్ శక్తులు చేస్తున్న దాడే ఆపరేషన్ గ్రీన్‌హంట్. ప్రజాస్వామ్య వ్యవస్థలో పాలన దక్షతతో ప్రభుత్వాలు సమస్యలు పరిష్కరించాలి. భద్రత బలగాల ఆధారంగా పాలన ఉన్నదూ సాగించలేరు. అది ప్రజాస్వామ్య మూల సూత్రాలకు విరుద్ధం. 'ప్రజాస్వామ్యంలో ప్రజలను వేటాడి వెంటాడి చంపరు' అనే ఒక మౌలిక అంశాన్ని ప్రభుత్వాలు గుర్తించాలని దేశంలోని మేధావి వర్గం ఎప్పటి నుంచో డిమాండ్ చేస్తున్నా ప్రభుత్వాల్లో చలనం లేకపోగా, ప్రజలపై యుద్ధం జరగడం లేదని ప్రభుత్వాలు బుకాయిస్తున్నాయి. యుద్ధం అని ప్రకటిస్తే అంతర్జాతీయ న్యాయ సూత్రాలను పాటించడమే కాకుండా అంతర్జాతీయ పౌర సమాజానికి జవాబు ఇవ్వాల్సి వస్తుంది.

ఉమ్మడి రాష్ట్రం విడిపోయి రెండు కొత్త రాష్ట్రాలు ఏర్పడడంతో కొత్త రాజకీయ పరిస్థితి ఏర్పడింది. కానీ ఆదివాసులపై దమనకాండ విషయంలో మాత్రం దేశ వ్యాప్తంగా అన్ని రాష్ట్రాల, అన్ని పాలక వర్గ పార్టీల రాజనీతి ఒక్కటే. ఈ రెండు తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు భవిష్యత్తులో ఒకటో అరో ఆదివాసి అనుకూల విధానాలు అమలు చేసే అవకాశం ఉన్నదని పగటి కలలు కనాల్సిన పనిలేదు. అట్లాగని ఈ వ్యవస్థ పరిధిలో ఆదివాసి సంక్షేమానికి, రక్షణ చట్టాలకు ఉన్న పాత్రను తగ్గించనవసమూ లేదు. గత చరిత్ర పరిశీలిస్తే ఇలాంటివి ఏవి జరిగినా, జరగకపోయినా మూల వాసులను అటవీ ప్రాంతం నుండి వెంటాడి, వేటాడి వెళ్లగొట్టే ప్రక్రియ నడుస్తూనే ఉంటుందని అర్థమవుతుంది.

అయితే ఇది కేవలం అటవీ ప్రాంతాలకే పరిమితమై లేదు. దేశంలో భౌతికంగా గ్రామాలను విధ్వంసం చేస్తూ కార్పొరేట్ సంస్థలకు దారాదత్తం చేయాడానికి విధ్వంసకర ప్రాజెక్టులను చేపట్టింది. మచ్చుకు ఆంధ్రప్రదేశ్‌లోని కోస్టల్ కారిడార్‌కు, సెజ్‌లకు, థర్మల్ న్యూక్లియర్ ప్రాజెక్టులకు, పోలవరం ప్రాజెక్టుకి, రాజధాని నిర్మాణానికి బలవంతపు భూసేకరణకు వ్యతిరేకంగా జరుగుతున్న అన్ని పోరాటాలపై, ఉద్యమాలపై ప్రభుత్వాలు తమ దమనకాండను కొనసాగిస్తున్నాయి. ఉద్యమాలు చేస్తున్న సామాన్య ప్రజలను వారి సొంత నేలపైనే రాజ్యం నేరస్తులను చేస్తున్నది.

సమాజంలో పునరావృతమవుతున్న హింసకు, రాజ్య అభివృద్ధి నమూనా ప్రధాన కారణంగా ఉంది. ఇదీ కేవలం ఆదివాసుల మీద జరుగుతున్న యుద్ధమే కాదు. దేశ పీడిత ప్రజల మీద, వారి ప్రజాస్వామిక ఆకాంక్షల కోసం జరుగుతున్న ప్రజాస్వామిక పోరాటాల మీద, రాజ్యాంగంలో పేర్కొన్న జీవించే హక్కుల మీద జరుగుతున్న యుద్ధం ఇది.

రాజ్యాంగంలోని ఐదు, ఆరు షెడ్యూల్లలోని నియమాలను పటిష్టంగా అమలు చేస్తే ఆదివాసుల స్థితిగతులు, ఆయా ప్రాంతాల ఆర్థిక, సామాజిక అంశాల్లో ఏదో ఒక మేరకు మెరుగుపడతాయనడంలో రెండో మాటకు తావు లేదు. కానీ ప్రభుత్వ యంత్రాంగం కార్యాచరణే గాడి తప్పింది. షెడ్యూలు ప్రాంత ఆదివాసి స్థితిగతులను సమీక్షించి, ప్రత్యేక చర్యలు చేపట్టే అధికారాలు గవర్నరుకు ఉన్నాయి. ఆదివాసి స్థితిగతులపై ఏటా రాష్ట్రపతికి గవర్నర్ నివేదిక అందజేదాలి. కానీ గవర్నర్ ఎన్నడూ ఈ పని చేసి ఉండరు. ఎందుకంటే ఇతగాడు కూడా మార్కెట్ శక్తుల ప్రయోజనాల కోసమే కొలువు దీరి ఉన్నాడు గనుక. గతంలో చత్తీస్‌గడ్ డిజిపిగా పనిచేసిన కాలంలో, దండకారణ్యంలో కార్పొరేట్ సంస్థల చొరబాటుకు ఇతోధికంగా సహకరించడు. దాని ప్రతి ఫలంగానే గవర్నర్ గిరి దొరికింది. కాబట్టే విశాఖ మన్యంలో కార్పొరేట్ సంస్థలు, ప్రభుత్వం కలిసి సృష్టిస్తున్న అశాంతి పరిణామాలను చోద్యం చూస్తూ మిన్నకుండి పోయాయి.

ఆదివాసి ప్రాంతాల పాలనకు సంబంధించి రాష్ట్రాల్లో సంబంధించిన ప్రజా ప్రతినిధులు, గిరిజన సంక్షేమ శాఖ అధికారులతో కూడిన గిరిజన సలహా మండలి (టిఎసి)కి విశేష అధికారాలను రాజ్యాంగం కల్పించింది. ఈ మండళ్ల పనితీరు మొక్కుబడిగా మారింది. రాజ్యాంగబద్ధమైన గిరిజన సలహా మండలి (టిఎసి)ని నిర్వార్యం చేసేందుకు చంద్రబాబు టిడిపి ప్రభుత్వం ఎత్తుగడ వేస్తుంది. గిరిజన ప్రాంతాల్లో విశేషాధికారాలు ఉన్న టిఎసిని నియమించకుండా ఉద్దేశ పూర్వకంగా జాప్యం చేస్తుంది. టిఎసిలో సభ్యులుగా ఉండే గిరిజన ఎంఎల్ఎలల్లో అత్యధికులు వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు చెందిన వారు కావడమే ఇందుకు ప్రధాన కారణం. తమ పార్టీకి చెందిన గిరిజన నేతలకు నామినేటెడ్ పదవులు కట్టబెట్టి, వారిని దొడ్డి దారిలో టిఎసి సభ్యులుగా చేర్పించడానికే ప్రభుత్వం వ్యూహం పన్నుతున్నది. ఆ వెంటనే బాక్సైట్ తవ్వకాల ప్రతిపాదనను టిఎసి ముందుంచడానికి ఎప్పటికే సన్నహాలు ముమ్మరం చేసింది.

ఎంఎల్ఎల కంటే అధిక సంఖ్యలో నామినేటెడ్ సభ్యులను నియమించాలన్న చంద్రబాబు పన్నాగం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధం. టిఎసిలో 20 మంది వరకు సభ్యులు ఉండొచ్చని రాజ్యాంగం చెపుతుంది. అందులో ఎంఎల్ఎలు మూడొంతుల మంది ఉండాలని స్పష్టం చేసింది. ప్రస్తుతం రాష్ట్రంలో గిరిజన ఎంఎల్ఎలు ఏడుగురే ఉన్నారు. ఆ ప్రకారం మొత్తం సభ్యులు 10 మందికి మించకూడదు. కానీ చంద్రబాబు ప్రభుత్వం ఈ విషయాన్ని పక్కదారి పట్టిస్తుంది. కచ్చితంగా 20 మంది సభ్యులు ఉండాలని రాజ్యాంగంలో లేదు. గరిష్టంగా 20 మంది వరకు ఉండొచ్చన్నదాన్నే ప్రస్తావిస్తూ తమ పార్టీ నేతలు 13 మందిని టిఎసికి నామినేట్ చేయాలని భావిస్తుంది. తద్వారా బాక్సైట్ తవ్వకాలకు అనుకూలంగా టిఎసిలో మెజార్టీ సాధించాలన్నది చంద్రబాబు పన్నాగం.

రాజ్యాంగం నిర్దేశించిన గిరిజన ప్రాంతాల అభివృద్ధికి ఉద్దేశించిన టిఎసిని నియమించేలా గవర్నర్ ప్రభుత్వాన్ని ఆదేశించాలి. ఎంఎల్ఎలే టిఎసిలో సభ్యులుగా ఉండాలి. నామినేటెడ్ సభ్యులు ఎక్కువ కాకుండా గవర్నర్ ప్రభుత్వాన్ని నియంత్రించాలి. ఆదివాసి ప్రాంతాల్లో ప్రైవేట్ పారిశ్రామిక కార్యకలాపాల కోసం విస్తారమైన భూముల్ని ధారాదత్తం చేయడం, భూబదలాయింపు చట్ట నింబంధనల ఉల్లంఘన, విచ్చలవిడిగా అడవులకు కొత్త పెట్టడం వంటి చర్యలు, పర్యావరణ సమతుల్యంపై తీవ్ర ప్రభావం చూపుతున్నాయి. దానివల్ల అటవీ వనరులు క్షీణించి, ఆదివాసుల ఆహార భద్రత ప్రమాదంలో పడుతుంది. గ్రామ సభ వ్యవస్థ ద్వారా ఆదివాసులను సంప్రదించే ప్రక్రియను పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నారు. ఒకరకమైన నిరంకుశత్వమే నడుస్తుంది. పీసా చట్టం-1996 క్షేత్రస్థాయిలో అమలు కావడం లేదు. చంద్రబాబు ప్రభుత్వం ఏర్పడ్డాక పీసా కమిటీలు మొక్కుబడిగా ఏర్పడ్డాయి. అది కూడా బాక్సైట్ తవ్వకాల కోసం ఆమోదం పొందడానికి మాత్రమే. చట్ట ప్రకారం ఏర్పాటైన గ్రామ

# జీవవైవిధ్య వ్యవసాయ మార్గదర్శి భాస్కర్ సావే

*భారత వ్యవసాయ రంగంలో సేంద్రియ, జీవవైవిధ్య వ్యవసాయ పద్ధతులతో భాస్కర్ సావే చేసిన కృషిని వివరిస్తున్నారు*

**కె. సజయ**

ఒన్‌స్ట్రా రెవల్యూషన్ (గడ్డిపరకతో విప్లవం) రచయిత, సహజ వ్యవసాయానికి ఆద్యుడైన మసనోబు ఫుకువోకా (జపాన్) 1997లో భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా ప్రభుత్వ ప్రత్యేక అతిథిగా వచ్చారు. ఆ తర్వాత తనంతటతానుగా గుజరాత్‌లోని 'కల్పవృక్ష' అనే ఒక వ్యవసాయ క్షేత్రానికి వెళ్లి ప్రత్యక్షంగా పరిశీలించి ప్రపంచంలోనే అత్యుత్తమైన సహజసిద్ధ వ్యవసాయ క్షేత్రంగా దానిని అభినందించారు. 'తాను రూపొందించిన దానికన్నా కల్పవృక్ష వందరెట్లు బాగుందని' ప్రశంసించారు. ఇంతకీ ఏమిటీ కల్పవృక్ష? ఎవరు దాన్ని రూపొందించారు? దశాబ్దాల కృషితో దాన్ని రూపొందించిన వ్యక్తి భాస్కర్ హిరాజి సావే అనే వ్యక్తి. ఆయన గురించి మనమెందుకు ఈరోజు చర్చించుకోవాలి? వైవిధ్యభరితమైన భారతీయ వ్యవసాయం గురించి ఆలోచించేవారికి ఈయన చిరపరిచితుడే. అవిశ్రాంతంగా సహజ వ్యవసాయ పద్ధతుల మీద ఏ రకమైన సహకారం లేకుండానే ఏడు దశాబ్దాల పాటు కృషి చేసిన ఈ 93 సంవత్సరాల వృద్ధుడు ఇంక సెలవంటూ 2015 అక్టోబర్ 24న కాలం చేశారు.

మనదేశంలో హరిత విప్లవానికి ఆద్యుడంటూ నిరంతర కితాబులు అందుకునేది ఎం.ఎస్. స్వామినాథన్. అలాంటి స్వామినాథన్‌ను 2006లో భారత ప్రభుత్వం వ్యవసాయ కమిషన్‌కు ఛైర్మన్‌గా చేసింది. హరిత విప్లవం పేరుతో భారతీయ వైవిధ్యభరిత వ్యవసాయాన్ని స్వామినాథన్ ఏ విధంగా నాశనం చేశారో వివరిస్తూ ఇప్పుడు జరుగుతున్న ఈ రైతు ఆత్మహత్యకు మూలం ఆ హరిత విప్లవ విధానంలోనే ఉందని భారత ప్రభుత్వానికి ఒక సుదీర్ఘమైన బహిరంగ లేఖ రాసిన వ్యక్తి భాస్కర్ సావే. 2006లో రాసిన ఆ బహిరంగ లేఖలోని కొన్ని ముఖ్యాంశాలను ఇక్కడ చూద్దాం.

జూలై 29, 2006

టు: ఎం.ఎస్.స్వామినాథన్, ది ఛైర్‌పర్సన్, నేషనల్ కమిషన్ ఆన్ ఫార్మర్స్, మినిస్ట్రీ ఆఫ్ అగ్రికల్చర్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా

విషయం: పెరుగుతున్న రైతుల ఆత్మహత్యలు, జాతీయ రైతు పాలసీ

ప్రియమైన శ్రీ స్వామినాథన్ గారు,

"నేను సహజ సేంద్రియ పద్ధతులతో వ్యవసాయం చేసే రైతుని. నాకిప్పుడు 84 సంవత్సరాలు. ఆరు దశాబ్దాలుగా నాకు ఈ వ్యవసాయంతో ఉన్న ప్రత్యక్ష అనుభవంతో ఎన్నోరకాల ఆహార పంటలను పండిస్తున్నాను. ఇన్ని సంవత్సరాలుగా నేను వ్యవసాయంలో అనేక పద్ధతులను అర్థం చేసుకుంటూ ఆచరిస్తూ వచ్చాను. 50వ దశకంలో రసాయన ఎరువుల దుష్ఫలితాలు అర్థమయ్యేవరకూ వాటితో కూడా వ్యవసాయం చేశాను. కేవలం సహజ సేంద్రియ వ్యవసాయం మాత్రమే ప్రకృతి సమతౌల్యాన్ని కాపాడగలుగుతుందని, భారతదేశ ప్రజలకు అవసరమైన పౌష్టికాహారధాన్యాలను అందజేయగలుగుతుందని, ప్రాథమికంగా ప్రతి ఒక్కరూ ఆరోగ్యంగా, గౌరవంగా, ప్రశాంతంగా ఉండడానికి అవసరమైనవాటిని అందజేయగలదని ఇప్పుడు నేను ఘంటాపథంగా చెప్పగలను.

ఎం.ఎస్.స్వామినాథన్ గారూ, విషపూరిత రసాయనాలకు గేట్లు బార్లా తెరిచిన హరిత విప్లవ పితామహులుగా మీరు పేరుగాంచారు. అది 40 సంవత్సరాలుగా వేలాది మంది రైతుల ప్రాణాలను హరించడమే కాకుండా సారవంతమైన భూముల్ని కూడా సర్వనాశనం చేసిపారేసింది. అప్పులపాలైపోయిన రైతులు, నిస్సారమైపోయిన భూములు అన్నీ కలిపి ప్రతిసంవత్సరం రైతుల ఆత్మహత్యలను పెంచుతున్నాయి. ఈ వినాశనానికంతటికీ నేను మిమ్మల్నే బాధ్యుల్ని చేస్తున్నాను. ఇంత వినాశనానికి మీరే కారణమయినప్పటికీ, కొత్త వ్యవసాయ పాలసీని తయారుచేయడానికి ఏర్పాటు చేయబడిన 'జాతీయ రైతు కమిషన్'కి

---

సభల కమిటీలకు అవగాహన కల్పించి, వారిని ఆదివాసి అభివృద్ధి వ్యవహారాల్లో భాగస్వాములను చేయడం లేదు. పైగా గ్రామ స్థాయిలో జన్మభూమి కమిటీలు, టిడిపి త్రిసభ్య కమిటీలే నిర్ణయాత్మకమైన పాత్ర పోషిస్తూ, రాజ్యాంగబద్ధ సంస్థలను నిర్వీర్యం చేస్తున్నాయి. రాజ్యాంగంలో పొందుపరిచిన ఆదేశిక సూత్రాల వెలుగులో రాజ్యాంగ పాలన జరగాలి. ప్రభుత్వాలు వాటిని అమలు చేయడం లేదు. కార్పొరేట్ సంస్థల కనుసన్నలలోనే ఇక్కడ రాజ్య పాలన సాగుతుందనడంలో అతిశయోక్తి లేదు. ఈ కార్పొరేట్ సంస్థలు రాజ్య విభాగాలన్నింటిని తమ ప్రభావానికి గురిచేస్తున్నాయి. కలవారు మాత్రమే రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులను అనుభవించ గలుగుతున్నారు.

అశేష ఆదివాసి జన బాహుళ్యానికి ప్రాథమిక హక్కులు అర్థరహిత మైనవిగా మిగిలాయి. సమానత్వాన్ని సాధించడంలో రాజ్యాంగం డొల్లతనం బైటపడింది. పాలకులు, ప్రాభుత్వాధికారులు, పోలీసులు, కార్పొరేట్ సంస్థలు, క్రిమినల్స్ కలిసి కుమ్మక్కై ఆదివాసుల జాతి సంపదలను దోపిడీ చేస్తున్నారు. చట్టాలను సైతం తమకు అనుకూలంగా మలచుకుంటున్నారు. గతంలో కంటే కనీవినీ ఎరుగని స్థాయిలో అవినీతి పెరిగింది. కార్పొరేట్ సంస్థలు కోర్టులను కూడా అవినీతికి గురిచేస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో తిరుగుబాటు జరుగుతున్నాయి. రాజ్యాంగాన్ని చట్టబద్ధ పాలనను ప్రభుత్వాలే గౌరవించనప్పుడు, పాటించనప్పుడు ప్రజలు తప్పని సరిగా తీవ్ర పోరాటాలకు ఆశ్రయిస్తారు. ఇప్పుడు విశాఖ మన్యంలో, దేశంలోని ఇతర ఆదివాసి ప్రాంతాల్లో జరుగుతున్న సంఘర్షణ ఇదే. మన్యం వాసులపై మావోయిస్టు ముద్రవేసి ప్రభుత్వం సాయుధ బలగాలను ఉసిగొల్పితే పోరాటాలు మరింత ఉధృతమవుతాయనడానికి చరిత్రలో, వర్తమానంలో ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి.

(రచయిత ఆదివాసి ఉద్యమ కార్యకర్త) వీ

మీరు ఛైర్‌పర్సన్ కావడాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి? అయినప్పటికీ ఇంకా ప్రపంచాన్ని చూడని పిల్లల భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకుని ఈ అవకాశాన్ని మీరు సద్వినియోగపరుస్తారని ఆశిస్తాను.

మీ కమిషన్ ఈ కొత్తపాలసీని తయారుచేయడం కోసం రైతుల నుంచి కూడా సూచనలు ఆహ్వానిస్తోందని నాకర్థమయింది. అందుకే నేను ఈ ఉత్తరాన్ని ప్రధానమంత్రికి, కేంద్ర వ్యవసాయ శాఖా మంత్రికి, జాతీయ సహాలమండలి ఛైర్ పర్సన్‌తో పాటు మీడియాకు కూడా జతచేస్తున్నాను. దీనిద్వారా అత్యంత ముఖ్యమైన విషయాల గురించి మనం ఒక ఆత్మపరిశీలనలోకి వెళ్లడానికి, బహిరంగంగా చర్చించడానికి ఇది ఒక అవకాశంగా ఉంటుందని భావిస్తున్నాను. దానివల్ల మనం చేసిన తప్పుల్నే తిరిగి చేయకుండా ఉండడానికి, వర్తమానంలో మనం అనుభవిస్తున్న దుస్థితి నుంచి బయటపడడానికి ఒక మార్గం దొరుకుతుందని ఆశిస్తున్నాను. 'సుజలాం, సుఫలాం' అని మన భూమి గురించి బంకించంద్ర ఛటర్జీ చెప్పి ఎంతో కాలం కాలేదు. నిజానికి మన దేశ భూములు ఎంతో సారవంతమైనవి. కొరత లేని నీటివనరులు, సౌరశక్తి, దట్టమైన అడవులు, సమృద్ధమైన జీవ వైవిధ్యం,...విభిన్న సంస్కృతులతో శాంతికాముకులుగా అనంతమైన వ్యవసాయ విజ్ఞాన సంపదను కలిగి ఉన్న ప్రజలు. వ్యవసాయం మా రక్తంలోనే ఉంది. కానీ మా తరంలోని భారతీయ రైతు, తమకున్న అపారమైన వ్యవసాయ అనుభవాలను వదిలిపెట్టి పర్యావరణానికి నాశనం కలిగించే వ్యవసాయం వైపుకి వెళ్లడమనేది నాకు చాలా దుఃఖంగా ఉంది. నిజానికి మీకు వ్యవసాయంలో సున్నా అనుభవం కూడా లేనప్పటికీ మీరు ఆ హానికరమైన వ్యవసాయాన్ని ఈ దేశంలోకి దిగుమతి చేయించారు. ఈ భూమ్మీద అత్యధిక జనాభాను భరించిన నేల మనది. లెక్కపెట్టలేనన్ని తరాలు గడిచిపోయాయి. ఏ రకమైన రసాయన ఎరువులు, పురుగు మందులు, అత్యధిక దిగుబడునిచ్చే కొత్త విత్తనాలు, పొట్టివంగడాలు లేదా ఆకర్షణీయమైన 'జీవ-సాంకేతిక' లబ్ధి లేకుండానే ఇంతకాలం మనుగడ సాగించారు. శతాబ్దాల తరబడి ఈ దేశం మీద ఎన్నో దండయాత్రలు జరిగి ఎంతో విలువైన సంపద తరలివెళ్లిపోయినా కానీ, మన నేలకున్న విలువైన సారం మాత్రం ఎక్కడా చెక్కుచెదరలేదు.

మన అడవుల్లో చింత, ఉసిరి, రేగు, మామిడి వంటి ఎన్నో వేలరకాల చెట్లు ఉన్నాయి. కాలానుగుణంగా వాటి నుంచి వచ్చే పండ్లు, కాయలతో చెట్లకొమ్మలు బరువుగా వేలాడుతూ ఉండేవి. సాధారణంగా ప్రతి సంవత్సరం ఒక్కోచెట్టు కనీసం ఒక టన్ను పైగానే ఫలసాయాన్ని అందించేవి. అయినప్పటికీ చుట్టుపక్కల ఉండే భూమి అంతే పరిపూర్ణంగా, నాశనం కాకుండానే ఉంటూ వచ్చింది. అడవుల్లో ఉండే చెట్లకి, అలాగే కొండమీద ఉండే చెట్లకి నీళ్లు, ఆహారం ఎక్కడినుంచి వస్తున్నాయి? అవి ఎక్కడ ఉన్నాయో అక్కడినుంచే ప్రకృతే వాటికి కావలసిన వాటిని సమకూరుస్తోంది. కానీ మీలాంటి 'శాస్త్రవేత్తలు' ఈ వాస్తవాన్ని గుర్తించడానికి నిరాకరిస్తున్నారు. ఏ పునాది మీద ఫలానా మొక్కకు కానీ, చెట్టుకి కానీ ఏది ఎంత కావాలి ఎప్పుడు కావాలి అని మీరెలా చెప్పగలుగుతున్నారు?

...మన దేశంలో 150 కంటే ఎక్కువ వ్యవసాయ విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. అవి వేలాది ఎకరాల వ్యవసాయ భూములను కలిగి ఉన్నాయి. వాటికి అవసరమైన సదుపాయాలు, సిబ్బంది, పరిజ్ఞానం, డబ్బు...వేటికీ కొదవలేదు. కానీ, ఇవేవీ కూడా వాటికి అవసరమైన ఆహారాన్ని కూడా ఉత్పత్తి చేయడంలేదనేది వాస్తవం. కానీ, ప్రతి సంవత్సరం రైతులను తప్పుదారి పట్టించడానికి, పర్యావరణ వినాశనాన్ని మరింత పెంచడానికి వందలాది మంది 'చదువుకున్న' నిరుద్యోగులను తయారు చేస్తూనే ఉంటాయి. వ్యవసాయ విద్యలో పట్టా తీసుకోవడానికి కనీసం ఆరు సంవత్సరాలు పడిపే విద్యార్థుల 'ఉత్పత్తి'ని ఎలా పెంపొందించాలనే లక్ష్యంతోనే ఉంటారు. వీరి లక్ష్యంకోసం రైతు అనేక విషయాలు చేయాల్సి ఉంటుంది? వందరకాల వస్తువులను కొనాల్సి ఉంటుంది. కానీ, నేలకు హాని కలిగించని పద్ధతులను ఎటువంటి పరిస్థితుల్లో కూడా రైతు చేయ కూడదో, తద్వారా భవిష్యత్ తరాలకు వాటితో ఇతర ప్రాణులకు హానీ జరగకుండా ఉంచేవిధంగా మాత్రం కనీసపాటి ఆలోచన చేయరు. కనీసం ఇప్పటికైనా ప్రజలు, ప్రభుత్వం రెండూ మేలుకుని రసాయన ఎరువులు, పురుగు మందుల పరిశ్రమకు మాత్రమే ఉపయోగపడే వ్యవసాయ విధానాన్ని విడనాడాలి. మన వ్యవస్థ ద్వారా వీటిని పెంచి పోషించడమంటే అది క్షమించరాని నేరమే కాదు ఆత్మహత్యా సదృశ్యం కూడా!

ప్రకృతి పరమైన ఉత్పత్తిని అనూహ్యంగా పెంచాలనుకోవడం ప్రాథమికమైన తప్పు. ఇది మీలాంటి 'వ్యవసాయ శాస్త్రవేత్త' అజ్ఞానాన్ని మాత్రమే బయటపెడుతుంది. మనుషుల చేతిలో పాడవనంతకాలం ప్రకృతి ఎంతో ఉదారంగా ఉత్పత్తులను ఇస్తూనే ఉంది. మీరు అమలు చేస్తున్న ఈ విధానమంతా కూడా వ్యవసాయాన్ని 'వ్యాపారంగా పరిశ్రమగా' మార్చి మిగతా అన్ని అంశాలను నిర్లక్ష్యపర్చడమే. అదే ఈ సమస్యకున్న మూలకారణం. పరిశ్రమలు ప్రకృతి నుంచి వచ్చేవాటిని అవసరాలుగా మారుస్తాయే తప్పించి వాటంతట అవి కొత్తవాటిని సృష్టించ లేవు. కేవలం ప్రకృతి మాత్రమే సృజనాత్మమైనది. అది తిరిగి ప్రతిరోజూ వచ్చే సూర్యరశ్మి సహాయంతో పునరుత్పత్తి చేస్తుంది.

చివరగా, మన దేశానికి ఇప్పుడు అత్యంత అవసరమైనది మిశ్రమ సేంద్రియ వ్యవసాయం, చెట్లపెంపకంతో పాటు స్థానిక వనయి,...? హక్కులను కాపాడే విధంగా అడవులను పునరుద్ధరించడం. నా ప్రశ్నకు మీరు సమాధానం రాతపూర్వకంగా ఇస్తారని ఆశిస్తూ-భాస్కర్ సావే.

సావే రూపొందించిన వ్యవసాయ పద్ధతుల్లో చెట్ల నుంచి వచ్చే ఫలసాయం, ఆహార ధాన్యాలు, కూరగాయలు, పశుసంపద వంటి అన్ని అంశాలకు ప్రాధాన్యత ఉంది. నేలలో తేమ నిలిచేవిధంగా నీటికట్టలను ఏర్పాటు చేయడం ద్వారా సంవత్సరం పొడుగూతా చెట్ల ఫలసాయం ఉండేలా చేశారు. కొబ్బరి, సపోటా పంటలను విరివిగా పెంచడం ద్వారా ఆదాయ భద్రతను కూడా పెంపొందించారు. అంతేకాకుండా ఈ చెట్లవలన నేలలో నిరంతరం హ్యూమస్ ఉత్పత్తి అవుతూనే ఉంటుంది. మరీ ముఖ్యంగా సపోటా లాంటి చెట్లవలన. నేలకోతకు గురికాకుండా ఉంటుంది. వాటి ఆకులు నేలసారాన్ని పెంచుతాయి. సావే వ్యవసాయ విధానం మూడంచెల విధానంతో ఉండేది. తక్కువ సమయంలో ఫలసాయం అందే విధంగా కూరగాయలు, పూలమొక్కలు, తృణధాన్యాలను పెంచేవారు. మధ్యంతరంగా ధాన్యాలను, గడ్డిమొక్కలను, పండ్ల చెట్లను, పూలతోటలను పెంచేవారు. ఎక్కువకాలం ఫలసాయాన్ని అందించే పంటలుగా నేలలో పండే దుంపకూరలను, ఉల్లి, వెల్లి పంటలను, నేరేడు, ఉసిరి వంటి వాటితో పాటు బాదం వంటి వాటిని, సపోటా, కొబ్బరి పంటలతో పాటు అల్ఫాల్ఫా లాంటి గడ్డిజాతి మొక్కలను పెంచేవారు. దేశంలోని రైతులందరి స్వావలంబన కోసం అయన్స్ ఫర్ సస్టెయినబుల్ అండ్ హోలిస్టిక్ అగ్రికల్చర్ (ఆషా) ఆధ్వర్యంలో దేశమంతటా ప్రయాణించిన చారిత్రాత్మకమైన కిసాన్ స్వరాజ్ యాత్రని గుజరాత్‌లోని సబర్మతి నుంచి 2010 అక్టోబర్ 2న సావే ప్రారంభించారు. 2010లోనే 'ది ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ఆర్గానిక్ అగ్రికల్చర్ మూవ్‌మెంట్స్' సావేని 'ఒన్ వరల్డ్ అవార్డ్ ఫర్ లైఫ్‌టైమ్ అఛీవ్‌మెంట్'తో సత్కరిస్తూ 'సేంద్రియ ప్రపంచంలో అత్యంత ముఖ్యమైన వ్యక్తి' అని ఈ సందర్భంగా ప్రకటించడం జరిగింది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ప్రపంచీకరణ బోనులో మాధ్యమిక విద్య

*ప్రభుత్వ విద్యారంగాన్ని నిర్లక్ష్యం చేస్తూ, ప్రైవేట్, కార్పొరేట్ విద్యారంగాన్ని ప్రోత్సహిస్తూ పాలకులు విద్యను వ్యాపారంగా మార్చి సామాన్య ప్రజలకు అందకుండా చేస్తున్న తీరును వివరిస్తున్నారు* **తోట రాజేష్**

ఇంటర్ పరీక్ష ఫలితాలు రాగానే ఢిల్లీలో ఉన్న కేంద్ర మానవ వనరుల శాఖ గ్రేడ్ల విధానాల వలన ఇంటర్మీడియెట్ విద్యార్థుల ఆత్మహత్యలు తగ్గాయి. ఇది మేం సాధించిన ఘన విజయం. విద్యారంగంలో విప్లవ మార్పు తీసుకురావడానికి త్వరలో ఇంటర్ బోర్డ్‌ను రద్దు చేసి, జాతీయ స్థాయిలో ఒక మండలి ఏర్పాటు చేద్దామని కేంద్ర మానవ వనరుల శాఖ ప్రకటించింది. విప్లవ మార్పు పేరిట ఉన్న ఇంటర్ బోర్డ్‌ను రద్దు చేయడం కంటే దారుణం మరొక్కటి ఉండదు. ఈ రోజు ఇంటర్మీడియెట్ బోర్డ్ రాష్ట్రంలో ఉన్న రెండు కార్పొరేట్ కాలేజీల చేతుల్లోనే ఉంది. ఒకపక్క అధికారంలోకి వచ్చిన ప్రతి పాలక పక్షం మా ప్రభుత్వం బడుగు, బలహీన వర్గాల కోసం పనిచేస్తుందని చెపుతుంది, కానీ ఆచరణలో ఆ పాలక పక్షాలు ఈ రాష్ట్రంలో, దేశంలో ఉన్న కార్పొరేట్ శక్తుల కోసమే పనిచేస్తున్నాయి. కేంద్ర మానవ వనరుల శాఖ అన్నట్లుగా ఇంటర్మీడియెట్ గ్రేడ్ పద్ధతి వలన విద్యార్థుల ఆత్మహత్యలు తగ్గలేదు. గత ఆరు దశాబ్దాల కాలంలో భారతదేశంలో ఉన్న విద్యారంగం ఎదుర్కొన్న సవాళ్లలో తీవ్రమైన మార్పు వచ్చింది. ప్రభుత్వం దగ్గర నిధులు లేవన్న సాకుతో మొత్తం విద్యారంగాన్ని ప్రపంచీకరణలో భాగంగా ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణ చేశారు. దీంతో ఈ విద్య విదేశీ సామ్రాజ్యవాదులకు ఊడిగం చేసే విద్యగా మారింది. ఈ మొత్తం కూడా ప్రభుత్వం పథకం ప్రకారమే చేసిందని అర్థమవుతుంది. విద్యనందించడం ప్రభుత్వం బాధ్యత కాదు అని, ఈ రోజు విద్య అంటే కార్పొరేటీకరణ అంటే మార్కెట్ సరుకుగా మారింది.

భారతదేశంలో 1968-70 హరిత విప్లవం విజయవంతమై పారిశ్రామికీకరణ ఫలితంగా నూతన ధనిక వర్గం విద్యారంగంపై పెట్టుబడి పెట్టింది. బంగారు గుడ్డు పెట్టే బాతులా ఈ రంగం అనిపించింది. ఇలా ప్రారంభమైన విద్యా వ్యాపారం తన భౌతిక స్వరూపాన్ని కోల్పోయింది. విద్యారంగంలో అవినీతి అక్రమాలు పెరిగాయి. ఇందులో భాగంగానే మాస్ కాపియింగ్ రాష్ట్రంలో ప్రతి విద్యా సంవత్సరం 10వ తరగతి పాస్‌కు, ఇంటర్ పాస్‌కు 20 శాతం తేడా వస్తుంది. దాంతో 10వ తరగతి పాసయిన లక్షకు పైగా విద్యార్థులు, అందులో 70 వేల మంది విద్యార్థులను 2 బడా కాలేజీలు పంచుకుంటున్నాయి. దీంతో కొన్ని వేల కోట్లు విద్యా వ్యాపారం జరుగుతుంది.

2002-03 విద్యా సంవత్సరంలో 10వ తరగతి పాస్ శాతం 81.12 వస్తే ఇంటర్ మీడియెట్ 56.45 శాతం తేడా 24.67 శాతం ఉంది. ఈ తేడా 2014-15 వరకు కనిపిస్తుంది. ఇలా మాస్ కాపీయింగ్‌ను ప్రోత్సహించి, తద్వారా కొన్ని వేల కోట్ల వ్యాపారం కొనసాగుతుంది. మాధ్యమిక విద్యారంగంలో మార్పు అంటే 10వ తరగతి విద్యార్థులు ఎంత మంది పాస్ అవుతున్నారు. ఇంటర్‌లో అంతే పాస్ కావాలి. కాని 10వ తరగతిలో పాస్ కావడానికి ప్రభుత్వమే 10వ తరగతి పాస్ కావాలని జిల్లా విద్యా అధికారులను బాధ్యులను చేసి పర్సెంటేజీని పెంచాలని చెపుతుంది. దీంతో జిల్లా విద్యాధికారి కిందిస్థాయి ఉద్యోగులు మాస్ కాపీయింగ్‌ను ప్రోత్సహిస్తున్నారు. మరోపక్క పుట్టగొడుగుల్లా పెరిగిన ప్రైవేట్ కార్పొరేట్ హైస్కూల్ విద్యా సంస్థలు ర్యాంకుల కోసం కూడా మాస్ కాపీయింగ్‌ను ప్రోత్సహిస్తున్నాయి.

నిజంగా ప్రభుత్వం చెప్పినట్లు ప్రతి విద్యా సంవత్సరంలో పాస్ పర్సెంటేజీ పెరగాలంటే లక్షకు పైగా కలిగియున్న టీచర్ పోస్టులను భర్తీ చేయాలి. ఆ స్కూల్లలో మౌలిక సదుపాయాలు కల్పించాలి. కానీ పాలక పక్షాలు అలా చేయవు, అలా చేయడం కూడా పాలక పక్షాలకు ఇష్టం ఉండదు. 10వ తరగతిలో మాస్ కాపీయింగ్ ప్రోత్సహించి ఎక్కువ పర్సెంటేజీ పెంచుతున్న ఈ పాలక పక్షాలే ఇంటర్‌లో వడపోత చేసి విద్యార్థుల జీవితాలతో ఆడుకుంటున్నాయి. ఇలా చేయడానికి ప్రధాన కారణం ముందుగా చెప్పినట్లుగా ఇంటర్ బోర్డును శాసిస్తున్న 2 కార్పొరేట్ కాలేజీల కోసమే ప్రభుత్వం ఇలా చేస్తుంది. మరో పక్క పుట్టగొడుగుల్లా పెరుగుతున్న కార్పొరేట్ విద్యా సంస్థల్లో ఫీజులు ఇష్టమొచ్చినట్లు పెంచుతారు. ప్రభుత్వ జూనియర్ కళాశాలల్లో ఆర్ట్స్‌కి 435 ఉంటే సైన్స్‌కి 701 ఉంటుంది.

ఈ మధ్య తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఈ ఫీజును తగ్గిస్తూ ఉచిత విద్య అని ఇంటర్మీడియెట్ మీద కపట ప్రేమ వెల్లబోస్తుంది. కానీ ప్రైవేట్ కాలేజీలకు 10 వేల నుండి 20 వేల వరకు ఫీజు ఒకే సంవత్సరం తీసుకొంటున్నారు. ఇక కార్పొరేట్ కాలేజీలయితే 50 వేల నుండి 2 లక్షల వరకు తీసుకొంటున్నాయి. ఇవే కాక అడ్మిషన్ ఫీజు పేరుతో, ల్యాబ్ ఫీజు పేరుతో, ప్రాక్టికల్ ఫీజు పేరుతో విద్యార్థుల తల్లి దండ్రులను నిలువు దోపిడీ చేస్తున్నారు. ఈ ఫీజుకు సంబంధించి ప్రభుత్వానికి ఎలాంటి అజమాయిషీ ఉండదు. ఈ పీజు నిర్ణయించడానికి ప్రతి కార్పొరేట్, ప్రైవేట్ యాజమాన్యాలు, గవర్నరింగ్ బాడీని ఏర్పాటు చేయాలి. ఈ బాడీలో ఆ విద్యా సంస్థకు చెందిన ప్రిన్సిపల్, కళాశాలలో చదువుతున్న విద్యార్థి, తల్లి, పేరెంట్స్ కమిటీ నుంచి ఒకరిని తీసుకోవాలి. ఇలా ఫీజు నిర్ణయించాలి. కానీ ఇలా ఏ కాలేజి చేయడం లేదు. ఇన్ని వేల ఫీజులు తీసుకున్న ఈ కళాశాలల్లో 100కి 70 శాతం గాలి, వెలుతురుండదు. ఈ గదులో లైట్లు, ఫ్యాన్లు వేస్తే కానీ చదువుకోవడానికి వీలుండదు. ఇరుకైన గదులు ఉంటాయి. కనీసం మరుగు దొడ్ల సౌకర్యం ఉండదు. యాజమాన్యాలు వసూలు చేస్తున్న ఫీజుల్లో సుమారు 40 శాతం ఆ కళాశాలల్లో పని చేస్తున్న లెక్చరర్లకు, అటెండర్, నాన్ టీచింగ్

వర్కర్లకు ఇవ్వాలి. కానీ ఇలా ఏ కాలేజీ చేయడం లేదు. తక్కువ జీతంతో ఎక్కువ శ్రమ చేయించుకోవడం యాజమాన్యాలకు వెన్నతో పెట్టిన విద్య.

ఈ రోజు ప్రభుత్వ విద్యకు సంబంధించి ఏ కోర్సు చేయవలసి వచ్చినా ఎంట్రెన్స్, విధానాలలోనే జరుగుతుంది. అయినా ఎంట్రెన్స్ విధానం విద్యారంగంలో మొదటి నుంచి లేదు. సమాజంలోని అందరికి విద్య అందించవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంది. అసలు ఇంటర్ బోర్డు 1970-72లో ప్రారంభించారు. అంతకు ముందు రెండు తెలుగు రాష్ట్రాల్లో విద్య 1 నుండి 3 వరకు ప్రాథమిక విద్య, 4 నుండి 6 వరకు సెకండరీ విద్య, 2 సంవత్సరాలు ఫ్.ఎ (ఫ్యాకల్టీ ఆర్ట్స్ విద్య), రెండు సంవత్సరాలు బి.ఎ. విద్య, 2 సంవత్సరాలే ఎం.ఎ. విద్య అమలు పరిచారు. తరువాత 1952లో వేసిన మొదలిమన్ కమిషన్ ఆధారంగా అప్పటి ఉమ్మడి రాష్ట్రంలో విద్యలో మార్పు చేశారు.

అంటే ప్రాథమిక విద్య 1 నుండి 5 వరకు ఉంటుంది. ప్రాథమికోన్నత విద్య 6 నుండి 7 వరకు, సెకండరీ విద్య 8 నుండి 10 వరకు, మాధ్యమిక విద్య ఇంటర్‌లో మ్యాథ్స్‌లో వచ్చిన మార్కుల ఆధారంగా ఇంజనీరింగ్ ఇచ్చేవారు. పి.ఇ.సి.లో వచ్చిన మార్కుల ఆధారంగా మెడికల్, మెడిసన్ సీట్లు వచ్చేవి. 1960-70ల్లో భారతదేశంలో వచ్చిన హరిత విప్లవం విజయవంతం అయిన తరువాత వ్యవసాయ రంగంలో వచ్చిన మిగులు ఆధాయంతో ఒక కొత్త ధనిక వర్గం ఉనికిలోకి వచ్చింది. ఈ ధనిక వర్గం వారికి వచ్చిన ఆధాయాన్ని విద్యారంగంపై పెట్టుబడిగా పెట్టారు. ఎప్పుడైతే ఆ విద్యారంగంపై పెట్టుబడిగా పెట్టారో అప్పుడే ఈ విద్యారంగం దాని భౌతిక స్వరూపం కోల్పోయి, నేటికి పతనమయ్యే స్థితిలో ఉంది. ఈ ధనిక వర్గం మాస్ కాపియింగ్‌ని వాల్యుయేషన్ అవినీతిని ప్రోత్సహించాయి.

ఈ నేపథ్యంలోనే ఈ ధనిక వర్గ విద్య దోపిడీకి ప్రభుత్వం తలుపు తెరిచింది. ఈ నేపథ్యంలో వచ్చింది ఇంటర్ వేటేజి, దీంతో ఈ ధనిక వర్గ కాలేజీల్లో విద్యార్థులు చేరాలంటే ఎంసెట్‌లో వీరికి ర్యాంకు కావాలి. ఎంసెట్ ర్యాంకు రావాలి అంటే విద్యార్థులకు నాణ్యమైన విద్యను అందించాలి. ఏ పాలక వర్గాలు, ప్రైవేట్, కార్పొరేట్ శక్తులు అలా చేయవు. అంటే ఎంసెట్‌లో ర్యాంకు రావాలి అంటే మాస్ కాపియింగ్‌ను వాల్యుయేషన్ అవినీతిని ప్రోత్సహించాలి.

ఈ ఎంసెట్ విధానంలో మొదటి ర్యాంకు రావాలి అంటే కోచింగ్ సెంటర్‌లు అవసరమయ్యాయి. ఈ కోచింగ్ సెంటర్లు మొదట విజయవాడ, హైదరాబాద్‌కే పరిమితమై నేడు పుట్టగొడుగుల్లా పెరిగాయి. ఏ కోచింగ్ సెంటర్‌లు అప్పుడు వెలిశాయో, ఆ కోచింగ్ సెంటర్‌లే బడా కార్పొరేట్ కాలేజీలుగా పరివర్తన చెందాయి.

ఇంటర్ వేటేజి అంటే, సూక్ష్మంగా చెప్పాలంటే ప్రభుత్వం విద్యను అందించడం విక్రమించి అదే సందర్భంలో ప్రైవేట్, కార్పొరేట్ కాలేజీలకు దోపిడి చేసుకోవడానికి పర్మిషన్ ఇచ్చినట్లు, మరోమాటలో చెప్పాలంటే ఇంటర్మీడియెట్ ఫేయిల్ అయితే తప్పు అన్నట్లుగా సిగ్గులేకుండా చెపుతున్నారు.

ఈ కార్పొరేట్ కాలేజీల్లో 1000 నుండి 2500 కోట్ల టర్నోవర్ దాటుతుందట. ఒకప్పుడు విద్య వస్తువుగా ఉండి, ఇప్పుడు సరుకుగా మారింది. ఆ విధానం ఇలా కావడానికి ప్రపంచీకరణ కూడా వీటికి దోహదపడింది. కాని ఇది విద్య సంక్షేమానికి నష్టం.

ఉమ్మడి రాష్ట్రంలో ప్రభుత్వ జూనియర్ కాలేజీలు 711 ఉన్నాయి. ఎన్.టి.ఆర్. అధికారంలోకి వచ్చినప్పుడు ప్రతి మండలానికి ఒక జూనియర్ కాలేజీని ఏర్పాటు చేయాలని, జి.ఒ తెచ్చాడు. అలానే రెండు తెలుగు రాష్ట్రాలో 1106 మండలాలు ఉన్నాయి. కాని ఇవి నేటికి అమలు కాలేదు. కనీసం ఈ 711 కాలేజీలకు పక్కా భవనాలు కూడా లేవు. దాదాపు 5000 జూనియర్ లెక్చరర్ పోస్టుల భర్తీ ఉన్నాయి. 1450 నాన్ టీచింగ్ పోస్టులు ఖాళీగా ఉన్నాయి. ఈ 711 కాలేజీల్లో ఉదయం స్కూల్ ఉంటే సాయంత్రం కాలేజీ, సాయంత్రం కాలేజీ ఉంటే ఉదయం స్కూల్ ఉంటుంది. దాదాపు 340 కాలేజీల్లో చెట్ల కిందనే పాఠాలు చెప్పుకుంటున్నారు. దీంతో వర్షాకాలం తడిచి, ఎండకాలం ఎండి, చలికాం వనికి, అనేక ఇబ్బందులతో విద్యార్థులు ఉన్నారు. మరోపక్క ప్రభుత్వం ప్రపంచీకరణలో భాగంగా మాధ్యమిక విద్యలో సంస్కరణలను వేగవంతం చేస్తున్నది. ఇందులో భాగంగానే 76 శాతం హాజరు శాతం లేకుంటే విద్యార్థులకు హాస్టల్ ఇవ్వరు. హాల్‌టికెట్ ఇవ్వని విద్యార్థులు పరీక్షలు రాయరు. రాయకపోతే ఉత్తీర్ణత శాతం పడిపోతుంది. ఉత్తీర్ణత శాతం తగ్గింది కాబటి గ్రూప్‌ని ఎత్తివేయాలి. మరోపక్క 20 మంది లేని సెక్షన్ కూడా ఎత్తివేయాలి. ఇలా రాష్ట్ర వ్యాప్తంగా 150 సెక్షన్‌లు ఎత్తివేశారు. వచ్చే విద్యా సంవత్సరంలో దాదాపు 230 ప్రభుత్వ జూనియర్ కళాశాలలను మూసివేయడానికి ప్రభుత్వం సంస్కరణలను వేగవంతం చేస్తుంది. ఇది ఇలా ఉంటే ప్రైవేట్ కాలేజీలు ఎగ్జామ్ ఫీజులను కూడా ఇష్టమొచ్చినట్లు దన్నుకుంటాయి. ఇంటర్ స్పాట్ వాల్యుయేషన్‌లో కూడా సామర్థ్యంలేని ప్రైవేట్ వ్యక్తులకు అప్పగిస్తున్నారు. దీని ద్వారా విద్యార్థులు తీవ్రంగా నష్టపోతున్నారు. ప్రభుత్వం ఈ విద్యా సంస్థల నుంచి తీసురాసిన..? జవాబు పత్రాన్ని జిరాక్స్ తీసుకొనే అవకాశాన్ని కల్పించింది. ఈ మధ్య ఆదిలాబాద్ జిల్లాలో ఒక విద్యార్థికి 85 మార్కులు వస్తాయనుకుంటే 15 మార్కులు వచ్చాయి. దాంతో ఆ విద్యార్థి రివాల్యుయేషన్‌ను, జిరాక్స్ జవాబు పత్రాన్ని తీసుకొచ్చుకున్నాడు. తరువాత జరిగింది ఏంటంటే తాను రాసిన జవాబు పత్రంలో 5 పేపర్లు మిస్ అయ్యాయి. ఉన్న జవాబు పత్రాలను రివాల్యుయేషన్ చేస్తే ఆ విద్యార్థికి 52 మార్కులు వచ్చాయి. అంటే సబ్జెక్ట్ మీద సామర్థ్యం లేని ప్రైవేట్ లెక్చరర్లను వేయడం వలన ఇలాంటి సంఘటనలు జరుగుతున్నాయి. మొన్న ఇంటర్ వాల్యుయేషన్‌లో వరంగల్ జిల్లాలో ప్రైవేట్ కాలేజీకి చెందిన క్లర్క్‌తో వాల్యుయేషన్ చేయించారు. దాంతో చాలా మంది విద్యార్థులు నష్టపోయారు. ఇలా ప్రభుత్వ సంస్కరణల వలన విద్యార్థుల సంక్షేమం ప్రశ్నార్థకంగా మారింది.

ఇంటర్ విద్య సంక్షోభాలకు కారణమైన ప్రైవేట్, కార్పొరేట్ ప్రభుత్వం రద్దు చేయాలి. దీని వలన వచ్చే దుష్ఫలితాలకు అనేక అనార్థాలు ఉంటాయి. అభివృద్ధి చెందిన దేశాలలో శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రభుత్వమే ప్రధాన బాధ్యత కాని ఆ అభివృద్ధి చెందిన దేశాలే వెనుకబడిన దేశాల విద్యను మార్కెట్ పరం చేస్తున్నాయి. ఆ సామ్రాజ్యవాద దేశాలు తమ విద్యను గ్లోబల్ పోటీని తట్టుకునే వైపుగా చర్యలు తీసుకుంటే వెనుకబడిన దేశాలు విద్యారంగాన్ని తమకు అనుకూలంగా మార్చుకుంటున్నాయి. కాబట్టి ఈ విద్య పట్ల ద్వంద ప్రమాణాలు అనుసరిస్తున్న సామ్రాజ్యవాద దేశాలకు వ్యతిరేకంగా మన కేంద్ర ప్రభుత్వం విద్యా సంస్కరణకు వ్యతిరేకంగా విద్యార్థులను సంఘటిత పరచాలి.

*(రచయిత పిడిఎస్‌యు సభ్యులు)* వీ

# ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి బహిరంగ లేఖ

విజయవాడ
నవంబర్ 11, 2015

*చంద్రబాబు నాయుడు గారికి,*

జూన్ 2014 నుండి ఇప్పటి వరకు సాగిన మీ పరిపాలనలో ఒక ధోరణి ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. అది అధికారిక విధులలో, కార్యక్రమాలలో హిందూ/ వైదిక మత ప్రతీకలను, క్రతువులను, సంప్రదాయాలను అడుగడుగునా పాటించడం. ఇంతకు ముందు కూడా ప్రభుత్వాలు ఇదే ధోరణిలో ప్రవర్తించాయి. కాని ఇప్పుడు కనిపించే స్పష్టమైన తేడా ముఖ్యమంత్రిగా మీరే ఈ ధోరణిని పెద్ద ఎత్తున ప్రోత్సహించడం. రాజ్యాన్ని మతం నుండి వేరు చేసే భారత రాజ్యాంగ లౌకికస్ఫూర్తికి ఇది పూర్తిగా విరుద్ధమని మీకు ప్రత్యేకంగా తెలియజెప్పనవసరం లేదనుకుంటున్నాము. బహుశా, ఇప్పటికీ మిమ్మల్ని మీరు లౌకికవాదిగా పరిగణించుకుంటూ ఉండవచ్చు. అయితే, పైన పేర్కొన్న మీ చర్యల వల్ల ఆ విధంగా చెప్పుకునే అర్హత మీరు పూర్తిగా కోల్పోయారు.

నిజానికి స్వాతంత్ర్యానంతర తొలిదశలో మినహా భారత రాజ్యవ్యవస్థలో లౌకికవాదం బలహీనపడుతూ వచ్చింది. మీ లౌకికవాద విరుద్ధ చర్యలు ఈ క్షీణతకు పరాకాష్ఠగా కనిపిస్తున్నాయి. మీరు, మీ ప్రభుత్వం లౌకికతత్వానికి విరుద్ధంగా తీసుకున్న చర్యలలో ప్రధానమైనవి: అధికార కార్యక్రమాలలో మెజారిటీ మత సంప్రదాయాలను అనుసరించడం' హిందూ/వైదిక మతాన్ని, హిందూ దేవాలయాల అభివృద్ధిని ప్రోత్సహించడం' దేవాలయాలను అధికార హోదాలో సందర్శించి ప్రత్యేక దర్శనాలు పొందడం' దేవాలయాల మతపరమైన ఉత్సవాలలో అధికార హోదాలో పాల్గొనడం' రాజధాని ప్రాంతంలో జరిపిన భూమి పూజ' గోదావరి పుష్కరాలను నిర్వహించిన తీరు' రాజధాని నిర్మాణానికి శంకుస్థాపన జరిపిన తీరు. ఈ విషయాలలో మీరు తీసుకున్న చర్యలు లౌకికస్ఫూర్తికి వ్యతిరేకమైనవి. దేశ ఐక్యతకు భంగకరమైనవి. లౌకికస్ఫూర్తికి అనుగుణమైన ఆచరణ ఎలా ఉండాలనే అంశాన్ని మీ దృష్టికి తీసుకురావడం ఈ లేఖ ఉద్దేశ్యం.

**1) లౌకికవాద స్ఫూర్తి**

I) మతాన్ని రాజకీయాలలోకి చొప్పించడం రాజ్యాన్ని, సమాజాన్ని అస్థిరపరుస్తుందని చరిత్ర అనేకసార్లు రుజువు చేసింది. దీనికి పరిష్కారంగా రాజ్యాన్ని, మతాన్ని వేరు చేసే లౌకికవాద సిద్ధాంతం ఐరోపాలో రూపు దిద్దుకుంది. ఆధునిక ప్రజాతంత్ర జాతి రాజ్య వ్యవస్థకి ఇది ఆలంబన అయింది. భారత రాజ్యాంగం ఈ స్ఫూర్తిని స్వీకరించింది. దేశాన్ని మతాతీత రాజ్యంగా నిర్దేశించింది. అయితే, మతాతీత లౌకికవాదం అంటే ఏమిటనే అంశంపై తీవ్ర భేదాభిప్రాయాలు ఉన్నాయి. రాజ్యం నుండి మతాన్ని వేరు చేయడం లౌకికవాద సారాంశం. అంటే రాజ్యం తన కార్యకలాపాలలో ఏ మతం పట్ల మొగ్గు చూపకపోవడం మాత్రమే కాదు. రాజ్యం పూర్తిగా మతరహితం కావడమే లౌకికవాదపు సిసలైన అర్థం. లౌకికవాదం అంటే సర్వధర్మ సమభావన అనే బలమైన అభిప్రాయం ఉంది. ఈ అవగాహన సూత్రప్రాయంగా సరైనదే. ప్రాచీనకాలం నుండి అనేక మతధర్మాల కూడలిగా ఉన్న భారత సమాజంలో ఐరోపా తరహా మత రాజ్యాలు కాక విభిన్న మత ధర్మాలను గౌరవించిన రాజ్యాలే ఎక్కువగా ఉన్నాయి. ఈ అనుభవం లౌకికవాదం పట్ల ఈ అవగాహనకి ఒక ప్రాతిపదిక అయింది. కాని ఈ భావనను రాజ్యం అన్ని మతాలను అనుసరించాలని, ప్రోత్సహించాలని అవగాహన చేసుకొనే ధోరణి బలంగా ఉంది. ఇది సమస్యాత్మకమైన అవగాహన. ప్రజలు వారి వారి మతాలను నిరాటంకంగా ఆచరించేందుకు అవకాశం కల్పించడం మాత్రమే రాజ్యం బాధ్యత. అన్ని మతాల పట్ల సమాన గౌరవం చూపడం కూడా రాజ్యం బాధ్యత. అంటే మత సామరస్యాన్ని కాపాడడం రాజ్యపు అత్యంత ముఖ్యమైన కర్తవ్యాలలో ఒకటి. ఈ బాధ్యతను, కర్తవ్యాన్ని సక్రమంగా నెరవేర్చాలంటే రాజ్యం ఏ మతాన్నీ అనుసరించరాదు, ప్రోత్సహించరాదు. మతాన్ని పూర్తిగా వైయక్తిక అంశంగా పరిగణించాలి. అన్ని మతాలకు సమాన దూరం పాటించాలి. తన అధికార విధి నిర్వహణలో, కార్యక్రమాలలో ఏ మత ఛాయలు లేకుండా చూడాలి. రాజ్యం మతరహితం కావడం అంటే ఇదే.

II) లౌకికవాద అవగాహనకి మరో ప్రాతిపదిక కూడా ఉంది. మతానికి ఆధారం విశ్వాసం. సాంప్రదాయకత ఆధారంగా అది నిరంతరం కొనసాగుతుంది. దానిని ప్రశ్నించరాదు, విమర్శించరాదు. అందువల్ల మత విశ్వాసం, హేతువు పరస్పర విరుద్ధాలు. అయితే, మానవుల వాస్తవ జీవిత (అంటే లౌకిక) కార్యక్రమాలన్నీ హేతుబద్ధత, కార్యకారణ అవగాహనపై ఆధారపడి నడుస్తాయి. రాజ్య వ్యవహారాలు కూడా ఈ ప్రాతిపదికపైనే నిర్వహించబడతాయి. అంతేగాక, కుల, వర్ణ వివక్ష హిందూ/వైదిక మతంలో అంతర్భాగం. అన్నిమతాలు స్త్రీ పట్ల వివక్షని పాటిస్తాయి. అందువల్ల ఆధునికత ముందుకు తీసుకువచ్చిన సమానత్వ భావనకి, మత భావనకి మధ్య వైరుధ్యం ఉంది. రాజ్యాన్ని మతం నుండి వేరు చేయాలన్న లౌకికవాద అవగాహనకి, ఈ రెండింటి దృష్టి కోణాల్లో ఉన్న పరస్పర విరుద్ధత కూడా కారణం.

III) రాజ్యాంగ, ప్రభుత్వ పదవులలో ఉన్నవారికి, అందరు భారత పౌరుల వలె అధికరణం–25 (1&2)లో రాజ్యాంగం కల్పించిన మతస్వేచ్ఛ హక్కుని తమ వ్యక్తిగత జీవితంలో అనుభవించే పూర్తి హక్కు ఉంది. కానీ, రాజ్యాంగం నిర్దేశించిన లౌకికవాదం (సెక్యులరిజం) నెరవేరాలంటే, వారు తమ అధికార విధుల నిర్వహణలో ఉన్నప్పుడు ఏ మతాన్ని అనుసరించకూడదు. ఎందుకంటే, రాజ్యానికి పాలకులు, కార్యనిర్వాహకులు, అధికారులు, ఉద్యోగులు కాక వేరే అస్తిత్వం ఉండదు. లౌకిక విధానం మేరకు రాజ్యం మతరహితం కావాలంటే, అన్ని మతాలకు దూరంగా ఉండాలంటే, వీరందరూ తమ అధికార నిర్వహణలో మతరహితంగా ప్రవర్తించడం ఒక్కటే మార్గం. ఈ సూత్రం వారి అధికార విధి నిర్వహణకి మాత్రమే అన్వయిస్తుంది కావున, దీనిని వ్యక్తిగత మతస్వేచ్ఛకి భంగం కలిగించడంగా భావించరాదు. రాజ్యాంగ లౌకిక స్వభావాన్ని కాపాడడానికి అవసరమైన హేతుబద్ధ పరిమితిగా మాత్రమే చూడాలి. ఈ తేడాని గుర్తించగలగడం ఇక్కడ కీలకం.

IV) రాజ్యాంగ అధికరణం: 51 ఎ (హెచ్) "శాస్త్రీయ దృక్పథాన్ని, మానవతావాదాన్ని, జిజ్ఞాసను, సంస్కరణవాదాన్ని పెంపొందించుకోవడం" భారత పౌరుల ప్రాథమిక విధులలో ఒకటిగా నిర్దేశించింది. పౌరులు తమ ప్రాథమిక విధులను నెరవేర్చే దిశగా రాజ్యం వారిని ప్రోత్సహించాలి. ప్రకృతి, సమాజం గురించిన అధ్యయనాలను హేతుబద్ధ, పరిశోధనాత్మక పునాదులపై నిలబెట్టడమే శాస్త్రీయ దృష్టి. అంతేగాక మతాన్ని విమర్శనాత్మక దృష్టితో చూడడం శాస్త్రీయ దృక్పథంలో అంతర్భాగం. పాశ్చాత్య దేశాల మేథో పరిణామంలో ఈ విషయాన్ని స్పష్టంగా గుర్తించారు. మన దేశంలో మతం, శాస్త్రాల మధ్య ఉన్న సంబంధాన్ని ప్రధాన స్రవంతి ఆలోచన చూడవలసిన విధంగా చూడలేదు. ఇప్పటికైనా మతాన్ని శాస్త్ర విమర్శకు, పరిశీలనకు గురి చేయవలసిన అవసరాన్ని గుర్తించాలి. అలానే మతాలలో అంతర్గత సంస్కరణలను ప్రోత్సహించడం ద్వారా హేతు విరుద్ధ, మూఢవిశ్వాసాల బారినుండి ప్రజానీకాన్ని బయట పడవేయాలి. అందువల్ల లౌకికవాదాన్ని దాని విశాలార్థంలో సమాజంలో మత ప్రభావాన్ని గణనీయంగా తగ్గించే దిశగా కృషిచేయడంగా కూడా చూడాలి.

V) మతం, దైవం, స్వర్గనరకాలు, పాపపుణ్యాలు, ఆత్మ అనశ్వరత, పునర్జన్మ అన్నీ మానవ జనిత భావాలు మాత్రమే. మనకి తెలిసిన ఈ భౌతిక ప్రపంచం ఒక్కటే వాస్తవం. దీనికి అతీతమైన పారమార్థిక ప్రపంచం (పరలోకం) ఏదీ లేదు. అది మానవుల జీవితంలోని భయాందోళనను, అనిశ్చితిని ఎదుర్కొనలేక, మరణం జీవితానికి శాశ్వత ముగింపు అన్న వాస్తవాన్ని అంగీకరించలేక సృష్టించుకున్న ఊహా ప్రపంచం మాత్రమే. భక్తి విశ్వాసాలు కలవారిగా చలామణీ అవుతున్న అనేక మందికి ఈ విషయాలు తెలుసు. కాకపోతే, మతాన్ని సంప్రదాయంగా, వారసత్వంగా అనేకమంది పాటిస్తారు. పూర్తిగా లౌకిక ప్రయోజనాల కోసం మతాన్ని ఒక సాధనంగా వాడుకునేవారు కూడా ఉంటారు. మత భావన వేదనాభరిత, నిరాశామయ పరిస్థితులలో నుండి జనిస్తుందని మార్క్స్ చెప్పాడు. అది ప్రజలకు మత్తు మందు లాంటిది అని కూడా చెప్పాడు. మతాన్ని విమర్శించడం అన్ని విమర్శలకు ప్రాతిపదిక అన్నాడు. మానవ జీవితంలో నిజమైన ఆనందాన్ని సాధించడం ద్వారా మతం ఇచ్చే భ్రమాజనిత ఆనందాన్ని అధిగమించ వచ్చన్నాడు. ఫ్రాయిడ్ మత భావనని ఒక భ్రమగా అభివర్ణించాడు. మతం మానవాళి బాల్యదశ లాంటిదని, మానవాళి పరిణతి చెందే క్రమంలో మతం సమసిపోతుందని చెప్పాడు. ఇంకా అనేకమంది తత్వవేత్తలు, చింతనాపరులు ఈ విషయాన్ని విభిన్న కోణాల్లో వివరించారు. ఈ భావాలు మనిషిని నిజంగా నిలబెడతాయి. తన జీవితానికి, వర్తమానానికి, భవిష్యత్తుకి ఆమెనే బాధ్యురాల్ని చేసి, ఈ ప్రపంచాన్ని మెరుగుపర్చుకొనే దిశగా పురికొల్పుతాయి. ఈ భావాలతో పరిచయం లౌకికవాదాన్ని బలోపేతం చేస్తుంది.

VI) అయితే లౌకిక వాదాన్ని ఒక్క రాజ్యం బాధ్యతగా చూడరాదు. పౌర సమాజం లౌకికతని ఒక జీవన విధానంగా అలవర్చుకోవాలి. సాంస్కృతిక జీవనంలోని భిన్నత్వం, బహుళత్వం పట్ల పరిణతితో కూడిన సహనాన్ని వివిధ సామాజిక అస్తిత్వ శ్రేణులు అలవర్చుకోవాలి. ఈ సామాజిక అస్తిత్వాల పట్ల, అందునా ముఖ్యంగా కుల, మత అస్తిత్వాల పట్ల, ఉండే కరుడుగట్టిన అభిజాత్యాన్ని, దురభిమానాన్ని, ఆధిపత్య ధోరణిని సంస్కరించే కృషి ఎవరికి వారు నిరంతరం చేయాలి. 'మనం', 'వాళ్లు' అనే విభజనని అధిగమించాలలి. రాజ్యాంగం పౌర విధులలో భాగంగా ప్రకటించిన శాస్త్రీయ దృక్పథం, మానవతావాదం, జిజ్ఞాస, సంస్కరణవాదాన్ని స్ఫూర్తిగా తీసుకోవాలి. అట్టి సంయమనాన్ని, సహనాన్ని అలవర్చుకున్న వివిధ అస్తిత్వాల ప్రజలు, ఇప్పటికీ ఇంకా రేఖామాత్రంగానే రూపుదిద్దుకున్న, భారత జాతీయ అస్తిత్వానికి ప్రోది చేయడం సాధ్యం కావచ్చు. అట్టి జాతీయ అస్తిత్వాన్ని ఏకశిలాసదృశంగా చూడకూడదు. అందులో అంతర్భాగమైన భిన్నత్వాల సమ్మేళనంగానే ఉండాలి. ఒక ఏకత్వాన్ని భిన్నత్వాలపై రుద్దే ప్రయత్నం చేయకూడదు. అంతిమంగా, వివిధ జాతీయ అస్తిత్వాల సమ్మేళనంలో నుండి విశ్వమానవుడు ఆవిర్భవించడం మానవాళి మహోన్నత ఆదర్శం. ఇది లౌకికవాదానికున్న విస్తృతార్థం.

**2) మీ ప్రభుత్వం లౌకికవాద ఉల్లంఘనకు పాల్పడుతున్న తీరు**

I) మీరు ప్రభుత్వ అధికార కార్యక్రమాలను హిందూ/వైదిక మత సంప్రదాయాల ప్రకారం జరుపుతున్నారు. మీ పదవీ ప్రమాణ స్వీకార కార్యక్రమాన్ని సిద్ధాంతి నిర్ణయించిన ముహూర్తం ప్రకారం జరిపారు. రాజధాని నిర్మాణ ప్రాంతాన్ని ఎంపిక చేయడంలో వాస్తుని పాటించారు. మీ ప్రభుత్వం విడుదల చేసిన ఉత్తర్వుల సంఖ్య: 300, రెవెన్యూ (ఎండోమెంట్స్-II) శాఖ, ది.18-8-2015 ద్వారా తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌ని ప్రతి సంవత్సరం వర్షాకాల ఆరంభ సమయంలో, తదితర సందర్భాలలో యజ్ఞాలు, యాగాలు, అభిషేకాలు జరపవలసిందిగా ఆదేశించారు. మీరు, మీ మంత్రులు, అధికారులు అనేక సందర్భాలలో ఆధికార హోదాలో వివిధ దేవాలయాలను సందర్శించి, ప్రత్యేక దర్శనం పొందుతున్నారు. ఇటీవల తిరుపతి వెంకటేశ్వరుని బ్రహ్మోత్సవాలలో మీరు పట్టువస్త్రాలు సమర్పించారు. సెప్టెంబర్‌లో జరిగిన దేవాదాయ, ధర్మాదాయ శాఖ సమీక్షలో మీరు రాష్ట్రం లోని 187 పుణ్యక్షేత్రాలను ఆధ్యాత్మిక పట్టణాలుగా అభివృద్ధి చేయాలని, భక్తుల సంఖ్య పెరిగేలా ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించాలని, దేవాదాయ శాఖ రాబడి 25 శాతం పెరగాలని అన్నట్లుగా పత్రికలలో వచ్చింది. నిజానికి దేవాదాయ, ధర్మాదాయ శాఖ ద్వారా హిందూ/వైదిక మత దేవాలయాల్ని రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించడం సమస్యాత్మకంగా పరిణమించింది. రాజ్యాంగంలోని అధికరణం-25 (2) (బి) లో పేర్కొన్నట్లు ఆర్థిక, ద్రవ్య సంబంధ, రాజకీయ లేక ఇతర మతేతర లౌకిక కార్యకలాపాలకు మాత్రమే ప్రభుత్వ పర్యవేక్షణ పరిమితం కావాలి. కాని అది ఈ పరిధిని దాటిపోయి పాలకుల, అధికారులు పెద్ద ఎత్తున మత, ధార్మిక కార్యక్రమాలలో పాల్గొనడంగా పరిణమించింది. రాజ్యాంగబద్ధ పదవులలో ఉన్నవారు ఇలా ప్రవర్తించడం అనుచితం. రాజ్యాంగ మతాతీత లౌకిక స్ఫూర్తికి విరుద్ధం. ఈ విషయం తెలిసి కూడా రాజ్యాంగ స్ఫూర్తిని ఉల్లంఘించేవారు రాజ్యాంగ పరమైన ఉన్నత పదవులు అధిష్టించడం భారత ప్రజాస్వామ్య దౌర్భాగ్యం.

II) లౌకికవాద ప్రభుత్వాలకు మతాన్ని ప్రోత్సహించే బాధ్యత ఏ మాత్రం లేదు. సోమనాథ దేవాలయ పునరుద్ధరణకు ప్రభుత్వ నిధులు కేటాయించడాన్ని గాంధీ వ్యతిరేకించారనే విషయాన్ని మనం ఇక్కడ గుర్తుంచుకోవాలి. మతాన్ని పెంపుదల చేయడం, ప్రార్థనాస్థలాల పునరుద్ధరణ లాంటివి పూర్తిగా ఆయా మత, ధార్మిక సంస్థలకు విడిచిపెట్టాలే కాని ప్రభుత్వం చేపట్టరాదు (రాజ్యాంగ అధికరణం -26 (ఎ, బి)). ఈ విషయాన్ని మీరు పర్యాటకం అభివృద్ధితో కలగాపులగం చేస్తున్నారు. ఇటువంటి అంశాలలో, లౌకిక రాజ్యవ్యవస్థ పరిరక్షణకు లోబడిన అభివృద్ధికి మాత్రమే ప్రాధాన్యం ఇవ్వాలి. అభివృద్ధి పేరిట ఏదైనా చలామణి అవుతుందనే అవగాహన సరియైనది కాదు. దేవాలయాలను, ప్రార్థనాస్థలాలను ఆధ్యాత్మిక కేంద్రాలుగా కాక కేవలం వారసత్వ సంపదగా చూడడం లౌకికస్ఫూర్తికి దోహదం చేస్తుంది. అప్పుడు దేవాలయాలలో జరిగే పూజలకు, మతసంబంధ ఉత్సవాలకు, కార్యక్రమాలకు రాజ్యం దూరంగా ఉంటూనే అదే సమయంలో వాటిని (వారసత్వ సంపదకి అన్వయించే) ఎలా వుంటే అలా ప్రాతిపదికపై పరిరక్షించే కనీస బాధ్యతను కూడా నెరవేర్చవచ్చు. రాజ్యానికి సంబంధించినంత వరకు ఈ సూత్రాలు అన్ని మతాలకు అన్వయిస్తాయి.

III) 2015 జూన్ 6న మీరు నూతన రాజధానికి భూమి పూజ పేరిట విఘ్నేశ్వర పూజ, హలయజ్ఞం, తదితర హిందూ/వైదిక మత క్రతువుల్ని బ్రాహ్మణ పురోహితుల ఆధ్వర్యంలో నిర్వహించారు. దీనిని లౌకికవాద వ్యతిరేక చర్యగా మేము భావిస్తున్నాము. ఈ క్రమంలో వ్యక్తిగత మతవిశ్వాసాలను రాజ్య వ్యవహారాలలో ప్రవేశపెట్టరాదన్న మౌలిక లౌకిక సూత్రాన్ని మీరు ఉల్లంఘించారు. ఎటువంటి అధికార కార్యక్రమాలనైనా లౌకికపద్ధతిలో నిర్వహించవచ్చు. ఇది ఏమాత్రం కష్టసాధ్యం కాదు. మీరు ఇందుకు విరుద్ధంగా ప్రవర్తించడానికి కారణం మీకు లౌకికవాదం పట్ల నిబద్ధత లోపించడం.

IV) గోదావరి పుష్కరాలను మీరు నిర్వహించిన తీరులోని సమస్యాత్మక అంశాలను దిగువ పేర్కొంటున్నాము:

అ) గోదావరి పుష్కరాల నిర్వహణలో మీరు హైందవ / వైదిక మత ఛాందసవాదానికి దాసోహమన్నారు. ప్రజల మత విశ్వాసాల్ని గౌరవించడమనే రాజకీయ పడికట్టుపదాన్ని మీరు హాస్యాస్పదమైన స్థాయికి దిగజార్చారు. ప్రజలకు సౌకర్యాలు కల్పించడం, భద్రతా ఏర్పాట్లు, పారిశుద్ధ్యం లాంటి నిర్వాహణాంశాల వరకే ప్రభుత్వ బాధ్యత. మీరు ఈ పరిధిని దాటి ఒక హిందూ మత పీఠాధిపతిని మించి ప్రజల మతవిశ్వాసాలను ప్రేరేపించే విధంగా ప్రవర్తించారు. ప్రజలను ఆకట్టుకొని రాజకీయలబ్ధి పొందాలనే కోరిక తప్పించి ఈ అతి ప్రవర్తనకు మరో హేతుబద్ధమైన వివరణ సాధ్యమని మేమనుకోవడం లేదు.

ఆ) జూలై 14న పత్రికలలో ముఖ్యమంత్రిగా మీరు ప్రజలను పుష్కరాలకు ఆహ్వానిస్తున్నట్లు ప్రభుత్వ అధికార ప్రకటన వచ్చింది. 'పవిత్ర పుష్కర స్నానానికి ఆంధ్రప్రదేశ్‌కి తరలిరండి. ఆధ్యాత్మిక జగత్తులో లీనమవ్వండి' అని పిలుపు నిచ్చారు. జూలై 22న మీరు రాష్ట్రంలోని అన్ని ఇళ్లలోనూ పుష్కరజ్యోతి వెలిగించాలని పిలుపునిచ్చినట్లు పత్రికలలో వార్త ప్రచురితమైంది. మేము పైన ఎత్తిచూపిన బాహాటమైన మతపరమైన ధోరణే ఇక్కడ కూడా కనిపించింది.

ఇ) జూలై 13న మీడియా సమావేశంలో 'ఈ వేడుకలు ఒక మతానికి సంబంధించినవి కావు. క్రిస్టియన్లు, ముస్లింలు, హిందువులు ఇంకా ఎన్ని

మతాలుంటాయో అన్నింటినీ నదుల అనుసంధానంతో ఏకం చేయాలనే దృఢ సంకల్పంతో పుష్కర శోభాయాత్ర ప్రారంభించాం' అని మీరు అన్నట్లు పత్రికలు రిపోర్ట్ చేశాయి. మీరన్నంత మాత్రాన అవి హిందూ/వైదిక మత వేడుకలు కాకుండా పోవు. హిందూమతం వైపు మీరు చూపిస్తున్న మొగ్గుని కప్పిపుచ్చుకోవడానికి చేసిన ప్రయత్నమే ఇందులో కనిపిస్తోంది. మాట కంటే ఆచరణ వాస్తవానికి నిఖార్సయిన గీటురాయి. మీ ఆచరణని బట్టి హిందూమతం పట్ల మీకున్న పక్షపాత దృష్టి సుస్పష్టం.

ఈ) పుష్కరాల మొదటి రోజున జరిగిన తొక్కిసలాటలో 28 మంది ప్రాణాలు కోల్పోయిన విషాదఘటన పూర్తిగా నివారించగలిగిన ఘటన. పుష్కరాలని ప్రారంభించే లాంఛన కార్యక్రమానికి అయిదు నిమిషాలు చాలు. ప్రజలని వెంటనే అనుమతించి ఉండాల్సింది. మొదటి రోజు పుష్కర ప్రారంభసమయంలో పుష్కరఘాట్‌లో మీరు స్నానమాచరించడానికి మూడు గంటల సమయం తీసుకోవడం సరాసరి ఈ దుర్ఘటనకు కారణమయిందని మీకు తెలుసు. పోలీసు, ఇతర యంత్రాంగం వైఫల్యం తప్పనిసరిగా ఉంది. కానీ సంఘటన జరిగిన పరిస్థితులను బట్టి చూస్తే ఇందులో మీది కేవలం నైతిక బాధ్యత మాత్రమే కాదు, వాస్తవ బాధ్యత కూడా. మీరు ఈ సంఘటనలకు ఎవరినీ బాధ్యుల్ని చేస్తూ కనీసం సస్పెండ్ కూడా చేయలేకపోయారు. పుష్కరాలు ముగియగానే తీసుకుంటామన్న చర్యలు కూడా తీసుకోలేక పోయారు. తొక్కిసలాట ఘటన జరిగిన రెండు నెలల పిమ్మట న్యాయ విచారణకు ఆదేశించారు. నివేదిక సమర్పించడానికి ఆర్నెల్ల గడువు ఇచ్చారు. మీరిచ్చిన విచారణాంశాలు ఏమైనప్పటికీ, నియామకం చేయడంలోని కాలహరణం, నివేదికకు ఆర్నెల్ల గడువు ఇవ్వడాన్ని బట్టి చూస్తే ఈ విచారణలో వాస్తవాలు వెలుగులోకి వస్తాయనే నమ్మకం ఏ కోశానా కలగడం లేదు. ఇప్పటికే చాలా ఆధారాలు సమసిపోయి ఉంటాయి. మీరు కనీసం శాఖాపరమైన చర్యలు తీసుకోవడానికి కూడా ధైర్యం చేయలేకపోయారు. దీనిని బట్టి చూస్తే, ఈ మరణానికి బాధ్యులు ఎవరనేది తేల్చి, చర్యలు తీసుకుంటారని మేమనుకోవడం లేదు.

ఉ) రు.1600 కోట్ల బడ్జెట్‌తో పుష్కర ఏర్పాట్లు మొదలు కాగా, ముగిసే సమయానికి మొత్తం రు.2500 కోట్లు ఖర్చు అయినట్లు జూలై 26న మీడియాలో ప్రచురితమయింది. ఖచ్చితమైన ఖర్చు ఎంతో మీకు తెలుసు. ఏది ఏమైనప్పటికీ రు.16000 కోట్ల రెవిన్యూ లోటుతో, నిధుల లేమితో సతమతమవుతున్న రాష్ట్రంలో ఇంత ఖర్చు సమంజసం కాదు. పుష్కరాల నిర్వహణకి మీరు రాజకీయ కారణాల వల్ల, మీ స్థానాన్ని బలోపేతం చేసుకోవడం కోసం అవసరాన్ని మించి ఇచ్చిన అతి ప్రాధాన్యతే ఖర్చు ఈ స్థాయిలో పెరగడానికి కారణమయిందని మా అభిప్రాయం.

ఊ) మీరు, పదిమంది మంత్రులు పదమూడు రోజుల పాటు పుష్కరాల నిర్వహణ పేరుతో రాజమండ్రిలో ఉన్నారు. యంత్రాంగాన్ని, వ్యవస్థల్ని బలోపేతం చేసి వాటిచే పని చేయించాలి కాని, మీరు ప్రత్యక్ష పర్యవేక్షణ చేయాల్సి రావడం పాలనలోని బలహీనతలను సూచిస్తోంది.

V) ఇటీవల కృష్ణాజిల్లాలో ఫెర్రి వద్ద గోదావరి నీళ్లను కృష్ణానది నీళ్లతో కలిపిన సందర్భంగా మీరు మళ్లీ అక్కడ పూజలు నిర్వహించారు. దానిని పవిత్ర సంగమం అన్నారు. గంగమ్మ దేవాలయం ఒకటి నెలకొల్పారు. ఈ స్థలాన్ని మీరు మత ప్రతీకగా మార్చడానికి ప్రయత్నించారు. ఇలా ఒక సాధారణ అభివృద్ధి కార్యక్రమానికి మతం రంగు పులమడం అసంబద్ధ చర్య.

VI) 2015 అక్టోబర్ 22న జరిపిన రాజధాని నిర్మాణ శంకుస్థాపన కార్యక్రమాన్ని మత విశ్వాసాలతో జోడించడంలో ఇంతకు ముందు మీరు తీసుకున్న అన్ని చర్యలను తలదన్నే విధంగా ప్రవర్తించారు. 'మన నీరు – మన మట్టి – మన అమరావతి' కార్యక్రమంలో పెద్ద ఎత్తున పూజా కార్యక్రమాలు జరిపారు. ఈ కార్యక్రమంలో సేకరించిన నీటికి, మట్టికి పవిత్రత ఆపాదించారు. తద్వారా శంకుస్థాపన ప్రాంతానికి, రాజధాని ప్రాంతానికి కూడా పవిత్రత ఆపాదించారు. అక్టోబర్ 22కి ముందే శంకుస్థాపన ప్రాంతంలో హోమాలు జరపడం ప్రారంభించారు. అక్టోబర్ 22న శంకుస్థాపన కార్యక్రమంలో భాగంగా మూడు గంటల పాటు పూజలు, హోమాలు జరిపించారు. వీటిలో మీరు, ప్రధానమంత్రి కూడా పాల్గొన్నారు. ఈ క్రమం అంతటా హిందూ/వైదిక మత సంప్రదాయాలను అనుసరించడం ప్రస్ఫుటంగా కనిపించింది. మీరు మసీదులో, చర్చిలో నామకః జరిపించిన ప్రార్థనలు, అక్టోబర్ 19న కళపూజ సందర్భంగా, మరల అక్టోబర్ 22న శంకుస్థాపన సందర్భంగా జరిపించిన సర్వమత ప్రార్థనలు మొత్తం కార్యక్రమం లోని హిందూ/వైదిక మత పక్షపాతాన్ని కప్పిపుచ్చలేవు. మానవ ప్రయత్నానికి దైవబలాన్ని జోడించడం కోసం ఇదంతా చేసినట్లు మీరు చెపుతున్నారు. ఇంతకు ముందే చెప్పినట్లుగా పవిత్రత, దైవత్వం మానవజనిత భావాలు మాత్రమే. అవి మానవ ప్రయత్నానికి జోడించగ అదనపు అంశం ఏదీలేదు. అవి కల్పించినట్లు అనిపించే సకారాత్మక మానసిక స్థితి కూడా వాస్తవానికి మానవుల సామూహిక సంకల్పం నుండి వచ్చేదే కాని వేరు కాదు. అందువల్ల మీరు చేయించిన పూజలు, క్రతువులు, హోమాలు, ప్రార్థనలు, నీరు–మట్టి సంప్రోక్షణ వలన ఫలితం శూన్యం. మానవ విజ్ఞానం, మానవ సంకల్పం, మానవ ప్రయత్నం మాత్రమే కార్య సాధకాలు. వాటిని అలానే చూడడం ఆధునిక భావన. లేని పవిత్రతని, దైవత్వాన్ని ఆపాదించడం మార్మిక, ఆధునిక పూర్వ ధోరణి. లౌకికవాద స్ఫూర్తిని కోల్పోవడం వల్ల, ఆధునికత గురించి తరచూ మాట్లాడే మీరు ఈ అంశాన్ని గుర్తించలేక పోయారు.

VII) ఇక్కడ మరో కోణం కూడా ఇమిడి ఉంది. శంకుస్థాపన కార్యక్రమంతో మతం, పవిత్రత అనే భావనను జోడించడం ద్వారా రాజధాని నిర్మాణం కూడా పవిత్రత సంతరించుకుందని చెపుతున్నారు. తద్వారా ఈ ప్రాజెక్టు విమర్శకు అతీతమైనదని చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. విమర్శకులను 'అభివృద్ధి నిరోధకులు', 'దుర్మార్గులు' అని అభివర్ణిస్తున్నారు. అంటే వారిపై ప్రతి విమర్శ చేయడానికి బదులు వారిని నిందిస్తున్నారు. ఇది మీలోని అసహన ధోరణికి, నియంతృత్వ పోకడకి నిదర్శనం. రాజధాని ప్రాంత ఎంపిక విషయంలో మీరు ప్రదర్శించిన అప్రజాస్వామిక, ఏకపక్ష ధోరణి ఈ ప్రాజెక్టుల పట్ల కొన్ని శ్రేణులలో వ్యతిరేకతకు దారితీసిందనే వాస్తవాన్ని మీరు చూడ నిరాకరిస్తున్నారు. అంటే మీ చర్యలు లౌకికవాదానికే కాక, ప్రజాస్వామ్య ప్రక్రియకి కూడా విరుద్ధంగా ఉన్నాయి.

**3) మరోసారి మా అవగాహన**

లౌకికవాదం గురించి, దానిని మీరు ఉల్లంఘించడం గురించి పైన చేసిన విశ్లేషణకు చివరిగా రెండు విషయాలు మీ దృష్టికి తేదల్చుకున్నాము.

I) భారతదేశంలో లౌకికవాదానికి రెండు లక్ష్యాలున్నాయి: ఒకటి, రాజ్యాన్ని, మతాన్ని వేరు చేయడం' రెండు, వివిధ మతాల మధ్య సామరస్యం సాధించడం. అందువల్ల, లౌకికవాదాన్ని కాపాడడం అత్యావశ్యకం. ఇంతకు ముందే చెప్పినట్లుగా, ఇందుకు అవసరమైన కీలకాంశాలలో పాలకులు, కార్యనిర్వాహకులు, అధికారులు తమ మత విశ్వాసాలను వ్యక్తిగత జీవితానికి పరిమితం చేసుకొని, అధికార విధులు, కార్యక్రమాల నిర్వహణలో మతరహితం గా ప్రవర్తించడం అతి ముఖ్యమైనది. దీన్ని మరో మాటలో చెప్పాలంటే, చంద్రబాబు నాయుడుగా మీకు మతం ఉంటుంది. కానీ ముఖ్యమంత్రిగా మీకు మతం లేదు. లౌకికవాదం అంటే అన్ని మతాల సంప్రదాయాలకు ప్రభుత్వ అధికారిక కార్యక్రమాలలో స్థానం కల్పించడమనే పొరపాటు అవగాహనకు లోను కాకండి. రాజ్యం తన విధులను, కార్యక్రమాలను ఏ మత ఛాయలు సోకకుండా నిర్వర్తించడం ఒక్కటే సరైన అవగాహన. అలా కాక మీరు ప్రస్తుతం చేస్తున్నట్లు మెజారిటీ మత ప్రతీకలను, సంప్రదాయాలను, క్రతువులను అధికార కార్యక్రమాలలో పాటించడం కొనసాగిస్తే, ప్రభుత్వం మెజారిటీ మతం వైపు మొగ్గు చూపుతున్నదనే భావానికి బలం చేకూర్చిన వారవుతారు. ఇది మైనారిటీలో అభద్రతా భావానికి దారి తీస్తుంది. మెజారిటీ మతంలో మౌలికవాదం (fundamentalism) పెచ్చరిల్లే అవకాశం కూడా ఉంది. ఈ క్రమం లౌకికవ్యవస్థని బలహీన పరుస్తుంది. ఎన్ని రిజర్వేషన్లు, మిగతా రక్షణలు కల్పించినప్పటికీ రాజ్యం లౌకికతపై ఏర్పడిన అపనమ్మకాన్ని తుడిచి వేయలేవు. ఇప్పటికే మత ఘర్షణలు, మైనారిటీపై దాడులు, ఉగ్రవాదంతో సంక్షుభితంగా ఉన్న వాతావరణాన్ని మరింత దిగజార్చినట్లవు

తుంది. మతాన్ని రాజకీయాలతో ముడిపెట్టే పార్టీ దుస్సాహసిక రాజకీయాలు, లౌకికవాద పార్టీలుగా చెప్పుకునే వాటి అవకాశవాద రాజకీయాలు కలిసి ఈ పరిస్థితిని మరింత జటిలం చేస్తున్నాయి. ఈ మొత్తం క్రమంలో మీరు మతతత్వ విచ్ఛిన్నకర శక్తులతో జత కట్టారు. మీరు సరాసరి మతతత్వవాది కాకపోవచ్చు. కాని మీరు అనుసరించే లౌకికవాద వ్యతిరేక కార్యకలాపాలు మతతత్వవాదులకు సారవంతమైన భూమికను ఏర్పరుస్తున్నాయి. మతతత్వ వాదులతో మీ రాజకీయ చెలిమి లౌకికవాదానికి తీవ్ర విఘాతం కలిగించేదే అవుతుంది. ఇది మీ ఉద్దేశ్యపూరిత విధానం అయివుండాలి. అందుకే దేశ వ్యాప్తంగా మోగుతున్న మతతత్వ ప్రమాదఘంటికలు మీకు వినపడడం లేదు.

II) తెలుగుజాతి వైతాళికుడు వేమన నాలుగు వందల సంవత్సరాల క్రితం మతాచారాలలోని డొల్లతనాన్ని ఎత్తిచూపుతూ రాసిన ఈ పద్యాలు చూడండి.

*'నీళ్ల మునగనేల, నిధుల ముట్టగనేల / మొనసి వేల్పునకును మొక్కనేల?/ కపట కల్మషము కడుపులోనుండగ'*

*'పిండమును చేసి పితరులను తలబోసి / కాకులకును బెట్టు గాడ్దెలార/ పియ్య తినెడు కాకి పితరుడెట్లాయెరా'*

*'రాతిబొమ్మలకేల రంగైన వలువలు / గుళ్లు గోపురాలు కుంభములను/ కూడు గుడ్డ తాను కోరునా దేవుండు?'*

నాలుగు వందల ఏళ్ల క్రితమే విగ్రహారాధన, పుష్కర స్నానాలు, పిండ ప్రదానాలలోని అర్థరాహిత్యాన్ని ఎండగడుతూ వేమన జాతికి వెలుగురేక చూపితే, మీరు, మీ ప్రభుత్వం ఎంతటి తిరోగమనవాదులుగా ప్రవర్తిస్తున్నారో ఆత్మ పరిశీలన చేసుకోండి. ప్రజలను ఎంత వెనక్కి నడుపుతున్నారో ఆలోచించుకోండి.

**4) లౌకికవాద స్ఫూర్తిని అమలు చేయాలంటే నెరవేర్చవలసిన అంశాలు**

I) హిందూ మత ప్రార్థనాస్థలాల్ని, పుణ్య క్షేత్రాల్ని ప్రభుత్వపరంగా అభివృద్ధి చేసే కార్యక్రమాల్ని విరమించుకోవాలి. వాటిని పూర్తిగా మత, ధార్మిక సంస్థలకు విడిచిపెట్టాలి. పర్యాటకం అభివృద్ధి పేరిట మెజారిటీ మతాన్ని రాజ్యపరంగా ప్రోత్సహించే ఈ అనాలోచిత విధానాన్ని కొనసాగించరాదు.

II) ప్రజాధనాన్ని వెచ్చించి ఏ మతానికీ ఎటువంటి ప్రోత్సాహకాలు ఇవ్వరాదు. ప్రస్తుతం అమలులో ఉన్న అట్టి ప్రోత్సాహకాలనన్నిటినీ ఉపసంహరించు కోవాలి.

III) దేవాదాయ, ధర్మాదాయ శాఖల అధికారులు, పరిపాలనా సిబ్బంది విధులను మతేతర లౌకిక అంశాలకు పరిమితం చేయాలి. వారు అధికార హోదాలో ఎటువంటి పూజలలో, మతపరమైన క్రతువులలో, ఉత్సవాలలో పాల్గొనరాదనే నియమాన్ని ప్రవేశపెట్టాలి. హిందూధర్మ ప్రచార సమితికి, ప్రభుత్వానికి ఎటువంటి సంబంధం లేకుండా చేయాలి.

IV) పండగలను రాజ్య కార్యక్రమంగా ప్రకటించడం, అధికారికంగా జరపడం ఆపివేయాలి.

V) వర్షాల కోసం యజ్ఞాలు, యాగాలు, అభిషేకాలు జరుపవలసిందిగా ఆదేశిస్తూ 2015 ఆగస్ట్ 18న విడుదల చేసిన ప్రభుత్వ ఉత్తర్వు సంఖ్య: 300ని వెంటనే ఉపసంహరించుకోవాలి.

VI) ఇప్పటి వరకు ప్రభుత్వ కార్యక్రమాలలో విచక్షణారహితంగా హిందూ/ వైదిక మత సంప్రదాయాల్ని, పూజల్ని, క్రతువుల్ని పాటించారు. ముహూర్తం, వాస్తు పట్ల నమ్మకాల్ని పెద్ద ఎత్తున అధికార కార్యక్రమాల్లోకి చొప్పించారు. అలాగని అధికార కార్యక్రమాలలో అన్ని మతాల సంప్రదాయాలకు స్థానం కల్పించడం, సర్వ మత ప్రార్థనలు జరపడం కూడా రాజ్యాంగ లౌకికస్ఫూర్తికి విరుద్ధమే. రాజ్యం నుండి మతాన్ని పూర్తిగా వేరు చేయడమే లౌకికవాదం. మతాన్ని పూర్తిగా వ్యక్తిగత అంశంగా పరిగణించడం లౌకికవాదంలో అంతర్భాగం. అందువల్ల ఇకపై రాజ్య వ్యవహారాలలోకి వ్యక్తిగత మత విశ్వాసాలను చొప్పించరాదు. ప్రభుత్వ అధికారిక కార్యక్రమాలను ఏ మత ఛాయలు లేని లౌకిక పద్ధతులలో మాత్రమే నిర్వహించాలి.

VII) 2016 ఆగస్ట్‌లో జరగబోయే కృష్ణా పుష్కరాలలో లౌకికస్ఫూర్తి మేరకు ప్రభుత్వం నెరవేర్చవలసిన అంశాలు కింద పేర్కొంటున్నాము:

(అ) పుష్కరాలపై నమ్మకం పూర్తిగా పురాణగాథలపై ఆధారపడి ఉంది. ప్రకృతి పట్ల ప్రగాఢమైన గౌరవ భావంతో మనిషి ప్రవర్తించాలి. కాని దైవత్వాన్ని ఆపాదించి పూజించనక్కర్లేదు. నదులతో మనుషుల అనుబంధానికి కూడా ఈ అవగాహన వర్తిస్తుంది. ప్రాచీనకాలంలో నదిని దేవతగా కొలిచిన విశ్వాసాన్ని ఇప్పటికీ అలాగే కొనసాగించడం అర్థరహితం. ప్రజలలో ఇటువంటి కాలం చెల్లిన విశ్వాసాలను ప్రేరేపించవద్దు.

(ఆ) పుష్కరాలకు ప్రజలను ఆహ్వానిస్తూ పత్రికలలో అధికారిక ప్రకటనలు ఇవ్వడం, పుష్కర జ్యోతి వెలిగించమని ప్రజలకు పిలుపునివ్వడం లాంటివి కృష్ణా పుష్కరాలలో చేయవద్దు.

(ఇ) ప్రభుత్వ రాజ్యాంగబద్ధ బాధ్యతను మించి పుష్కరాల నిర్వహణను తలకెత్తుకోవద్దు. తప్పనిసరి అవసరాలపై, మితమైన ఖర్చుతో కృష్ణా పుష్కరాలను నిర్వహించాలి.

(ఈ) ఘాట్ ఏర్పాటు, సౌకర్యాల కల్పన, భద్రత, పారిశుద్ధ్యం లాంటి అవసరాలను నెరవేర్చడానికి పుష్కరాల నిర్వహణలో ప్రభుత్వ పాత్రను పరిమితం చేయాలి. మత, ధార్మిక అంశాలకు మీరు, మంత్రులు, అధికారులు పూర్తిగా దూరంగా ఉండాలి.

(ఉ) వి.ఐ.పి ఘాట్లను ఏర్పాటు చేయవద్దు. మత గురువులకి, పీఠాధిపతు లకి కూడా ప్రత్యేక ఏర్పాట్లు చేయనవసరం లేదు. గవర్నర్, ముఖ్యమంత్రి, మంత్రులు, ప్రభుత్వాధికారులు పుష్కర స్నానాలకు దూరంగా ఉంటే మంచిది. అలాకాక వారు స్నానాలు చేయాలనుకుంటే, తమ వ్యక్తిగత హోదాలో చేయాలే తప్ప అధికార హోదాలో చేయరాదు. అంటే ఎటువంటి ప్రొటోకాల్ పాటించకుండా, అధికార వాహనం ఉపయోగించకుండా, భద్రతా సిబ్బంది లేకుండా, సాధారణ ప్రజానీకంతో పాటు క్యూలో వెళ్లి అందరికీ కేటాయించిన సమయాన్నే తాము కూడా తీసుకొని చేయవచ్చు. ఇలా కాక అధికార హోదాని ఏమాత్రం ఉపయోగించుకున్నా అది రాజ్యాంగ, ప్రజాస్వామ్య, లౌకికవాద విరుద్ధ చర్య అవుతుంది.

(ఊ) నదిలో నీటి కొరత ఉంటే పుష్కర ఘాట్‌లకి నీటిని అందించడం చివరి ప్రాధాన్యత అవుతుంది. తాగునీటికి, సాగునీటికి, విద్యుదుత్పత్తికి వినియోగించగా మిగిలిన నీటిని మాత్రమే పుష్కర అవసరాలకు అందించవచ్చు. కాని, ఆ అవసరాలకు కోత విధించి మరలించరాదు.

(ఋ) గోదావరి పుష్కరాలలో వలె మీరు, మీ మంత్రులు రోజుల తరబడి పుష్కరాల నిర్వహణపై సమయం వెచ్చించవద్దు. ప్రణాళికాబద్ధమైన ఏర్పాట్లు చేసి, అధికారులకి బాధ్యతలు అప్పగించాలి. అవసరమైతే సంబంధిత మంత్రికి ప్రత్యక్ష పర్యవేక్షణ అప్పచెప్పవచ్చు. ఇలాచేసి సవ్యంగా నిర్వహించడం సాధ్యమే. ఇంతకు మించిన అనవసరమైన ప్రాధాన్యాన్ని పుష్కరాలకు ఇవ్వవద్దు.

(ౠ) గోదావరినదికి నిత్య హారతి ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు. ఇది ఒక అదనపు మత ప్రతీకను సృష్టించడమే. ఇటువంటివి మత, ధార్మిక సంస్థల పని కాని, ప్రభుత్వం పని కాదు. కృష్ణా పుష్కరాలలో ఇటువంటి కార్యక్రమం తలపెట్టవద్దు.

(ఎ) పుష్కరాల సందర్భంగా అదనపు సెలవులు ప్రకటించవద్దు.

VIII) అధికార స్థానాలల్లో ఉన్నవారు కూడా సామాన్య ప్రజలలో ఒకరుగానే ప్రార్థనాస్థలాల్ని సందర్శించే ప్రజాస్వామ్య పద్ధతిని అమలు చేయాలి. అధికార హోదాలో ప్రార్థనాస్థలాల్ని సందర్శించి ప్రత్యేక (వి.ఐ.పి.) దర్శనం పొందే పద్ధతిని వెంటనే రద్దు చేయాలి.

IX) దేవాలయాలు, ఇతర మతసంస్థలు నిర్వహించే ఉత్సవాలలో, కార్యక్రమాలలో గవర్నర్, ముఖ్యమంత్రి, మంత్రులు, అధికారులు అధికార హోదాలలో పాల్గొనడాన్ని ఆపివేయాలి.

X) రాజ్యాంగ అధికరణం: 51ఎ (హెచ్) ప్రకారం ప్రజలలో శాస్త్రీయ దృక్పథం, మానవతావాదం, జిజ్ఞాస, సంస్కరణవాదాన్ని అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం కృషి చేయాలి.

XI) మహారాష్ట్ర తరహాలో తాంత్రిక, మూఢ విశ్వాసాల నియంత్రణ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్‌లో కూడా తీసుకురావాలి.

XII) మౌలిక లౌకికవాద సూత్రాలను ఇకపై రాజ్యం, ప్రభుత్వం,

అధికారవర్గం ఉల్లంఘించడానికి అవకాశం లేకుండా చేయడానికి గాను ఒక సమగ్ర మార్గదర్శక నియమావళిని రూపొందించి అమలు చేయాలి. దీనిని రాజ్యాంగ/ప్రభుత్వ పదవులలో ఉన్న వారందరూ (గవర్నర్, ముఖ్యమంత్రి నుండి సాధారణ ప్రభుత్వోద్యోగి వరకు) పాటించేట్లుగా చర్యలు తీసుకోవాలి. ప్రజాధనంతో నడిచే అన్ని సంస్థల్లో ఈ నియమావళిని అమలు చేయాలి.

**5) ముగింపు**

పైన పేర్కొన్న చర్యలను అమలుపర్చగలిగితే మీరు లౌకికవాద మార్గానికి తిరిగి రాగలరు. కాని, అలా దిశ మార్చుకునే ఉద్దేశ్యం మీకుందని అనిపించడం లేదు. ఎందుకంటే, రాజకీయలబ్ధి కోసం మీరు ఈ చర్యలను చేపట్టారు. 2014 ఎన్నికలలో బి.జె.పి. విజయంలో హిందూ ఓటు బ్యాంకు పాత్ర ఉందనేది ఒక విశ్లేషణ. మీ రాజకీయ ప్రాబల్యాన్ని సుస్థిరపర్చుకోవాలని మీరు ప్రయత్నిస్తున్నారు. ఇందు నిమిత్తం, ఆంధ్రప్రదేశ్‌లో హిందూ ఓటు బ్యాంకు ఉన్న మేరకు అది బి.జె.పి. వైపు వెళ్లకుండా, మీరే దానిని ఆకట్టుకునేందుకు గాను హిందూ/వైదిక మత సానుకూల చర్యలను చేపడుతున్నారు. బి.జె.పి.తో మీ పార్టీ పొత్తులోని రాజకీయ అవకాశవాదం చాలదన్నట్లు, ఆ పార్టీ కంటే రెండాకులు ఎక్కువ చదివినట్లు మీరు ప్రవర్తిస్తున్నారు. ఈ క్రమంలో అన్ని మతాల పట్ల సమాన గౌరవం చూపాలన్న మౌలిక లౌకికవాద సూత్రాన్ని ఉల్లంఘిస్తున్నారు.

మంచి జరగాలనే ఉద్దేశ్యంతోనే ఈ విధంగా చేస్తున్నట్లుగా మీరు చెప్పవచ్చు. వీలైనంత మేరకు అన్ని మతాలకు అధికార కార్యక్రమాలలో చోటు కల్పిస్తున్నామని కూడా మీరు అనవచ్చు. ప్రజలలో బలమైన మతవిశ్వాసాలు ఉన్నప్పుడు ప్రభుత్వ అధికార కార్యక్రమాలను మత ఛాయలు అస్సలు లేకుండా నిర్వహించడం సాధ్యం కాదని మీరు వాదించవచ్చు. అయితే, మీ చర్యలు నిరపాయకరమైనవి కాకపోగా, అత్యంత సమస్యాత్మకమైనవి. ఎందుకంటే మన ఉద్దేశ్యాలను బట్టి మన చర్యల ఫలితాలు ఉండవు. ఉద్దేశ్యాలు మంచివైనప్పటికీ కొన్ని విధానాలు, చర్యలు ప్రతికూల ఫలితాలకు దారి తీయవచ్చు. మనం చర్చిస్తున్న సందర్భం అలాంటిదే. అసమాన సంఖ్యాబలం ఉన్న వివిధ మతాలకు సమాన గౌరవం ఇవ్వడం అధికార కార్యక్రమాలలో వాటన్నింటికీ స్థానం కల్పించడం ద్వారా సాధ్యం కాదు. ఎందుకంటే, ఇలాంటి సందర్భాలలో వాటికి సమాన స్థానం ఇవ్వడం ఆచరణలో సాధ్యం కాదు. మెజారిటీ మత సంప్రదాయాలు తప్పనిసరిగా ఈ కార్యక్రమాలో ఆధిపత్య స్థానాన్ని పొందుతాయి. ఇది వివిధ మతాల మధ్య దూరాన్ని పెంచుతుంది. అందువల్ల, ఈ పద్ధతిని అనుసరించరాదు. అన్ని మతాలకు రాజ్యం సమాన దూరంలో ఉండటం ఒక్కటే వాటికి సమాన గౌరవం ఇవ్వడానికి సరైన పద్ధతి. లౌకికవాదం కాలపరీక్షకు నిలబడిన విధానం. కాని హిందూత్వవాదులు లౌకికవాదాన్ని వ్యతిరేకిస్తారు. ఈ వ్యతిరేకతకి ప్రధానమంత్రి మోడీయే ప్రత్యక్ష తార్కాణం. భారత రాజ్య మౌలిక స్వభావంలో అంతర్భాగమైన లౌకికవాదాన్ని పరిరక్షించాల్సిన అత్యున్నత పదవిలో ప్రస్తుతం ఆయన ఉన్నారు. దానిని విస్మరించి జపాన్, ఐర్లాండ్ పర్యటనలో ఉన్నప్పుడు సందర్భరహితంగా భారతదేశంలోని లౌకికవాదుల గురించి మోడీ వ్యంగ్య విమర్శలు చేశారు. లౌకికవాదం పట్ల హిందూత్వవాదుల వ్యతిరేకతకి ఇంతకు మించిన ఉదాహరణ ఇంకేం ఉంటుంది! లౌకికవాదాన్ని వ్యతిరేకించే ఇలాంటి శక్తులు ఇతర సమాజాల్లో కూడా ఉన్నాయి. కాని ఈ శక్తులు లౌకికవాదానికి ప్రత్యామ్నాయాన్ని చూపలేకపోగా, విచ్ఛిన్నకర పాత్రని పోషిస్తున్నాయి. అందువల్ల ఆధునిక రాజ్య వ్యవస్థకి లౌకికవాదం ఒక్కటే అనుసరణీయ మార్గం. ఈ సత్యాన్ని గ్రహిస్తే అనేక గందరగోళాలు పరిష్కారమవుతాయి.

హిందూత్వ శక్తులు ప్రబలంగా ఉన్న తరుణంలో వాటిననుకరిస్తూ మీరు హిందూ/వైదిక మత పక్షపాతిగా ప్రవర్తిస్తున్నారు. హిందూమత విశ్వాసాలు బలోపేతం కావడానికి దోహదం చేస్తున్నారు. బలపడిన మత విశ్వాసాలు హిందూమతంలో అంతర్భాగమైన కుల వివక్ష సమస్యల పరిష్కారాన్ని క్లిష్టతరం చేస్తాయి. అంతేగాక, ఇది హిందూ/వైదిక మత మౌలికవాదానికి దారి తీసే ప్రమాదం ఉంది. మతపరమైన అసహనానికి కూడా ఇది దారి తీయవచ్చు. కర్నాటక ఇప్పటికే ఈ పరిస్థితిని ఎదుర్కొంటోంది. ఆంధ్రప్రదేశ్ ఈ మార్గంలో వెళ్లకుండా జాగ్రత్త పడాలి. హిందూత్వకి మరో పేరు ముస్లిం వ్యతిరేకత. బీహార్ ఎన్నికల ప్రచారంలో స్వయంగా ప్రధానమంత్రి వెనుకబడిన తరగతుల ప్రజలకి, ముస్లిం ప్రజలకి మధ్య విభజన సృష్టించడానికి ప్రయత్నించడం హిందూత్వ ముస్లిం వ్యతిరేకతకి ప్రత్యక్ష ఉదాహరణ. ఇది చెప్పే సాంస్కృతిక జాతీయవాద సిద్ధాంతానికి ఫాసిస్టు స్వభావం ఉంది. ఇటీవల దేశంలో జరుగుతున్న అనేక సంఘటనలు హిందూమత మౌలికవాదం, ఇస్లాంమత మౌలికవాదం రెండూ ప్రమాదకరమైనవేననే విషయాన్ని రుజువు చేస్తున్నాయి. మత మౌలికవాదాలు పరస్పర కారకాలు. ఒకటి మరొకదానికి దారి తీస్తుంది. అందువలన హిందూమత మౌలికవాదానికి చోటు కల్పించడం తీవ్రమైన తప్పిదం అవుతుంది. అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లో మత కల్లోలాలను అరికట్టిన ప్రతిష్ట మీ పార్టీకి ఉంది. అలాగే విభజనానంతర ఆంధ్రప్రదేశ్ స్వతహాగా మత సామరస్యం కలిగిన ప్రాంతం. మీరు ప్రస్తుతం అనుసరిస్తున్న విధానాలు ఈ రెండు సానుకూల అంశాలకు విఘాతం కలిగించే అవకాశం ఉంది. ఇది అంతిమంగా మీకు, మీ పార్టీకి, ప్రభుత్వానికి ఆత్మహత్యాసదృశం అవుతుంది. తెలుగు సమాజానికి తీరని నష్టం కలుగచేస్తుంది.

హిందూత్వ శక్తులు రాజకీయ అధికారాన్ని కైవసం చేసుకోవడంతో దేశవ్యాప్తంగా ఫాసిస్టు ధోరణులు ప్రబలుతున్నాయి. భావ వ్యక్తీకరణ స్వేచ్ఛపై, ప్రజల ఆహారపు అలవాట్లపై, 'లవ్ జిహాద్' పేరిట యువత ప్రేమించుకునే స్వేచ్ఛపై, దళితుల జీవించే స్వేచ్ఛపై, 'ఘర్ వాపసీ' పేరిట మతస్వేచ్ఛపై దాడులు, హత్యలు జరుగుతున్నాయి. వీటన్నిటి వెనుక హిందూత్వ శక్తులు ఉన్నాయి. ఈ ధోరణుల పట్ల దేశవ్యాప్తంగా రచయితలు, కళాకారులు, మేధావులు, శాస్త్రవేత్తలు, చరిత్రకారులు, విద్యావేత్తలు తీవ్ర నిరసన వ్యక్తం చేస్తున్నారు. ప్రజాస్వామ్యాన్ని, లౌకికవాదాన్ని కాపాడాలని నినదిస్తున్నారు. లౌకికవాదం జాతికి జీవనాడిలాంటిదని ఘంటాపథంగా చెపుతున్నారు. జాతికి పట్టుగొమ్మల్లాంటి వీరి పిలుపుని పట్టించుకోకపోవడం మూర్ఖత్వం అవుతుంది.

లౌకికవాదాన్ని ఒక రాజకీయ సిద్ధాంతంగా మాత్రమే కాక ఒక జీవన విధానంగా చూడాలి. దానిని పరిరక్షించడం అనేక జాతుల, మతాల, భాషల, సంస్కృతులతో కూడిన దేశ సమగ్రతకి, సామాజిక సుస్థిరతకి అత్యంత ఆవశ్యకం. ప్రజలలో హేతుబద్ధతను, శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించడం ఇందుకు దోహదపడుతుంది. అయితే ఇందుకు విరుద్ధంగా మీరు సంకుచిత రాజకీయ దృష్టితో లౌకికవాద స్ఫూర్తిని విడనాడారు. అభివృద్ధి, సంక్షేమం ఎంత ముఖ్యమైనవో లౌకికవాదం కూడా అంతే ముఖ్యమైనది. దేశ ఆర్థిక పురోగతికి అభివృద్ధి, సంక్షేమం ఎంత అవసరమో, ఎంతముఖ్యమో, అదే విధంగా రాజకీయ సుస్థిరతకి, సామాజిక పురోగతికి లౌకికవాదం అంతే అవసరం, అంతే ముఖ్యం.

ఇప్పటికైనా లౌకిక వ్యవస్థ ప్రాధాన్యతలను గుర్తించి, లౌకికస్ఫూర్తికి కట్టుబడవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాం.

*కొండపల్లి మాధవరావు, కార్యదర్శి – కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం; కొత్తపల్లి రవిబాబు, ప్రధాన సంపాదకుడు – 'ప్రజాసాహితి', సాహిత్య మాసపత్రిక; దివికుమార్, ప్రధాన కార్యదర్శి – జనసాహితి; ఉమా మహేశ్వరరావు, కన్వీనర్ – సంగమం (లౌకిక ప్రజాతంత్రవాదుల వేదిక); కె. సత్యరంజన్, కార్యదర్శి – సాహితీ స్రవంతి; జమిందార్ బుడ్డిగ ప్రధాన కార్యదర్శి – ప్రోగ్రెసివ్ ఫోరం; విశ్వేశ్వరరావు, మేనేజింగ్ ట్రస్టీ – సాహితీమిత్రులు, విజయవాడ; ఎన్. అంజయ్య, కార్యదర్శి – సోషల్ సైన్సెస్ ట్రస్ట్, విజయవాడ; కోట ప్రసాదశివరావు, కార్యదర్శి – సత్యాన్వేషణ మండలి; జంపా క్రిష్ణకిషోర్, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి – జనవిజ్ఞానవేదిక; కె.ఎస్.సి. బోస్, కన్వీనర్ – యం.బి. విజ్ఞానకేంద్రం; కె.ఉషారాణి, ఎడిటర్ – ప్రజాశక్తి బుక్‌హౌస్; అరసవెల్లి కృష్ణ, కార్యవర్గ సభ్యులు – విప్లవ రచయితల సంఘం; జి. మురళీధర్, కార్యదర్శి – జనవిజ్ఞానవేదిక, విజయవాడ; సింహాద్రి యల్లమందారెడ్డి, ఉపాధ్యక్షులు – గుంటూరు జిల్లా హేతువాద సంఘం; అశోక్, మానవ వికాస వేదిక – కృష్ణా జిల్లా.* వీ

# ఆర్‌ఎస్ రావు స్మారక సదస్సు

ఆర్‌ఎస్ రావు మిత్రులు, బి1 కలెక్టివ్, తెలుగు రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక వీక్షణం సంయుక్త నిర్వహణలో నాలుగేళ్లుగా ప్రతి సంవత్సరం జరుగుతున్న ఆర్‌ఎస్ రావు స్మారక సదస్సు ఈ సంవత్సరం 'వలసలు – ఆర్థిక వ్యవస్థలు' అనే చర్చాంశంపై హైదరాబాద్ సెంటర్ ఫర్ ఎకనమిక్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) సెమినార్ హాలులో నవంబర్ 8 ఆదివారం జరిగింది. ప్రతి సంవత్సరం జరిగే ఆర్‌ఎస్ రావు స్మారకోపన్యాసం ఈ సంవత్సరం అనివార్య కారణాలవల్ల వాయిదా పడింది. ఈ స్మారకోపన్యాసాన్ని త్వరలో ప్రొ. డి నరసింహారెడ్డి చేస్తారు.

ఇటీవలి కాలంలో భారత ఆర్థిక వ్యవస్థలో అనివార్య స్థితిలో వలస వెళ్తున్న శ్రామికుల సమస్య మళ్లీ ప్రధాన చర్చనీయాంశంగా మారింది. విద్యావేత్తలు, పరిశోధకులు, విధాన నిర్మాతలు, సామాజిక కార్యకర్తలు, వ్యాఖ్యాతలు ఈ అంశం గురించి విభిన్న ఆలోచనలు చేస్తున్నారు. ఈ చర్చలో భాగంగానే ఈ సంవత్సరం ఆర్‌ఎస్ రావు స్మారక సదస్సుకు ఈ చర్చాంశాన్ని ఎంచుకోవడం జరిగింది. ఆర్‌ఎస్ రావు తన రచనల్లో, ఉపన్యాసాల్లో ఎన్నోసార్లు ఈ అంశాన్ని ప్రస్తావించి విశ్లేషించారు.

సదస్సు ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రొ. డి నరసింహారెడ్డి సమాజంలో పెరుగుతున్న వలసలను ఎలా అర్థం చేసుకోవాలనే అంశాలను చర్చించారు. మానవ సమాజ పరిణామ క్రమంలో వలసలు ఎప్పుడూ జరుగుతున్నాయని, కాని ప్రతి వలసా అభివృద్ధికి దారి తీస్తుందని చెప్పలేమని, వలసలకు ఎప్పుడూ ఒకే రకమైన ఫలితాలూ ప్రభావాలూ లేవని ఉదాహరణలు చెప్పారు. ఈ నేపథ్యంలో వలసల గురించి సిద్ధాంత స్థాయిలో లోతైన అధ్యయనం చేయవలసి ఉందని, క్షేత్రస్థాయిలో విశాలమైన సమాచార సేకరణ జరగవలసి ఉందని ఆయన అన్నారు. మన సమాజంలో జరుగుతున్న వలసలు, వలస శ్రామికుల దుర్భర పరిస్థితులు అర్ధ భూస్వామ్య సూత్రీకరణ నేపథ్యంలో అర్థం చేసుకోవాలని ఆయన అన్నారు.

వలసల గురించి డా. ముదునూరి భారతి అభిప్రాయాలను వివరిస్తూ డా. ఆర్ కవితా రావు వలసలు ఉత్పత్తిశక్తులలో, ఉత్పత్తి సంబంధాలలో, ఉపరితలాంశాలలో ఏ మార్పులు తెస్తున్నాయనేదే గీటురాయిగా వలసలను పరిశీలించాలని, ఆ మార్పులు వ్యవస్థలో ఎటువంటి మార్పులకు దారితీస్తున్నాయనేది గుర్తించాలని అన్నారు. మన సమాజంలో వలసలు విరివిగా జరుగుతున్నప్పటికీ అవి వ్యవస్థాగతంగా మార్పులకు దారితీస్తున్నాయా లేదా, ఉన్న వ్యవస్థనే బలోపేతం చేస్తున్నాయా అనే అంశాలు ఇంకా చర్చనీయాంశాలుగానే ఉన్నాయని అన్నారు.

ఆ తర్వాత దేశమంతా సుప్రసిద్ధమైన పాలమూరు వలసల గురించి ఇరవై సంవత్సరాలకు పైగా క్షేత్రస్థాయి సమాచారం, అనుభవం ఉన్న ఎం రాఘవాచారి మాట్లాడుతూ దేశవ్యాప్తంగా అన్ని భారీ నిర్మాణాలలో పాల్గొన్న పాలమూరు శ్రామికుల వలసలు ఎప్పుడు ఎందుకు ప్రారంభమయ్యాయో, ఈ వలస శ్రామికులను తీసుకుపోయే వ్యవస్థ ఎలా రూపొందిందో వివరించారు. ఆయా ప్రాంతాల్లో వలస శ్రామికుల దుర్భర స్థితిని, గ్రామాల్లో వారి కుటుంబ సభ్యుల దుస్థితిని వివరించారు. ఇటువంటి మహబూబ్ నగర్ జిల్లాకే ఇతర ప్రాంతాల నుంచి వలస రావడం కూడ ఉందంటే, బైటికి వెళ్లే శ్రామికుల వలసకు కారణం వనరుల లేమి కాదని అర్థం చేసుకోవాలని అన్నారు.

వ్యవసాయ రంగం నుంచి విస్తారమైన వలసల నేపథ్యంలో దేశ స్థాయిలో వ్యవసాయం వాటా తగ్గిపోతున్నదనే అభిప్రాయాలను ప్రాతిపదికగా తీసుకుని జాతీయ నమూనా సర్వే గణాంకాలను విశ్లేషిస్తూ చిత్రా సేన్ 'భారత ఆర్థిక వ్యవస్థలో మార్పులు: నిజంగా వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ కుంచించుకుపోతున్నదా?' అనే పత్రం సమర్పించారు. వ్యవసాయ రంగంలో ఉన్నవారు, వ్యవసాయేతర రంగంలో ఉన్నవారు అనే వృత్తిపరమైన విభజనతో గణాంకాలు సేకరిస్తుండడం వల్ల వ్యవసాయం వాటా తగ్గిపోతున్నదనే తప్పుడు అభిప్రాయం కలుగుతున్నదని, నిజానికి మిశ్రమ రంగం, అంటే ఆదాయం కోసం వ్యవసాయేతర రంగంలో ఒక కాలుపెట్టి, మరొక కాలు వ్యవసాయ రంగంలోనే ఉంచుకున్న వారి జనాభా పెరుగుతున్నదని ఆయన అన్నారు.

పశ్చిమ ఒడిశా లో ఇటుక బట్టీ కార్మికుల జీవన స్థితిగతులను, వలసలలో మధ్యవర్తుల పాత్రను అధ్యయనం చేసిన ఆనంద్ మెహెర్ 'పశ్చిమ ఒడిశాలో ఇటుకబట్టీ కార్మికుల వలసలు: పద్ధతులు, సెకండ్ సర్దార్ పాత్ర' అనే పత్రం సమర్పించారు. పశ్చిమ ఒడిశాలో వ్యవసాయ రంగపు దుర్భర పరిస్థితులు అక్కడి శ్రామికుల వలసలకు ఎలా దారితీస్తున్నాయో, వారిని చౌక, నిర్బంధ శ్రామికులుగా ఉపయోగించడంలో ఒక నిచ్చెన మెట్ల యాజమాన్య వ్యవస్థ ఎలా రూపొందిందో, ఆ వ్యవస్థలో భూస్వాములు, వడ్డీవ్యాపారులు, పోలీసులు, మాఫియా, రైల్వే సిబ్బంది ఎలా భాగమవుతున్నారో, ఆ వ్యవస్థలో సెకండ్ సర్దార్ అనే ముఠా మేస్త్రీ పాత్ర ఏమిటో ఆయన వివరించారు.

శ్రామికుల వలసలు ఎదుర్కొంటున్న సమస్యలు మాత్రమే కాదని, మన సామాజిక వ్యవస్థ ఉన్న స్థితిలో పెట్టుబడి వలసకు కూడ సమస్యలు ఉన్నాయని చెపుతూ, తన అనుభవం నుంచి ఒడిశాలో మయూర్ భంజ్ జిల్లా రాయ్ రంగపూర్ లో 1982-84లో స్థాపించిన కుట్టు మిషన్ల కర్మాగారాలు ఎలా విఫలమయ్యాయో వివరించారు.

ఒక గ్రామం నుంచి వలస వెళ్లిన వారు ఏయే వృత్తుల్లో స్థిరపడ్డారో, వలసలు అంతిమంగా గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు గాని, వలస వెళ్లినవారి కుటుంబాల ఆర్థిక వ్యవస్థలకు గాని మేలు చేశాయో లేదో క్షేత్ర స్థాయి గ్రామీణ అధ్యయనంతో వై రామచంద్రం వివరించారు.

వలసల వల్ల సామాజిక పరివర్తన జరుగుతున్నదా లేదా, జరిగితే ఆ పరివర్తన మూల్యం ఏమిటి, మధ్యవర్తుల పాత్ర ఏమిటి అనే అంశంపై చర్చిస్తూ డా. జి విజయ్ తన ఆలోచనలు పంచుకున్నారు.

వలసలను ఎన్ని కోణాలలో అర్థం చేసుకోవలసి ఉందో, అవి సాహిత్యంలో ఎలా చిత్రణ పొందాయో, వర్గ పోరాటానికీ వలసలకూ సంబంధం ఎంత సంక్లిష్టమైనదో ఎన్ వేణుగోపాల్ చర్చించారు.

ఆరు గంటలకు పైగా జరిగిన ఈ ఆసక్తిదాయకమైన, ఆలోచనాస్ఫోరకమైన సదస్సులో, చర్చలో దాదాపు అరవై మంది పాల్గొన్నారు. వీ

### యువజన జెఎసి నాయకులపై బిజెపి దాడి

ఆంధ్రప్రదేశ్‌కి ప్రత్యేక హోదా ఇవ్వాలన్న డిమాండ్‌తో ఉద్యమిస్తున్న విద్యార్థి, యువజన జెఎసి నాయకులపై బిజెపి నేతలు దాడి చేశారు. నవంబర్ 1న విజయవాడలోని పార్టీ రాష్ట్ర కార్యాలయం ముందు ప్రధానమంత్రి నరేంద్రమోడీ దిష్టిబొమ్మను దహనం చేసేందుకు ప్రయత్నించిన జెఎసి నేతలపై బిజెపి కార్యకర్తలు దాడి చేశారు. వారిని తరిమికొట్టారు. ఈ సంఘటన తీవ్ర ఉద్రిక్తతకు దారి తీసింది. నలుగురు జెఎసి నేతలను సూర్యారావుపేట పోలీసులు అరెస్టు చేశారు.

### బాక్సైట్ తవ్వకాలకు వ్యతిరేకంగా భారీ ర్యాలీ

విశాఖ ఏజెన్సీలో బాక్సైట్ తవ్వకాలను వ్యతిరేకిస్తూ నవంబర్ 10న ఆదివాసులు భారీ ర్యాలీ నిర్వహించారు. తవ్వకాలు జరిపేందుకు మన్యంలో అడుగుపెట్టే నాయకులు, వ్యాపారవేత్తల గుండెల్లో గునపాలు దించుతామని హెచ్చరించారు. బాక్సైట్ జోలికొస్తే ఖబర్దార్ అంటూ గర్జించారు. బాక్సైట్ తవ్వకాలను నిరసిస్తూ ఏర్పాటయిన గూడెంకొత్త వీధి మండల అఖిలపక్షం పిలుపు మేరకు పదహారు పంచాయతీల నుంచి సుమారు ఆరు వేల మంది ఆదివాసులు ఈ కార్యక్రమానికి వచ్చారు. ఈ మేరకు జికె వీధి నాగదేవత కాలనీ నుంచి యుసిఐఎం క్రీడా మైదానం వరకు భారీ ర్యాలీ నిర్వహించారు.

### బాక్సైట్ తవ్వకాలకు అనుమతులు రద్దు

విశాఖ మన్యంలో బాక్సైట్ తవ్వకాలకు అన్‌రాక్ కంపెనీకి అనుమతులు ఇస్తూ అటవీ శాఖ నవంబర్ 5న ప్రభుత్వం జి.ఒ. 97ను జారీ చేసింది. అయితే ఆంధ్రప్రదేశ్‌లోని ఆదివాసులు, మేధావులు, ప్రజా ప్రతినిధులు దీనిపై నిరసన వ్యక్తం చేశారు. బాక్సైట్ తవ్వకాల జి.ఒ.ను తక్షణమే రద్దు చేయాలని డిమాండ్ చేశారు. కాగా నవంబర్ 16న మంత్రి మండలి బాక్సైట్ తవ్వకాల జి.ఒ.ను రద్దు చేసింది. బాక్సైట్ తవ్వకాలపై ఆదివాసులకు పూర్తి అవగాహన కల్పించిన తర్వాతే తవ్వకాలకు అనుమతులిస్తామని మంత్రి మండలి పేర్కొంది. అయితే బాకైట్ తవ్వకాలను శాశ్వతంగా రద్దుచేయాలని ప్రజా సంఘాల నాయకులు, ప్రజా ప్రతినిధులు డిమాండ్ చేస్తున్నారు.

### ఆంధ్రప్రదేశ్‌లో భారీ వర్షాలు

ఈశాన్య రుతుపవనాల ప్రభావంతో నవంబర్ మొదటి వారంలో ఆంధ్రప్రదేశ్‌లోని పలు జిల్లాలలో భారీ వర్షాలు కురిశాయి. ముఖ్యంగా నెల్లూరు, చిత్తూరు, కడప, గుంటూరు జిల్లాలలో తీవ్ర వర్షాలు కురిశాయి. ఈ వర్షాలకు చిత్తూరు, నెల్లూరు జిల్లాలలో ఏడుగురు మృతి చెందగా, ఆరుగురు గల్లంతయ్యారు. వాయుగుండం కారణంగా నవంబర్ 15, 16, 17న మళ్లీ నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం జిల్లాలలో భారీ వర్షాలు కురిశాయి. ఈ కారణంగా 19 మంది మృతి చెందారు. సుమారు మూడు వేల హెక్టార్లలో పంట నష్టం జరిగింది. గొర్రెలు, పశువులు కొట్టుకు పోయాయి. అలాగే ఉభయ గోదావరి జిల్లాలలోనూ వర్షాల కారణంగా పంట నష్టం జరిగింది.

### చిత్తూరు మేయర్ హత్య

చిత్తూరులో నవంబర్ 17న తెలుగుదేశం పార్టీకి చెందిన చిత్తూరు నగరపాలక సంస్థ మేయర్ కటారి అనురాధ, ఆమె భర్త కటారి మోహన్‌లను దుండగులు హత్య చేశారు. ఐదుగురు వ్యక్తులు రెండు బృందాలుగా విడిపోయి మునిసిపల్ కార్యాలయంలోని, వారి చాంబర్‌లోనే వారిపై కత్తులతో, పిస్టోల్‌తో దాడి చేసి మేయర్ దంపతులను హత్య చేశారు. ఈ ఘటనలో మేయర్ అనురాధ అక్కడికక్కడే మృతి చెందగా, మోహన్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ మృతి చెందారు. కాగా ఘటనలో కటారి మోహన్ మేనల్లుడు చింటూనూ నిందితుడిగా నిర్ధారించారు.

### టిఆర్ఎస్ నేతలకు విముక్తి

మావోయిస్టులు తీసుకెళ్లిన తెలంగాణ రాష్ట్ర సమితికి చెందిన ఆరుగురు నాయకులను నవంబర్ 21న విడుదల చేశారు. నవంబర్ 18న భద్రాచలం ఇన్‌చార్జ్ మానె రామకృష్ణ, చర్ల మండలానికి చెందిన పటేలు వెంకటేశ్వర్లు, వి. రామకృష్ణ, ఎస్. సురేశ్, వెంకటాపురం మండలానికి చెందిన సత్యనారాయణ, వాజేడు మండలానికి చెందిన జనార్దన్‌లు మాట్లాడేందుకని చెప్పి మావోయిస్టులు తీసుకెళ్లారని తెలిపారు. ఖమ్మం జిల్లా నుండి ఆదిలాబాద్ వరకు అవినీతిమయంగా మారిందని, ఎన్‌కౌంటర్ల పేరుతో తమ కార్యకర్తలను చంపితే తెరాస నాయకులను వదిలిపెట్టమని, ఇప్పటికైనా ప్రభుత్వం తన పంథా మార్చుకోవాలని మావోయిస్టులు అన్నారని చర్లలో నవంబర్ 21న విలేకరుల సమావేశంలో తెలిపారు.

### ఆంధ్రప్రదేశ్‌లో 359 కరువు మండలాలు

ఆంధ్రప్రదేశ్‌లో అక్టోబర్ 27న ఏడు జిల్లాల పరిధిలో ప్రకటించిన కరువు మండలాలు 196 కాగా, నవంబర్ 21న ప్రకటించిన 163 మండలాలతో కలిపి మొత్తం కరువు మండలాలు 359గా గుర్తించింది. ప్రకాశం. గుంటూరు, అనంతపురం, నెల్లూరు, కడప, చిత్తూరు, కృష్ణా, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల పరిధిలోని కరువు మండలాల జాబితాను ప్రకటిస్తూ రెవెన్యూ శాఖ ముఖ్య కార్యదర్శి జెసి శర్మ ఉత్తర్వులు జారీచేశారు. ప్రభుత్వం నియమించిన కమిటీ నవంబర్ 18, 20 తేదీల్లో సమావేశమై కలెక్టర్ల నుంచి వచ్చిన జాబితాను పరిశీలించి వీటిని ఎంపిక చేశారు. కరువు నివారణ చర్యల కింద రైతులకు రుణ సౌకర్యం కల్పించే చర్యలు చేపట్టాలని తెలిపారు.

### ఎపిలో అంగన్‌వాడి ఉద్యోగుల ధర్నాలు

అంగన్‌వాడి ఉద్యోగులకు వేతనాల పెంపును ప్రకటించి నాలుగు నెలలైనా జి.ఒ. విడుదల చేయకపోవడంతో అంగన్‌వాడి యూనియన్ నాయకత్వంలో నవంబర్ 20న ధర్నాలు నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లా కలెక్టరేట్ల, ఆర్‌డిఒ కార్యాలయాల ముందు ధర్నాలు, ర్యాలీలు నిర్వహించారు. శ్రీకాకుళం ఆర్‌డిఒ కార్యాలయానికి వెళ్లేందుకు ప్రయత్నించగా అంగన్‌వాడి కార్యకర్తలు అడ్డగించారు. దీంతో అంగన్‌వాడి వర్కర్స్ అండ్ హెల్పర్స్ యూనియన్ జిల్లా అధ్యక్ష, ఉపాధ్యక్షులు సుజాత, కె. నాగమణితో పాటు 258 మందిని పోలీసులు అరెస్ట్ చేశారు. అంగన్‌వాడి యూనియన్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. సుబ్బరావమ్మ పెంచిన వేతనాలను అమలు చేకపోవడం అన్యాయమని వెంటనే అమలు చేయాలని డిమాండ్ చేశారు.

### ఆశా వర్కర్ల దీక్షలు భగ్నం

తెలంగాణ వ్యాప్తంగా గత మూడు రోజులుగా ఆశా వర్కర్లు నిరవధిక నిరాహార దీక్షలు చేస్తున్నారు. తమకు కనీస వేతనాలు, ఉద్యోగ భద్రత కల్పించాలని, ఆశాలను 4వ తరగతి ఉద్యోగులుగా గుర్తించాలని డిమాండ్ చేస్తూ 80 రోజులుగా ధర్నాలు, రాస్తా రోకోలు చేస్తున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా నిరాహార దీక్ష చేస్తున్న ఆశా వర్కర్లను నవంబర్ 20న పోలీసులు అరెస్ట్ చేసి ఆస్పత్రులకు తరలించారు. ఆశా వర్కర్ల ఉద్యమానికి అన్ని పార్టీల నాయకులు మద్దతు ప్రకటించారు. వీ

### జాతీయ విత్తన సదస్సు

8వ జాతీయ విత్తన సదస్సు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల భాగస్వామ్యంలో హైదరాబాద్‌లోని హైటెక్స్‌లో అక్టోబర్ 27 నుండి 29 వరకు నిర్వహించారు. ఈ సదస్సుకు తమిళనాడు, మహారాష్ట్ర, ఒడిశా, గుజరాత్, అస్సాం, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల నుంచి వ్యవసాయ శాస్త్రవేత్తలు, అధికారులు పాల్గొన్నారని జాతీయ విత్తన సదస్సు ఆర్గనైజింగ్ కమిటీ చైర్మన్ పార్థసారథి తెలిపారు. ఏయే రాష్ట్రాల్లో విత్తనోత్పత్తికి అనుకూలమైన వనరులు ఉన్నాయో ఆయా రాష్ట్రాల ప్రతినిధులు మాత్రమే పాల్గొన్నారన్నారు. విత్తనోత్పత్తి రైతులకు ఆదాయం సమకూర్చే మార్గమన్నారు. ప్రభుత్వాలు విత్తనోత్పత్తికి సబ్సిడీ ఇవ్వాలనీ, బీమా పథకం అమలు చేయాలనీ, విత్తన సంస్థలు రైతులతో చేసుకున్న ఒప్పందాలు అమలు చేయాలనీ రైతులు కోరారు. ప్రైవేట్ కంపెనీల నుండి రైతులను కాపాడాలి. విత్తన పరిశోధన చేసే వ్యవసాయ విశ్వవిద్యాలయాలున్నాయి. ప్రభుత్వాలు చేయాల్సిన పని చేయకుండా కార్పొరేట్ సంస్థలను కాపాడేందుకే ఈ ప్రయత్నమంతా అని తెలంగాణ రైతు సంఘం ఉపాధ్యక్షులు టి. సాగర్ అన్నారు. ఈ సదస్సులో ప్రధానంగా విత్తనాభివృద్ధిలో ఆవిష్కరణలు, భవిష్యత్తులో ఆహార భద్రత, సుస్థిర వ్యవసాయం కోసం నాణ్యమైన విత్తనాల ఉత్పత్తికి అమలు చేయాల్సిన వ్యూహాలు చర్చించారు.

### పద్మభూషణ్‌ను వెనక్కిచ్చిన భార్గవ

జీవ పరిశోధనా రంగంలో కృషిచేసిన శాస్త్రవేత్త పి.ఎం. భార్గవ తనకు లభించిన పద్మభూషణ్ పురస్కారాన్ని వెనక్కి ఇస్తున్నట్లు అక్టోబర్ 29న ప్రకటించారు. శాస్త్రీయత, హేతుబద్ధత, నాస్తికత్వాలపై ప్రభుత్వ దాడులకు నిరసనగా తాను ఈ నిర్ణయం తీసుకున్నట్టు తెలిపారు. ప్రభుత్వమే మతాన్ని, విద్వేష వాతావరణాన్ని వ్యవస్థీకృతం చేస్తున్నపుడు...ఆ ప్రభుత్వం ఇచ్చే పురస్కారాలకు ఎలాంటి విలువ ఉండదని స్పష్టం చేశారు. కేంద్ర హోంశాఖ అధికారులను త్వరలోనే కలుసుకొని పురస్కారాన్ని తిరిగి ఇచ్చేస్తానన్నారు. హైదరాబాద్‌లో ప్రతిష్టాత్మక పరిశోధనా సంస్థ సిసిఎంబిలో వ్యవస్థాపక డైరెక్టర్‌గా ఆయన సుదీర్ఘకాలం సేవలందించారు.

### ఆర్‌టిఐ కార్యకర్తలపై శివసేన దాడి

ముంబైలో శివసేన కార్యకర్తలు అక్టోబర్ 30న సమాచార హక్కు (ఆర్‌టిఐ) కార్యకర్త మల్లికార్జున్ బాయ్‌కట్టీపై ఇనుపరాడ్‌తో దాడిచేసి, సిరా పోశారు. లాతూర్‌లోని ఓ కళాశాల యాజమాన్యం భారీ కట్టడం నిర్మించడాన్ని మల్లికార్జున్ బయటపెట్టడంతో ఆయన్ని కాలేజీకి తీసుకొచ్చి విద్యార్థుల సమక్షంలో ఇనుపరాడ్‌తో కొట్టి ఇతను ఆర్‌టిఐ ముసుగులో ఉన్న బ్లాక్ మెయిలర్‌గా శివసేన కార్యకర్త అభయ్ సలుంకే ఆరోపించారు. మల్లికార్జున్ తీవ్రగాయాలతో ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నాడు.

### తమిళనాడులో కళాకారుడి అరెస్ట్

తమిళనాడులో మద్యాన్ని నిషేధించాలని కోరుతూ పాటలు పాడుతున్న జానపద కళాకారుడు ఎస్. శివదాస్ అలియాస్ కోవన్‌ను రాజద్రోహం కేసుపై పోలీసులు అక్టోబర్ 30న అరెస్ట్ చేశారు. మద్యపానం అమ్మకాలపై జయలలిత ప్రభుత్వం చూపిస్తున్న శ్రద్ధను ఆయన పాటలో వ్యక్తంచేశారు. ప్రస్తుతం ఈ పాట తమిళనాట ప్రతిచోట వినిపిస్తోందంటున్నారు. కోవన్‌ను తిరుచ్చి జిల్లా ఉరయూరులో పోలీసులు అరెస్ట్ చేశారు.

### ఎబిఎన్ -ఆంధ్రజ్యోతి ప్రసారాలు పునరుద్ధరించండి

తెలంగాణలోని ఎబిఎన్-ఆంధ్రజ్యోతి చానల్ ప్రసారాలను పునరుద్ధరించాలని సుప్రీంకోర్టు నవంబర్ 3న ఆదేశాలిచ్చింది. తెలంగాణ ప్రభుత్వ సూచనల మేరకే ఎంఎస్‌ఒలు తమ ఛానల్ ప్రసారాలు నిలిపివేశారని ఎబిఎన్-ఆంధ్రజ్యోతి దాఖలు చేసిన పిటిషన్‌పై జస్టిస్ జగదీశ్‌సింగ్ కెహర్, జస్టిస్ కురియన్ జోసెఫ్, జస్టిస్ మదన్ బి లోకూర్‌లతో కూడిన ధర్మాసనం విచారణ చేపట్టింది. గతంలో టివి9 విషయంలో తెలికం వివాదాల పరిష్కార, పునర్విచారణ ట్రిబ్యునల్ ఇచ్చిన ఆదేశాలు ఎబిఎన్-ఆంధ్రజ్యోతికి వర్తింపచేయాలని ధర్మాసనం స్పష్టంచేసింది.

### మద్య నిషేధం కోసం ప్రాణత్యాగం

రాజస్థాన్‌లోని జనతాదళ్‌కు చెందిన మాజీ ఎంఎల్ఏ గురుచరణ్ ఛాబ్రా రాష్ట్రంలో మద్యనిషేధంతో పాటు లోకాయుక్తను పటిష్టం చేయాలన్న డిమాండ్‌తో అక్టోబర్ 2న అమరణ నిరాహార దీక్షలో కూర్చున్నారు. నెల రోజులైనా ప్రభుత్వం స్పందించక, ఆహారం లేకపోవడంతో ఆరోగ్యం క్షీణించి 65 ఏళ్ల ఛాబ్రా రెండు రోజులు కోమాలో ఉండడంతో జైపూర్‌లోని ఎస్ఎమ్ఎస్ ఆస్పత్రిలో చికిత్స చేశారు. కానీ, నవంబర్ 3న ఆయన మృతి చెందారు.

### బిహార్ ఎన్నికల్లో మహాకూటమి గెలుపు

బిహార్ అసెంబ్లీకి జరిగిన ఎన్నికల ఫలితాలు నవంబర్ 8న ప్రకటించారు. ఈ ఫలితాల్లో మహాకూటమి అత్యధిక స్థానాలు 178 సాధించి ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసింది. మొత్తం 243 స్థానాలకు గాను మహాకూటమికి చెందిన ఆర్‌జెడికి 80, జెడి(యు)కి 71, కాంగ్రెస్ 27. ఎన్‌డిఎ కూటమికి చెందిన బిజెపికి 53, ఎల్‌జెపికి 2, ఆర్ఎల్ఎస్‌పికి 2, ఎచ్ఎఎంకి 1. ఇతరులు సిపిఐ (ఎంఎల్-ఎల్)కి 3, స్వతంత్రులు 4. ముఖ్యమంత్రిగా నితీష్‌కుమార్ నవంబర్ 20న పాట్నాలోని గాంధీ మైదానంలో ప్రమాణ స్వీకారం చేశారు. ఆ తరువాత గవర్నర్ రామ్‌నాథ్ కోవింద్ 28 మందిని మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేయించారు.

### టిప్పు సుల్తాన్ జయంతిపై నిరసన

కర్నాటక ప్రభుత్వం నిర్వహిస్తున్న టిప్పుసుల్తాన్ జయంతి వేడుకలను నిరసిస్తూ విశ్వహిందూ పరిషత్ నవంబర్ 10న చేపట్టిన ఆందోళన హింసాత్మకంగా మారింది. కొడగు జిల్లా మడికెరిలో ఇరువర్గాల మధ్య జరిగిన రాళ్లదాడిలో విహెచ్‌పి నేత, మడికెరి ఆర్గనైజింగ్ సెక్రెటరీ కుట్టప్ప (67) మృతిచెందారు. సాహుల్ (27) అనే యువకుడికి పోలీసు కాల్పుల్లో బుల్లెట్ గాయాలయ్యాయి. ఈ వేడుకలను రాష్ట్ర ప్రభుత్వమే నిర్వహించడాన్ని విహెచ్‌పి, క్రిస్టియన్ అసోసియేషన్ వ్యతిరేకిస్తున్నాయి. టిప్పు మత దురాభిమాని అని, ఎందరినో ఇస్లాంలోకి బలవంతంగా మార్చాడని, కర్ణాటకలో పట్టణాల పేర్లను ముస్లిం పేర్లుగా మార్చాడని వీరి ఆరోపణ.

### పోలీసు కాల్పుల్లో మహిళా నక్సల్స్ మృతి

ఛత్తీస్‌గఢ్‌లోని సుకుమా జిల్లాలో పోలీసులు జరిపిన కాల్పుల్లో నలుగురు మహిళా మావోయిస్టులు మృతి చెందారు. సుకుమా జిల్లాలోని గడిరాస్ పోలీస్ స్టేషన్ పరిధిలో ఈ సంఘటన జరిగింది. నాగుల్‌గూడ అటవీ ప్రాంతంలో మావోయిస్టులు సంచరిస్తున్నారనే సమాచారం అందడంతో నవంబర్ 22న సిఆర్‌పిఎఫ్, ఎస్‌టిఎఫ్ బలగాలు కూబింగ్‌కు వెళ్లి గాలింపులు జరుపుతుండగా మావోయిస్టులు తారసపడడం కాల్పులు జరిపారని, దీంతో పోలీసులు ఎదురు కాల్పులు జరిపారని బస్తర్ రేంజ్ ఐజి ఎస్.ఆర్.పి. కల్లూరి తెలిపారు. సంఘటనా ప్రాంతంలో నలుగురు మహిళా మావోయిస్టుల మృతదేహాలు, రెండు 12-బోర్ తుపాకులు, ఒక పాయింట్ 303 రైఫిల్, 48 తూటాలు లభించాయని తెలిపారు.

### తమిళనాడులో భారీ వర్షాలు

నవంబర్ రెండో వారంలో బంగాళాఖాతంలో ఏర్పడిన అల్పపీడనం వల్ల తమిళనాడులో భారీ వర్షాలు కురిసాయి. దీంతో చాలా ప్రాంతాలు జలమయమయ్యాయి. లోతట్టు ప్రాంతాలలో జనజీవనం స్థంబించిపోయాయి. వర్షాల కారణంగా నవంబర్ 22 నాటికి 122 మంది చనిపోయారు. వీ

## రష్యా విమానం కూల్చివేత

అక్టోబర్ 31న ఈజిప్ట్ నుంచి రష్యాలోని సెయింట్ పీటర్స్ బర్గ్ కు బయలుదేరిన ఎయిర్ బస్ 321 విమానం టేకాఫ్ అయిన 23 నిమిషాలకు సినాయ్ పెనిన్సులా ప్రాంతంలో కూలిపోయింది. ఈ ప్రమాదంలో విమానంలోని ఏడుగురు సిబ్బందితో సహా 224 మంది చనిపోయారు. ఇందులో 25 మంది పిల్లలు ఉన్నారు. ఇది ఉగ్రవాదుల చర్యగా రష్యా నిర్ధారించింది. విమానాన్ని కూల్చింది తామేనని ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్) ఉగ్రవాద సంస్థ ప్రకటించింది. ఈ దాడి నేపథ్యంలో సిరియాలోని ఐసిస్ ఉగ్రవాద స్థావరాలపై రష్యా వైమానిక దాడులను తీవ్రతరం చేసింది.

## రుమేనియాలో విషాదం

రుమేనియాలోని బుఖారెస్ట్ నగరంలో కలెక్టివ్ క్లబ్ లో అక్టోబర్ 31న జరిగిన అగ్ని ప్రమాదంలో 27 మంది మరణించారు. 180 మంది తీవ్రంగా గాయపడ్డారు. కలెక్టివ్ క్లబ్ లో బాణాసంచా తయారీ విధానంపై ఓ అవగాహన కార్యక్రమం జరిగింది. బాణాసంచా తయారీ విధానంపై డెమో జరుగుతుండగా అపశృతి చోటుచేసుకుని ఒక్కసారిగా మంటలు లేచాయి. మంటలు అతి వేగంగా వ్యాపించడం, క్లబ్ నుంచి బయటకు వెళ్లేందుకు ఒకే మార్గం ఉండడంతో తొక్కిసలాట జరిగి తీవ్ర ప్రాణ నష్టం జరిగింది. ఈ ప్రమాదాన్ని నిరసిస్తూ సుమారు ఇరవై వేలమంది వీధుల్లోకి వచ్చి నిరసన తెలిపారు. సరైన భద్రతా చర్యలు తీసుకోకుండా, ప్రమాణాలు పాటించకుండా నైట్ క్లబ్ నిర్మించడం వల్లే ప్రమాదం జరిగిందనీ, దీనికి అవినీతే కారణమనీ నిరసన వ్యక్తం చేశారు. ఈ ఘటనకు నైతిక బాధ్యత వహిస్తూ రుమేనియా ప్రధాని విక్టర్ పొంటా రాజీనామా చేశారు.

## టర్కీ పార్లమెంట్ ఎన్నికలు

టర్కీ పార్లమెంట్‌కు నవంబర్ 1న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో అధికార పార్టీ జస్టిస్ అండ్ డెవలప్‌మెంట్ పార్టీ (ఎకెపి) విజయం సాధించింది. ఎకెపి మొత్తం 49.4 శాతం ఓట్లను దక్కించుకుని 316 స్థానాలు పొందింది. ప్రధాన ప్రతిపక్షం సిఎచ్‌పి 25.4 శాతం ఓట్లతో 134 స్థానాలు దక్కించుకుంది. అధ్యక్షుడు రిసెప్ తయ్యిప్ ఎర్డోగాన్ నేతృత్వంలో మరోమారు ప్రభుత్వం ఏర్పాటు అయింది. టర్కీలో ఎన్నికలు జరగడం ఈ ఏడాదిలో ఇది రెండోసారి.

## మాల్దీవుల్లో నిరసనలు - ఎమర్జెన్సీ

మాల్దీవుల్లో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలు ఆందోళనల చేపట్టారు. ఈ నేపథ్యంలో అధ్యక్షుడు అబ్దుల్లా యమీన్ దేశంలో ఎమర్జెన్సీని ప్రకటించారు. నవంబర్ 4 నుంచి ముప్పై రోజుల పాటు అత్యయిక స్థితిని విధించారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా పెద్ద ర్యాలీని నిర్వహించాలన్న ప్రతిపక్ష పార్టీలు నిర్ణయించడంతో ఈ నిర్ణయం తీసుకున్నారు. ప్రతిపక్ష డెమోక్రటిక్ పార్టీ నేత మహమ్మద్ నషీద్ ప్రస్తుతం జైలులో ఉన్నారు.

## వోక్స్ వ్యాగన్ కాలుష్యం

జర్మనీకి చెందిన ప్రముఖ కార్ల కంపెనీ వోక్స్ వ్యాగన్ కార్ల నుంచి ప్రమాణాలకు మించి కార్బన్ ఉద్గారాలు విడుదల అవుతున్నాయని తేలడంతో కంపెనీ తీవ్ర కష్టాల్లో నష్టాల్లో పడింది. 78 ఏళ్ల వోక్స్ వ్యాగన్ కంపెనీ చరిత్రలో ఇటువంటి పరిస్థితి రావడం ఇది మొదటిసారి. వోక్స్ వ్యాగన్ కార్ల నుంచి కార్బన్ డై ఆక్సైడ్, నైట్రోజన్ డై ఆక్సైడ్ వాయువులు వెలువడుతున్నాయనీ, అది 40 రేట్లు ఎక్కువగా ఉందన్న విషయాన్ని అమెరికాలోని కాలుష్య నియంత్రణ సంస్థలు గుర్తించాయి. తమ కార్లలో ఎటువంటి లోపం లేదని, మోసానికి పాల్పడలేదని ఒక సంవత్సరం పాటు వాదించిన వోక్స్ వ్యాగన్ కంపెనీ ఇప్పుడు తన తప్పును ఒప్పుకుంది. ప్రమాణాలకు మించి మరో 8 లక్షల కార్లలో కాలుష్యం విడుదలవుతోందనీ, వాటిని పరిష్కరించడం కోసం 2.2 బిలియన్ డాలర్లు ఖర్చు అవుతుందనీ వోక్స్ వ్యాగన్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ మాథ్యూస్ ముల్లర్ ప్రకటించారు.

## సిరియాపై రష్యా వైమానిక దాడులు

సిరియాలో రఖ్ఖా ప్రాంతంలో ఇస్లామిక్ స్టేట్ ఉగ్రవాద సంస్థ స్థావరాలపై రష్యా వైమానిక దాడులు చేస్తోంది. ఈ దాడుల్లో ఇస్లామిక్ స్టేట్ దళాలతో పాటు ఎక్కువ సంఖ్యలో సాధారణ పౌరులు మరణిస్తున్నారు. దాదాపు నెలలోపు రష్యా జరిపిన దాడుల్లో రెండు వందల యాభై మందికి పైగా మృతి చెందారు. దాదాపు 15 ఉగ్రవాద స్థావరాలు కేంద్రీకృతమై ఉన్న రఖ్ఖా ప్రాంతంపై రష్యా పెద్ద ఎత్తున వైమానిక దాడులు చేస్తోంది. ఈ దాడులతో దాదాపు లక్షా ఇరవై వేల మంది నిరాశ్రయులయ్యారని, కోటికి పైగా శరణార్థులుగా వెళ్లారని, రెండు లక్షల యాభై వేల మందికి పైగా మృత్యువాత పడ్డారని వార్తలు వస్తున్నాయి.

## అంగ్ సాన్ సూకీ విజయం

బర్మా (మయన్మార్)లో 25 ఏళ్ల తర్వాత పార్లమెంట్‌కు, స్థానిక అసెంబ్లీకి నవంబర్ 8న ఎన్నికలు జరిగాయి. పార్లమెంట్‌లోని 664 స్థానాలకు 90 పార్టీలకు చెందిన ఆరు వేల మంది అభ్యర్థులు పోటీ చేశారు. దాదాపు 51 మిలియన్ ఓటర్లు తమ ఓటు హక్కుని వినియోగించుకున్నారు. అంగ్ సాన్ సూకీ నేతృత్వంలోని నేషనల్ లీగ్ ఆఫ్ డెమోక్రసీ (ఎన్ఎల్‌డి) పార్టీ సంపూర్ణ విజయాన్ని సాధించింది. మయన్మార్ ఎగువ 110 స్థానాలు, దిగువ సభలో 238 మొత్తం 348 స్థానాలు దక్కించుకుని అధికారం సొంతం చేసుకుంది. దేశంలో అధికార మార్పిడి శాంతియుతంగా జరుపుతామని మయన్మార్ అధ్యక్షుడు థేయిన్ సేన్ తెలిపారు. సైనిక పాలనలో అంగ్ సాన్ సూకీ దాదాపు రెండు దశాబ్దాలపాటు గృహ నిర్బంధంలో ఉండి పోరాటం చేశారు.

## గ్రీస్‌లో ఆందోళనలు

గ్రీస్ ప్రభుత్వం అవలంబిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలపై ప్రజలు నిరసన ప్రదర్శనలు చేస్తూ నవంబర్ 12న సాధారణ సమ్మె చేశారు. వేలాదిగా ప్రజలు రాజధాని ఏథెన్స్ వీధుల్లోకి వచ్చి బ్యానర్లు, ప్లకార్డులతో శాంతి ర్యాలీ చేపట్టారు. నిరసనకారులను చెదరగొట్టేందుకు పోలీసులు ప్రయత్నించడంతో ఘర్షణ వాతావరణం చెలరేగింది. దీంతో రవాణా వ్యవస్థను పూర్తిగా స్తంభించిపోయింది. ఇటీవల గ్రీస్ ప్రభుత్వం పలు ఆర్థిక సంస్కరణలకు పూనుకుంది. దీనిలో భాగంగా రిటైర్‌మెంట్ వయస్సు పెంపు, పెన్షన్ల తొలగింపు, స్వేచ్ఛాయుత మార్కెట్ తదితర అంశాల ద్వారా మితవ్యయ చర్యలను చేపట్టాలని ప్రయత్నిస్తోంది.

## పారిస్‌లో దాడులు

ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో నవంబర్ 13న రాత్రి వరుస దాడులు జరిగాయి. ముందుగా స్టేడ్ డి ఫ్రాన్స్ అంతర్జాతీయ స్టేడియం వద్ద ఉగ్రవాదులు ఆత్మాహుతి దాడికి పాల్పడ్డారు. స్టేడియంలో 80 వేల మంది ప్రేక్షకులు ఉన్నారు. స్టేడియం రెండు ప్రవేశ మార్గాల వద్ద రెండు ఆత్మాహుతి దాడులతో పేలుళ్లు సంభవించాయి. సమీపంలోని ఒక రెస్టారెంట్ వద్ద బాంబు దాడి జరిగింది. ఈ దాడిలో ముగ్గురు చనిపోయారు. అక్కడికి ఐదు మైళ్ల దూరంలో రెండు రెస్టారెంట్లపై ఉగ్రవాదులు కాల్పులు జరిపడంతో 14 మంది మరణించారు. అక్కడికి దక్షిణాన ఉన్న ఒక థియేటర్ సమీపంలోని కెఫేలపై దాడి చేయడంతో 18 మంది ప్రాణాలు కోల్పోయారు. థియేటర్‌లో ముగ్గురు సాయుధులు దాదాపు వంద మందిని బందీలుగా పట్టుకుని విచక్షణారహితంగా కాల్పులు జరిపి, గ్రెనేడ్లు విసిరడంతో 82 మంది చనిపోయారు. ముగ్గురు ఉగ్రవాదులు ఆత్మాహుతి బాంబు జాకెట్లు పేల్చుకుని మరణించారు. అక్కడికి కొద్ది దూరంలో ఒక కెఫేపై ఉగ్రవాదులు తుపాకులతో దాడి చేయడంతో ఐదుగురు మరణించారు. ఈ దాడికి పాల్పడింది తామేనని ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్ ఐ ఎస్) సంస్థ ప్రకటించింది. దాడుల నేపథ్యంలో ఫ్రాన్స్ అధ్యక్షుడు హోలాండ్ దేశంలో అత్యవసర పరిస్థితి విధించారు. పారిస్‌పై దాడికి ప్రతీకారంగా సిరియాలోని ఐఎస్ ఐఎస్ శిక్షణా స్థావరాలపై ఫ్రాన్స్ వైమానిక దాడులు చేపట్టింది. ఈ దాడులలో ఉగ్రవాదులతో పాటు అమాయక పౌరులు కూడ వందలాదిగా మరణించారు. వీ

# వీక్షణం 2015 సూచిక

## సంస్థాగతం

## సంస్థాగతం

**సెప్టెంబర్ 2015** — సంచిక : **170**

పాఠకుల వీక్షణం
అబద్ధాల, అతిశయోక్తుల ఆగస్ట్ 15 ప్రసంగం (సంపాదకీయం)
తాగబోయించి తప్పించుకుంటున్న పాలకులు; ముసుగు అవసరం కూడ పోయిందా?;
టర్కీ పరిణామాల్లో కుర్దుల భవిష్యత్తు – బి.ఎస్. రాజు (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
దేశం గతి ఏమిటో చూపిన సర్వే
'బంగారు తెలంగాణ'లో దళితులు – సుజాత సూరేపల్లి
అడుగంటుతున్న గ్రామీణ భారతం – ఎ. నర్సింహారెడ్డి
స్వర్ణాంధ్ర స్వర్ణపిశాచి నగరం – హేమా వెంకట్రావ్
ఉరిశిక్ష అమానవీయం – అనాగరికం – బైరెడ్డి సతీష్
యాకుబ్ మెమన్‌కు ఉరిశిక్ష సమంజసమేనా? – చిమ్మె జాన్ బర్నబాస్
డా. రామనాథం హత్య – ముప్పై ఏళ్లు – వరవరరావు
తెలంగాణలో నిరుద్యోగ సమస్య – డా. అక్కెనపల్లి పున్నయ్య
అన్యాయాన్ని ఎదిరిస్తే అణచివేతలు – బి. రామకృష్ణ
చేనేత గురించి చేదు నిజాలు – బి.ఎస్. రాజు
కొన్ని మరణాలు – మీడియా ప్రాధాన్యతలు – వీరబ్రహ్మాచారి
ఆంధ్రప్రదేశ్ పాలనలో కులం – రాజకీయం – వై ఎచ్ కె మోహన్‌రావు
అభివృద్ధి, పెరుగుదల – వేర్వేరు పరిణామాలు – వి. హనుమంతరావు
ఉత్తరాంధ్ర హక్కుల గొంతు రామ్మూర్తి – కెకెకె వర్మ
మన ప్రాథమిక అవసరాలు–కృత్రిమ అవసరాలు – గోపి
గ్రామజ్యోతి కర్తవ్యాలు – దుర్గం రవీందర్
వాళ్లెందుకు భయపడుతున్నారు? – లోక సంచారి
భారత రాజ్య సామాజిక స్వభావం – కోట శ్రీనివాస్
ఎదుగుదల లేని వార్తా ఛానళ్లు – టంకశాల అశోక్
రాజ్యహింస – ఆర్. లక్ష్మి
అదనపు విలువ గురించి మార్క్స్ – ఇఎస్ బ్రహ్మాచారి
విమర్శనారహిత విమర్శ – విద్యాసాగర్
ఈనెల – వై. రామచంద్రం
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – సి. రాజశేఖర్
అసహజ మరణాలు – ఎస్. వెంకటేష్

**అక్టోబర్ 2015** — సంచిక : **171**

పాఠకుల వీక్షణం
డిజిటల్ ఇండియా ప్రజలది కాదు, బహుళజాతి సంస్థలది (సంపాదకీయం)
బంగారు తెలంగాణ అంటే పాశవిక హత్యాకాండేనా?; రైతుల సమాధుల మీద రాజధాని పునాదులు;
కొత్త ఆశాకిరణం జెరిమి కార్బిన్ (సంపాదకీయ వ్యాఖ్యలు )
కొత్త పుస్తకాలు / సి.డి.లు
రాష్ట్రాల మధ్య కుక్కల కాట్లాటకు ఎగసన
ఎన్‌కౌంటర్ హత్యలు – అమానుష సమర్థనలు – ఎడ్ల పోచయ్య
తెలంగాణ అధ్యయనం ఎందుకు, ఎలా? – ఎన్. వేణుగోపాల్
సంక్షేమం పేరుతో మద్యానికి ప్రోత్సాహం – రాధ
అన్నదాతల ఆత్మహత్యలు–పరిష్కారం – మచ్చ శ్రద్ధానందం
రాజధానికి చేరిన రైతు ఆత్మహత్యలు – ఎ. మల్లేశ్, వై రామచంద్రం
సమస్యల సుడిగుండంలో అన్నదాత – విద్యాభూషణ్
పాలకుల ద్వంద్వ ప్రమాణాలు – రాజేంద్రబాబు అర్విణి
సెప్టెంబర్ 2 సమ్మె – ప్రభుత్వ నిర్లక్ష్యం – బి. రామకృష్ణ
రిజర్వేషన్లకు వ్యతిరేకంగా పటేళ్ల పోరు – చిమ్మె జాన్ బర్నబాస్
ప్రాథమిక హక్కుల్లో విద్య మిథ్యేనా? – దుర్గం సారయ్య
ఆలస్యంగానైనా అర్థవంతమైన అడుగు – ఆర్. లక్ష్మి
వాళ్లెందుకు భయపడుతున్నారు? – లోక సంచారి
ముగింపులేని పెట్టుబడిదారీ సంక్షోభం – ఎ. నర్సింహారెడ్డి
పడిలేస్తున్న ప్రపంచ శ్రామిక వర్గ విప్లవం – బి. ఎస్. రాజు
వ్యక్తుల హత్యతో సత్యశోధన ఆగదు – బైరెడ్డి సతీష్
కన్నీటి కడలి అలన్ కుర్దీ – షేక్ కరిముల్లా
పైశాచికానందం ర్యాగింగ్ – ఎన్. రవిందర్
శాంతిదూత నాయకురాలు – ఒక విశ్లేషణ – కొసరాజు వెంకటేశ్వరరావు
ప్రభుత్వ పాఠశాలల్లో హేతుబద్ధీకరణ – తక్కళ్లపెల్లి సూరి
విమర్శనారహిత విమర్శ – విద్యాసాగర్
వీక్షణం ఎపి రచయితల సమావేశానికి లేఖ – వి. హనుమంతరావు
ఆంధ్రప్రదేశ్‌లో వీక్షణం రచయితల సమావేశం
ఈనెల – వై. రామచంద్రం
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – సి. రాజశేఖర్
అసహజ మరణాలు – ఎస్. వెంకటేష్

**నవంబర్ 2015** — సంచిక : **172**

పాఠకుల వీక్షణం
కొత్త పుస్తకాలు / సి.డి.లు
సంఘ్ పరివార్ అసహనాన్ని అడ్డుకోక తప్పదు (సంపాదకీయం)
ప్రజల ఆకాంక్షకు చోటులేని 'ప్రజా ప్రతినిధుల' సభ; అమరావతి ఆర్భాటం అసలు సమస్యల్ని మాయం చేస్తుందా?; బాలరిష్టాలలో నేపాల్ నూతన రాజ్యాంగం (సంపాదకీయ వ్యాఖ్యలు)
ఈనెల – వై. రామచంద్రం
ఫ్రెంచ్ విప్లవం నాటి స్థితికి భారతదేశం
'చలో అసెంబ్లీ' పై ఉక్కుపాదం – బి. రామకృష్ణ
వ్యవసాయ విప్లవమే పరిష్కార మార్గం – వరవరరావు
తెలంగాణ సమాజం మేల్కొనాలి – గొడిశాల వెంకటేశ్వర్లు
గద్వాలలో ఘరానా దోపిడీ – సాయన్న
వ్యక్తిని చూసి రాజ్యం స్వరూపాన్ని మర్చిపోదామా? – సిఎచ్. మధు
ఆర్టికల్ 371డి ఉల్లంఘనే జి.ఒ. 120 – మల్లెల భాస్కర్
ప్రజా సమస్యలు పట్టని అమరావతి ఆర్భాటం – చిమ్మె జాన్ బర్నబాస్
రిషితేశ్వరి ఆత్మహత్య – మూలాలు – షేక్ కరిముల్లా
విద్యను దూరం చేసే డిటెన్షన్ విధానం – రుద్రవేణి
అర్హతలు లేని వైద్యుల శిక్షణ – డా. రాపోలు సత్యనారాయణ
ఆదివాసి ప్రాంతాలకు ప్రత్యేక జిల్లాలు – మైపతి అరుణ్‌కుమార్
రాయలసీమపై శీతకన్ను – ఎం. కె. కుమార్
ఆలస్యంగానైనా అర్థవంతమైన అడుగు – ఆర్. లక్ష్మి
అభివద్ధి పేరుతో విధ్వంసం – మర్రి కామయ్య
'ద్వేష'భక్తి ! – గుండెబోయిన శ్రీనివాస్
బ్రిటిష్ – మోడీ పాలనలకు మధ్య తేడా ఉందా? – వి. హనుమంతరావు
వ్యవసాయ సంక్షోభం – పరిష్కారాలు – కె. సురేష్
వేగుచుక్కల ఉసురు తీస్తున్న మతోన్మాదం – వై.ఎచ్.కె. మోహన్‌రావు
ఆధార్ – అంతా అయోమయం – ఎస్. కిశోర్‌కుమార్
మరణశిక్షను ఎందుకు వ్యతిరేకించాలి? – మాదిరాజు రాంబాబు
బీహార్ ఎన్నికల రాజకీయాలు – వై. భాస్కర్
కొండను తవ్వి ఎలుకను పట్టని నివేదిక – బైరెడ్డి సతీష్
రాజ్యాంగబద్ధ లౌకిక రాజ్యంగా నేపాల్ – ఎ. నరసింహారెడ్డి
చిన్న పుస్తకం–పెద్ద సందేశం – జి. కోటయ్య
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – సి. రాజశేఖర్
అసహజ మరణాలు – ఎస్. వెంకటేష్

**డిసెంబర్ 2015** — సంచిక : **173**

పాఠకుల వీక్షణం
కొత్త పుస్తకాలు / సి.డి.లు
స (సంపాదకీయం)
ప్ర ; అ;
బా (సంపాదకీయ వ్యాఖ్యలు )
భారత ప్రధాని విదేశీ పర్యటనలు
విద్వేషపూరిత అసహనం – బి. సతీష్
బిహార్‌లో భాజపాకు ఎదురుదెబ్బ – షేక్ కరిముల్లా
హిందూత్వ అభివృద్ధి నమూనాపై బిహార్ ప్రజల తీర్పు – భాస్కర్ ఏంపెల్లి
కొలీజియం, ఎన్‌జెఎసి–2014 – ఎ. నర్సింహారెడ్డి
రైతు పెత్తనం లేని విత్తన సదస్సు – ఎ. పున్నయ్య
సిరియా సంక్షోభం – పూర్వాపరాలు – రాజేంద్రబాబు అర్విణి
సాంఘిక వ్యవసాయమే పరిష్కారం – బి.ఎస్. రాజు
పులీ నక్కా గొర్రెయిజం – బి. విజయభారతి
వరంగల్ ఉపఎన్నిక ప్రజాస్వామ్య స్ఫూర్తికి విరుద్ధం – వంగల సంపత్ రెడ్డి
భూమయ్య కిష్టాగౌడ్ – నలభై ఏళ్లు – వరవరరావు
భోపాల్‌లో తగ్గని విషప్రభావం – పి.వి. రమణ
ముంచుకొస్తున్న 'ఛాందస'వాద ముప్పు – విద్యాభూషన్
రాష్ట్రాల నిధులను పిండుకొంటున్న కేంద్రం – వి. హనుంతరావు
వ్యవసాయ రంగంలో సంక్షోభం – ఇప్ప వీరారెడ్డి
ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక హోదాపై పోరు – వై.ఎచ్.కె. మోహన్‌రావు
ప్రత్యేక హోదాతో ప్రయోజనమేంటి? – ఎం. కె. కూమార్
ఆదివాసుల హక్కులను హరిస్తున్న ప్రభుత్వాలు – మండి నాగమణి
జీవవైవిధ్య వ్యవసాయ మార్గదర్శి భాస్కర్ సావే – కె. సజయ
ప్రపంచీకరణ బోనులో మాధ్యమిక విద్య – తోట రాజేష్
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి బహిరంగ లేఖ
ఆర్ఎస్ రావు సెమినార్
ఈనెల – వై. రామచంద్రం, రుద్రవేణి
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – సి. రాజశేఖర్
వీక్షణం 2015 సూచిక
అసహజ మరణాలు – ఎస్. వెంకటేష్ వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(అక్టోబర్ 1 నుండి అక్టోబర్ 31, 2015 వరకు తెలంగాణలోని 8 జిల్లాలు (1001), ఆంధ్రప్రదేశ్‌లోని 10 జిల్లాలలో (604) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య1605)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | | | | | | | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 3 | – | 26 | 27 | 2 | 6 | 4 | 3 | 4 | 4 | 6 | 1 | 2 | 32 | 39 | – | – | – | 7 | – |
| హైదరాబాద్ | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| కరీంనగర్ | – | 6 | – | 8 | 9 | 7 | 13 | – | – | – | 2 | 6 | 2 | 6 | 25 | 5 | – | – | – | – | 2 |
| ఖమ్మం | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| మహబూబ్‌నగర్ | – | 28 | – | 12 | 11 | 5 | 4 | 1 | 1 | – | 10 | 9 | 12 | 15 | 48 | 9 | 1 | – | – | – | 6 |
| మెదక్ | 1 | 14 | 9 | 16 | 21 | 29 | 16 | 2 | 1 | 15 | 3 | 15 | 16 | 19 | 16 | 13 | – | – | – | 6 | 5 |
| నల్గొండ | – | 21 | – | 5 | 6 | 1 | 6 | – | – | 1 | – | 3 | 2 | 5 | 42 | 13 | – | – | – | – | 1 |
| నిజామాబాద్ | – | 12 | – | 1 | 5 | 1 | – | – | – | – | 1 | 5 | – | 2 | 15 | 6 | – | – | – | – | 6 |
| వరంగల్ | – | 23 | – | 6 | 8 | 9 | 5 | – | – | 1 | 4 | 4 | – | 6 | 19 | 17 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 13 | – | 7 | 5 | 1 | 3 | 13 | – | – | 4 | 6 | 2 | 2 | 27 | 10 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **2** | **119** | **9** | **81** | **92** | **55** | **53** | **20** | **5** | **21** | **28** | **54** | **35** | **57** | **224** | **112** | **1** | **-** | **-** | **13** | **20** |
| అనంతపురం | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| చిత్తూరు | – | – | – | 4 | 4 | – | – | – | – | 4 | 7 | 7 | – | – | 19 | – | – | – | – | – | 11 |
| కడప | – | – | – | 8 | 9 | – | 2 | 17 | 1 | 7 | | 3 | – | 4 | 18 | – | – | – | – | – | 1 |
| గుంటూరు | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| కృష్ణా | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | |
| కర్నూలు | – | 7 | 3 | 6 | 8 | 6 | 4 | 8 | 5 | 2 | 3 | 6 | 8 | 3 | 20 | 15 | – | – | – | – | 6 |
| తూర్పు గోదావరి | – | 2 | – | 3 | 7 | – | 9 | – | – | – | 2 | 2 | – | 2 | 21 | 22 | – | – | – | – | – |
| ప్రకాశం | – | 4 | – | 6 | 7 | 4 | 3 | 2 | 1 | 1 | – | – | – | 3 | 21 | 10 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 5 | 1 | 2 | 4 | 3 | – | – | – | – | 1 | 2 | 18 | 7 | – | – | – | – | 2 |
| పశ్చిమ గోదావరి | – | 1 | – | 1 | 2 | – | 3 | – | – | – | – | 1 | – | – | 10 | 6 | – | – | – | – | 3 |
| నెల్లూరు | – | 1 | – | 2 | 5 | 5 | 6 | 2 | 2 | – | 1 | – | – | 5 | 13 | 11 | – | – | – | – | 4 |
| విజయనగరం | – | – | – | 2 | 4 | – | 1 | – | 2 | – | 1 | – | – | – | 15 | 12 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 7 | 5 | – | – | 1 | 4 | 5 | 2 | 2 | – | 4 | 16 | 17 | – | – | – | – | 7 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **15** | **3** | **44** | **52** | **17** | **32** | **33** | **15** | **19** | **16** | **21** | **9** | **23** | **171** | **100** | **-** | **-** | **-** | **-** | **34** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం– ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |
| పోలవరంతో విధ్వంసమే | డా. ఎస్. తిరుపతయ్య | 40 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| తెలంగాణ కాలజ్ఞాని ప్రొ. జయశంకర్ | ఘంటా చక్రపాణి | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్సి, ఎస్టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు - అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |
| రియాలిటీ చెక్ | పూడూరి రాజిరెడ్డి | 250 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 10 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమీల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | రు. 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి ప్రభాకర్ | 150 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |

### కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్వేస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966–1992) | 240 |
| అరుణతార (1970–2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 173 - December 2015 • **ISSN 2231-6892**

• RNI Regn No APTEL/2003/11483 • Published on 27/11/2014 • Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao